శ్రీః






ప్రకాశకులు :

శ్రీమతి **రావి కృష్ణకుమారి**

4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః

# శ్రీకృష్ణ చరితం

**డా॥ గాలిగుణశేఖర్**

ప్రథమ ముద్రణ: **22-08-2011** శ్రీకృష్ణాష్టమి

ప్రతులు : **500**

పేజీలు : **186**

వెల రూ. : **60/-**



ప్రతులకు :

**Dr. GALI GUNASEKHAR,**
M.A., M.Phil., Ph.D. (Telugu), M.A. (Tamil), M.A. (Eng.)
Kovida (Sanskrit), D.I.Tr.
Principal
K.R.K. Govt. Degree College,
ADDANKI - 523 201
Cell: **9618612495, 8341660979**

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# పీఠిక

భారత రామాయణ భాగవతాలు భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే మహోన్నత గ్రంథాలు. భారత రామాయణాల్లో మానవ జీవితానికి ఆదర్శప్రాయమైన అంశాలు అద్భుతంగా చిత్రీకరించబడ్డాయి. మానవ స్వభావ చిత్రణ భారతంలో తీర్చబడినట్లు విస్తృతంగా మరో గ్రంథంలో కన్పించదు.

భాగవతం మోక్షపురుషార్థసాధనకు భక్తి మార్గమే శరణ్యమని చాటిన గ్రంథం. శ్రీకృష్ణుని అతిమానుష చర్యలు, మానవాతీత సంఘటనలే భాగవతమంతా వర్ణింపబడ్డాయి. కాని ప్రతి భారతీయుడి హృదయంలో దాని ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉందనడం వాస్తవం. తెలుగువారిలో పోతనామాత్యుడి మనోహరమైన శైలి మరింత గాఢ ముద్రను వేసింది.

భగవద్భావం కలిగిన వ్యక్తికి జ్ఞానం కంటే భక్తే ప్రధానం. భక్తి భాగ్యానికి నోచుకున్న భక్తుల చరిత్ర భాగవతం. భగవంతుని గురించి చెప్పే గ్రంథం కనుక భాగవతం అని వాచస్పత్యం పేర్కొంది. శ్రీ హరిని భగవంతుడిగా, హరిభక్తుల్ని భాగవతులుగా పేర్కొనడం పరిపాటి.

భాగవతంలోని కథలకు కేంద్ర బిందువు శ్రీకృష్ణుడు, ఆయన పూర్వ అవతారాలు. శ్రీకృష్ణుడు సాక్షాత్తు నారాయణుడే అని భారత భాగవతాలలో పలుచోట్ల ప్రస్తుతింపబడ్డాడు.

**మత్స్యః కూర్మోవరాహశ్చ నారసింహశ్చ వామనః**

**రామోరామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవ చ**

ఇందులో కృష్ణావతారం ప్రస్తావింపబడలేదు. పోతనామాత్యుడు కూడా "అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబులగు మత్స్య కూర్మవరాహ నారసింహ వామన రామ రఘురామ రామ బుద్ధ కల్క్యాద్యవతారంబు లనేకంబులు గలవు(11వ స్కంధం-71వ గద్య)" – అని శ్రీకృష్ణుణ్ని దశావతారాలలో చేర్చలేదు.

కారణం శ్రీకృష్ణుడు త్రిమూర్తులకు అతీతుడైనవాడని, గోలోకవాసి అని, పరబ్రహ్మ స్వరూపుడని, ఆయనే ఈ అవతారాలన్నీ ధరించాడని పెద్దల అభిప్రాయం.



భాగవతం అన్ని భారతీయ భాషల్లోకి అనువదింపబడింది. ప్రతి భాషలోనూ ఒకరికి మించిన కవులు భాగవతాన్ని రచించారు. తెలుగులోను ఎన్నో భాగవత రచనలు వెలువడ్డాయి. వాటిలో పెక్కింటిలో దశమస్కంధం మాత్రమే స్వీకరింపబడి కొద్దిపాటి మార్పు చేర్పులతో రచన చేసినట్లు స్పష్టమవుతుంది. వ్యాస, పోతనామాత్యులు కూడా దశమస్కంధంలో శ్రీకృష్ణ లీలల్ని వర్ణించినట్లు మరో అవతారం గురించి వర్ణించలేదు.

శ్రీమద్భాగవతంలో వ్యాసభగవానుడు ప్రతిపాదించిన శ్రీకృష్ణుడు సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపం. బ్రహ్మం అంటే ప్రేమ. అదే దాని వాస్తవ స్వరూపం. ప్రేమను పొందడం జీవికి అంతిమ లక్ష్యం అన్నదే భాగవతం మానవాళికి బోధించిన పరమోన్నత సత్యం. భాగవతంలోని ప్రతి శబ్దం శ్రీకృష్ణ ప్రేమను మనస్సులోకి చొప్పిస్తుంది.

ఈ గ్రంథంలోని అంశం మొత్తం భాగవత పరిచయమే అయినా పై కారణాల్ల **శ్రీకృష్ణ చరితం** అనే పేరు పెట్టడం జరిగింది.

భారత రామాయణ భాగవతాలు సంపూర్ణంగా తెలుగులో అనువదింపబడ్డాయి. భారత భాగవతాలు అనితర సాధ్యమైన రీతిలో రచింపబడిన గ్రంథాలు.

కాని ఆ మూడూ ఏకకర్తృత్వం కాక బహుకర్తృత్వం అవడం విశేషం. భారతాన్ని నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు రచించారు. రామాయణాలలో సుప్రసిద్ధమైన భాస్కర రామాయణాన్ని భాస్కరుడు,ఆయన కుమారుడు మల్లికార్జున భట్టు, శిష్యుడు కుమార రుద్రదేవుడు, ఆయన మిత్రుడు అయ్యలార్యుడు రచించారు.

భాగవతంలోని పన్నెండు స్కంధాలలో అయిదవ స్కంధాన్ని బొప్పరాజు గంగనార్యుడు, ఆరవ స్కంధాన్ని ఏర్చూరి సింగయ, పదకొండు, పన్నెండు స్కంధాలను వెలిగందల నారయ ఆంధ్రీకరించారు. వీళ్ళు ముగ్గురూ పోతన శిష్యులే. తక్కిన ఎనిమిది స్కంధాలను పోతన రచించాడు.

భాగవతం బహుకర్తృత్వం కావడానికి విమర్శకులు మూడు కారణాలను పేర్కొన్నారు.

1. పోతన భాగవతాన్ని పూర్తిగా రచించాడు. అవసాన దశలో గ్రంథాన్ని పూజామందిరంలో భద్రపరచి, కొడుకైన మల్లన్నకు చెప్పి పరమపదించాడు. ఆయన మరణానంతరం తీసి చూసినప్పుడు అందులో కొన్ని స్కంధాలు చెదలు పట్టి నష్టమయ్యాయి. ఆ భాగాలను పోతన శిష్యులు అనువదించారు.
2. అంతటి మహాగ్రంథాన్ని ఒక్క చేతిమీదుగా పూర్తిచెయ్యడం అసాధ్యమని పోతనే తన శిష్యులకు ప్రారంభంలోనే అప్పజెప్పాడు.

3. భాగవతాన్ని తనకు అంకితం ఇవ్వలేదన్న కోపంతో సర్వజ్ఞసింగ భూపాలుడు భూమిలో పాతిపెట్టించాడు. తర్వాత కొంతకాలానికి పోతన శిష్యులు తవ్వితీశారు. అప్పటికి గ్రంథం క్రిమిదష్టమై కొంతభాగం నష్టమయింది. వాటిని పోతన శిష్యులు పూరించారు.

వీటిలో తొలి కారణం సమంజసం అన్పిస్తుంది. తెలుగు భాగవతంలో మొత్తం 9000 (8998) గద్య పద్యాలున్నాయి. వాటిలో పోతన శిష్యులు రాసిన గద్యపద్యాల సంఖ్య 1060 మాత్రమే. 8000 గద్యపద్యాలు (88%) రాసిన పోతనకు మరో వెయ్యి గద్యపద్యాలు రాయడం అసాధ్యమని ముందే ఊహించి శిష్యులకు అప్పగించడం జరిగి ఉండదు.

సర్వజ్ఞ సింగభూపాలుడు రసికుడైన రాజుగా, కవి పండితుల్ని పోషించిన వాడని ప్రసిద్ధి. కనుక అటువంటి హేయకృత్యానికి పాల్పడి ఉండడని, ఒకవేళ అంతటి ఆగ్రహం వచ్చినా పాతిపెట్టడం కన్నా తగులబెట్టి ఉంటాడన్నది పలువురి అభిప్రాయం.

రామాయణ గాథని తెలుగులో రచించిన వారందరూ విభిన్నమైన అవాల్మీకాంశాలను చొప్పించారు. అందువల్ల శ్రీ రామచరితం రచనకు వాల్మీకి రామాయణాన్ని అనుసరించాను. భారత భాగవతాలు తెలుగు గ్రంథాలను అనుసరించి రాయడం జరిగింది. పైగా తెలుగు భారత భాగవతాలు సంస్కృతం కంటే హృద్యంగా రూపొందాయి.

భాగవతం భక్తిని ఉన్నతంగా ప్రతిపాదించే, ప్రబోధించే ఏకైక మహాపురాణం. పోతనామాత్యుడు భక్తిని ప్రచారం చెయ్యడమే ప్రధాన ఆశయంగా భావించాడు. ఒకే విషయాన్ని అనేక విధాలుగా చెప్పడానికి భాగవతం అంతటా ప్రయత్నించాడు.

త్యాగరాజులా నాదోపాసన చేసి, ఆ రహస్యాన్ని గ్రహించినవాడు పోతన, పరమభక్తుడు. తాను రచించిన ప్రతిపద్యాన్ని చెవికి ఇంపు కలిగించే అందమైన పదాలతో కూర్చి, విన్నంతలోనే తన్మయత్వం పొందే విధంగా రచించాడు. అద్భుతమైన ఆయన శైలి దివ్యానుభూతిని కలిగిస్తుంది.

భాగవత రచనకు శ్రీరామనవమి (12-04-2011) నాడు శ్రీకారం చుట్టాను. శ్రీమత్ హనుమజ్జయంతి (27-05-2011) నాడు పూర్తయింది. ప్రారంభం, ముగింపు ప్రణాళికాబద్ధంగా జరిగినవి కావు. కేవలం యాదృచ్ఛికం. ఈశ్వరేచ్ఛ.

సహృదయుల స్పందనను ఆశిస్తూ.....

బుధజన విధేయుడు

**గాలిగుణశేఖర్**



# ఆశయం - అభివందనం

**డాక్టర్ గాలి గుణశేఖర్**

దివంగతులైన మా మిత్రులు డా॥ పి.యం.డి.రాజేంద్రగారు (ఆంగ్లోపన్యాసకులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పుత్తూరు) తమకు ముందే పరమపదించిన (03-01-2006) తమ అర్థాంగి శ్రీమతి స్వర్ణలత స్మత్యర్థం, ప్రతి వర్ధంతినాడు భారతీయ సంస్కృతిని, విలువల్ని ప్రతిబింబించే విధంగా గ్రంథాలను ప్రచురించి ఉచితంగా పంచాలని భావించారు.

నాచేత అక్షరాంజలి (03-01-2007), భారత భారతి (మహాభారతం - 03-01-2008) రచింపజేసి వెలువరించారు. మూడవ, నాల్గవ వర్ధంతులకు క్రమంగా రామాయణ భాగవతాలు రాయమని నన్ను కోరారు. కాని విధి వక్రించి ఆయన శ్రీమతి మూడవ వర్ధంతికి ముందే (01-05-2008) ఆయన కూడా దివంగతులయ్యారు. ఈ రచనల వెనుక ప్రధాన ఆశయం ఆయా గ్రంథాల సారాంశాన్ని వీలైనంత తక్కువ పుటల్లో, సాధ్యమైనంత సులభశైలిలో అందించడమే.

శ్రీ రావి మోహనరావుగారు సాహిత్యానికి, ప్రత్యేకంగా సంస్కృత సాహిత్యానికి చేస్తున్న సేవ సాహితీ లోకానికి సువిదితం. ఆయన డా॥రాజేంద్రగారి స్మత్యర్థం (ఆయనతో ఏమాత్రం పరిచయం లేకపోయినా) రామాయణ భాగవతాలను రాయండి. ప్రచురణ బాధ్యత నాది అన్నారు. అన్నట్లే శ్రీ రామచరితాన్ని, సర్వాంగ సుందరంగా ముద్రించి శ్రీరామనవమి (23-03-2010) పర్వదినాన వెలువరించారు. శ్రీకృష్ణ చరితాన్ని కృష్ణాష్టమి (22-08-2011) నాడు వెలువరించాలని సంకల్పించారు. వారి ఉత్తమ సంస్కారానికి, సౌజన్యానికి మనఃపూర్వక అభివందనాలు.

ముందు రచించిన గ్రంథాలపై తమ అభిప్రాయాలను, అభినందలను తెలియజేసిన పెద్దలకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

భాగవతాన్ని ఎందరో, ఎన్నో రీతులలో రచించారు. ఆయా రచయితలకు అభివాదాలు.

---

# ఒకటవ స్కంధం

## బమ్మెర పోతనామాత్యుని శీలం

**శ్రీ కైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్, లోక ర**
**క్షైకారంభకు, భక్తపాలన కళాసంరంభకున్, దానవో**
**ద్రేకస్తంభకు, కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా**
**నాకంజాత భవాండ కుంభకు, మహానందంగనా డింభకున్**

భాగవతానికి మోక్షశాస్త్రమని కూడా పేరుంది. అందుకే భాగవతంలోని పై ప్రారంభ పద్యంలో పోతన **శ్రీకైవల్యపదం** గురించిన ప్రస్తావన చేశాడు.

లోక రక్షకుడు, భక్తుల పాలిట కల్పతరువు, దుష్టుల పాలిట గొడ్డలిపెట్టు, విలాసంగా తిప్పే తన కళ్ళలోంచి బ్రహ్మాండాలను పుట్టించేవాడు, ఆనందమయుడు అయిన విష్ణువుని **శ్రీకైవల్యపదం** (గొప్పదైన పరమపదం) చేరడానికై స్తుతించాడు. ఇష్ట దేవతా ప్రార్థనతో బాటు మొత్తం భాగవత ఇతివృత్తాన్ని పై పద్యం ధ్వనింపజేస్తుంది.

ఇహలోకంలో కీర్తికోసమో, సంపదల కోసమో పోతన ఈ కృతిని రచించలేదు. అల్పులైన రాజులకు అంకితం ఇచ్చి అగ్రహారాది భోగాలను ఆశించలేదు. ఇంద్రియ సుఖాల కోసం అర్రులు చాస్తే యమలోకంలో సమ్మెట పోటులు తప్పవు. అందుకే పోతన శ్రీమద్భాగవతాన్ని హరికి అంకితం ఇచ్చాడు.

**చేతులారంగ శివుని పూజించడేని**
**నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని**
**దయయు సత్యంబు లోనుగా తలపడేని**
**కలుగనేటికి తల్లుల కడుపు చేటు** (1–14)

అని మానవజన్మ ఎత్తినందుకు ఆచరించవలసిన ఉత్తమ కర్మల్ని నిర్దేశించాడు. ఎన్నోవేల జన్మల్లో కూడగట్టిన తపఃఫలం వల్ల ఈ జన్మలో శ్రీమన్నారాయణుని పుణ్యకథలు రచించాలన్న కుతూహలం తన హృదయంలో చోటు చేసుకుందన్నాడు.

ఒకనాటి పున్నమిరేయి. నిండు జాబిలి పండు వెన్నెలను కురిపిస్తున్నాడు. అది చంద్రగ్రహణం రోజు. సజ్జనులైన పెద్దల అనుమతి పొంది, ఆకాశాన్ని తాకేటంతటి ఉన్నత తరంగాలతో పరవళ్ళు తొక్కుతున్న గౌతమీగంగకు వెళ్ళి స్నానం చేశాడు పోతన.



స్నానానంతరం ఎత్తయిన ఇసుక తిన్నెపై కూర్చొని పరమశివుణ్ణి గురించి ధ్యానం మొదలుపెట్టాడు.

అప్పుడొక రాజశేఖరుడు సాక్షాత్కరించాడు. మేఘం పక్కన మెరుపులా ఆయన పక్కన ఓ స్త్రీ ఉంది. తానేదో మాట్లాడాలని పోతన ప్రయత్నిస్తుండగా అతడే **నేను రామభద్రుణ్ని, నాకు అంకితంగా శ్రీమహాభాగవతాన్ని తెలుగులో రచించు. అందువల్ల నీకు భవబంధాలు తెగుతాయి.** అని చెప్పి అంతర్ధానం అయ్యాడు.

పోతన ఆశ్చర్యానికి లోనయ్యాడు. పలికేది భాగవతం. పలికించేవాడు రామభద్రుడు. తాను పలికితే ఆశించిన కైవల్యం ప్రాప్తిస్తుంది. అటువంటప్పుడు మరో కథ గురించి ఆలోచించడం ఎందుకు? భాగవతాన్నే రచిస్తానని నిర్ణయించాడు.

పోతన తండ్రి **కేసన** శైవశాస్త్రానుయాయి. తల్లి **లక్కమాంబ**. సదాశివపాద యుగార్చన పరురాలు. అన్న **తిప్పన్న** ఈశ్వర సేవాకాముడు. తన వంశంలోని వాళ్ళందరూ శివభక్తులే. తానూ నాడు పరమశివుణ్ణే ధ్యానిస్తున్నాడు. కాని సాక్షాత్కరించింది శ్రీరామచంద్రుడు. అతడు శ్రీకృష్ణగాథను వినిపించమన్నాడు. పోతన శివకేశవులు ఒక్కరేనన్న భావాన్ని ఇందుమూలంగా చాటాడు.

**భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు।**
**శూలికైన, తమ్మి చూలికైన**
**విబుధజనుల వలన విన్నంత కన్నంత**
**తెలియ వచ్చినంత తేట పఱుతు** (1–19)

భాగవతాన్ని శివుడు, బ్రహ్మ కూడా పూర్తిగా తెలుసుకొని చెప్పలేరు. అటువంటిది నా గురించి వేరే చెప్పాలా? అయితే పెద్దల ద్వారా, జ్ఞానులద్వారా విన్నది, కన్నది అందులో అర్థమయినంత మేర తెలియజేస్తానని వినయాన్ని ప్రదర్శించాడు.

నన్నయ, తిక్కన మొదలైన మహామహులు సంస్కృతంలోని భారతం, పురాణ గ్రంథాలెన్నింటినో రచించారు కాని తన అదృష్టం కారణంగా వాళ్ళు భాగవతాన్ని రచించలేదు. కనుక ఆ మహాకవులకు నమస్కరిస్తూ భాగవతాన్ని తెనిగించి పునర్జన్మ లేకుండా చేసుకుంటానన్నాడు. పోతన మహాభక్తుడు కనుకనే ఇంతటి వినయ సంపదను అలవరచుకున్నాడు.

భాగవతాన్ని భూలోకంలోని కల్పవృక్షంగా (1–22) పోతన అభివర్ణించారు. తన రచనాశైలిని గురించి చెబుతూ కొందరికి తెలుగంటే ఇష్టం. కొందరికి సంస్కృతం అంటే అభిమానం. మరికొందరు తెలుగు, సంస్కృతం రెంటిని సమంగా ఆదరిస్తారు.

భక్తిని విశేషంగా ప్రచారం చెయ్యడం తన ప్రధానాశయం కనుక, పోతన అందరినీ మెప్పించే రీతిలో తన రచన కొనసాగిస్తానన్నాడు.

**కథా ప్రారంభం**

విష్ణుక్షేత్రమైన నైమిశారణ్యంలో శౌనకుడు మొదలైన మహామునులు శ్రీమహావిష్ణువు సన్నిధిని పొందాలని, వెయ్యి సంవత్సరాలబాటు కొనసాగే సత్రయాగం ప్రారంభించారు.

రోమహర్షుని కుమారుడు ఉగ్రశ్రవసుడనే సూతుడు సమస్త పురాణాలను చక్కగా వివరించగల దిట్ట. అతడితో ఆ మహామునులు **ఇంతవరకు బ్రహ్మాండాది పురాణాలు, మహాభారతం మొదలైన ఇతిహాసాలు, ధర్మశాస్త్రాలు – మీ గురువు సన్నిధిలో నేర్చిన వాటినన్నింటిని మాకు వినిపించావు. మాకు శ్రీకృష్ణగాథల్ని విస్తృతంగా వినాలని కుతూహలంగా ఉంది. ఆ గాథల్ని వివరించు** అని కోరారు.

సూతుడు వేదవ్యాసుని పుత్రుడైన శుకమహర్షికి, నరనారాయణులకు, సరస్వతీదేవికి, వ్యాసుడికి నమస్కరించి, **జనన మరణ బంధాలను పటాపంచలు చేసే పవిత్ర గ్రంథాన్ని పలుకుతున్నాను** అన్నాడు.

## భగవంతుని ఇరవై ఒక్క అవతారాలు

అనంతుడైన భగవంతుడు శుద్ధసత్త్వ స్వరూపుడై, సర్వేశ్వరుడై, వేలకొలది పాదాలు, ఊరువులు, భుజాలు, ముఖాలు, చెవులు, కళ్ళు, శిరస్సులతో అలరారుతూ, వేలకొలది వస్త్రాలు, భుజకీర్తులు, హారాలు, మకరకుండలాలు, మణికిరీటాలు ధరించి పరమపురుష స్వరూపంలో యోగ నిద్రాముద్రితుడై, మహాసముద్రం మధ్య శయనించి ఉంటాడు. అదే అన్ని అవతారాలకు కారణమైన శ్రీమన్నారాయణుని దివ్యరూపం.

ఆ దివ్యరూపాన్ని యోగీంద్రులు దర్శిస్తారు. ఆ పరమేశ్వరుని నాభికమలం నుంచి సృష్టికర్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మ ఉదయించాడు. అవయవాల నుంచి సమస్త లోకాలు ఆవిర్భవించాయి. ఈ వివరాలను చెప్పి సూతుడు ఇరవై ఒక్క అవతారాల గురించి ఇలా ప్రస్తావించాడు.

1. నారాయణుడు కౌమారమనే పేరుగల సర్గాన్ని ఆశ్రయించి సనకసనందననాది రూపాలలో బ్రహ్మణ్యుడై కఠోర బ్రహ్మచర్యాన్ని ఆచరించాడు. 2. యజ్ఞవరాహ శరీరం దాల్చి భూమిని ఉద్ధరించాడు. 3. నారదుడిగా మోక్షదాయకమైన వైష్ణవధర్మాన్ని బోధించాడు. 4. నరనారాయణుడై తీవ్రమైన తపస్సు చేశాడు. 5. కపిలుడై సాంఖ్య యోగాన్ని ప్రసాదించాడు. 6. దత్తాత్రేయ రూపంలో అలర్క ప్రహ్లాదులకు ఆత్మ విద్యను ప్రబోధించాడు.



7. యజ్ఞుడనే పేరుతో యమాది దేవతలతో కలిసి స్వాయంభువమన్వంతరాన్ని రక్షించాడు. 8. ఋషభుడనే పేరుతో పుట్టి పండితులకు పరమహంస మార్గాన్ని ప్రకటించాడు. 9. ఋషుల ప్రార్థనను మన్నించి పృథుచక్రవర్తిగా జన్మించి భూమిని ధేనువుగా చేసి సకల వస్తువుల్ని పితికాడు. 10. మత్స్యావతారం దాల్చి చాక్షుష మన్వంతరంలో సంభవించిన జలప్రళయంలో వైవస్వతమనువును నావపై ఎక్కించి రక్షించాడు. 11. కూర్మావతారాన్ని ధరించి మందర పర్వతాన్ని ధరించాడు. 12. ధన్వంతరిగా పాలకడలి నుంచి అమృతకలశంతో సాక్షాత్కరించాడు. 13. మోహినీ వేషంలో రాక్షసుల్ని వంచించి దేవతలకు అమృతం పంచిపెట్టాడు. 14. నరసింహావతారం 15. వామనావతారం 16. పరశురాముడు 17. వేదవ్యాసుడు 18. శ్రీరాముడు 19. బలరాముడు 20. శ్రీకృష్ణుడు 21. బుద్ధుడై మధ్యగయా ప్రదేశంలో పుట్టి రాక్షసుల్ని సమ్మోహపరుస్తాడు. కలియుగాంతంలో విష్ణుయశుడనే బ్రాహ్మణుడికి కుమారుడుగా పుట్టి దొంగల్లా ప్రవర్తించే రాజుల్ని శిక్షిస్తాడు.

## వేదవ్యాసుని వ్యాకుల చిత్తం

ద్వాపర యుగాంతంలో **ఉపరిచరవసువు** వీర్యం వల్ల పుట్టిన **వాసవి** అనే **సత్యవతికి పరాశర** మహర్షివల్ల నారాయణాంశలో **వేదవ్యాసుడు** జన్మించాడు. ఒకనాడు ఆయన బదరికాశ్రంలో సరస్వతీనదిలో స్నానం చేసి, సూర్యోదయకాలాన ఏకాంతంగా కూర్చొని భవిష్యత్తును అవలోకించాడు.

కాలవేగానికి లోకంలో యుగధర్మాలు సాంకర్యం చెందుతాయని, పాంచభౌతిక శరీరాలకు శక్తి సన్నగిల్లుతుందని, మానవులు సారహీనులు, ధైర్యరహితులు, మందబుద్ధులు, అల్పాయుష్కులు, దుర్బలులు అవుతారని తన దివ్యదృష్టితో గ్రహించాడు. సకల జనులకు అన్ని ఆశ్రమవాసులకు మేలు కూర్చాలని సంకల్పించి హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కుల చేత అనుష్ఠింపదగిన వైదిక కర్మలైన యజ్ఞాలు ఎల్లప్పుడూ జరగాలని కాంక్షించాడు. అవిచ్ఛిన్నంగా కొనసాగటం కోసం ఒకటిగా ఉన్న వేదాన్ని ఋక్, యజుర్, సామ, అథర్వణ వేదాలుగా విభజించాడు. ఇతిహాస పురాణాలన్నింటినీ కలిపి పంచమవేదంగా పేర్కొన్నాడు.

**పైలుడు ఋగ్వేదం, జైమిని సామవేదం, వైశంపాయనుడు యజుర్వేదం, సుమంతుడు అధ్వరణ వేదం** పఠించారు. రోమహర్షణుడు (సూతుని తండ్రి) సమస్త పురాణాలు, ఇతిహాసాలు చదివాడు. ఆ తపోధనులు తాము నేర్చిన వాటిని తమ శిష్యులకు వేర్వేరుగా విభజించి చెప్పారు. ఆ శిష్యులు తమ శిష్యులకు అనేక విధాలుగా నేర్పించారు. అనేక శాఖలుగా వేదం పరిఢవిల్లింది.

వేదశ్రవణానికి సమర్థులు కాని సామాన్యుల క్షేమం ఆశించి వ్యాసుడు మహాభారతాన్ని రచించాడు. విశ్వశ్రేయస్సును కాంక్షించి, తాను చేసిన కృషితో ఆయన హృదయం సంతోషించలేదు. ఈ అసంతృప్తికి కారణం ఏమిటని సరస్వతీనదీ తీరంలో కూర్చొని ఆలోచించాడు.

## భాగవత ప్రాశస్త్యం

ఆయనకు సమాధానం స్ఫురించింది. **హరిభక్తులైన యోగులకు, హరికి ఇష్టమైన భాగవత స్వరూపం చెప్పటం మరిచాను** అని విచారించాడు.

అప్పుడు అక్కడికి వచ్చిన నారదమహర్షి హరినామ సంకీర్తన ప్రభావాన్ని తెలిపాడు. గతజన్మలో దాసీపుత్రుడైన తాను, తన తల్లి పనిచేస్తున్న వేదవేత్తల ఇళ్ళలోనే తానూ సేవ చేశానని, వారికి చేసిన పరిచర్యలు, వారి ద్వారా నేర్చిన హరినామ సంకీర్తనమే తన ఇప్పటి మహోన్నత జన్మకు కారణమని చెప్పాడు.

ఓంకార పూర్వకంగా వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధ నామాలను పలికి, నమస్కరించి, ఆరాధిస్తే సమ్యగ్దర్శనం అలవడుతుందని నారదుడు పేర్కొన్నాడు. పుణ్యశ్లోకుడైన ఆ పురుషోత్తమ స్తుతివల్ల సంసార సాగరం నుంచి బయటపడి మోక్షతీరాన్ని అందుకోవడం సులభమని వ్యాసుడికి చెప్పి నారదుడు నిష్క్రమించాడు.

ఆ తర్వాత వ్యాసుడు వేద స్వరూపమైన భాగవత రచన గావించి తన పుత్రుడైన శుకుని చేత చదివించాడు. భాగవత ప్రాశస్త్యాన్ని గురించి సూతుడు ఇలా పేర్కొన్నాడు.

**నిగమములు వేయి చదివిన**
**సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్**
**సుగమంబు, భాగవతమను**
**నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా (1-140)**

వేలకొద్ది వేదాలు వల్లించినా మోక్ష సౌభాగ్యాలు లభించవు. భాగవతమనే వేదాన్ని అధ్యయనం చేస్తే కైవల్యం సునాయాసంగా లభ్యం అవుతుంది.

శుకుడు తాను నేర్చిన భాగవతాన్ని శృంగి శాపంవల్ల ఏడు రోజుల్లో మరణించబోతున్న పరీక్షిత్తుకు బోధించాడు.

## పరీక్షిత్తు జననం

తొడలు విరిగి నేలమీద పడి ఉన్న దుర్యోధనుడికి ప్రీతి కలిగించడానికి ద్రౌపదీ పుత్రుల శిరస్సుల్ని రాత్రివేళ ఖండించాడు అశ్వత్థామ. శోకంతో కుమిలిపోతున్న ద్రౌపదిని



చూసి అశ్వత్థామను పట్టుకోవటానికి అర్జునుడు వెంటపడ్డాడు. అశ్వత్థామ పరుగులంకించుకొని తన ప్రాణరక్షణ కోసం బ్రహ్మశిరోనామక అస్త్రాన్ని ప్రయోగించాడు. ప్రయోగమే కాని ఆ అస్త్ర ఉపసంహారం అతడికి తెలియదు. అది సర్వప్రాణి భయంకరంగా విజృంభించడం చూసి శ్రీకృష్ణుని సూచన మేరకు అర్జునుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించి, రెండింటినీ ఉపసంహరింపజేశాడు.

అశ్వత్థామ చేతులు, కాళ్ళు కట్టి రథం మీద పడవేసి, అర్జునుడు ద్రౌపది సమక్షానికి తీసుకువచ్చాడు. ద్రౌపది పరిపరివిధాల దుఃఖించి, తన కడుపు కోతను వెల్లడించి, అశ్వత్థామ తల్లిని స్మరించి క్షమించి విడిచిపెట్టమంది.

అందరూ అంగీకరించినా అందుకు భీముడు సమ్మతించలేదు. అశ్వత్థామ జుట్టును కత్తిరించి, లోపల మెరుస్తున్న గొప్పమణిని అతడి విశాలమైన కీర్తితోబాటు అర్జునుడు గ్రహించి విడిచిపెట్టాడు. ఆ తర్వాత పాండవులు చనిపోయిన వారికందరికీ తిలోదకాలు వదిలి భాగీరథీ జలాలలో స్నానం చేశారు.

కృష్ణుడు ద్వారకకు బయలుదేరుతుండగా ఉత్తర తత్తరపాటులో అక్కడికి వచ్చి కృష్ణుడితో **ప్రళయాగ్నిలా ఒక బాణం వచ్చి నా కడుపులోని కసుగందును కాల్చి వెయ్యాలని చూస్తున్నది. రక్షించ**మని మొరపెట్టుకుంది.

సుభద్రార్జునుల పుత్రుడు అభిమన్యుడు. అతడి భార్య ఉత్తర. ఆమె విరాట రాజు కుమార్తె. పాండవ వంశంలో వారసుడిగా మిగిలి ఉన్నది ఉత్తరాగర్భస్థ శిశువు మాత్రమే.

దహించి వేస్తున్న ఆ బాణం **లోకం అపాండవం కావాలి** అని అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రం అని కృష్ణుడు గ్రహించాడు. ఇంతలో దివ్యాస్త్రం నుంచి వెలువడుతున్న బాణాలు పాండవుల్ని చుట్టుముట్టాయి. పాండవులు వెంటనే దానితో సమరం సాగించారు.

దేవతల్ని కంటికి రెప్పలా కాపాడే తన సుదర్శన చక్రాన్ని కృష్ణుడు ప్రయోగించాడు. ఉత్తర గర్భాన్ని యోగమాయతో కప్పి అమోఘమైన వైష్ణవ తేజస్సుతో అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని అవలీలగా అణచివేశాడు. కుంతీదేవి ఆనందంతో తన మేనల్లుడైన కృష్ణుని స్తుతించింది.

విష్ణువు చేత రక్షింపబడిన కారణంగా **విష్ణురాతుడనే** పేరు బ్రాహ్మణ శ్రేష్ఠులు ఆ బాలుడికి పెట్టారు. తల్లి గర్భంలో ముందు తాను చూసిన భగవంతుడు విశ్వమంతటా విరాజిల్లుతున్నాడేమోనని పరీక్షించినందువల్ల ఆ బాలుణ్ణి ప్రజలు **పరీక్షిత్తు** అని పిలిచారు.

## పట్టాభిషేకం - సుపరిపాలనం

శ్రీకృష్ణుడు ద్వారకానగరం చేరాడు. ధర్మరాజు ధర్మబద్ధంగా రాజ్యపాలన కొనసాగించాడు. యుద్ధానికి ముందే తీర్థయాత్రలకని వెళ్ళిన విదురుడు తిరిగి వచ్చాడు. ధర్మరాజు అడిగిన మీదట తీర్థయాత్రల విశేషాలు చెప్పి, యాదవుల వినాశనం మాత్రం చెప్పలేదు.

విదురుని నిందాపూర్వకమైన ఉపదేశం విన్న తర్వాత విరక్తి చెందిన ధృతరాష్ట్రుడు అతడితో, గాంధారితో హిమాలయ ప్రాంతంలోని దుర్గమారణ్యంలోకి వెళ్ళాడు. సంజయ ధర్మరాజులు ధృతరాష్ట్రుడు కనిపించకపోవడంతో కలత చెందారు. తుంబురునితో వచ్చిన నారదుడు ధర్మరాజుతో **ధృతరాష్ట్రుడు గాంధారీ విదురులతో హిమాలయ ప్రాంతంలోని సప్త స్రోతమనే పుణ్యతీర్థంలో నిరాహారుడై హరిచింతనలో ఉన్నాడు. నేటికి అయిదవ రోజు యోగాగ్నిలో దగ్ధం కావటానికి సిద్ధంగా ఉన్నాడు. గాంధారి కూడా ఆ పవిత్ర అగ్నిజ్వాలల్లో పడి భస్మమై పోతుంది. విదురుడు సంతోష సంతాపాలు కూడిన హృదయంతో పుణ్యతీర్థాలకు వెళ్ళిపోతాడు.** అని చెప్పి స్వర్గలోకానికి నిష్క్రమించాడు.

ధర్మరాజు అనేక దుర్నిమిత్తాలు కలగడం చూశాడు. భీముడితో వాటిని గురించి ప్రస్తావిస్తున్న సందర్భంలో అర్జునుడు వచ్చి యాదవకుల నాశనం గురించి తెలియజేశాడు. యాదవకుల నాశనం, శ్రీకృష్ణ నిర్యాణం విన్న కుంతీదేవి తన శరీరాన్ని విడిచిపెట్టింది. పాండవులు అమిత దుఃఖానికి లోనయ్యారు. కృష్ణ నిర్యాణానంతరం తాను పూర్తిగా అశక్తుడై, అసమర్థుడైన విషయాన్ని అర్జునుడు గ్రహించాడు. శ్రీమన్నారాయణుడు తన లీలామానుష రూపాన్ని ఏ రోజు చాలించాడో, అప్పటి నుంచి అమంగళకరమైన కలియుగం ప్రారంభమయింది.

కలి ప్రభావం తీవ్రతరమవడం చూసి ధర్మరాజు పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేశాడు. వైరాగ్యభావంతో పరబ్రహ్మ స్మరణ చేసుకుంటూ ఉత్తర దిక్కుగా ప్రస్థానం సాగించాడు. భీమాదులు శ్రీమన్నారాయణుని పాదారవిందాలను తమ హృదయంలో పదిలపరచుకొని, దానధర్మాలు విరివిగా చేసి విష్ణులోకాన్ని చేరుకున్నారు. విదురుడు పవిత్రమైన ప్రభాస తీర్థంలో తన శరీరాన్ని త్యజించాడు. యమాంశజుడు కనుక పితృదేవతలతో కలిసి, తన అధికార పీఠాన్ని అధిరోహించాడు. భర్తలచేత ఉపేక్షింపబడిన ద్రౌపది వాసుదేవుడి పట్ల మనస్సు లగ్నం చేసి పరమేశ్వర సాన్నిధ్యాన్ని పొందింది.

పరీక్షిత్తు దైవజ్ఞుల ఆదేశానుసారం బ్రాహ్మణుల సన్నిధిలో సమస్త విద్యలు అభ్యసించి, మహాభక్తుడై రాజ్యపాలన ధర్మబద్ధంగా కొనసాగించాడు. తన మేనమామ



ఉత్తర కుమారుని కుమార్తె ఇరావతిని వివాహమాడి జనమేజయుడు మొదలైన నలుగురు పుత్రుల్ని పొందాడు. గంగానదీ తీరంలో కృపాచార్యుడి పర్యవేక్షణలో మూడు అశ్వమేధయాగాలు చేశాడు. యుద్ధ కుతూహలంతో జైత్రయాత్రకు బయలుదేరి అనేక దేశాలను జయించి, స్తోత్ర పాఠకులు పఠించిన పద్యాలవల్ల శ్రీకృష్ణునిచేత తాను రక్షింపబడిన విధం గ్రహించాడు.

## కలిపురుషుని దౌష్ట్యం - దండనం

ఆ సమయంలో వృషభాకారంలో ఒంటి కాలిపై నడుస్తున్న ధర్మదేవుడు, దూడను కోల్పోయి కన్నీళ్ళు కారుస్తున్న ఆవులా కాంతి కోల్పోయిన గోరూపం ధరించిన భూదేవి సంభాషించుకుంటున్న దృశ్యాన్ని చూశాడు.

ధర్మదేవతకు కృతయుగంలో **తపం, శౌచం, దయ, సత్యం** అనే నాలుగు పాదాలుండేవి. త్రేతాయుగంలో మూడు, ద్వాపర యుగంలో రెండు కాళ్లుండేవి. కలియుగంలో **సత్యం** అనే ఒక కాలు మాత్రమే మిగిలింది. ఆ పాదాన్ని కూడా కలియుగాంతంలో అధర్మం భగ్నం చెయ్యాలని కలిపురుషుని రూపంలో కాచుకొని ఉంది.

భగవంతుడి పాదస్పర్శతో ఇంతవరకు పునీతమైన భూదేవి ఇక పాపాత్ముల బారిన పడతామేమోనని బాధపడి భయపడుతూ ఉంది. ఇంతలో రాజవేషం ధరించిన కలిపురుషుడు తొలుత ఎద్దురూపంలో ఉన్న ధర్మదేవతను తన్నాడు. అప్పుడది కిందపడి మూత్ర విసర్జన చేసింది. ఆ తర్వాత గోమాతను తన్నాడు. ఇలా తనముందే క్రూరకృత్యం చేస్తున్న కలిని సంహరించడానికి కత్తి పైకెత్తి సమీపించాడు పరీక్షిత్తు.

కలి పరీక్షిత్తు కాళ్లపై పడి తనకు ఆశ్రయం కల్పించమని ప్రాధేయపడ్డాడు. **జూదం, మద్యపానం, స్త్రీలు, ప్రాణివధ, సువర్ణం, అసత్యం, గర్వం, కామం, హింస, వైరం** అనే పదిస్థానాలలో తప్ప మరెక్కడా కన్పించకూడదని కలిని పరీక్షిత్తు కట్టడి చేశాడు. ధర్మదేవత పోగొట్టుక్ను తపం, శౌచం, దయ అనే మూడు పాదాలను వృషభమూర్తి ధర్మదేవతకు అర్పించి, భూదేవికి ఆనందం కలుగజేశాడు. పిదప సకల ప్రజాసంక్షేమకరంగా రాజ్యపాలన కొనసాగించాడు.

## శృంగి శాపం - ప్రాయోపవేశ సన్నాహం

కొంతకాలం తర్వాత వేటకోసం అరణ్యం వెళ్ళిన పరీక్షిత్తు ఎన్నో జంతువుల్ని వేటాడి, మృగాలను వెంటాడుతూ అలసిపోయాడు. దప్పికతో నీటికోసం వెతుకుతూ ఒకచోట ఏకాగ్రచిత్తంలో తపస్సు చేస్తున్న **శమీక మహర్షిని** చూసి, నీళ్లడిగాడు.

ముని సమాధానం ఇవ్వలేదు. హరిచింతనా పరుడైన మహర్షిని అహంకారిగా భావించి కోపంతో సమీపంలో చచ్చిపడి ఉన్న పామును వింటి కొప్పుతో తీసి ఆయన భుజాలపై వేసి నిష్క్రమించాడు.

పరిసర ప్రాంతాలలో తిరుగుతున్న ముని బాలురు అది గమనించి శమీకమహర్షి కుమారుడైన శృంగికి తెలియజేశారు.

శృంగి అత్యంత ఆవేశంతో **బ్రహ్మర్షి అయిన నా తండ్రి మెడలో చచ్చిన పామును పడవేసిన ఆ రాజు నేటికి ఏడవరోజున తక్షకుడనే సర్పవిషాగ్ని జ్వాలలకు దగ్ధమై పోతాడు** అని శపించాడు.

తండ్రి వద్దకు వచ్చిన **శృంగి** జరిగిన వృత్తాంతాన్ని చెప్పాడు. శమీక మహర్షి రాజును అలా శపించడం మంచిది కాదన్నాడు. రాజులేని రాజ్యంలో అనర్థాలు దాపురిస్తాయని, ఒక ముని బాలుణ్ణి పిలిచి ఆ శాప వృత్తాంతాన్ని రాజుకు చెప్పమని పంపాడు. విషయం గ్రహించిన పరీక్షిత్తు పశ్చాత్తాపం చెందాడు. ప్రతిశాపం ఇవ్వగలిగిన సమర్థత ఉన్నా శాంతం వహించాడు.

రాజ్యాన్ని పరిహరించి, నిరాహారదీక్ష అవలంబించాలని నిర్ణయించాడు. దివ్య గంగానదీ తీరంలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడవడానికి పూనుకున్నాడు. తన మనస్సును విష్ణుపదాల మీదే నిలిపి, మౌనంగా కూర్చున్నాడు.

సంగతి తెలిసిన బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులు మొదలైన వాళ్ళెందరో పరీక్షిత్తు వద్దకు వచ్చారు. అందరికీ నమస్కరించి **భవిష్యత్తు జన్మలోను శ్రీకృష్ణుడిపై అనురక్తి, కృష్ణ కథా శ్రవణంపై ఆసక్తి, శ్రీకృష్ణ చరణాలపై భక్తి కలిగేవిధంగా అనుగ్రహించ**మని ప్రార్థించారు.

గోవిందుని లీలలు గానంచేసి, హరిభక్తుల కథలను విన్పించి, ఏడు రోజుల్లో తనకు కైవల్యం సిద్ధించేట్లు చెయ్యమని అర్థించాడు. అతడి కోరికకు తగిన సమాధానం కోసం మునులందరూ కలిసి సమాలోచనలు జరిపారు. ఇంతలో–

## శుకమహర్షి రాక

పదహారేళ్ళ నవయౌవనంతో, సుందర గమనంతో, ముక్తికాంత కూడా మోహించే ఉన్నత గుణాలు మూర్తీభవించిన శుకమహర్షి అక్కడికి చేరుకున్నాడు.

పరీక్షిత్తు ఆయనకు సాష్టాంగ ప్రమాణంచేసి, భయభక్తులతో చేతులు జోడించి **నా అదృష్టం వల్ల మీరు ఇక్కడికి వచ్చారు. మీ వంటి బ్రహ్మర్షిని దర్శించి, బోధలు విని, అర్చించి, పాదప్రక్షాళన గావించి ఆ నీటిని శిరస్సుపై చల్లుకునే అవకాశం నాకు కలిగింది.**



**నాకు మోక్షం తప్పక ప్రాప్తిస్తుంది. మహాత్ములైన మీరు ఆవు పాలను పిదికినంత సేపటి కంటే ఎక్కువ సమయం ఎక్కడా ఉండరు. ఓ మహానుభావా! నా పై దయతో మోక్షమార్గాన్ని చూపించండి.** అని శ్రద్ధాసక్తులతో కోరాడు.

**ఇంతటితో ప్రథమస్కంధం పూర్తయింది.**

# రెండవ స్కంధం

## హరిమహిమ

**హరిమయము విశ్వమంతయు**
**హరి విశ్వమయుండు, సంశయము పనిలేదా**
**హరిమయము కాని ద్రవ్యము**
**పరమాణువు లేదు వంశ పావన। వింటే (2-17)**

రెండవ స్కంధమంతా హరిమహిమను తెలియజేస్తుంది. పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శుకుడు ఇలా సమాధానం చెప్పాడు.

**మా తండ్రి వ్యాసభగవానుడు ద్వాపరయుగంలో వేదసమానమైన భాగవతాన్ని నా చేత చదివించాడు. పరబ్రహ్మంలో నా చిత్తాన్ని లగ్నంచేసి భగవంతుని అవతారలీలలు నన్నాకర్షించడం వల్ల దీన్ని శ్రద్ధగా పఠించాను. నువ్వు హరిభక్తుడివి. అందువల్ల నీకు భాగవత తత్త్వం తెలియజేస్తాను. భాగవత శ్రవణం వల్ల విష్ణువును సేవించాలన్న బుద్ధి పుడుతుంది. మోక్షం కోరేవాడికి అది లభిస్తుంది. జన్మ జరామరణాది భయాలన్నీ నశిస్తాయి. వాసుదేవుడి నామ సంకీర్తనలే పరమ యోగులకు ఉత్తమ వ్రతాలు.**

**శుకుడు పరీక్షిత్తుకు** భాగవతాన్ని చెప్పిన విధంగా **శౌనకాది మహామునులకు సూతుడు** తెలియజెప్పాడు.

హరినామస్మరణ ఒక క్షణం సాగినా ముక్తి లభిస్తుంది. అందుకు ఉదాహరణగా ఖట్వాంగుని వృత్తాంతాన్ని శుకమహర్షి పేర్కొన్నాడు.

**పూర్వం ఖట్వాంగుడనే రాజు దేవేంద్రాది దేవతల కోరిక మేరకు స్వర్గలోకానికి వెళ్ళి దానవుల్ని సంహరించాడు. దేవతలు సంతోషించి వరం కోరుకొమ్మన్నారు. తానెంతకాలం జీవిస్తాడో చెప్పమన్నాడు ఖట్వాంగుడు. 'నీకు ఆయుస్సు ఒక ముహూర్తకాలం మాత్రమే ఉంద'ని దేవతలు చెప్పారు. వెంటనే అతడు సమస్త భోగభాగ్యాలను విడిచిపెట్టి, గోవిందనామ స్మరణచేసి రెండు గడియల్లోనే మోక్షం పొందాడు.**

మోక్షం కోరేవాడు ఏవిధంగా మనుగడ కొనసాగించాలో తెలియజేస్తూ ధారణతో రజోగుణ తమోగుణాల వల్ల కలిగే మాలిన్యాలను తొలగించి నిర్మలం చేస్తే సర్వోత్కృష్ట



విష్ణుపదం లభిస్తుందని శుకుడు చెప్పాడు. ధారణ ఎలా నిలపాలన్న ప్రశ్నకు విష్ణువుయొక్క విశాల స్వరూపాన్ని మనస్సులో స్థిరంగా ఉంచాలని, విశ్వరూపాన్ని వర్ణించాడు.

**శ్రీహరిని స్మరించకుండా, మదోన్మత్తులుగా ప్రవర్తించి ఇంద్రియ భోగాలలో జీవితాన్ని గడిపేవాళ్ళు, నరకద్వారం వద్ద వైతరిణీనదిలోని భయంకర జ్వాలల్లో పడి మలమల మాడిపోతారు** అన్నాడు.

యోగి ప్రాణత్యాగం చేసే పద్ధతి, వివిధ లోకాలను చేరుకునే వారి యోగ్యతలు, బ్రహ్మలోక వివరాలను తెలియజేసిన శుకయోగి సంసారంలో ఉన్నవాడికి తపస్సు, యోగం మొదలైన మోక్షమార్గాలు ఎన్నో ఉన్నాయని, అన్నింటికంటే సులభతరమైనది భక్తిమార్గం అన్నాడు.

బ్రహ్మ మూడు పర్యాయాలు వేదాన్ని ధర్మపరాయణమైన దృష్టితో పరామర్శించి, భక్తితో తప్ప మరో మార్గంలో మోక్షం లభ్యంకాదని నిశ్చయించాడు. జగదీశ్వరుడైన విష్ణువు సమస్త లోకాలలో ఆత్మ స్వరూపుడిగా ఉన్నాడు. కనుక జన్మసార్థకం చేసుకోవడానికి విష్ణువు మీది భక్తి ఒక్కటే శరణ్యం. కనుక–

**చెవులున్నందుకు హరికీర్తనలు వినాలి. లేకపోతే అవి పర్వతగుహల వంటివే. నాలుక ఉన్నందుకు విష్ణుపద్యాలను చదవడమే ప్రయోజనం. కాకపోతే అవి కప్పల నాలుకలే. కళ్ళున్నందుకు శ్రీనాథుణ్ణి దర్శించాలి. అలాకాకపోతే అవి కేవలం నెమలి పింఛంలోని కళ్ళే. కమలాక్షుని పూజించడమే చేతుల కర్తవ్యం. – కానట్లయితే అవి శవానికున్న చేతులు. విష్ణుపదాల మీదున్న తులసీదళ పరిమళాన్ని ఆఘ్రాణించని ముక్కు పందిముక్కు. గరుడ వాహనుని భుజించడానికి కదలని కాళ్ళు, చెట్ల వేళ్ళు.**

హరిభక్తిని అనేక విధాలుగా శుకుడు పరీక్షిత్తుకు వివరించాడు. పరీక్షిత్తు సృష్టి విధానం గురించి ప్రశ్నించాడు.

ఈ విజ్ఞానాన్ని తొలుత బ్రహ్మ ప్రశ్నకు సమాధానంగా విష్ణువు అనుగ్రహించాడు. బ్రహ్మదేవుడు నారదుడికి వివరించాడు. నారదుడు నాకు తెలియజేశాడని శుకుడు చెప్పాడు.

పద్నాలుగు లోకాల్లో భూ, భువర్, సువర్, మహర్, జన, తపో, సత్యలోకాలైన పై ఏడులోకాలు మహావిష్ణువు నడుముపై భాగమైన శరీరం. అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాల లోకాలు నడుము క్రింది భాగపు శరీరం. అందుకే విష్ణువును లోకమయుడన్నారు. బ్రహ్మకు సృష్టి సామర్థ్యాన్ని ప్రసాదించింది విష్ణువే. శ్రీహరి సృష్టి స్థితి లయాలకన్నింటికీ మూల కారకుడు. పుట్టుకలేని ఆ పరమాత్ముడు ప్రతికల్పంలోను ఈ విశ్వాన్ని పుట్టిస్తాడు. పోషిస్తాడు. సంహరిస్తాడు.

శ్రీ మహావిష్ణువు లీలావతారాలను గురించి సంగ్రహంగా శుకుడు వివరించాడు.

**బద్ధుడై వర్తించే జీవుడికి భగవంతుడిపై భక్తితో ముక్తి ఎలా కలుగుతుంది** అని పరీక్షిత్తు ప్రశ్నించాడు.

**ప్రకృతికి, పురుషుడికి అతీతమైన బ్రహ్మ స్వరూపాన్ని ఎపుడు జీవుడు తీవ్రంగా ధ్యానిస్తాడో అప్పుడు మోహం నుంచి బయటపడతాడు. అహంకార మమకారాలతో నిండిన సంసారం నుంచి విముక్తుడవుతాడు. అందువల్ల జీవుడికి భగవద్భక్తి ద్వారా తప్పకుండా మోక్షం లభిస్తుంది. ఈ విషయాన్ని నిరూపించే ఇతిహాసాన్ని శుకుడు చెప్పాడు.**

## బ్రహ్మతపం – విష్ణ్వనుగ్రహం

పరమేశ్వరుని పాదాల మీది భక్తి కలిగి ఉండడంలోని పరమరహస్యాన్ని ఉపదేశించినవాడు, దేవతలకందరికీ అధినేత అయినవాడు బ్రహ్మ. కల్పారంభంలో తనకు నివాసమైన పద్మానికి మూలం ఏమిటో పరిశీలించాలని సంకల్పించి, నీటిలో వెదకటం ప్రారంభించాడు.

ఎంతకూ పద్మమూలం తెలుసుకోలేక తిరిగివచ్చి మళ్ళీ పద్మంలోనే కూర్చున్నాడు. జగత్తును సృష్టించాలని భావించాడు. ఎంత ఆలోచించినా సృష్టి సంబంధమైన పరిజ్ఞానం తోచలేదు. అలసత్వం ఆవహించింది. మోహాయత్త చిత్తుడయ్యాడు.

అప్పుడు నీటిలోంచి ఒక శబ్దం విన్పించింది. 'క మొదలు మ' వరకున్న స్పర్శాక్షరాలలో 16వది, 21వది అయిన తప అనే అక్షరాల కలయికవల్ల ఏర్పడిన శబ్దం అది. తన్ను తపస్సు చెయ్యమని ఆదేశించడానికే ఆ శబ్దం విన్పించిందని బ్రహ్మ గ్రహించాడు.

ఇంద్రియాలను స్వాధీనపరచి, మనస్సును ఏకాగ్రం చేసి వెయ్యి దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. విష్ణువు వైకుంఠంతో సహా ప్రత్యక్షమయ్యాడు. వైకుంఠంలోని చిలుకలు, గోరువంకలు సైతం విష్ణుస్తుతి చేస్తున్నాయి. తుమ్మెదలు **శౌలషట్, వషట్, స్వధా** మొదలైన శబ్దాలలో ఝుంకారం చేస్తున్నాయి. విష్ణువు మాయాతత్త్వాన్ని బ్రహ్మకు వివరించాడు. తర్వాత తన లోకంతో సహా అంతర్ధానం అయ్యాడు.

ఒకనాడు నారదుడు తన తండ్రి అయిన బ్రహ్మవద్దకు వచ్చి సపర్యలు చేయసాగాడు. సంతుష్టుడైన బ్రహ్మ – శ్రీహరి తనకు దయతో చెప్పింది, లోకాలకు శుభం కలిగించేది, నాలుగు శ్లోకాల రూపంలో ఉన్నది, పది లక్షణాలలో కూడినది అయిన భాగవతాన్ని నారదుడికి బోధించాడు. నీకు నేను దాన్నే చెబుతానని శుకుడు పరీక్షిత్తుకు తెలిపాడు.



## భాగవతం దశలక్షణాలు

**1. సర్గం :** మహత్తత్త్వం, అహంకారం, పంచతన్మాత్రలు (శబ్ద స్పర్శరూప రసగంధాలు), పంచభూతాలు (మిన్ను, గాలి, నిప్పు, నీరు, మన్ను) కర్మేంద్రియాలు (వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ) జ్ఞానేంద్రియాలు (చర్మం, కన్ను, చెవి, నాలుక, ముక్కు) ఇవన్నీ భగవంతుడిలో గోచరించడం.

**2. విసర్గం** : విరాట్పురుషుడి నుంచి బ్రహ్మ ఆవిర్భవించి సృష్టికార్యం చెయ్యడం.

**3. స్థానం** : లోక కంటకులైన రాజుల్ని చంపి జగత్తును ఉద్ధరించిన విష్ణు విజయం.

**4. పోషణం** : సర్వేశ్వరుడు, అనంతుడు, మంగళస్వరూపుడూ అయిన శ్రీహరి భక్తజనుల్ని ఉద్ధరించడం.

**5. ఊతులు** : అనేక జన్మలనుంచి జీవుల్ని వెన్నంటి వచ్చే కర్మవాసనలు.

**6. మన్వంతరాలు** : జలజనాభుడి దయావిశేషాలతో లోకాలను ధర్మబద్ధంగా పాలించిన రాజుల చరిత్రలు

**7. ఈశానుకథలు** : నారాయణుని అవతారాల వర్ణన. ఆయన భక్తుల కథల్ని విస్తృతంగా వర్ణించాడు.

**8. నిరోధం** : సర్వానికి ప్రభువు, చిదచిదానందమూర్తి సుందరమైన ఉపాధిశక్తులతో, తన నివాసంలో శేషశయనుడై యోగనిద్రలో ఉంటాడు. అప్పుడు సమస్త జీవులు తమ తేజస్సుల్ని కోల్పోయి క్రియాశూన్యతను పొందుతాయి. అప్పటి అవస్థా విశేషాలను తెలపడం. దీన్నే అవాంతర ప్రళయం అంటారు.

**9. ముక్తి** : జీవుడు భగవంతుని కృపతో దేహధర్మాలు, ఆత్మ ధర్మాలనుంచి విముక్తుడై పూర్వ సంచితమైన గుణాలతో భగవంతుడికి శరీరభూతుడౌతాడు. దివ్యశరీరం కలవాడై హరి స్వరూపం పొందుతాడు.

**10. ఆశ్రయం** : ఉత్పత్తి స్థితి లయలు ఎక్కడ జరుగుతాయో అది.

పదవ లక్షణమైన ఆశ్రయమే పరమాత్మ. బ్రహ్మశబ్దానికి అర్థం అదే. ఆత్మ మూడు విధాలు. అవి ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం. ఇవి ద్రష్ట (చూసేవాడు), దృక్కు (చూసేసాధనం) దృశ్యం (చూడదగినది) వంటివి. వీటిలో ఏ ఒక్కటి లేకున్నా తక్కినవి కన్పించవు. దీన్నే తాపత్రయం అంటారు. త్రిపుటి అనే ఈ మూడింటిని ఎవరు తెలుసుకుంటారో అతడే సర్వలోకాలకు ఆశ్రయుడై ఉంటాడు. పరమాత్మ కూడా అతడే.

ఆ మహాత్ముడు లీలకోసం జగన్నిర్మాణం సంకల్పించి బ్రహ్మాండాన్ని భేదించాడు. తొలుత తనకు సుఖస్థానం ఏర్పరచుకోవడం కోసం శుద్ధమైన జలాలను సృష్టించాడు. స్వతహాగా తాను పరిశుద్ధుడు కనుక తాను సృష్టించిన అపార జలరాశిలో శయనించడం వల్ల నారాయణుడయ్యాడు.

భారతం శాంతి పర్వంలోని పద్యం ఈ విషయాన్ని స్పష్టపరుస్తుంది.

**నారములనగా జలముల**
**పే, రయనం బనగ నెలవు ప్రీతిగ నాకున్**
**నారములయనం బగుటను**
**నారాయణుడంద్రు జనులు నన్ను కిరీటీ** (6 –421)

ఇంకా శ్రీమన్నారాయణుని వైభవం, జీవుడు మొదలైన తత్త్వాల సృష్టి, వాసుదేవుని నిత్యవిభూతి మొదలైన వాటి వివరణ, కల్ప స్వరూపం మొదలైన వాటి సూచన శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పినట్లు సూతుడు శౌనకాది మునులకు తెలియజేశాడు.

శౌనకుడు **భాగవతులలో శ్రేష్ఠుడైన విదురుడు బంధుమిత్రుల్ని విడిచి, అనేక పుణ్యక్షేత్రాలను సందర్శించి, మైత్రేయ మునిని దర్శించి, ఆయన ద్వారా ఆధ్యాత్మ తత్త్వజ్ఞానం పొందాడని విన్నాం. వాటిని విపులంగా చెప్ప**మని సూతుణ్ణి అడగడంతో **రెండవ స్కంధం** పూర్తవుతుంది.

---



# మూడవ స్కంధం

**హరిచరణార విందయుగళార్చన సన్నుతి భక్తియోగముల్**
**నిరతము గల్గువారభవనీరజగర్భుల కందరాని భా**
**సురపదమందు జేరుదురు, సూరిజనస్తవనీయ! యట్టి స**
**త్పురుషుల పూర్వజన్మ ఫలమున్ గణుతింప తరమె యేరికిన్**

**(3–243)**

ఈ స్కంధంలో హరినామస్మరణతో అత్యుత్తమ పదం పొందిన వారిలో కొందరి గురించి వర్ణింపబడింది. శ్రీమన్నారాయణుడి అనుగ్రహానికి పాత్రులైనవారు విదుర, ఉద్ధవ, మైత్రేయ, పాండవ, బ్రహ్మాది ఉత్తములే కాక హిరణ్యాక్షుడి వంటి రాక్షసులూ ఉన్నారు.

రెండవ స్కంధం చివర శౌనకుడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా మూడవ స్కంధం మొదలవుతుంది.

## విదురుడు

వ్యాసభగవానుడికి, శూద్రస్త్రీకి జన్మించిన యముడి అంశతో పుట్టినవాడు. నీతికోవిదుడు. శ్రీకృష్ణరాయబార ఘట్టంలో తన అన్న అయిన ధృతరాష్ట్రునికి అనేక రకాలుగా న్యాయబోధ చేసినవాడు. ధర్మాన్ని చెబుతున్న తనను దుర్యోధనాదులు అవమానించడంతో రాజ్యం విడిచి అరణ్యం వైపు వెళ్ళాడు. అనేక పుణ్యక్షేత్రాలను దర్శించాడు. తీర్థయాత్రలు చేస్తున్నంతకాలం శ్రీకృష్ణుని పాదాలనే స్మరిస్తూ సంచరించాడు. అలా పయనిస్తూ యమునానదీ తీరంలో ఉద్ధవుణ్ని చూశాడు.

## ఉద్ధవుడు

శ్రీకృష్ణుడికి చిన్ననాటి నుంచి సన్నిహితుడు. ఆయనపై అపారమైన భక్తి వాత్సల్యాలు కలిగినవాడు. ఉత్తమ గుణసంపన్నుడు. శాంత స్వభావుడు. రాజనీతిలో బృహస్పతి శిష్యుడు – సమానుడు. ఎటువంటి దోషాలు లేనివాడు. అతణ్ని చూసి విదురుడు పాండవ యాదవ యోగక్షేమాలను విచారించాడు.

ఆ ప్రశ్నలు విన్న ఉద్ధవుడు దుఃఖంతో పూరుకుపోయిన గొంతుతో యాదవకుల నాశనం గురించి తెలియజేశాడు. శ్రీకృష్ణ నిర్యాణం చెప్పి ఆయన లీలల్ని, గుణగణాల్ని స్మరిస్తూ విలపించాడు. ఇంకా ఉద్ధవుడు ఇలా అన్నాడు.

యాదవకులంలో మరణించిన వాళ్ళకందరికీ సరస్వతీనదీ జలాలతో ఉత్తర క్రియలు జరిపిన శ్రీకృష్ణుడు ఒక చెట్టు నీడన కొంతసేపు విశ్రమించి నన్నుపిలిచి బదరీవనానికి వెళ్లమని ఆదేశించి ఆయన ఎక్కడికో వెళ్ళాడు.

ఆయన తన వంశాన్ని సంపూర్ణంగా అంతం చెయ్యాలని నిర్ణయించాడని నేను గ్రహించాను. ఆయన వియోగాన్ని సహింపలేక నేను ఆయన అడుగుజాడల్ని అనుసరించాను. అలా వెళ్ళి వెళ్ళి ఒక వృక్షాన్ని ఆనుకొని నేలమీద కూర్చొని దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న కృష్ణుణ్ని చూశాను. ఆ సమయంలోనే వేదవ్యాసుడితోపాటు చదువుకున్న మైత్రేయ మహర్షి అక్కడికి వచ్చాడు. ఆ పరమాత్ముణ్ణి పరమానందంలో తదేకంగా చూస్తూ నిలబడ్డాడు.

అప్పుడు కృష్ణుడు నాతో "ఉద్ధవా! పూర్వజన్మలో నువ్వు వసువువి. వసుబ్రహ్మలు చేస్తూ ఉన్న సత్త్రయాగంలో పాల్గొన్న నువ్వు మరో ధ్యాస ఏదీలేకుండా నా పాదపద్మాలనే స్మరించావు. వాటినే కోరుకున్నావు. అందువల్ల ఇకముందు నీ హృదయంలో నివసిస్తూ అన్నీ చూస్తుంటాను. పద్మకల్పంలో నా నాభికమలంలో ఆసీనుడైన బ్రహ్మకు ఉపదేశించిన దివ్యజ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తాను" అన్నాడు. ఆ తర్వాత నాకు పరతత్త్వ సంబంధమైన పరిపూర్ణ జ్ఞానాన్ని అనుగ్రహించాడు.

నేను కల్పాంతం వరకు కృష్ణుడి ఆదేశం మేరకు ఇలా తిరగవలసిన వాడినే. ఆయన ఆదేశించినట్టే నేనిప్పుడు బదరికాశ్రమం వెళ్తున్నాను. ఈ మాటలు విన్న విదురుడు కుమిలిపోయాడు. కొంతసేపటికి దుఃఖం నుంచి తేరుకొని కృష్ణుడు అనుగ్రహించిన అధ్యాత్మతత్త్వ రహస్యాన్ని తనకు బోధించమని ఉద్ధవుణ్ణి ప్రార్థించాడు.

అందుకు ఉద్ధవుడు **విష్ణువుతో సమానుడైన మైత్రేయుడు తన మానవ శరీరాన్ని వదిలిపెట్టాలని నిర్ణయించాడు. నువ్వు అతని వద్దకు వెళ్ళు. ఆ మహాముని నీకు తప్పక ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానాన్ని ఉపదేశిస్తాడు** అని తన పయనం సాగించాడు.

యాదవకులంలోని మహామహులందరూ మరణించినా ఉద్ధవుడు మాత్రం ఎలా జీవించగలిగాడు అన్న పరీక్షిత్తు ప్రశ్నకు సమాధానంగా శుకమహర్షి ఇలా అన్నాడు.

**తన తర్వాత విజ్ఞానతత్త్వాన్ని లోకంలో జిజ్ఞాసువులైన ప్రజలకు అందించగల ప్రజ్ఞాశాలి, ఇంద్రియాలను జయించినవాడు, తనంతట వాడైన ఉద్ధవుడు తప్ప మరొకడు లేడని కృష్ణుడు అతణ్ణి భూలోకంలో నిలిపాడు.**

విదురుడు ముందుకు సాగి, గంగానదిని, సమీపించి, అందులో స్నానం చేసి, మైత్రేయ మహర్షిని సందర్శించడానికి వెళ్ళాడు.



### మైత్రేయుడు

మైత్రేయుడు యోగులకు ఆదర్శప్రాయుడు. సాధువులైన వారికి భాగ్యమైనవాడు. ఆశ్రితులైన వారి పట్ల విధేయుడు. యమ నియమాదులతో కూడిన అష్టాంగయోగాన్ని నిష్ఠతో ఆచరించేవాడు. సదా శ్రీకృష్ణ చరణారవిందాలపై చిత్తం లగ్నం చేసినవాడు. ఇంద్రియాలను వశం చేసుకున్నవాడు. సదాచారాలను, ఉపవాసాలను, వ్రతాలను నిక్కచ్చిగా ఆచరించేవాడు. అతడిలో వార్ధక్య లక్షణాలు ఏవీ కన్పించవు.

## విదుర మైత్రేయుల సంభాషణ

ఇటువంటి మహోన్నత లక్షణాలున్న మైత్రేయుడి వద్దకు వెళ్ళి విదురుడు ఆయనకు సాష్టాంగ దండ ప్రమాణాలు ఆచరించాడు. తన సందేహాల నివృత్తికి ఎన్నో ప్రశ్నలు వేశాడు.

**మునీంద్రా! లోకులెల్లప్పుడూ సుఖాన్నే ఆశ్రయిస్తారు. అందుకోసం ఎన్నో కర్మల్ని ఆచరిస్తుంటారు. దైవానుగ్రహం లేక వాళ్ళ ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతాయి. ఈ కర్మలన్నీ ప్రతిబంధకాలు. అవి దుఃఖం కలిగిస్తాయే కాని సుఖాన్నివ్వవు. పాపాన్ని పోగొట్టలేవు. మానవులు కోర్కెల వ్యామోహంలో పడి పరితపిస్తుంటారు. సర్వస్వతంత్రుడైన భగవంతుడు మత్స్య కూర్మాది అవతారాలు ఎందుకు ధరించాడు? ఏయే అవతారాలలో ఏయే సత్కార్యాలు సాధించాడు? క్రియారహితుడైన ఆయన తొలుత ఈ ప్రపంచాన్ని ఎలా సృష్టించాడు? శ్రీమన్నారాయణ గాథలనే అమృతాన్ని ఎంత ఆస్వాదించినా తనివి తీరదు. నాకు వాటిని అనుగ్రహించు** అని విదురుడు ప్రార్థించాడు.

పై ప్రశ్నలకు సమాధానంగా మైత్రేయుడు తొలుత ప్రపంచం పుట్టుక గురించి చెప్పాడు.

## ప్రపంచం పుట్టుక

ఈ విశ్వంలోని జీవులన్నీ భగవంతుడి స్వరూపాలు. ఆత్మలన్నీ ఆయనే. అన్నిటికీ ప్రభువతడే. భగవంతుడికి సృష్టి చెయ్యాలన్న సంకల్పం కలిగిన వెంటనే కార్యకారణ రూపమైన, మహత్తరమైన మాయాశక్తిగా **అవిద్య** రూపొందింది. మాయవల్ల **కాల చోదితం, అవ్యక్తం, ప్రకృతి** అనే పేర్లతో వ్యవహరింపబడే మహత్తత్త్వం పుట్టింది.

మహత్తత్త్వం నుండి **కారణం, కార్యం, కర్త** అనే భేదాలు ఏర్పడి వరుసగా **పంచభూతాలు, ఇంద్రియాలు, మనస్సు** అనే రూపాలుగా గోచరించాయి. ఈ మూడింటిలో **సత్త్వ, రజో, తమో గుణాలతో** కూడిన అహంకారం ఏర్పడింది. దీనివల్ల **ఇంద్రియాలు, పంచభూతాలు** పుట్టాయి.

పంచభూతాలలో ఆకాశానికి శబ్దం; వాయువుకు శబ్ద స్పర్శలు; తేజస్సుకు (అగ్నికి) శబ్ద స్పర్శ రూపాలు; జలానికి శబ్ద స్పర్శ రూప రసాలు; భూమికి వీటితోబాటు గంధం గుణాలయ్యాయి. ఇవి సమైక్యం కాకపోవడంవల్ల ప్రపంచ సృష్టికి అవి సమర్థం కాలేకపోయాయి. అవి శ్రీమన్నారాయణుని ప్రార్థించాయి.

పంచభూతాలు – పంచతన్మాత్రలు – పది ఇంద్రియాలు – కాలం – ప్రకృతి – మహత్తు – మనస్సు – బుద్ధి – చిత్తం – అహంకారం అనే అంతఃకరణ చతుష్టయం – ఈ ఇరవయ్యేడు తత్త్వాలలో ఒకే సమయంలో నారాయణుడు ప్రవేశించి విడివిడిగా వాటికి ఏకత్వం కలిగించాడు (జీవుడికి ఇంద్రియ జ్ఞానం కలిగిన విధానం వివరింపబడింది)

విరాట్పురుషుడి వివిధ అవయవాల నుంచి విశ్వం ఆవిర్భవించింది. ఆయన శిరస్సు నుండి స్వర్గం, పాదాల నుండి భూమి, నాభినుండి ఆకాశం పుట్టాయి. సత్త్వ రజస్తమో గుణాల మార్పువల్ల జీవులు అమరులయ్యారు. సత్త్వగుణం ఎక్కువగా ఉండడం వల్ల దేవతలు స్వర్గాన్ని , రజోగుణం వల్ల మానవులు, గోవులు మొదలైన జీవరాశి భూమిని, తామసగుణం వల్ల భూతాదులైన రుద్ర పారిషదులు భూమికి, ఆకాశానికి మధ్య ఉన్న ప్రదేశాన్ని పొందారు. విరాట్పురుషుడి ముఖం నుంచి వేదాలు ఆవిర్భవించాయి.

శ్రీమన్నారాయణుని మహిమను ఆయన నాభికమలం నుండి పుట్టిన చతుర్ముఖుడే తెలుసుకోలేడు. ఇక ఇతరుల సంగతి చెప్పడానికి ఏముంది?

పురుషోత్తముడి మాయవల్ల ఈ జగత్తంతా ఒక క్రమంలో పుట్టి, పెరిగి, నశిస్తూ ఉంటుంది. ఇంతకుముందు ఇలాగే జరిగింది. ఇకముందు కూడా ఇలాగే కొనసాగుతుంది. అటువంటి సృష్టి తొమ్మిది రకాలు. వాటిలో ప్రాకృత వైకృత సృష్టులనేవి కాల ద్రవ్య గుణాలనే మూడు విధాలైన భేదాల చేత పరస్పరం సంకరం అవుతుంటాయి.

## ప్రాకృత సృష్టులు ఆరు. అవి –

1. మహత్తత్త్వం – పరమేశ్వర సాన్నిధ్యంలో గుణభేదం పొందుతుంది.
2. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకమైన అహంకార తత్త్వం.
3. శబ్ద స్పర్శ రూప రసగంధాలనే పంచ తన్మాత్రల ద్రవ్యశక్తితో కూడిన పంచభూతాల సృష్టి.
4. కర్మ జ్ఞానేంద్రియాల సృష్టి.
5. సాత్త్విక – అహంకారాల వల్ల పుట్టిన దేవతా గుణాలు – ఇది మనోమయం.
6. ప్రాణి సమూహానికి అజ్ఞాన కృతాలైన ఆవరణ విక్షేపాలు కలిగించే తామస సృష్టి.



## వైకృత సృష్టులు మూడు

7. పూలు పూయకనే ఫలించే రావి, మేడి, పనస, మఱ్ఱి మొదలైన వనస్పతులు; పూచి ఫలించిన వెంటనే నశించే వడ్లు, యవలు, పెసలు మొదలైన ఓషధులు; పైకి ఎగబ్రాకటానికి వీలులేని మాలతి, మల్లె మొదలైన తీగలు; దృఢమైన వేళ్ళతో నేలపై వ్యాపించే దుబ్బులు పొదలు; పుష్పించి పండ్లనిచ్చే మామిడి మొదలైన చెట్లు; అవ్యక్త చైతన్యంతో పైకి తిరుగుతూ తమోమయాలై లోపల మాత్రమే స్పర్శజ్ఞానం కలిగి కదలలేనివైన (కొండ మొ॥) ఈ **ఆరూ ఏడవ సృష్టి.** 8. రేపు అనే జ్ఞానం లేకుండా, ఆహారాదులందు మాత్రమే ఆసక్తి కలిగి, వాసన చూసి తెలుసుకోగల వాటిని గ్రహిస్తూ మనస్సులో ఆలోచన చెయ్యలేనివి :– చీలిన గిట్టలున్న ఎద్దు, బఱ్ఱె, మేక, జింక, పంది, ఒంటె, గురుపోతు, నల్లచారల దుప్పి, పొట్టేలు మొదలైన తొమ్మిది; చీలని గిట్టలున్న గాడిద, గుర్రం, కంచరగాడిద, గౌరమృగం, శరభమృగం, చమరీమృగం, మొదలైన ఆరు; అయిదుగోళ్ళున్న కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ఏదుపంది, సింహం, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము మొదలైన పన్నెండు – ఇవన్నీ నేలమీద సంచరించేవి. మొసలి మొదలైన జలచరాలు, రాబందు, గద్ద, కొంగ, డేగ, తెల్లపిట్ట, గబ్బిలం, నెమలి, హంస, బెగ్గురు పక్షి, జక్కవ, పిట్ట, కాకి, గుడ్లగూబ మొదలైన ఆకాశంలో తిరిగే తిర్యక్కులు – అయిన ఇరవై ఎనిమిది **భేదాలు ఎనిమిదవ సర్గ** (సృష్టి.); 9. మానవసృష్టి – ఇది రజోగుణంతో ప్రేరేపింపబడి, కర్మలు చెయ్యడంలో నేర్పుగలిగింది. దుఃఖంలోనూ సుఖం కోరేది.

## దేవసర్గం

ఎనిమిది విధాలు 1. విబుధులు 2. పితృదేవతలు 3. సురలు 4. గంధర్వులు, అప్సరసలు 5. యక్షులు, రాక్షసులు 6. భూతప్రేత పిశాచాదులు 7. సిద్ధచారణ విద్యాధరులు 8. కిన్నర కింపురుషులు

కల్పారంభంలో ఇలాగే తన్ను తాను సృష్టించుకుంటూ, రజోగుణంతో కూడినవాడై, సృష్టికర్తగా తన స్వరూపమే అయిన విశ్వాన్ని కల్పించాడు. ఈశ్వరుడి మాయా విశేషంవల్ల ఈ సృష్టి – నదుల్లోని నీటి సుడులలో తిరిగే చెట్లవలె ముందు వెనుకలు తెలియకుండా ఉంటుంది.

ప్రపంచం పుట్టుకను గురించి ఈ విధంగా తెలియజేసిన మైత్రేయుడు తర్వాత కాల లక్షణాన్ని వివరిచాడు.

### కాలస్వరూపం

భగవంతుడి సృష్టికి అంతులేదు.

సూర్యకాంతి ప్రసరించే సమయంలో మన కంటికి కన్పించే చిన్న చిన్న రేణువులలోని ఆరవ భాగానికి **పరమాణువు** అని పేరు. ఆ పరమాణువు మీద సూర్యకిరణం ఒకవైపు నుంచి మరొక వైపుకు పయనించే కాలానికి **సూక్ష్మకాల**మని పేరు. రెండు పరమాణువులు ఒక **అణువు.** మూడు అణువులు ఒక **త్రసరేణువు**. మూడు త్రసరేణువులు ఒక **త్రుటి.** నూరు త్రుటులు **వేధ**. మూడు వేధలు **లవం.** మూడు లవాలు ఒక **నిమేషం.** మూడు నిమేషాలు ఒక **క్షణం.** అయిదు క్షణాలు ఒక **కాష్ఠ.** పది కాష్ఠలు ఒక **లఘువు.** పదిహేను లఘువులు ఒక **నాడి.** రెండు నాడులు ఒక **ముహూర్తం.** ఆ నాడికలు ఆరు లేదా ఏడు అయితే ఒక **ప్రహరం.** దాన్నే **యామం లేదా జాము** అంటారు. నాలుగు జాములు ఒక **పగలు.** మరో నాలుగు జాములు **రాత్రి.** ఈ రెండూ కలిసి మానవులకు ఒక **దినం** అవుతుంది. పదిహేను దినాలు ఒక **పక్షం. శుక్ల కృష్ణ** పక్షాలు అని రెండు పక్షాలు. ఆ రెండూ కలిస్తే ఒక నెల. ఇది పితృదేవతలకు ఒక దినం. రెండు నెలలు ఒక **ఋతువు.** ఆరునెలలు ఒక **అయనం.** ఉత్తర దక్షిణ అయనాలని రెండు కలిస్తే పన్నెండు నెలలున్న ఒక **సంవత్సరం** అవుతుంది. ఈ సంవత్సరం **దేవతలకు** ఒక దినం. (సూర్యుడు మేషం మొదలైన పన్నెండు రాశులలో పయనించే కాలం సంవత్సరం. దీన్నే **మహత్కాలం** అంటారు.) నూరు సంవత్సరాలు మానవుల పరమాయువు.

సూర్యగమనం వల్ల **సౌరమానం, చాంద్రమానం, నక్షత్రమానం** అనే భేదాలతో సంవత్సరకాలం ఏర్పడుతుంది. ఇది **సంవత్సరం, పరీవత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, వత్సరం** అనే అయిదు భేదాలు కలిగి ఉంటుంది.

సూర్యుడు కాలరూపమైన తన శక్తితో జీవ సృష్టిని అనుకూలం చేసుకుంటూ ఆయుస్సును హరిస్తూ, మానవుల విషయాసక్తిని పెంచుతూ, కోరికలు కలవారికి యజ్ఞాల ద్వారా స్వర్గఫలాన్ని సమకూరుస్తూ ఆకాశంలో పరుగెడుతుంటాడు. అటువంటి సూర్యభగవానుణ్ణి ఆరాధించమని మైత్రేయుడు విదురునితో అన్నాడు.

దేవతల 360 రోజులు (మానవుల 360 సంవత్సరాలు) ఒక **దివ్య సంవత్సరం** అవుతుంది. **కృతయుగం** నాలుగువేల దివ్యసంవత్సరాల ప్రమాణం కలిగి ఉంటుంది. దాని సంధ్యాకాలం ఎనిమిది వందల దివ్యవత్సరాలు. మొత్తం 4800 దివ్యవత్సరాలు. **త్రేతాయుగం** 3000 దివ్య వత్సరాలు. సంధ్యాకాలం 600 దివ్య వత్సరాలు. మొత్తం 3600 దివ్య సంవత్సరాలు. **ద్వాపరయుగం** 2000 దివ్య సంవత్సరాలు. సంధ్యాకాలం 400. మొత్తం 2400 దివ్య వత్సరాలు. **కలియుగం** 1000 దివ్యవత్సరాలు. సంధ్యాకాలం 200. మొత్తం 1200 దివ్యవత్సరాలు. సంధ్యాంశల మధ్యకాలంలో ధర్మం అధికంగా ప్రవర్తిల్లుతుంది. సంధ్యాంశలో అల్పంగా ఉంటుంది.



భూలోకం, భువర్లోకం, స్వర్లోకం కంటే పైన **సత్యలోకం** ఉంటుంది. అందులోని బ్రహ్మకు వెయ్యి చతుర్యుగాలు. (12000 దివ్య సంవత్సరాలు, 43,20,000 మానవ వత్సరాలు ఒక చతుర్యుగం. 432 కోట్ల మానవ సంవత్సరాలు వెయ్యి చతుర్యుగాలు) గడిస్తే ఒక పగలు అవుతుంది. అలాగే రాత్రిపూట కూడా. బ్రహ్మ నిద్రిస్తే ప్రళయం వస్తుంది. మేల్కొంటే లోకాలు మళ్ళీ పుడతాయి.

71 చతుర్యుగాలు ఒక **మన్వంతరం.** అంటే ఒక మనువు జీవితకాలం. ఇటువంటి 14 మన్వంతరాలు బ్రహ్మకు ఒక్కదినం. దేవతలు, మునులు, సప్తర్షులు భగవంతుడి అంశలో మనువులుగా పుట్టి లోకాలను పాలిస్తారు. ఈ మన్వంతరాలలో శ్రీహరి పితృ, దేవ, పశు, పక్షి, మానవరూపాల్లో జన్మించి ఆత్మశక్తితో పౌరుష ప్రతాపాలతో విశ్వాన్ని పరిపాలిస్తాడు.

బ్రహ్మ రాత్రి రాగానే నిద్రిస్తాడు. అప్పుడాతని శక్తిసామర్థ్యాలు అంధకారంతో ఆవరింపబడతాయి. విష్ణువు యొక్క శక్తిరూపమైన **సంకర్షణాగ్ని** విజృంభిస్తుంది. ఆ అగ్ని జ్వాలలు ముల్లోకాలను దహించి వేస్తాయి. ప్రళయ కాలంలో ప్రచండ వాయువులు వీస్తాయి. ఆ వాయు వేగానికి ఉప్పొంగిన సముద్రజలాలు అన్నింటిని ముంచివేస్తాయి. ఆ మహాసముద్రం మధ్య శేషశయ్యమీద యోగనిద్రాముద్రితుడై శయనించి ఉన్న విష్ణువు ఉదరంలో అన్ని లోకాలు విలసిల్లుతుంటాయి.

మానవుల ఆయుస్సు నూరుసంవత్సరాలైనట్లే బ్రహ్మదేవుడి పరమాయువు కూడా వంద సంవత్సరాలే. అందులోని మొదటి సగాన్ని **పూర్వ పరార్ధం** అని, రెండవ సగాన్ని **ద్వితీయ పరార్ధం** అంటారు. పూర్వ పరార్ధకాలం **బ్రహ్మకల్పం** అవుతుంది. కల్పం మొదట్లో బ్రహ్మ పుట్టడం వల్ల దానికాపేరు. దీన్నే **శబ్దబ్రహ్మం** అని కూడా పేర్కొంటారు.

అన్ని లోకాలకు ఆశ్రయమై ఉండే పద్మం పంకజనాభుడి నాభి అనే సరస్సు నుండి ఉద్భవించిన కాలం **పద్మకల్పంగా** ప్రసిద్ధి గాంచింది. ద్వితీయ పరార్ధం మొదట శ్రీహరి వరాహరూపం ధరించినప్పుడు **వరాహకల్పం** అవుతుంది. ఆ వరాహకల్పమే ప్రస్తుతం జరుగుతూ ఉంది.

## చతుర్ముఖుని సృష్టి కార్యం

బ్రహ్మ నేను సృష్టిస్తాను అని సంకల్పించగానే మోహం, మహామోహం, అంధతామిస్రం, తామిస్రం, చిత్తవిభ్రమం మొదలైన **అవిద్యాపంచకం** కలిసిన భూతకోటి పుట్టింది. ఇది పాపకార్యంగా భావించి భగవద్ధ్యానం చేసి సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులనే మునుల్ని సృష్టించాడు. వారిని ప్రజల్ని పుట్టించమని ఆదేశించాడు.

వాళ్ళు అవహేళన చెయ్యగా, కోపించిన ఆయన కనుబొమల నుంచి రుద్రుడు జన్మించాడు. అతడు రుద్రగణాలను సృష్టించాడు. బ్రహ్మ వివిధ అవయవాలనుండి దక్ష, నారద, పులహ, పులస్త్య, భృగు, క్రతువు, అంగిరస, వసిష్ఠ, మరీచి, అత్రి అనే పదిమంది పుట్టారు. ఆత్మనుంచి మన్మథుడు జన్మించాడు. దేహం నుండి సరస్వతి జన్మించింది.

బ్రహ్మ నాలుగుముఖాల నుంచి నాలుగు వేదాలు, చతురాశ్రమాలు ఉద్భవించాయి. అన్వీక్షకీ, త్రయీ, వార్తా, దండనీతి అనే నాలుగు న్యాయవిద్యలు, భూః , భువః, సువః అనే వ్యాహృతులు పుట్టాయి. ఇంకా వర్ణాలు, ఛందస్సు, సప్తస్వరాలు మొదలైనవన్నీ వివిధావయవాల ద్వారా వెలువడ్డాయి.

ఎంత చేసినా ప్రజాభివృద్ధి కాని కారణంగా దైవానుకూల్యత కోసం ధ్యానించాడు. ఆయన శరీరం రెండు భాగాలయింది. అందులో ఒకటి స్వరాట్టు అయిన **స్వాయంభువ మనువుగా**, మరొకటి అతడి భార్య **శతరూపగా** రూపొందాయి.

## స్వాయంభువ మనువు – ప్రజాభివృద్ధి

తొలిజంట అయిన శతరూప స్వాయంభువులకు **ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడనే** ఇద్దరు కుమారులు; **ఆకూతి, దేవహూతి, ప్రసూతి** అనే ముగ్గురు కుమార్తెలు జన్మించారు.

వారిలో ఆకూతిని **రుచి ప్రజాపతికి**, దేవహూతిని **కర్దమ ప్రజాపతికి**, ప్రసూతిని **దక్షప్రజాపతికి** ఇచ్చి వివాహం చేశారు. వారివల్ల కలిగిన సంతానం కారణంగా ప్రజాభివృద్ధి కలిగింది. స్వాయంభువ మనువు బ్రహ్మవద్దకు వెళ్ళి అఖిల జంతుజాలానికి ఆధారభూతమైన భూమి ఇప్పుడు మహాసముద్రంలో మునిగి ఉంది. తానూ, తన సంతానం నివసించటానికి చోటులేని కారణంగా ఆ భూమిని ఉద్ధరించే ఉపాయం చెప్పమన్నాడు.

బ్రహ్మ విష్ణువుని స్మరించాడు. వెంటనే ఆయన ముక్కులోంచి **యజ్ఞవరాహమూర్తి** బొటనవేలంత పరిమాణంలో పుట్టి, ఒక్క క్షణంలోనే ఏనుగంత ఆకారమై, వెనువెంటనే పర్వతాకారమంత రూపొందాడు. సముద్రంలోకి చొరబడి హిరణ్యాక్షుణ్ణి సంహరించి భూమిని ఉద్ధరించాడు. బ్రహ్మాదిదేవతలు యజ్ఞవరాహమూర్తి అవతారం దాల్చిన విష్ణుమూర్తిని పరిపరివిధాలుగా స్తుతించారు.

ఈ సందర్భంగా విదురుడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా మైత్రేయుడు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతాన్ని తెలియజేశాడు.

## హిరణ్యాక్ష హిరణ్యకశిపులు

## దితికశ్యపుల అకాల సంయోగం

దక్షప్రజాపతి కుమార్తె దితి. ఆమె మనస్సులో సంతానకాంక్ష పెల్లుబికింది. ఆమె కశ్యపుడి వద్దకు సూర్యాస్తమయ సమయంలో వెళ్ళింది. తన కోరికను వెల్లడించింది.



కశ్యపుడు **ఇది సంధ్యా సమయం. ముహూర్తకాలం ఆగు. మన్మథుడికి శత్రువైన త్రినేత్రుడు వృషభ వాహనం మీద భూతగణాలలో కలిసి విహరిస్తూ ఉంటాడు. ఈ ఉగ్రవేళలో సమాగమం సముచితం కాదు** అని నచ్చచెప్పాడు.

కాని దితి భర్త మాటల్ని పట్టించుకోక, సహనం కోల్పోయి ఆయన వస్త్రాన్ని పట్టి లాగింది. ఆమె నిర్బంధాన్ని వదిలించుకోలేక ఈశ్వరుడికి నమస్కరించి కశ్యపుడు ఆమె కోరికను తీర్చాడు. సంయోగానంతరం కశ్యపుడు **మన ఈ కలయికవల్ల నీకు దుర్మార్గులైన పుత్రులు జన్మిస్తారు. లోక కంటకులవుతారు. విష్ణువు చేత వధింపబడతారు** అన్నాడు.

దితి ప్రాధేయపడగా **శ్రీహరి పాదాలను ఆశ్రయించి స్మరించు. నీ కొడుకులలో హిరణ్యకశిపుడనే వాడికి పుట్టే సంతానంలో ధర్మాత్ముడు, విష్ణుభక్తి పరాయణుడు జన్మిస్తాడు. అతడి కారణంగా వంశమంతా పునీతమవుతుంది.** అని కశ్యపుడు అనుగ్రహించాడు.

దితి గర్భం దాల్చింది. అది మహాతేజస్సుతో దినదినాభివృద్ధి చెందుతూ వచ్చింది. నూరేండ్ల పర్యంతం ఉన్న ఆ గర్భం నుంచి ఒక రమణీయమైన తేజస్సు సర్వత్రా వ్యాపించి సూర్యచంద్ర కాంతుల్ని సైతం కప్పేసింది. చిక్కని చీకటి వ్యాపించింది. భయంతో కంపించిన దేవతలు బ్రహ్మను ఆశ్రయించారు.

## సనక సనందనాదుల శాపం

బ్రహ్మ వారికి ఇలా వివరించారు. సనక సనందనాదులు మీకంటే ముందు జన్మించిన వాళ్ళు. నా మానస పుత్రులు. రూపం దాల్చిన కైవల్యం వంటివారు. సమగ్ర జ్ఞాన స్వరూపులు. శ్రీహరి పాదపద్మాలను కొలవాలన్న ఆసక్తితో ఒకరోజు వారు వైకుంఠం వెళ్ళారు. ఆరు మహాద్వారాలను దాటి ఏడవమహాద్వారాన్ని సమీపించారు.

అక్కడ సమవయస్కులైన ఇద్దరు ద్వారపాలకుల్ని చూశారు. సనక సనందనాదులు మిక్కిలి వృద్ధులైనా అయిదేళ్ళ బాలురిలా ఉంటారు. వాళ్లు ద్వారాన్ని సమీపించగానే ద్వారపాలకులు అడ్డుకొని ప్రతికూలమైన మాటలు పలికారు. దానితో ఆగ్రహించిన సనక సనందనాదులు **కామక్రోధ లోభాలనే శత్రుగుణాలకు పాత్రులై భూలోకంలో జన్మించండి** అని శాపం ఇచ్చారు.

## జయ విజయులు

ఆ ద్వారపాలకులు జయ విజయులనేవారు తమ తప్పిదాన్ని గ్రహించి **మీరిచ్చిన శాపాన్ని అనుభవిస్తున్నా శ్రీమన్నారాయణుడి నామం విస్మరించకుండా ఉండేటట్లు అనుగ్రహించండి** అని ప్రాధేయపడ్డారు. అక్కడి కలకలం విని విష్ణువు ద్వారం వద్దకు

వచ్చాడు. లక్ష్మీదేవి కూడా వెంటవచ్చింది. విషయం గ్రహించిన విష్ణువు తన సేవకుల తప్పు తనకూ చెందుతుందని, వాళ్ళను అనుగ్రహించమని సనక సనందనాదులకు విన్నవించాడు.

**జయ విజయులిద్దరూ రాక్షసులై జన్మిస్తారు. లోకకంటకులుగా ప్రవర్తిస్తారు. నాతో యుద్ధానికి సన్నద్ధులై, నా సుదర్శన చక్రం చేత వధింపబడతారు. ఇలా మూడు జన్మలెత్తిన పిదప వీరికి జన్మ అంటూ ఉండదు** అని విష్ణువు అనుగ్రహించాడు.

ఆ జయ విజయులే ఇప్పుడు దితిగర్భంలో ఉన్నారు. వారి అసమానమైన తేజస్సే మీ తేజస్సులన్నింటినీ వమ్ముచేసింది. బ్రహ్మచెప్పిన ఈ వృత్తాంతాన్ని విని దేవతలు వెనుతిరిగారు.

## రాక్షసుల జననం

దితి ఇద్దరు కుమారుల్ని కన్నది. ఆ సమయంలో భూమి కంపించింది. కుల పర్వతాలు వణికాయి. సముద్రాలు కలత చెందాయి. నక్షత్రాలు నేలరాలాయి. ఆకాశం బద్దలయింది. అష్ట దిగ్గజాలు ఊగసాగాయి. భూమిమీద పిడుగులు పడ్డాయి. ఇలా ఎన్నో అపశకునాలు, మహోత్పాతాలు సంభవించాయి.

కశ్యప ప్రజాపతి దితి గర్భంలో తాను మొదట ఉంచిన తేజస్సు వల్ల పుట్టిన వాడికి **హిరణ్యకశిపుడు** అని, కాన్పు సమయంలో దితి గర్భం నుంచి తొలుత పుట్టి సూర్యతేజస్సుతో ప్రకాశించేవాడికి **హిరణ్యాక్షుడు** అని పేర్లు పెట్టాడు.

హిరణ్యకశిపుడు బ్రహ్మదేవుడివల్ల పొందిన వరాలలో తిరుగులేని వాడిగా చెయ్యగల మొనగాడి కోసం అన్నిచోట్ల వెతికాడు. అతణ్ణి చూసి అందరూ పారిపోయేవాళ్ళే కాని ఎదిరించగల వాళ్ళు ఒక్కరూ కన్పించలేదు. చివరకు సముద్రంలోకి జొరబడి, **వరుణుడు** పాలించే **విభావరి** నగరానికి వెళ్ళి అతణ్ణి పోరుకు ఆహ్వానించాడు.

వరుణుడు తమ ఉభయుల బలాన్ని అంచనా వేసుకొని హిరణ్యాక్షుడితో **సాటిలేని నీ పరాక్రమానికి సమాధానం చెప్పగల వీరుడు విష్ణువొక్కడే. పైగా ఆయన ప్రతియుగంలోను పురుష రూపం దాల్చి రాక్షసుల్ని వధించి, మునుల్ని రక్షిస్తుంటాడు. నువ్వు అతడితో యుద్ధం చెయ్యడం సమంజసం** అన్నాడు.

వెంటనే వైకుంఠం మార్గం పట్టిన హిరణ్యాక్షుడికి నారదుడు ఎదురువచ్చి విషయం గ్రహించి **విష్ణువు వైకుంఠంలో లేడు. భూభారాన్ని పూనడానికి ఆదివరాహ రూపం దాల్చి రసాతలంలో ఉన్నాడు అక్కడికి వెళ్ళు** అన్నాడు.



## ఆది వరాహమూర్తి

హిరణ్యాక్షుడు ఆగ్రహంతో పాతాళం వెళ్ళాడు. అక్కడ వాడి అయిన తన కోరలపై భూమిని మోస్తూ వస్తున్న వరాహాన్ని చూశాడు. **బ్రహ్మ వరాలను బట్టి రసాతలంలో ఉన్న ఈ భూమి నాదే. దాన్ని తీసుకుపోవద్దు. నీ ప్రాణాలు తీస్తాను** అని హిరణ్యాక్షుడు హుంకరించాడు. పరిహాస పూరితమైన మాటలతో వరాహమూర్తిని ప్రేరేపించాడు. ఇద్దరి మధ్య భీకర యుద్ధానంతరం చివరగా తన చేతిదెబ్బతో హిరణ్యాక్షుణ్ణి విష్ణువు నేలకూల్చాడు. బ్రహ్మాది దేవతలు శ్రీహరిని వేనోళ్ళ కీర్తించారు.

విదురుడు అడిగిన మీదట బ్రహ్మ గంధర్వులను, అప్సర స్త్రీలను, గుహ్యక, సిద్ధ, భూత, విద్యాధర, కిన్నర, కింపురుషుల్ని సృష్టించిన తీరును మైత్రేయముని విన్నవించాడు. విదురుడు దేవహూతి కర్దముల గురించి, వారి సంతానమైన కపిలాచార్యుడి గురించి చెప్పసాగాడు.

## కర్దమ దేవహూతులు

కృతయుగంలో బ్రహ్మ ప్రజల్ని సృష్టించడానికి కర్దముణ్ణి నియమించాడు. కర్దమముని పదివేల దివ్య సంవత్సరాలు సరస్వతీ నదీతీరంలో తపస్సు ఆచరించాడు. విష్ణువు ప్రత్యక్షమై స్వాయంభువమనువు మహోన్నతురాలైన తన కుమార్తె దేవహూతిని అతడికిచ్చి వివాహం చేస్తాడని, తాను ఆమె గర్భంలో తన కళాంశతో కుమారుడిగా జన్మిస్తానన్నాడు. కర్దముణ్ణి ఆర్ద్ర దృష్టులతో విష్ణువు చూసినప్పుడు రాలిన ఆనంద బాష్ప బిందువుల సమూహం నేలపై పడి సరస్వతీ నదిని చుట్టుకొని ప్రవహించి **బిందు సరోవరం** అని పేరు గాంచింది.

బిందు సరోవరం సమీపంలో కర్దముని తపోవనం ఉంది. స్వాయంభువ మనువు అక్కడికి వచ్చి, భార్య, కుమార్తెల అభిప్రాయాన్ని గ్రహించి కర్దముడికి దేవహూతిని కన్యాదానం చేశాడు. దేవహూతి భక్తి తత్పరతకు మెచ్చి ఆమెకు కర్దముడు దివ్యదృష్టిని ప్రసాదించాడు. దేవహూతి సంతానేచ్ఛను తెలుసుకొని దివ్య విమానం సృష్టించాడు. కోరుకున్న చోటికి వెళ్ళగల ఆ విమానంలో భార్యతో కలిసి అనేక ప్రదేశాలను కర్దముడు సందర్శించాడు. ఇలా నూరేండ్లు గడిపారు.

ఒకనాడు కర్దముడు తొమ్మిది రకాలైన వేర్వేరు రూపాలు ధరించి క్రమంగా తన వీర్యాన్ని దేవహూతి గర్భంలో తొమ్మిది విధాలుగా నిలిచేటట్లు చేశాడు. తద్వారా దేవహూతికి తొమ్మిదిమంది కుమార్తెలు జన్మించారు. అప్పుడు కర్దముడు సన్యసించాలని భావించాడు.

ఆ విషయం గ్రహించిన దేవహూతి తన కుమార్తెలకు తగిన వరులను అన్వేషించి వివాహం జరిపించడం, తనకు వేదాంత విషయాలు, చెప్పగలిగిన పుత్రుణ్ణి అనుగ్రహించడం చెయ్యమని ప్రార్థించింది. కర్దముడు ఆమెతో సాక్షాత్తు విష్ణుభగవానుడే ఆమె గర్భంలో ప్రవేశిస్తాడని, ఆమె సందేహాలన్నింటినీ అతడు తీర్చగలడని చెప్పాడు.

## కపిలాచార్యుడు

కర్దముడి ఆదేశానుసారం విష్ణుపద ధ్యానంతో గడిపిన దేవహూతికి కొన్ని సంవత్సరాల తరువాత భగవంతుడు ఆమె గర్భంలో నుంచి ఆవిర్భవించాడు. అతడే కపిలుడు. ఆ సమయంలో శ్రీమహావిష్ణువును దర్శించడం కోసం బ్రహ్మ, మరీచి మొదలైన మునీశ్వరులతో అక్కడికి వచ్చాడు.

బ్రహ్మ ఆదేశానుసారం తన కుమార్తెలలో కళను మరీచికి, అనసూయను అత్రికి, శ్రద్ధను అంగిరసునకు, హవిర్భువును పులస్త్యునికి, గతిని పులహునకు, క్రియను క్రతువునకు, ఖ్యాతిని భృగువునకు, అరుంధతిని వసిష్ఠునికి, శాంతిని అథర్వునకిచ్చి కర్దముడు వివాహం గావించాడు.

ఆ తర్వాత కర్దముడు ఏకాంత సమయంలో కపిలుని దర్శించి నమస్కరించి తత్త్వజ్ఞానం బోధించమన్నాడు. కపిలుడు సర్వాంతర్యామి అయిన తనను స్థిరంగా హృదయంలో నిలిపి ధ్యానం చెయ్యమన్నాడు. కర్దముడు మునిజన నివాస యోగ్యమైన అరణ్యానికి వెళ్లాడు. అక్కడ మౌనవ్రతం పూని, లోక సంబంధాలను విడిచి, హోమాది అగ్ని కార్యాలను వదిలి, ఒక చోట స్థిరంగా నిలవక, అంతటా తిరుగుతూ తనలోని పరమాత్మనే శరణుజొచ్చిన వాడై, చాంచల్యం లేనివాడై, సమస్త ప్రపంచాన్ని విష్ణుమయంగా భావిస్తూ భక్తియోగం ద్వారా భాగవతులు పొందే పరమపదం చేరుకున్నాడు.

## తల్లికి తత్త్వబోధ

కర్దముడు నిష్క్రమించిన పిదప దేవహూతి తన కుమారుడైన కపిలాచార్యుని సమీపించి తత్త్వజ్ఞానం అనుగ్రహించమని కోరింది. అందుకతడు తనపై ఏకాగ్రచిత్తంలో భక్తిని చూపమన్నాడు. సహజమూ, కారణరహితమూ అయిన సేవారూపమైన భక్తి ముక్తికంటే గొప్పదని పేర్కొన్నాడు. భగవద్భక్తి జీవుడు చేసిన కర్మల్ని, కర్మఫలాలను లోగొంటుందని, విష్ణుభక్తి విశేషాలను సుదీర్ఘంగా దేవహూతికి కశ్యపుడు తెలియజేశాడు.

భక్తియోగం గురించి, ప్రకృతి పురుషుల లక్షణాలు గురించి, అహంకార భేదాలు, నారాయణుడి సర్వవ్యాపకత్వం మొదలైన విషయాలను చక్కగా వివరించాడు.



## భక్తియోగం

ప్రజల సంకల్పాలను బట్టి, ఆశయాలను అనుసరించి భక్తియోగం సిద్ధిస్తుంది. భక్తి **తామసం, రాజసం, సాత్త్వికం** అని మూడు విధాలు.

ఇతరుల్ని హింసించి ఆడంబరం, అసూయ, రోషం, అజ్ఞానం, భేదబుద్ధి కలిగి నన్ను భజించేవాడు తామసుడు. అది **తామస భక్తి.**

లక్షలు వెచ్చించి ఆడంబరంతో నిండిన పూజాద్రవ్యాలతో, అష్టైశ్వర్యాల కోసం, పేరు ప్రతిష్ఠలకోసం పూజించడం **రాజస భక్తి.**

తెలియక చేసిన పాపాలను పరిహరించేది భగవద్భక్తి ఒక్కటేనన్న విశ్వాసంతో, భజింపతగిన భవ్యచరిత్రుడు భగవంతుడొక్కడే అని భావించి, సమస్త కార్యాలను భగవదర్పితంగా ఆచరించి, లోకులకు హితం కూర్చే పనులు చేస్తూ ఉండటం **సాత్త్విక భక్తి.**

కారణాలు అన్వేషించకుండా, నన్ను విడిచిపెట్టక, అవ్యాజంగా నాకై చేసే వ్రతమే అచంచలమైన భక్తి. కోరికలు లేకుండా భజించే భక్తులకు **సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం** అనే ముక్తులు లభిస్తాయి. తమ కోర్కెల్ని తీర్చేవి అయినా నా ఆరాధనకు దూరమైన ఏ సాధనను మహాత్ములైన వాళ్ళు చెయ్యరు. దీన్నే **అత్యంతిక భక్తియోగం** అంటారు.

నా భక్తుడు స్నానసంధ్యాది నిత్యకర్మలందు, జగత్కల్యాణం ఆశించి చేసే యజ్ఞయాగాది నైమిత్తిక కర్మలందు మిక్కిలి శ్రద్ధాసక్తులు కలిగి ఉండాలి. గురువుల్ని, పెద్దల్ని, గౌరవించాలి. నా రూపాన్ని దర్శించడం, పూజించడం, నమస్కరించడం, స్మరించడం, నా చరిత్రల్ని వినడం, కర్మల్లో చిక్కుకోకుండా ఉండడం, తనకంటే గొప్పవారి పట్ల ఆదర గౌరవాలు, తక్కువ వారిపైన దయాదాక్షిణ్యాలు, సమానులైన వారిమీద స్నేహానురాగాలు కలిగి ఉండడం, యమ నియమాలు పాటించడం, యోగాభ్యాసం చెయ్యడం, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతికాలను తాను తెలుసుకొని ఇతరులకు తెలియజెయ్యడం, భగవద్భక్తుల్ని సేవించడం, అహంకారం లేకుండా నిశ్చల హృదయంతో జీవించడం వంటి జీవన విధానాన్ని ఆచరించిన పుణ్యాత్ముడు అనాయాసంగా నన్ను చేరుకుంటాడు.

సర్వజీవుల హృదయాలలో నేను అంతర్యామిగా ఉన్నాను. కేవలం నా విగ్రహాలను మాత్రమే పూజించేవాడు మూర్ఖుడు. నాపై, ఇతర జీవరాసుల మధ్య భేదదృష్టి కలిగి విరోధ భావంతో మెలిగే వారికి మనశ్శాంతి ఉండదు. అటువంటి కుటిలాత్ములు ఎంతో

డబ్బు వెచ్చించి ఆడంబరంగా, పటాటోపంతో నాకు పాదపూజలు చేసినా తృప్తి చెందను. ఈ విధంగా తల్లికి భక్తియోగం గురించి చెప్పిన కపిలాచార్యుడు మహోన్నతుడు ఎవరన్నది తెలియజేశాడు.

## ఉత్తమోత్తమం

తల్లీ! చైతన్యం లేని రాళ్లు రప్పలకంటే చైతన్యం కలిగిన చెట్లు గొప్పవి. స్పర్శజ్ఞానం కలిగిన చెట్లకంటే రసజ్ఞానం (రుచి చూడగల సామర్థ్యం) గలవి (క్రిమికీటకాలు) గొప్పవి. వాటికంటే గంధజ్ఞానం కలవి (వాసన చూడగలిగినవి) గొప్పవి. వీటికంటే శబ్దజ్ఞానం కలవి (వినగలశక్తి) గొప్పవి. వీటిన్నింటికంటే రూపజ్ఞానం (చూడగలవి) కల కాకులు మొదలైనవి గొప్పవి. అంతకంటే అనేక పాదాలు (జెర్రుల వంటివి) కలిగినవి శ్రేష్ఠమైనవి.

బహుపాదాలు కలిగిన వాటికన్నా నాలుగు పాదాలున్న జంతువులు గొప్పవి. పైన చెప్పిన వాటికి అన్నింటికంటే రెండు పాదాలున్న మానవులు గొప్పవాళ్ళు. వీళ్ళల్లో నాలుగు తెగలున్నారు.

అందులో బ్రాహ్మణులు ఉత్తములు. వీరికంటే వేదవేత్తలు, వారికంటే వేదార్థం తెలిసినవాళ్ళు, అంతకంటే శాస్త్రసంబంధమైన సందేహాలు నివృత్తి చెయ్యగల మీమాంసకులు, వీరికంటే స్వధర్మపరాయణులు, వీరికంటే ఎందులోనూ ఆసక్తి లేని నిగ్సంగులు, వీరికంటే సద్ధర్మం ఆచరించే వాళ్ళు ఉత్తములు.

ఆ ధార్మికుల కంటే సర్వధర్మాలను, సర్వసంపదల్ని, అన్నింటినీ నాకే అర్పించి, మరో భావం లేకుండా, అన్నిచోట్లా సమవర్తనుడిగా జీవితం గడిపే పుణ్యాత్ముడు మహోన్నతుడు.

ఉత్తముల్ని గురించి చెప్పిన కపిలాచార్యుడు దుష్టబుద్ధుల్ని గురించి ఇలా పేర్కొన్నాడు.

## దుష్టబుద్ధి

మనిషి, శాశ్వతం కాని ఇల్లు, పొలం, పశువులు, ధనం, సంతానం, భార్య, బంధువులు మొదలైన వాటిని శాశ్వతం అని నమ్ముతాడు. మళ్ళీ మళ్ళీ అనేక జన్మలు ఎత్తుతాడు. అయినా విరక్తి చెందడు. నరకం అనుభవించిన తరువాత కూడా దేహి తన దేహాన్ని వదలడు.

రేయింబవళ్లు భార్య, పిల్లలు, ధనం మొదలైన వాటిని రక్షించుకోవడంలోనే ఆసక్తి చూపుతాడు. అనేక పాపకార్యాలు ఆచరిస్తాడు. ఇంద్రియాలపై మరింత అభిమానం



పెంచుకుంటాడు. తన సంపాదనను చూసి మురిసిపోతూ కుటిల బుద్ధితో ప్రవర్తిస్తుంటాడు. అంత్యకాలంలో ఈసడింపుకు లోనవుతాడు.

మృత్యుదేవత వాకిట్లో పొంచి ఉంటుంది. అనేక వ్యాధులు బాధిస్తాయి. ఆకలి మందగిస్తుంది. ఆయాసం పెరుగుతుంది. కంఠనాళం పూడుకుపోతుంది. భార్యాపిల్లల్ని ఎవరు పోషిస్తారో అన్న దిగులుతో శిథిలమైన ఇంద్రియాలతో తెలివి కోల్పోతాడు. ఇద్దరు యమదూతలు ముందుకు వచ్చి నిలుచుంటారు. వాళ్ళను చూసి గుండెలు పగిలి మలమూత్రాలు విసర్జిస్తాడు. యమపాశాలు కంఠాన్ని బంధిస్తాయి. యాతనా శరీరంలోనికి ప్రవేశిస్తాడు.

నరకంలో వివిధ రకాలైన శిక్షల్ని అనుభవిస్తాడు. ఒకదాని వెనుక ఒకటిగా తామిస్రం, అంధ తామిస్రం, రౌరవం మొదలైన నరకాలలో పడి పాపాలన్నీ తరిగిపోయిన తర్వాత మళ్ళీ మానవజన్మలు పొందుతాడు.

## పిండోత్పత్తి క్రమం

జీవుడు తన పూర్వకర్మలకు అనుగుణంగా మళ్ళీ దేహాన్ని పొందగోరుతాడు. పురుషుడి వీర్యబిందు సంబంధంతో స్త్రీ గర్భంలోకి ప్రవేశిస్తాడు. ఒకరాత్రి కలిలమై (శుక్రశోణితాల ద్రవం) తర్వాత అయిదు రాత్రులకు బుద్బుదమై (నీటిబుడగలా) పదవరోజుకు రేగుపండంత పరిమాణం కలిగి, మాంస పిండంగా గుడ్డు ఆకారం పొందుతాడు. ఒక నెలకు శిరస్సు; రెండు నెలలకు కాళ్లు, చేతులు; మూడు నెలలకు గోళ్ళు, వెంట్రుకలు, ఎముకలు, చర్మం, నవరంధ్రాలు ఏర్పడతాయి.

నాల్గవనెలకు సప్తధాతువులైన శుక్లం, శోణితం, మాంసం, చీము, మెదడు, ఎముక, చర్మం కలుగుతాయి. అయిదవ నెలకు ఆకలిదప్పులు సంభవిస్తాయి. ఆరవనెలలో మావిచేత కప్పబడి తల్లి కడుపులో కుడివైపున తిరుగుతూ తల్లి తిన్న అన్నంతో, తాగిన నీటితో తృప్తి పొందుతాడు. ధాతువులు (వాతపిత్త శ్లేష్మాలు) అభివృద్ధి చెందుతుంటాయి.

ఏడవనెలలో జ్ఞానం కలుగుతుంది. కదలికలుంటాయి. మళ్ళీ గర్భవాసం పొందినందుకు భయపడుతూ దేవుణ్ణి ప్రార్థిస్తాడు. గర్భనరకం అనేక వ్యసనాలకు నిలయం. అంతంలేని దుఃఖాలకు మూలం. ఎన్నో రంధ్రాలకు నిలయం. క్రిములకు జన్మస్థానం. ఈ ఆపద నుంచి బయటపడాలని విష్ణుపాదాలను ఆశ్రయిస్తాను అని గర్భస్థ శిశువు భావిస్తుంది.

నిర్మల జ్ఞానంతో జీవుడు గర్భం నుండి బయటకు రాకుండా తొమ్మిదినెలలు గడుపుతాడు. పదవనెలలో జీవుడు తలకిందులుగా తిరిగి, ఎంతో బాధపడుతూ, జ్ఞానం

పోగొట్టుకున్నవాడై, నెత్తురు పులుముకున్న దేహంతో భూమి మీద పడతాడు. శైశవం మొదలు మరణ పర్యంతం మళ్ళీ మాయలోపడి అనేక అవస్థలకు లోనవుతాడు.

పిండోత్పత్తి క్రమం తల్లికి వివరించిన కపిలాచార్యుడు ఈ తత్త్వబోధకు అర్హులు, అనర్హులు ఎవరన్నది తెలియజేశాడు.

### పాత్రులు – అపాత్రులు

అతిరహస్యమైన ఈ సాంఖ్యయోగ పద్ధతిని ఉపదేశం పొందగల **అర్హుడు** :– శ్రద్ధాసక్తుడు, భక్తుడు, వినయ సంపన్నుడు, ద్వేషం లేనివాడు, సర్వప్రాణుల్ని స్నేహపూర్వకంగా చూసేవాడు, విజ్ఞాన విషయాలను వినాలనే ఆసక్తి కలవాడు, విరక్తుడు, శాంతచిత్తుడు, అసూయలేనివాడు, స్వచ్ఛమైన మనస్సున్న వాడు, భక్తులపై ప్రేమ కలవాడు, పరస్త్రీలపై వాంఛలేనివాడు, చెడుకోరికలు లేనివాడు.

**అనర్హులు :–** దుష్టులకు, నీతిలేనివారికి, మూర్ఖులకు, దురాచారులకు, డాంబికులకు, ఇంద్రియలోలురికి, దార, పుత్ర, పశుసంపదలపై అమితాసక్తి కలవారికి, భక్తి లేనివారికి, విష్ణుదాసులపై ద్వేషం కలవారికి ఉపదేశం చెయ్యకూడదు.

కపిలాచార్యుని ఉపదేశం విన్న దేవహూతికి మోహం తొలగిపోయింది. ఆయనకు సాష్టాంగ దండ ప్రణామాలు చేసి స్తుతించింది. కపిలాచార్యుడు అక్కడనుండి నిష్క్రమించాడు.

దేవహూతి భర్త, పుత్రుడు వెళ్ళిపోయినందుకు కొంత తల్లడిల్లింది. కర్దమ ప్రజాపతి తపఃప్రభావం వల్ల ఏర్పడిన తపోవనం విడిచి, పరమాత్ముని మనస్సులో లగ్నంచేసి అఖండమైన యోగ ప్రభావంతో శ్రీహరి పాదపద్మాలలో విలీనమయింది. ఆమె మోక్షం పొందిన పవిత్ర క్షేత్రం **సిద్ధిపదం** అనే పేరుతో ప్రసిద్ధి గాంచింది.

కపిలుడు ముల్లోకాలకు శాంతిని ప్రసాదించడం కోసం నిశ్చల చిత్తంతో ఉత్తర దిక్కుగా పయనం సాగించాడు.

ఇలా వివరించిన మైత్రేయుడు విదురుడితో **ఈ కపిల దేవహూతి సంవాదం చాలా పవిత్రమైంది. దీన్నే కపిల ప్రోక్త యోగశాస్త్రం అంటారు** అని చెప్పి విరమించాడు.

ఈవిధంగా మైత్రేయుడు విదురుడికి వివరించిన విషయాన్ని శుకుడు పరీక్షిత్తుకు తెలియజేశాడని సూతుడు శౌనకాది మహామునులకు వెల్లడించడంతో **మూడవ స్కంధం** పరిసమాప్తం అయింది.

---



# నాల్గవ స్కంధం

**నిరతము తావకీన భజనీయ పదాబ్జ సుగంధ లబ్ధి యె**
**వ్వరి మది వొందగా కలుగు, వారలు తత్ప్రియ మర్త్యదేహము**
**న్నరయ తదీయ దార తనయాది సుహృద్గృహ బంధు వర్గమున్**
**మఱతురు విశ్వతోముఖ। రమాహృదయేశ। ముకుంద। మాధవా।**

**(285)**

## స్వాయంభువ మనువు పుత్రికల వంశం

విదురునితో మైత్రేయ మహర్షి మళ్ళీ ఇలా చెప్పసాగాడు.

స్వాయంభువ మనువుకు శతరూప అనే భార్యవల్ల ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలు; ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు.

ఆకూతిని రుచి అనే ప్రజాపతికి ఇచ్చి స్వాయంభువుడు వివాహం చేశాడు. వారిద్దరికి శ్రీమహావిష్ణువు **యజ్ఞుడు** అనే పుత్రుడిగా జన్మించాడు. జగన్మాత ఆదిలక్ష్మి విష్ణువును ఎన్నడూ విడిచి ఉండదు కనుక **దక్షిణ** అనే కన్యగా వారికి జన్మించింది. స్వాయంభువ మనువు యజ్ఞుని తన ఇంటికి తెచ్చుకున్నాడు. యజ్ఞుడు తన్ను భర్తగా వరించిన దక్షిణను చేపట్టాడు. ఆది దంపతులు కనుక వారి వివాహం లోక విరుద్ధం కాలేదు.

వారికి **యామ** నామకులైన దేవతలు పుత్రులుగా పన్నెండుమంది పుట్టారు. వాళ్లని **తుషితులు** అని కూడా అంటారు. యజ్ఞుడు దేవేంద్రుడయ్యాడు. **మరీచి** మొదలైన వాళ్ళు సప్తర్షులయ్యారు. స్వాయంభువ మనువు పుత్రులు, మనుమలు, ముని మనుమలు మొదలైన వాళ్ళలో **స్వాయంభువ మన్వంతరం** కొనసాగింది.

### కర్దమ ప్రజాపతి సంతతి

స్వాయంభువుడు తన రెండవ కుమార్తె **దేవహూతిని కర్దమ ప్రజాపతికిచ్చి** వివాహం చేశాడు. వాళ్ల వృత్తాంతం మూడవ స్కంధంలో వివరింపబడింది. వారి మగ సంతానం కపిలాచార్యుడి ప్రస్తావన కూడా ఆ స్కంధంలోనే ఉంది.

ఇక కర్దముని కుమార్తెల సంతతి గురించి వివరించబడుతూంది. **మరీచి మహర్షి** కర్దముని జ్యేష్ఠ కుమార్తె అయిన కళను వివాహమాడి **కశ్యపుడు** అనే కొడుకును, **పూర్ణిమ** అనే కూతురును పొందాడు. పూర్ణిమ **విరజుడు** అనే కుమారుణ్ణి, **దేవకుల్య** అనే కూతురును కన్నది. దేవకుల్య శ్రీమన్నారాయణుని పాద ప్రక్షాళన జలాలతో స్వర్గంగగా తర్వాత అవతరించింది.

కర్దముని రెండవ కుమార్తె అనసూయాదేవి **అత్రిముని** వివాహం ఆడాడు. ఆయన **ఋక్షం** అనే కులపర్వతానికి వెళ్ళి అక్కడ **నిర్వింధ్యానది** సమీపంలో జితేంద్రియుడై ఒంటికాలిపై నూరు సంవత్సరాలు తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి త్రిమూర్తులు ప్రత్యక్షమై తమ అంశలతో ముగ్గురు కుమారులు జన్మిస్తారని అనుగ్రహించారు.

బ్రహ్మాంశతో **చంద్రుడు,** విష్ణ్వంశ వల్ల **దత్తాత్రేయుడు,** శివాంశతో **దుర్వాసుడు** జన్మించారు. కర్దమ ప్రజాపతి మూడవ కుమార్తె శ్రద్ధకు ఆమె భర్త అంగిరసుడికి **సినీవాలి, కుహువు, రాక, అనుమతి** అనే నలుగురు కుమార్తెలు **ఉచథ్యుడు, బృహస్పతి** అనే ఇద్దరు కుమారులు జన్మించారు.

నాల్గవ కుమార్తె **హవిర్భుక్కు.** ఆమె భర్త పులస్త్యుడు. వారికి **అగస్త్యుడు, విశ్రవసుడు** జన్మించారు. విశ్రవసుడికి **ఇలబిల** అనే భార్యవల్ల **కుబేరుడు, కైకసి** అనే భార్యవల్ల **రావణ, కుంభకర్ణ, విభీషణులు** జన్మించారు.

అయిదవ కుమార్తె గతికి, పులహుడికి **కర్మశ్రేష్ఠుడు, వరీయాంసుడు, సహిష్ణుడు** అనే ముగ్గురు కొడుకులు పుట్టారు.

ఆరవకుమార్తె క్రియ, క్రతువును వివాహమాడి అరవై వేలమంది బ్రహ్మతేజోనిధులైన **వాలఖిల్యులు** అనే మహర్షుల్ని కన్నది.

వసిష్ఠుడు ఊర్జ (అరుంధతి) అనే కర్దముడి ఏడవకుమార్తె ద్వారా **చిత్రకేతుడు, సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసు భృద్యానుడు, ద్యుమంతుడ**నే ఏడుగురు ఋషుల్ని పొందాడు. మరో భార్య ద్వారా **శక్తి** (ఇతడు కూడా అరుంధతి పుత్రుడేనని కొన్ని పురాణాలు) మొదలైన కుమారుల్ని కన్నాడు.

ఖ్యాతి అనే ఎనిమిదవ కుమార్తె భృగువును వరించి **ధాత, విధాత** అనే పుత్రుల్ని, **శ్రీ** అనే కూతుర్ని కన్నది. ధాత, విధాతలు మేరువు కుమార్తెలైన **అయతి, నియతి** అనే వాళ్ళను పెళ్ళాడారు. ధాతకు **మృకండుడు**, విధాతకు **ప్రాణుడు** జన్మించారు. మృకండునికి **మార్కండేయుడు,** ప్రాణుడికి **వేదశిరుడు** అనే పుత్రులు కలిగారు. భృగువుకు **ఉశన** అనే భార్యవల్ల **కవి** జన్మించాడు.



చిత్తి (శాంతి) అధర్వుని వివాహమాడి అశ్వశిరస్సుగల **దధ్యంచుడి**ని కుమారుడిగా పొందింది. ఇలా కర్దముని తొమ్మిదికుమార్తెల వల్ల కలిగిన సంతానంతో లోకాలన్నీ నిండిపోయాయి.

కర్దమ ప్రజాపతి వంశాన్ని వివరించిన మైత్రేయుడు, తర్వాత దక్షప్రజాపతి వంశం గురించి చెప్పసాగాడు.

## దక్ష ప్రజాపతి సంతతి

బ్రహ్మ కుమారుడు **దక్షుడు**. అతడు స్వాయంభువ మనువు కుమార్తె **ప్రసూతిని** వివాహమాడి పదహారుమంది కుమార్తెలను పొందాడు. వాళ్ళలో **శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి** అనే పదమూడు మందిని **ధర్ముడి**కిచ్చి వివాహం చేశాడు.

ధర్ముడి భార్యల్లో శ్రద్ధవల్ల **శ్రుతం,** మైత్రివల్ల **ప్రసాదం**, దయవల్ల **అభయం**, శాంతి వల్ల **సుఖం**, తుష్టి వల్ల **ముదం,** పుష్టివల్ల **స్మయం** (గర్వం, ఆశ్చర్యం) క్రియవల్ల **యోగం**, ఉన్నతి వల్ల **దర్పం,** బుద్ధివల్ల **అర్థం,** మేధవల్ల **స్మృతి**, తితిక్ష వల్ల **క్షేమం**, హ్రీ వల్ల **ప్రశయం**, మూర్తి వల్ల సకల కల్యాణగుణ సంపన్నులైన **నరనారాయణులు** పుట్టారు. నరనారాయణులు జన్మించినపుడు లోకాలన్నీ ఆహ్లాదకరంగా భాసిల్లాయి. బ్రహ్మాదులు వాళ్ళవద్దకు వచ్చి స్తుతించారు. వాళ్ళు గంధ మాదన పర్వతానికి తపం ఆచరించడానికి వెళ్లారు. ఆ నరనారాయణులే భూభారం తగ్గించడం కోసం **కృష్ణార్జునులుగా యదు కురు** వంశాలలో జన్మించారు.

అగ్నిదేవుడికి దక్షుడు **స్వాహా** అనే కుమార్తెను ఇచ్చాడు. వాళ్ళకు **పావకుడు, పవమానుడు, రుచి** అనే కుమారులు పుట్టారు. ఆ ముగ్గురి వల్ల నలభై అయిదు అగ్నులు ఉద్భవించాయి. తాతతండ్రులతో కలిసి మొత్తం నలభై తొమ్మిది అగ్నులయ్యాయి.

**అగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సౌమ్యులు, పితలు, అజ్యపులు, సాగ్నులు, నిరగ్నులు** – అనే ఏడు విధాలైన ఆ అగ్నుల పేర్లతో బ్రహ్మావాదులు యజ్ఞకర్మల్లో ఇష్టులు(యజ్ఞాలు) నిర్వహిస్తారు. దక్షప్రజాపతి కుమార్తె **స్వధ** వల్ల ఆ అగ్నులకు **వయున, ధారిణి** అనే ఇద్దరు కన్యలు జన్మించారు. వాళ్ళిద్దరూ జ్ఞాన విజ్ఞాన సంపన్నులు. బ్రహ్మనిష్ఠ కలిగిన వాళ్లు.

## అల్లుడిపై ఆగ్రహం

**సతి** అనే తన కూతుర్ని దక్షుడు **శివుడు**కిచ్చి పెళ్లిచేశాడు. ఒకప్పుడు బ్రహ్మవేత్తలు గొప్పయజ్ఞం మొదలుపెట్టారు. ఆ యజ్ఞాన్ని చూడటానికి పరమశివుడు, బ్రహ్మాదిదేవతలు,

మునులు, మహర్షులు, ప్రజాపతులు వచ్చారు. దక్షుడు ప్రవేశించినప్పుడు బ్రహ్మ, శివుడు తప్ప యజ్ఞశాలలోని వాళ్ళందరూ లేచి నిల్చున్నారు. దక్షుడు బ్రహ్మకు నమస్కరించి, సభ్యుల సత్కారం అందుకొని ఉచితాసనంపై కూర్చున్నాడు.

తనను చూసి అందరూ నిల్చున్నా, తన అల్లుడైన శివుడు తన పెద్దరికానికి గౌరవం ఇవ్వలేదని దక్షుడు ఆగ్రహించాడు. శివుణ్ణి అందరి ముందు పలువిధాలుగా దూషించాడు. తన కూతురితో వివాహం వల్లే శివుడు గొప్పవాడయ్యాడని, వేదాలలో చెప్పిన కర్మల్ని పాటించని వాడని, పిచ్చివాళ్ళకు ప్రియుడని, భూతాలు, ప్రేతాలచేత స్తుతింపబడేవాడని, ఎముకల దండలు ధరించేవాడని, శుభ్రతలేని వాడని నిందించాడు.

**ఈ అశివుడికి బ్రహ్మమాట విని వేదాన్ని శూద్రునికిచ్చినట్లు నా కుమార్తెనిచ్చాను. శివుడికి ఇక యజ్ఞాలలో హవిర్భాగం అందకుండుగాక** అని శపించాడు. సభ్యులు దక్షుణ్ణి చూసి **నువ్వుచేసింది తప్పు** అనగానే కోపంతో యజ్ఞశాల నుంచి వెళ్ళిపోయాడు.

శివ సేవకుల్లో శ్రేష్ఠుడైన నందికేశ్వరుడు ఆగ్రహంతో **వీడు కుటిల ధర్మాలపై ఆసక్తి కలిగి నీచసుఖాలను ఆశ్రయించాడు. శాంతుడైన శివుడిపట్ల అపచారం చేశాడు. దేహాన్నే ఆత్మగా భావించే ఈ దక్షుడు సత్యమైన ఆత్మతత్త్వాన్ని విస్మరించి, పశువుతో సమానుడౌతాడు. స్త్రీలోలుడై భ్రష్టుడౌతాడు. త్వరలో పొట్టేలు తలవాడవుతాడు** అని దక్షుణ్ణి శపించాడు.

తర్వాత శివుణ్ణి ద్వేషించే అక్కడున్న బ్రాహ్మణుల్ని చూసి **ధనం మీద, దేహం మీద, ఇంద్రియ సుఖాలమీద ఆదరాభిమానాలతో యాచకులై తిరుగుతారు** అని శపించాడు.

అప్పుడు భృగుమహర్షి నందీశ్వరుణ్ణి నిందించి **ఈ లోకంలో ఎవరు శివదీక్షాపరాయణులో, వాళ్ళని అనుసరించే వాళ్లెవరో వాళ్లందరూ శాస్త్రాలకు విరోధులై పాషండులౌతారు** అని ప్రతిశాపం ఇచ్చాడు. అయినా దైవానుగ్రహం వల్ల వాళ్లు (ఉభయులు) పతనం కాలేదు. శివుడు వ్యాకుల చిత్తంతో అక్కణ్నుంచి వెళ్లిపోయాడు.

సర్వేశ్వరుడైన నారాయణుడు యజ్ఞంలో పూజనీయుడు. ఆ యజ్ఞాన్ని బ్రహ్మణ్యులు వెయ్యి సంవత్సరాలు నిర్వహించారు. గంగా యమునల సంగమ ప్రదేశమైన ప్రయాగక్షేత్రంలో సదస్యులు దీక్షా స్నానాలు చేసి పాపాలు పోగొట్టుకొని తమ తమ ఆశ్రమాలకు వెళ్లారు.

మైత్రేయుడు ఈ వివరాలు చెప్పి మళ్లీ విదురుడితో ఇలా అన్నాడు.

## దక్షయజ్ఞం – విధ్వంసం

మామా అల్లుళ్ళ మధ్య వైరం క్రమంగా పెరిగింది. అధికార గర్వంతో, పగతో



శివుణ్ని విస్మరించి **వాజపేయ** మనే యజ్ఞం చేశాడు దక్షుడు. వాజపేయం తర్వాత **బృహస్పతి సవనం** అనే యజ్ఞం చెయ్యాలని సంకల్పించాడు.

ఆ యజ్ఞం చూడటానికి మునులు, ప్రజాపతులు, దేవతలు (భార్యలతో కలిసి వచ్చి) దక్షుణ్ని దీవించి, అతడి పూజలు సంతోషంగా స్వీకరించారు. దక్షుడి యజ్ఞవైభవాన్ని కీర్తిస్తూ దేవతలు ఆకాశంలో వెళ్తున్నారు. అది చూసి సతీదేవి తన తండ్రి యజ్ఞాన్ని చూడాలని కోరికతో భర్తతో తన ఆకాంక్షను తెలియజేసింది.

**తండ్రి, గురువు, మిత్రుడు, రాజు మొదలైన వారి ఇళ్లకు పిలవకపోయినా సజ్జనులు వెళ్లడం మంచి ఆచారమే కదా!** అని అనుమతిని వేడింది.

శివుడు **కపట బుద్ధుల ఇళ్లకు, దుర్జనుల ఇళ్లకు చుట్టరికం పాటించి వెళ్లడం వివేకవంతులైన వారి పనికాదు.** అని వారించినా, **అవమానం ఎదురవుతుంది** అని హెచ్చరించినా సతీదేవి తండ్రిచేసే యజ్ఞం చూడాలన్న బలీయమైన కోరిక శివుణ్ని మౌనం దాల్చేటట్లు చేసింది.

సతీదేవి వివేకం కోల్పోయి, తనకు అర్ధదేహం ఇచ్చి ఆదరించిన పరమేశ్వరుడి మాటను కాదని తండ్రి, అతడి యజ్ఞాన్ని చూడాలనే కోరిక అతిశయించడంతో ఒంటరిగా పుట్టింటికి బయలుదేరింది. అలా వెళ్తున్న ఆమె వెంట మణిమంతుడు మొదలైన యక్షులు నందీశ్వరుడితోబాటు సకల సంబారాలతో నడిచారు.

యజ్ఞశాలలో దక్షుడికి జంకి సదస్సులోని వాళ్లు ఆమెను గౌరవించలేదు. తోబుట్టువులు, తల్లి, పినతల్లులు ఆదరించినా తండ్రి కన్నెత్తి చూడలేదు. ఈ అవమానాన్ని భరించలేని సతీదేవి శివుడి గుణగణాలను, ఔన్నత్యాన్ని చాటుతూ, దక్షుణ్ని నిందించి **దాక్షాయణి** అని పిలుచుకోవడం ఇష్టం లేక తన శరీరాన్ని విడిచిపెట్టాలని నిర్ణయించింది.

యోగసమాధిలో నుంచి పుట్టిన అగ్నిలో తన దేహాన్ని భస్మం చేసింది. సదస్సులోని వాళ్లందరూ కలత చెంది హాహాకారాలు చేశారు. సతీదేవి వెంటవచ్చిన ప్రమథ గణాలు దక్షుణ్ని శిక్షించాలని ముందుకురికారు.

భృగుమహర్షి యజ్ఞనాశకుల్ని నశింపజేసే **అభిచార హోమాన్ని** వెంటనే ప్రారంభించాడు. అందులోంచి **ఋభువులు** అనే దేవతలు వేలకొలది పుట్టి, దివ్య విమానాలు అధిరోహించి ప్రమథగణాలను పారదోలారు.

తండ్రిచేత అవమానింపబడి దాక్షాయణి శరీరం త్యజించడం, ప్రమథ గణాలు ఓటమి చెందడం నారదుడి ద్వారా పరమేశ్వరుడు విన్నాడు. ఆగ్రహావేశంతో సింహంలా గర్జించి, మెరుపుతీగలా, అగ్నిజ్వాలామాలికలా ప్రకాశించే జడను ఒకదాన్ని పెరికి భూమిపైకి

విసిరాడు. అందులోంచి సకలలోక భయంకరుడైన **వీరభద్రుడు** ఉదయించాడు. దక్షయజ్ఞాన్ని ధ్వంసం చెయ్యమని శివుడు అతణ్ణి ఆదేశించాడు.

వీరభద్రుడితో వెళ్ళిన ప్రమథగణాలు సదస్యుల్ని, ఋత్వికుల్నీ, అందరినీ నానావిధాలుగా హింసించారు. వీరభద్రుడు దక్షుడి శిరస్సును తునిమి దక్షిణాగ్ని కుండంలో పడవేసి భస్మం చేశాడు.

### శివానుగ్రహం

శివభటుల చేతుల్లోని ఆయుధాల దెబ్బలకు అవయవాలు శిథిలం అయిపోగా, దేవతలు భయంతో బ్రహ్మదేవుణ్ని ఆశ్రయించారు. ఇటువంటి అనర్థం, జరుగుతుందని గ్రహించిన వాళ్లు కనుక బ్రహ్మ, విష్ణువులు ఆ యజ్ఞానికి వెళ్లలేదు. బ్రహ్మ యజ్ఞసమాప్తికి శివుడే శరణ్యమన్నాడు.

బ్రహ్మసమేతంగా కైలాసం వెళ్లిన దేవతలు పరమేశ్వరుణ్ని వేనోళ్ల నుతించి దాసోహమన్నారు. బ్రహ్మ దక్షయజ్ఞాన్ని పునరుద్ధరించి దక్షుణ్ని బ్రతికించమని కోరాడు. దేవతలకు ఆరోగ్యాన్ని అనుగ్రహించమని ప్రార్థించాడు. శివుడు అనుగ్రహించగా దక్షుడికి పొట్టేలు తల సంప్రాప్తమయింది. దేవతలందరూ తమ పూర్వ తేజస్సును పొందారు.

దక్షుడు తన అపరాధాన్ని క్షమించమని శివుణ్ని ప్రార్థించాడు. విష్ణువు అప్పుడు సాక్షాత్కరించాడు. దేవతలు, యక్ష గంధర్వ విద్యాధర బ్రాహ్మణులు విష్ణువును స్తుతించారు. విష్ణువు యొక్క ఉపదేశానంతరం దక్షుడు విష్ణుదేవతాకమైన **త్రికపాల పురోడాశ**మనే యజ్ఞం చేసి మహావిష్ణువు పాదపద్మాలను భక్తితో పూజించాడు.

సతీదేవి మరు జన్మలో **పార్వతి** అనే పేరుతో హిమవంతుడి కుమార్తెగా జన్మించింది.

**దక్షయజ్ఞ ధ్వంసగాథను బృహస్పతి తన శిష్యుడైన ఉద్ధవుడికి చెప్పాడు. ఉద్ధవుడు నాకు వివరించినట్లు నీకు వివరించాను** అని విదురుడితో చెప్పి మళ్లీ మైత్రేయుడు ఇలా కొనసాగించాడు.

### ఉత్తానపాదుడి వంశం

### ధ్రువుడు

స్వాయంభువ మనువు రెండవ కొడుకు. ఉత్తానపాదుడు. అతడికి **సునీతి, సురుచి** అనే ఇద్దరు భార్యలు. సునీతి కొడుకు **ధ్రువుడు.** సురుచి కుమారుడు **ఉత్తముడు.** ఉత్తానపాదుడికి సురుచి మీద ప్రేమ ఎక్కువ. ఒకరోజు ఉత్తానపాదుడు తన తొడపై ఉత్తముణ్ణి ఎక్కించుకొని ముద్దాడుతున్నాడు. అది చూసి ధ్రువుడు తానూ తండ్రి తొడలపైకి ఎక్కాలని ఆశించాడు. ఉత్తానపాదుడు ధ్రువుణ్ని ఆదరించలేదు. అప్పుడు సురుచి గర్వంతో



**నా కడుపున పుట్టిన వాడే తండ్రి తొడపై ఎక్కడానికి అర్హుడు. కనుక ధ్రువకుమారా! నువ్వు విష్ణుపాదాలను ఆశ్రయించు. ఆయన నిన్ను నా కడుపున జన్మించేటట్టు అనుగ్రహిస్తాడు** అన్నది. చిన్నబుచ్చుకున్న ధ్రువుడు ఏడుస్తూ తల్లి దగ్గరికి వెళ్లాడు.

అంతఃపుర కాంతలద్వారా విషయం గ్రహించిన సునీతి అతణ్ని ఓదార్చి, హరి పాదాలను ఆశ్రయించమంది. ధ్రువుడు దృఢచిత్తంతో పట్టణం విడిచాడు. నారదమహర్షి దివ్యదృష్టితో విషయం తెలుసుకొని అతడి వద్దకు వచ్చాడు. యమునా నదీతీరంలోని హరికి నివాసమైన మధువనంలో యమ నియమాలను పాటించి నారాయణుణ్ని ఆరాధించమన్నాడు. ధ్రువుడు ఆయన చెప్పినట్లే **మధువనం** చేరాడు.

అటు తర్వాత నారదుడు ఉత్తానపాదుడి వద్దకు వచ్చాడు. దిగులుగా ఉన్న రాజునుచూసి కారణం అడిగాడు. తాను ధ్రువుడి పట్ల ప్రదర్శించిన నిర్లక్ష్యాన్ని, ఆ కారణంగా అతడు ఇల్లు విడిచి వెళ్లడాన్ని ఉత్తానపాదుడు చెప్పాడు. నారదుడు ధ్రువుడు విష్ణు అనుగ్రహంతో దిక్పాలకులు పొందలేని నిత్యపదానికి అధీశ్వరుడౌతాడని, అతడివల్ల తండ్రి కీర్తి కూడా చిరస్థాయిగా ఉంటుందని పేర్కొన్నాడు.

ధ్రువుడు ఒంటికాలిపై నిల్చొని ప్రాణవాయువును నిరోధించి ఏకాగ్రచిత్తంతో పరమేశ్వరుణ్ని అనుసంధానం చేశాడు. సమస్త లోకాలు ఊపిరాడక తల్లడిల్లాయి. అతడి కఠోర దీక్షకు మెచ్చి విష్ణువు ప్రత్యక్షమయ్యాడు.

ధ్రువుడితో **నాయనా! నీ చిత్తాన్ని ఎల్లప్పుడూ నా పట్లే నిలిపి, నన్నే ధ్యానిస్తూ, సత్కార్యాలను ఆచరిస్తూ, క్రతువుల్ని నిర్వహిస్తూ, కొంతకాలం రాజ్యాన్ని పాలించు. తర్వాత సమస్త గ్రహ తారాగణాలు, సప్తర్షి మండల ప్రదక్షిణం చేసే ధ్రువస్థానంలో శాశ్వతంగా ఉంటావు** అని చెప్పి విష్ణువు అంతర్ధానమయ్యాడు.

ధ్రువుడు రాజ్యానికి తిరిగివచ్చాడు. కొంతకాలానికి ఒకానొక సుముహూర్తంలో అతణ్ని పట్టాభిషిక్తుణ్ని చేసి ఉత్తానపాదుడు వానప్రస్థాశ్రమం స్వీకరించి అరణ్యానికి వెళ్లి తపోదీక్ష వహించాడు.

ధ్రువుడు శింశుమార ప్రజాపతి కుమార్తె **భ్రమని** వివాహమాడి **కల్పుడు, వత్సరుడు** అనే కుమారుల్ని పొందాడు. వాయుపుత్రిక ఇలను పెళ్లాడి **ఉత్కలుడు** అనే పుత్రుణ్ని, సౌందర్యవతియైన కుమార్తెను పొందాడు. ధ్రువుడి తమ్ముడైన ఉత్తముడు పెళ్లికాకముందే హిమవత్పర్వత ప్రాంతానికై వేటకై వెళ్లి అక్కడొక యక్షుడి చేత చంపబడ్డాడు. కొడుకు దుర్మరణాన్ని తట్టుకోలేక సురుచి అరణ్యానికి వెళ్లి అక్కడ కార్చిచ్చు మంటల్లో చిక్కుకొని మరణించింది.

ధ్రువుడు తమ్ముడి మరణవార్త విని కోపం, దుఃఖం పెనగొన్న చిత్తంతో రథం ఎక్కి ఉత్తరదిశలో ఉన్న అలకాపురాన్ని చేరి శంఖం పూరించాడు. తన్ను ఎదిరించిన పదమూడు వేలమంది యక్షుల్ని వాడి బాణాలతో గాయపరిచాడు.

కొంతసేపటికి మాయా యుద్ధం చేస్తున్న యక్ష రాక్షసుల కారణంగా పట్టణం కన్పించలేదు. మహామునుల సూచనమేరకు ధ్రువుడు నారాయణాస్త్రం విడిచాడు. వెంటనే మాయ పటాపంచలయింది. వేనకువేలు బాణాలు నారాయణాస్త్రం నుంచి వెలువడి నిరపరాధులైన యక్షుల్ని సంహరిస్తుండగా, ధ్రువుడి తాత స్వాయంభువ మనువు ఋషులతో అక్కడికి వచ్చాడు.

మనుమడితో **ఆగ్రహం విడిచిపెట్టు. సంహారం మాని శివుడికి సన్నిహితుడైన కుబేరుడికి సంతోషం కలుగజెయ్యి** అని అన్నాడు. ధ్రువుడు శాంతించాడు. కుబేరుడు తన పరివారంతో వచ్చి ధ్రువుణ్ని కీర్తించాడు.

ఇరవై ఆరువేల ఏళ్లపాటు రాజ్యాన్ని ప్రజారంజకంగా పాలించి, తర్వాత పుత్రుడికి సింహాసనం అప్పగించి బదరికాశ్రమానికి వెళ్లాడు. తీవ్ర ధ్యాననిమగ్నుడయ్యాడు. విష్ణు కింకరులైన నందసునందులు అతణ్ని పరమపదానికి తీసుకువెళ్లడానికి వచ్చారు.

దేవలోకానికి వెళ్తూ దీనురాలైన తన తల్లిని ఎలా విడిచి వెళ్లాలని ధ్రువుడు విచారిస్తుండగా విష్ణుకింకరులు ధ్రువుడికి విమానంలో ముందు వెళ్తున్న అతడి తల్లిని చూపించారు.

## వేనరాజు

ధ్రువుడి కొడుకు **వత్సరుడు** రాజయ్యాడు. అతడి వంశం ఇలా సాగింది. పుష్పార్ణుడు – వ్యష్టుడు – సర్వతేజుడు – చాక్షుష మనువు – ఉల్ముకుడు – అంగుడు.

**అంగుడు** రాజర్షిగా ప్రఖ్యాతిగాంచాడు. అతడు **మృత్యువు** కుమార్తె సునీథను పెళ్లాడాడు. అతడు అశ్వమేథయాగం నిర్వహించాడు. ఋత్విజులు ఆహ్వానించినా దేవతలు హవిర్భాగాలు అందుకోవడానికి రాలేదు. అంగుడు సదస్యుల అనుమతితో మౌనం విడిచిపెట్టి తాను చేసిన అపరాధం ఏమిటని ప్రశ్నించాడు.

**నీకు సంతానం లేదు కనుక దేవతలు హవిర్భాగాలు అందుకోవడానికి రాలేదు. పుత్రకామేష్టి చేసి పుత్రుణ్ని పొందు** అన్నారు. ఋత్వికులు చెప్పినట్లే పుత్రకామేష్టి యాగం చెయ్యగా, పట్టు వస్త్రాలు ధరించిన పురుషుడు బంగారు గిన్నెలో పాయసంతో ప్రత్యక్షమయ్యాడు. ఆ పాయసాన్ని అంగుడు సునీథకిచ్చాడు.



ఆ పాయసాన్ని ఆరగించిన ఆమె పతి సంయోగంతో గర్భం దాల్చి కుమారుణ్ణి ప్రసవించింది. అతడికి **వేను**వని నామకరణం చేశారు. అతడు తాత దోషం వల్ల పాపకర్మల్ని ఆచరించాడు. (వేణుడి తాత కురు. అతడి గురించిన ప్రస్తావన ఇంతకుమించి ఏ పురాణంలోనూ లేదు)

చిన్నప్పుడు తనతో కలిసి ఆడుకుంటున్న పిల్లల్ని జాలిలేకుండా చంపేవాడు. వేటలో సాధుజంతువుల్ని క్రూరంగా చంపేవాడు. అతడి అకృత్యాలను చూసిన అంగుడు మనోవ్యథతో ఒకనాటి అర్థరాత్రి రాజ్యం విడిచి వెళ్లిపోయాడు.

రాజులేని ప్రజలు పశువుల్లా ప్రవర్తించడం గమనించి భృగువు మొదలైన మునీంద్రులు ఇష్టంలేకపోయినా వేణుడికి పట్టం కట్టారు. కాని అతడి దుర్మార్గం మితి మీరింది. హితం చెప్పడానికి వచ్చిన మునుల్ని ధిక్కరించి విష్ణువు గొప్పవాడు కాదని, తానే సకల దేవతా స్వరూపుడని – అన్ని వ్రతాలు, పూజలు, బలిదానాలు తనకే జరగాలన్నాడు. ఆగ్రహం చెందిన మహర్షులు హుంకరించడంతో వేణుడు మరణం పాలయ్యాడు.

రాజులేక పోవడం వల్ల, దేశమంతా దొమ్మీలు, దోపిళ్లు, పరస్పర హింసాకాండ చెలరేగింది. సునీథ యోగశక్తి చేత తన కొడుకు శరీరాన్ని సంరక్షించింది. మహర్షులు వేణుడి తొడలు మథించారు. అందులోంచి ఒక బోయవాడు పుట్టాడు. కాకిలా నల్లగా, పొట్టిచేతులు, కురచకాళ్ళు మొదలైన లక్షణాలతో పుట్టిన అతను **నేనేం చెయ్యాలి** అని మునుల్ని ప్రశ్నించాడు. **నిషీద** అంటే **కూర్చో** అని మునులన్నారు. అందువల్ల అతడికి **నిషాదుడని** పేరు వచ్చింది. అతడి సంతతి వాళ్లు నిషాదులయ్యారు.

## పృథుచక్రవర్తి

మునులు వేణుడి హస్తాలను మథించారు. వేణుడి కుడిచేతి నుంచి నారాయణాంశతో **పృథువు,** ఎడమచేతి నుంచి లక్ష్మీదేవి అంశతో **అర్చి** ఉదయించారు. పృథువు కుడిచేతిలో చక్రచిహ్నం, పాదాలలో నాగలి, అంకుశం, వజ్రం, ధ్వజం, ధనుస్సు, పద్మం, శంఖం మొదలైన రేఖలున్నాయి. పృథువు, అర్చి దంపతులయ్యారు. పృథువు చక్రవర్తిగా సింహాసనాన్ని అధిష్టించినప్పుడు దేవతలు పలు విలువైన కానుకల్ని బహూకరించారు.

పృథువు రాజ్యం ఏలుతున్నప్పుడు సారహీనమైన భూమి నుంచి అన్నం లభించకపోవడంతో, ఆకలి బాధతో ప్రజలు కృశించిపోయారు. ప్రజల మొర విని పృథువు విల్లు చేత బూని బాణం సంధించాడు. అప్పుడు భూమి గోరూపం ధరించి పరిగెత్తసాగింది.

పృథువు దాన్ని వెంబడిస్తుండగా భూదేవి ఆగి ఇలా చెప్పింది. **ఏ తప్పూ చెయ్యని నన్ను ధర్మరక్షకుడవైన నువ్వెందుకు చంపాలనుకుంటున్నావు? లోకంలో నాకు ఆదరం లేకపోయింది. మానవులు దొంగలయ్యారు. యజ్ఞాలు మొదలైన సత్కర్మలకు ఉపయోగపడే ఓషధుల్ని చోరులు అపహరించకుండా నాలో జీర్ణించుకున్నాను. నాకు తగిన దూడను, పాత్రను, దోగ్ధను (పితికేవాడు) చూడు. వాటిని సమకూరిస్తే ప్రాణులకు ఇష్టమైనవి, బలవర్ధకమైనవి, దుగ్ధాన్న రూపమైన వాటిని ప్రసాదిస్తాను.**

అప్పుడు పృథు చక్రవర్తి మనువును దూడగా, తన చేతిని పాత్రగా, తాను దోగ్ధగా వ్యవహరించి సకల ఓషధుల్ని పిదికాడు. ఇలాగే ఋషులు, దేవతలు, రాక్షసులు, అప్సరసలు, గంధర్వులు, విశ్వావసులు మొదలైన సమస్త వర్గాలకు చెందిన వాళ్లు, తమలో శ్రేష్ఠులైన వాళ్లను దూడలుగా, తమకు తగిన పాత్రలలో తమకు ఆమోదయోగ్యమైన పాలను పిండుకున్నారు. ప్రజలకు శాంతిసౌభాగ్యాలు సమకూరాయి.

పృథు చక్రవర్తి ప్రజాక్షేమం ఆశయంగా రాజ్యపాలన చేస్తూ అశ్వమేధయాగం ప్రారంభించాడు. సమృద్ధికరంగా సాగుతున్న యజ్ఞాన్ని చూసి సహింపలేక దేవేంద్రుడు యజ్ఞశాలలోని అశ్వాన్ని హరించాడు. పృథువు దేవేంద్రుడిపై శర పరంపరను కురిపించగా ఇంద్రుడు గుర్రాన్ని వదిలి వెళ్లాడు.

పృథువు అశ్వాన్ని తీసుకువచ్చి యజ్ఞం పరిసమాప్తి చేస్తుండగా ఇంద్రుడు మళ్లీ అశ్వాన్ని అపహరించాడు. పృథువు ఇంద్ర సంహారానికి పూనుకోగా, మునులు వారించి వేదమంత్రాలతో దేవేంద్రుణ్ని ఆహ్వానించి అగ్నికి ఆహుతి చేద్దామన్నారు.

ఋత్విక్కులు దీక్షపూనారు. బ్రహ్మ వాళ్లని శాంతింపజేసి పృథువుకు యాగఫలాన్ని అనుగ్రహించాడు. విష్ణువు ఇంద్ర సమేతంగా వచ్చి ఇంద్రుడి చేత క్షమాపణలు చెప్పించాడు.

**రాజుకు ప్రజారక్షణ ప్రధాన కర్తవ్యం. అందువల్ల ప్రజలు చేసే పుణ్య కర్మఫలంలో రాజుకు ఆరవవంతు సంక్రమిస్తుంది. ప్రజల కష్టసుఖాలతో సంబంధం లేని రాజు ప్రజలు చేసే పాపఫలాన్ని అనుభవించక తప్పదు.** అని విష్ణువు పృథువుకు బోధించాడు.

అనంతరం తన రాజధానికి చేరుకున్న పృథువు విష్ణుమూర్తి పదారవిందాలను ధ్యానిస్తూ, కన్నబిడ్డల్లా ప్రజల్ని పాలిస్తూ దాన ధర్మాలలో, సత్కర్మలలో అందరినీ తృప్తిపరుస్తూ భార్యతో కలిసి పరమపదం చేరుకున్నాడు.

## పాచీన బర్హి

పృథుచక్రవర్తికి, అర్చి మహాదేవికి పుట్టిన కుమారుడు **విజితాశ్వుడు**. అతడు ఇంద్రుణ్ణి జయించి అశ్వాన్ని తీసుకురావడం వల్ల అతడికి ఆ పేరు సార్ధకమయింది.



అంతర్ధాన విద్యలో ఇంద్రుణ్ణి జయించిన కారణంగా **అంతర్ధానుడని** కూడా ప్రసిద్ధుడయ్యాడు.

విజితాశ్వుడు **దీర్ఘసత్రం** అనే మహాయజ్ఞాన్ని ప్రారంభించి, హంస స్వరూపుడైన భగవంతుణ్ని ఆరాధించి యోగమార్గం ద్వారా ముక్తి పొందాడు.

విజితాశ్వుడి తర్వాత అతడి ఆరుగురు కుమారుల్లో బర్హిష్మదుడు నిత్యయజ్ఞదీక్షలో భూమండలమంతా యజ్ఞశాలలతో నింపాడు. ప్రాచీనాగ్రాలైన (తూర్పు దిక్కున కొనలుగల) దర్భల్ని (బర్హి) భూమి అంతటా పరచి **ప్రాచీనబర్హి** అనే పేరు పొందాడు.

సముద్రుడి కుమార్తె **శతధృతి**ని పెళ్లాడి పదిమంది పుత్రుల్ని పొందాడు. వాళ్ళు **ప్రచేతసులు** అని ఖ్యాతి గాంచారు. తండ్రి ఆజ్ఞమేరకు ప్రజల్ని సృజించడానికై తపస్సు ఆచరించడానికి అడవికి బయలుదేరారు. దారిలో రుద్రుడు సాక్షాత్కరించి **నారాయణమంత్రం** ఉపదేశించాడు.

బర్హి కర్మాసక్తుడయ్యాడు. ఒకరోజు నారదుడు అతడి వద్దకు వచ్చాడు. కర్మాసక్తి వల్ల తనకు జ్ఞానం నశించిందని, శ్రేయస్సును తెలుసుకోలేక పోయానని, కర్మబంధాలను నిర్మూలించే నిర్మల జ్ఞానాన్ని ఉపదేశించమని నారదుణ్ని ప్రార్థించాడు.

నారదుడు:– **నువ్వు యజ్ఞాలలో దయాహీనుడవై, వేలకొలది పశువుల్ని చంపావు. పరలోకానికి నువ్వు వెళ్లినప్పుడు లోహయంత్రాలమయమైన కొమ్ములతో నిన్ను పొడిచి చంపాలని అవి ఎదురుచూస్తున్నాయి. ఇటువంటి ప్రమాదాన్ని పొందబోతున్న నీకు ఒక ఇతిహాసం వినిపిస్తా**నన్నాడు.

పురంజనోపాఖ్యాన్ని విన్పించాడు. తత్త్వజ్ఞానాన్ని ప్రతీకాత్మకంగా అందించిన కథ ఇది.

తుదకు నారదుడు **మనస్సే జీవులకు జన్మ కారణం. కర్మవశాన అవిద్య కలుగుతుంది. అందువల్ల దేహానికి కర్మబంధం ఏర్పడుతుంది. కర్మబంధం వల్ల అనేక జన్మలు పొందవలసి ఉంటుంది. వాసుదేవుడే సృష్టిస్థితి లయలకు కారణమని, జగత్తంతా వాసుదేవాత్మకం అని భావించి ఈశ్వరుడైన వాసుదేవుణ్ని సేవిస్తే అవిద్య నశిస్తుందని** జీవేశ్వరుల తత్త్వాన్ని ప్రాచీన బర్హికి బోధించి సిద్ధలోకం వెళ్లాడు.

శివుడు బోధించిన నారాయణ మంత్రం జపిస్తూ నీటినడుమ నిల్చొని ప్రచేతసులు పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. ప్రచేతసుల తపస్సుకు మెచ్చి విష్ణువు ప్రత్యక్షమై ప్రచేతసులందరూ **మారిష** అనే కన్యను వివాహమాడి (మారిష – కండు మహామునికి ప్రమ్లోచ అనే అప్సరసకు జన్మించింది) వేల సంవత్సరాలు భూమిని పాలించి పరమపదం

పొందగలరని అనుగ్రహించాడు. ప్రచేతసులకు కూడా నారదుడు శ్రీమన్నారాయణుడి సచ్చరిత్రను విన్పించాడు.

ఈ గాథల్ని మైత్రేయముని ద్వారా విన్న విదురుడు తన జన్మ తరించిందని ఆనందించి, మైత్రేయుడి పాదాలను తలపై, శ్రీహరి పాదాలను మనస్సులో ధరించి మైత్రేయుడితో **మునీంద్రా! నీ కారణంగా శ్రీహరి తత్త్వాన్ని తెలుసుకున్నాను** అని చెప్పి, ఆయన అనుమతితో విదురుడు హస్తినాపురం పయనమయ్యాడు.

ఇంతటితో **నాల్గవ స్కంధం** సమాప్తం.



# అయిదవ స్కంధం

**భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు? నీ**
**భారత వర్షమందు హరి పల్మఱు పుట్టుచు జీవకోటికిన్**
**ధీరత తోడ తత్త్వముపదేశము సేయుచు, చెల్మి చేయుచు**
**న్నారయు బాంధవాకృతిగ కృతార్థుల జేయుచు నుండు నెంతయున్**

**(2వ ఆశ్వాసం -56)**

అయిదవ స్కంధాన్ని పోతన శిష్యుడు **బొప్పరాజు గంగానార్యుడు** అనువదించాడు. 350 గద్యపద్యాలున్న ఈ స్కంధాన్ని రెండు ఆశ్వాసాలుగా విభజించాడు. పోతన ప్రతి స్కంధంలోనూ ఆద్యంత పద్యాలను శ్రీరామచంద్రుణ్ని సంబోధిస్తూ రాస్తే, గంగన ఈ స్కంధంలో శ్రీకృష్ణ భగవానుని సంబోధిస్తూ ఆద్యంత పద్యాలు రాశాడు.

## ప్రియవ్రతుడి సంతతి

స్వాయంభువ మనువు మొదటి కొడుకు **ప్రియవ్రతుడు.** స్వాయంభువుడు అతడికి పాలనా బాధ్యతను అప్పగించి, తాను అరణ్యాలకు వెళ్లాడు. ప్రియవ్రతుడు విశ్వకర్మ ప్రజాపతి కుమార్తె బర్హిష్మతిని పెళ్లి చేసుకొని పదిమంది కుమారుల్ని, **ఊర్జస్వతి** అనే కుమార్తెను పొందాడు. మరొక భార్యద్వారా ఉత్తముడు, తామసుడు, రైవతుడనే పుత్రుల్ని పొందాడు. ఈ ముగ్గురు మనువులై మన్వంతరాలకు అధిపతులయ్యారు.

తొలి పదిమంది మగ సంతానంలో **కవి, మహావీర, సవనులు** బ్రహ్మచర్యం అవలంబించి బ్రహ్మవిద్యా నిష్ణాతులై మోక్షపదం అందుకున్నారు.

ప్రియవ్రతుడు తన బాహుబలంతో సమస్త శత్రువుల్ని జయించాడు. పదకొండు అర్బుద (దశకోటి, కోటి అని కొందరు – శబ్దరత్నాకరం) సంవత్సరాలు రాజ్యం పాలించాడు. ఒకసారి మేరుపర్వతానికి ప్రదక్షిణం చేస్తున్న సూర్యుడికి అటువైపున్న చీకటిని రూపుమాపాలని సూర్యరథంతో సమానమైన తేజోవంతమైన రథం ఎక్కాడు. భగవంతుని ఎల్లప్పుడూ ధ్యానించడం వల్లే అతడికి ఆ శక్తి కలిగింది.

రెండవ సూర్యుడిలా ప్రకాశిస్తూ, ఏడుసార్లు సూర్యుడి చుట్టూ ప్రదక్షిణం చేశాడు. బ్రహ్మదేవుడు అతణ్ని వారించాడు. ప్రియవ్రతుడి రథచక్రాల గాళ్లు పడినదారులు **సప్తసముద్రాలయ్యాయి.** ఆ గాళ్ల నడుమ ఉన్న భూమి **సప్తద్వీపాలయ్యాయి.**

జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కర ద్వీపాలనే పేర్లుగల వాటికి క్రమంగా తన కొడుకులైన అగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, హిరణ్యరేతస, ఘృతపృష్ఠ, మేధాతిథి, వీతిహోత్రులనే వారిని అధిపతుల్ని చేశాడు. తన కుమార్తె ఊర్జస్వతిని భార్గవుడికిచ్చి వివాహం జరిపించాడు. వారికి దేవయాని జన్మించింది. తర్వాత ప్రియవ్రతుడు విరక్తుడైనాడు.

## అగ్నీధ్రుడు

తన తండ్రి ఆజ్ఞమేరకు అగ్నీధ్రుడు జంబూ ద్వీపాన్ని ధర్మమార్గంలో పాలించాడు. సంతానం కోసం అగ్నీధ్రుడు మందర పర్వత సమీపానికి వెళ్లి బ్రహ్మదేవుణ్ని ఆరాధించాడు. బ్రహ్మదేవుడు సంతోషించి సత్యలోకంలో తన సమక్షంలో సంగీతం ఆలపించే **పూర్వచిత్తి** అనే అప్సరసను అతడి వద్దకు పంపాడు.

పూర్వచిత్తి, అగ్నీధ్రులు పరస్పరం ఇష్టపడి నూరువేలసంవత్సరాలు భూలోకంలో స్వర్గసౌఖ్యాలు అనుభవించారు. వారికి నాభి మున్నగు తొమ్మిదిమంది కుమారులు జన్మించారు. వాళ్లు జంబుద్వీపాన్ని వర్షాలుగా విభజించుకొని పరిపాలించారు. అవి వారి పేర్లతోనే ప్రసిద్ధమయ్యాయి.

వాళ్లు మేరు కుమార్తెలైన **మేరుదేవి, ప్రతిదేవి** మొదలైన తొమ్మిదిమంది సోదరీమణుల్ని వరుస క్రమంలో వివాహం ఆడారు. **నాభి, మేరుదేవి** దంపతులు సంతానం కోసం యజ్ఞపురుషుడైన వాసుదేవుని శ్రద్ధాసక్తులతో పూజించారు. **ప్రవర్గ్య**మనే క్రతువును శ్రద్ధతో ఆరంభించారు. శ్రీమన్నారాయణుడు తన నిండు స్వరూపంతో ప్రత్యక్షమై, తానే కొడుకుగా పుడతానని అనుగ్రహించాడు.

## ఋషభుడు

శ్రీహరి నాభి, మేరుదేవి దంపతులకు **ఋషభుడిగా** జన్మించాడు. ఋషభుడి వైభవం చూసి ఇంద్రుడు అసూయ చెందాడు. అతడి పాలనలోని రాజ్యంలో వర్షం లేకుండా చేశాడు. ఋషభుడు తన యోగమాయా బలంతో ఇంద్రుడి దౌష్ట్యాన్ని గుర్తించి రాజ్యాన్ని దినదినాభివృద్ధిని గావించి, సమృద్ధిగా వర్షం కురిపించాడు. అజనాభ మనే పేరుతో వ్యవహరింపబడే భూమండలాన్ని సుభిక్షం చేశాడు.

నాభి తన కుమారుడి సమర్థతకు సంతోషించి అతడికి పట్టంగట్టి నరనారాయణులకు స్థానమైన బదరికాశ్రమం చేరాడు. వాసుదేవుణ్ని తదేక ధ్యానంతో ఆరాధించి, సతీసమేతుడై శ్రీహరితో తాదాత్మ్యం చెందాడు.



హరి ఆజ్ఞను శిరసావహించి దేవేంద్రుడిచ్చిన జయంతిని వివాహమాడి ఋషభుడు భరతుడు మొదలైన నూరుమంది కుమారుల్ని పొందాడు. ఋషభుడు ధర్మబద్ధంగా పాలిస్తూ, సాంసారిక బంధాలలో చిక్కక స్వతంత్రుడై మెలిగాడు. ఆయన రాజ్యంలో ప్రజలందరూ పారలౌకిక ఫలమే తప్ప ఇహలోక ఫలం ఆశించేవారు కారు.

ఋషభుని కుమారులు **కుశావర్తుడు, ఇలావర్తుడు** మొదలైన తొమ్మిదిమందిని అగ్రజుడైన భరతుడు ప్రధానులుగా నియమించాడు. వాళ్లకు అప్పగించిన భూభాగాలు వారి పేరుతోనే ప్రసిద్ధిగాంచాయి. కవి, హరి మొదలైన మరో తొమ్మిదిమంది భాగవత ధర్మాన్ని ప్రకాశింపజేశారు. తక్కిన ఎనభై యొక్క మంది కుమారులు తమ తండ్రి అయిన ఋషభుని మాట జవదాటనివారు. వారు వేదధర్మాలను ఆచరిస్తూ, యాగాలపట్ల శ్రద్ధచూపేవారు. అందుచేత బ్రాహ్మణోత్తములుగా కీర్తి గాంచారు.

ఋషభుడు రాజ్యపాలన గావించి తన కుమారులతో ఇలా అన్నాడు. **బిడ్డలారా! కామానికి లొంగితే కుక్కలకు సైతం రాని కష్టాలు ఎదురవుతాయి. కోరికల్ని దూరంగా ఉంచండి. తపస్సువల్ల తరగని సుఖం కలుగుతుంది. అందువల్ల బ్రహ్మానందం సిద్ధిస్తుంది. వృద్ధుల్ని, దీనుల్ని దయతో కాపాడండి. చెడుమార్గాలలో పయనించే కాముకుల సహవాసాన్ని పూర్తిగా వదిలిపెట్టండి. మీకు శుభం కలుగుతుంది. సమదృష్టిని ప్రదర్శించండి.**

మోక్షోపాయాలను విపులీకరించిన ఋషభుడు, తన కొడుకుల్లో పెద్దవాడు, భాగవతోత్తముడైన **భరతుడికి** పట్టంగట్టి, దిగంబరుడిగా, చింపిరి జుట్టుతో పిచ్చివాడిలా ప్రవర్తిస్తూ, అవధూత వేషంలో సంచరించాడు. తన దేహాన్ని అడవిలో వ్యాపించిన కార్చిచ్చు మంటలకు ఆహుతిచ్చాడు. రజోగుణంతో నిండిన వారికి మోక్షమార్గం ఉపదేశించడమే ఋషభ అవతారం యొక్క పరమోద్దేశం.

## భరతుడు

**అజనాభం** అనే పేరుగాంచిన భూమి భరతుడి తర్వాత అతడి పేరుతో **భరతవర్షంగా** ప్రసిద్ధిగాంచింది. భరతుడు దీక్షతో రాజ్యపాలన గావించాడు. విశ్వరూపుడనే రాజుకుమార్తె **పంచజని**. ఆమెను వివాహమాడి **సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు, ఆచరణుడు, ధూమ్రకేతువు** అనే అయిదుమంది కొడుకుల్ని పొందాడు.

సర్వవిధాలైన సత్కర్మల్ని ఆచరించిన భరతుడు అనేక యజ్ఞయాగాదుల్ని నిర్వహించాడు. యాభై లక్షల వేల సంవత్సరాల రాజ్యపాలన గావించి, తన రాజ్యాన్ని తనయులకిచ్చి పులహాశ్రమానికి వెళ్లాడు.

అక్కడ తదేక ధ్యానంతో శ్రీహరిని ధ్యానిస్తూ ఉండేవాడు. ఒకరోజు భరతుడు గండకీ నదిలో స్నానం చేసి మూడు ముహూర్తాలకాలం నీటిలో నిల్చొని ప్రణవం జపిస్తున్నాడు.

అప్పుడొక నిండు గర్భిణియైన జింక నీళ్లు తాగడానికి వచ్చి, సింహ గర్జనను విని భయంతో ఎగిరి దూకింది. భయంతో దూకడం వల్ల జింక గర్భంలోని పిల్ల జారి నదిలో పడింది. తల్లి జింక నదీతీరంలోని కొండరాతిమీద పడి ప్రాణాలు కోల్పోయింది. నీటిలో తల్లడిల్లుతున్న జింకపిల్లను చూసి దయార్ద్ర హృదయుడైన భరతుడు తనతోపాటు ఆశ్రమానికి తీసుకువెళ్లి పెంచసాగాడు.

జింకపిల్లపై మమకారంతో ఆత్మయోగానికి విఘ్నం కలిగిన విషయాన్ని అతడు గుర్తించలేదు. అంత్యకాలంలోనూ ఆ జింక యోగక్షేమాల గురించి చింతిస్తూ కళ్లుమూశాడు. చివరి క్షణాలలోని అతడి ఆలోచనలకు అనుగుణంగా మరుజన్మలో జింకగా పుట్టాడు.

పూర్వం చేసిన తపస్సు కారణంగా గతజన్మ స్మృతిని కలిగి తాను యోగభ్రష్టుడైనందుకు బాధపడ్డాడు. ఆ తర్వాత తల్లి జింకను వదిలి సాలగ్రామ సమీపంలోని పులస్త్య పులహాశ్రమం చేరుకున్నాడు. ఆ ఆశ్రమంలో శాంతస్వభావులైన మునీశ్వరుల మధ్య గడుపుతూ, జింక జన్మకు కారణమైన గండకీ నదిలో స్నానం చేస్తూ తన శరీరాన్ని త్యజించాడు.

తర్వాతి జన్మలో అంగిరస గోత్రుడైన బ్రాహ్మణుడి రెండవ భార్య కుమారుడిగా పుట్టాడు. గత జన్మస్మృతి వల్ల బంధవిముక్తి కోసం ఉన్మత్తుడిగా, జడుడిగా, అంధుడిగా, చెవిటివాడుగా లోకులకు కన్పిస్తూ జీవితం గడిపాడు.

అతడి తండ్రి చనిపోగా, అతడితో పాటు తల్లికూడా సహగమనం చేసింది. దుర్మార్గులైన సవతి సోదరులు అతణ్ని ఇంటిపనులకు వినియోగించుకుంటూ, పొలానికి కాపలా పెట్టారు.

భరతుడు కాపలాకాస్తున్న పొలానికి సమీపంలోని నగరానికి నాయకుడైన భిల్లరాజుకు సంతానం లేదు. కాళికాదేవికి నరబలి ఇవ్వడం కోసం ఒకణ్ని అతడి భటులు తీసుకురాగా అతడు తప్పించుకున్నాడు. అతడి కోసం వెతుకుతుండగా భరతుడు కన్పించాడు. భటులు అతణ్ని పట్టుకుపోయారు.

బలి ఇవ్వడానికి భటులు సిద్ధమవుతున్నారు. అతడి తేజస్సు చూసి కాళికాదేవి భయపడింది. క్రోధంతో భిల్లరాజును, అతడి అనుచరుల్ని సంహరించింది.



తన్ను బలి ఇవ్వబోతున్న సమయంలోను, కాళికాదేవి ఉగ్రస్వరూపిణిగా భిల్లరాజు ప్రభృతుల్ని సంహరించిన సందర్భంలోనూ భరతుడు నిర్భయంగా ఉన్నాడు. అందరిలోనూ అచ్యుత భావాన్ని సందర్శించగలిగిన మహాయోగి అతడు.

## భరత రహూగణుల సంవాదం

కొన్ని సంవత్సరాలు గడిచిన పిదప ఒకరోజు సింధుదేశ పాలకుడైన రహూగణుడనే రాజు కపిలమహర్షి ద్వారా అధ్యాత్మ విద్య గ్రహించాలని పల్లకి ఎక్కి బయలుదేరాడు. పల్లకి మోస్తున్న బోయలు పుష్టిగా ఉన్న భరతుని చూసి, అతణ్ని తీసుకువచ్చి ఒకవైపు పల్లకి బొంగును అతడి భుజంపై మోపారు.

పల్లకి మోసిన అలవాటులేని భరతుడు తడబడడంతో పల్లకి ఎగుడుదిగుడుగా ఊగింది. రాజు అతణ్ని మందలించాడు. ఎత్తిపొడుపు మాటలు పలికాడు. భరతుడికి అది తన చివరిజన్మ అని తెలుసు. జ్ఞాని, పరబ్రహ్మ స్వరూపుడైన అతడు మౌనంగా పల్లకి మోశాడు. కాని పల్లకి ఊగిసలాటకు రాజు భరతుణ్ని **పొగరుబోతా ! నడపీనుగా!** అని సంబోధించి దూషించసాగాడు. అప్పుడు భరతుడు రాజును చూసి ఇలా అన్నాడు.

**ఓ రాజా! నువ్వు చెప్పింది అక్షర సత్యం. బరువు శరీరానికే కాని నాకే మాత్రం కాదు. మనిషి బలవడం, చిక్కడం శరీరానికి, మనిషికి సంబంధించిన రోగాలు, ఆకలిదప్పులు, ఇచ్ఛాద్వేషాలు, భయ, వార్ధక్య, మరణ, రోషాలు - నిద్ర, మెలకువ, అహంకార మమకారాలు, మదమాత్సర్యాలు దేహంలో పుడతాయి. అవి నాకు లేవు. జీవన్మృతుణ్ని నేను మాత్రమే కాను. జననమరణాలున్న వాళ్లందరూ జీవన్మృతులే.**

ఇటువంటి శాస్త్రసమ్మతాలైన వాక్యాలు పలికిన భరతుడు సామాన్యుడు కాదని గ్రహించి, రాజు పల్లకిని దిగి, అహంకారం విడిచి అతడి ముందు సాష్టాంగ దండ ప్రమాణం ఆచరించాడు.

రహూగణుడు **నేను ఎవరిద్వారా బ్రహ్మవిద్యోపదేశం పొందాలని వెళ్తున్నానో ఆ కపిల మహర్షివా? నా వంటి మూఢుడు యోగీశ్వరుల చరిత్రను ఎలా గ్రహించగలడు?** అని భరతుడితో అన్నాడు.

భరతుడు పలు ఉదాహరణలతో లోక వ్యవహారంలోని నిత్యత్వం ఉపాధిపై ఆధారపడుతుందే కాని అది సత్యం కాదని రాజుకు బోధపరిచాడు. తన పూర్వజన్మల్ని తెలియజేసి భరతుడు రాజుకు తత్త్వజ్ఞానం ఉపదేశించాడు. రహూగణుడికి దేహమే ఆత్మ అనే భ్రమ నశించింది.

శుకయోగీంద్రుడు ఈ కథను ముగించి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

**భరతుడు పూర్వం పుత్రుల్ని, భార్యల్ని, రాజ్యవైభవాన్ని త్యజించాడు. భగవంతుడి పట్ల నిష్ఠపెంచుకున్నాడు. యజ్ఞమయుడు, ధర్మస్వరూపుడు, సాంఖ్య యోగీశ్వరుడు అయిన భరతుడి చరిత్ర వినిపించిన వారిని, విన్నవారిని శ్రీమన్నారాయణుడు తప్పక రక్షిస్తాడు. వారికి ధనధాన్య ఆయుర్వృద్ధి లభిస్తుంది.**

అయిదవ స్కంధంలో **ప్రథమాశ్వాసం సమాప్తం.**

## ప్రియవ్రతుడి వంశ పరంపర

భరతుడి కుమారుడు సుమతికి దేవతాజిత్తు జన్మించాడు. తర్వాతి వంశక్రమం :– దేవద్యుమ్నుడు – పరమేష్ఠి – ప్రతీహుడు – ప్రతిహర్త – వ్యోముడు – భూముడు – ఉద్గీథుడు – ప్రస్తోత – విభుడు – పృథుసేనుడు – నక్తుడు.

నక్తుడి కుమారుడే గయుడు. ఇతడు రాజర్షులలో ఎంతో గొప్పవాడై కీర్తి గడించాడు. సకల జీవరాసుల్ని రక్షించడం కోసం, విష్ణువు సత్త్వ ప్రధానమైన దేహం ధరించి ఆత్మ తత్త్వాన్ని తెలిసినవాడుగా గయుడి రూపంలో అవతరించాడు.

గయుడికి జయంతి అనే భార్యవల్ల చిత్రరథుడు, స్వాతి, అవరోధనుడు జన్మించారు. చిత్రరథుడికి సమ్రాట్టు, అతడికి మరీచి, మరీచికి బిందుమంతుడు, అతడికి మధువు, మధువుకు వీరవ్రతుడు, అతడికి మన్యువు, మన్యువుకు భువనుడు, భువనుడికి త్వష్ట, త్వష్టకు విరజుడు జన్మించాడు. విరజుడు ప్రియవ్రతుని వంశంలో చివరివాడు.

పరీక్షిత్తు అడిగిన మీదట శుకమహర్షి భూమండల విశేషాలను విస్తృతంగా తెలియజేశాడు. సృష్టి కొలతల్ని వివరించాడు.

## భగణ విషయం (సూర్య గమనం)

సూర్యుడు బ్రహ్మాండం మధ్యలో ప్రకాశిస్తూ ముల్లోకాలను ప్రకాశింపజేస్తాడు. సూర్యుడికి ఉత్తరాయణం, దక్షిణాయణం, విషువత్తులు అనే మూడు గమనాలున్నాయి. ఆ గమనం ఉత్తరాయణంలో మందకొండిగా, దక్షిణాయనంలో వేగంగా, విషువత్తులో సమానంగా ఉంటుంది. ఈ మూడు గమనాలను అనుసరించి ఆరోహణ, అవరోహణ, స్థానాలలో రాత్రింబవళ్లు దీర్ఘంగా, హ్రస్వంగా, సమానంగా మారుతుంటాయి.

మేష తులా రాశుల్లో సూర్యసంచారం రాత్రిపగలు సమానంగా ఉంటుంది. వృషభ, మిధున, కర్కాటక, సింహ, కన్య – మొదలైన ఈ ఐదు రాశుల్లో సంచారం ఒక్కొక్క గడియ ప్రకారం రాత్రికాలం తగ్గుతూ, పగలు పెరుగుతుంది. వృశ్చిక, ధనుర్, మకర, కుంభ, మీనరాశుల్లో ఒక్కొక్క గడియగా రాత్రి పెరిగి పగలు తగ్గుతుంది.



ఈ ప్రకారంగా అహోరాత్రుల్ని ఉత్తరాయణ, దక్షిణాయనాలను పెంచుతూ, తగ్గిస్తూ ఒక్కరోజులో తొమ్మిదికోట్ల యాభైఒక్క లక్షల యోజనాల పరిమాణం కలిగిన దూరం మానసోత్తర పర్వతం నలువైపులా సూర్యరథం తిరుగుతూ ఉంటుంది.

సూర్యరథానికి గాయత్రి, బృహస్పతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి అనే ఏడు ఛందస్సులు గుర్రాలుగా ఉన్నాయి. సూర్యసారథి అరుణుడు. బొటనవేలి కణుపు పరిమాణం దేహం కలిగిన వాలఖిల్యులనే ఋషిశ్రేష్ఠులు అరవైవేలమంది జ్యోతిర్మయ స్వరూపాలు ధరించి సూర్యుడి ముందుండి వేదసూక్తాలతో స్తోత్రం చేస్తుంటారు.

సూర్యుడి మూడు రకాల గతుల (శీఘ్ర, మంద, సమ) కారణంగా కలిగే మార్పుల్ని వరుసగా వత్సరం, పరివత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, ఇద్వత్సరం అని ఐదు రకాలుగా పేర్కొంటారు.

గ్రహాల మధ్యదూరం, సప్తర్షి మండలం, శింశుమార చక్రం మొదలైన వాటిని శుకమహర్షి వివరించాడు.

పరీక్షిత్తు నరక లోకాల గురించి అడిగిన ప్రశ్నకు శుకుడు చెప్పిన సమాధానం.

## నరకలోకాలు

ముల్లోకాలకు తర్వాత దక్షిణ దిక్కులో, భూమ్యాకాశాల మధ్య మహాభయంకరమైన నరకలోకాలున్నాయి.

దక్షిణ దిశలోనే అగ్నిష్వాత్తులు మొదలైన పితృదేవతలు కూడా తమతమ గోత్రాలతో జన్మించిన వాళ్లకు శుభం కలగడం కోసం దీవెనలు అందిస్తుంటారు. పితృపతి అయిన యముడు తన లోకం చేరే జీవుల్ని, వాళ్లు చేసిన కర్మల్ని అనుసరించి ఫలితం ఇస్తూ శిక్షిస్తుంటాడు.

యమలోకంలో తామిస్రం, అంధతామిస్రం, రౌరవం, మహారౌరవం, కుంభీపాకం, కాలసూత్రం, అసిపత్రవనం, సూకరముఖం, అంధకూపం, క్రిమిభోజనం, సందంశం, తప్తోర్మి, వజ్రకంటక శాల్మలి, వైతరణి, పూయోదం, ప్రాణరోధం, విశసనం, లాలాభక్షణం, సారమేయాదనం, అవీచిరయం, రేతఃపానం అనే ఇరవై ఒక్క నరకాలున్నాయి. ఇవికాక క్షారకర్దమం, రక్షోగణభోజనం, శూలప్రోతం, దంద శూకం, అవట నిరోధనం, సూచీముఖం అని మరో ఏడు నరకాలున్నాయి.

భూమిపై మానవులు చేసిన వివిధ పాపకార్యాలను బట్టి, ఆయా నరకాలలో కొన్నింటిని ఒకటికి మించిన నరకాలలో పడి తీవ్రమైన శిక్షలు అమలు జరుగుతుంటాయి.

చేసిన పాపాలు, వాటి శిక్షల గురించి శుకుడు సుదీర్ఘంగా చెప్పి **ధర్మపరులు స్వర్గలోకంలో సుఖభోగాలు అనుభవిస్తారు** అని చెప్పాడు.

చివరగా **శ్రీమన్నారాయణుడి స్థూలశరీరం ఈ బ్రహ్మాండం. కనుక బ్రహ్మాండ వర్ణన చేసేవాళ్లు, అది విన్నవాళ్లు, అన్నివిధాల శుభాలు పొందుతారు. స్థూలశరీరం తెలసినవాళ్ళకి శ్రద్ధాభక్తుల కారణంగా భగవంతుడి సూక్ష్మరూపం కూడా తెలుసుకోగలుగుతారు.** అని పరీక్షిత్తుతో శుకుడు చెప్పడంతో ఈ స్కంధం సమాప్తమవుతుంది.

---



# ఆరవ స్కంధం

**భాగవతము తేట పఱుప నెవ్వడు సాలు**
**శుకుడు దక్క, నరుని సఖుడు దక్క**
**బుద్ధి దోచినంత, బుధులచే విన్నంత**
**భక్తి నిగిడినంత పలుకువాడ (6-23)**

పోతనామాత్యుణ్ని స్ఫురణకు తెచ్చే ఈ పద్యాన్ని రచించినవాడు ఆయన మరోశిష్యుడైన ఏర్చూరి సింగన. ఇతడు ఆరవ స్కంధాన్ని అనువదించాడు. ఇతడికి స్వప్నంలో సరస్వతీదేవి సాక్షాత్కరించింది. శ్రీకృష్ణాంకితంగా ఈ స్కంధాన్ని 529 గద్యపద్యాలతో రచించాడు.

## అజామిళుడు

పరీక్షిత్తు శుకయోగిని చూసి ఇలా అడిగాడు.

**ప్రపంచంలోని మనిషి భరించరాని బాధలతో నిండిన అనేక రకాలైన నరకకూపాలలో పడిపోకుండా సుఖంగా జీవించే మార్గం ఉందా?**

శుకమహర్షి సమాధానం :- రాజా! మనస్సు, వాక్కు, శరీరం ఈ మూడింటినీ త్రికరణాలంటారు. ఈ మూడు సమైక్యంగా పనిచెయ్యాలి. త్రికరణశుద్ధి లేని మనిషి ఎన్నోపాపాలు చేస్తాడు. ఆ పాపాలకు ప్రతిక్రియలు చెయ్యకుండా మరణించినవాడు నరకకూపాలలో పడి నానాబాధలు అనుభవిస్తాడు.

శ్రీహరి భక్తి పాపాత్ముడి కర్మల్ని పటాపంచలు చేసి అతడికి మోక్షాన్ని ప్రసాదిస్తుంది. శమం, దమం మొదలైన సద్గుణాలు కూడా హరిభక్తిలా పాపాత్ముణ్ని పుణ్యాత్ముడిగా మార్చలేవు.

ఈ విషయాన్ని నిరూపించే అజామిళుడి వృత్తాంతాన్ని చెబుతాను సావధానంగా విను.

పూర్వం కన్యాకుబ్జ నగరంలో అజామిళుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడికి వంశపారంపర్యంగా సంక్రమించిన సంపదలున్నాయి. కాని యౌవనం రాగానే కామంతో ఒక వేశ్యను ఇల్లాలుగా చేసుకున్నాడు. నిందాచరిత్రుడయ్యాడు. దురాచారాల పాల్పడి

నికృష్ట జీవనం గడిపాడు. జూదాలు, వివాదాలు అతనికి ఇష్టమైనవి. చోరవిద్యను నేర్చాడు. ఆ వేశ్యద్వారా అతడికి పదిమంది కొడుకులు పుట్టారు.

ముసలితనం వచ్చి, పళ్లూడి, మతి చలించినా మోహం వీడలేదు. తన చిన్నకుమారుడిపై అతడికి ప్రేమ ఎక్కువ. నారాయణుడని అతడికి పేరుపెట్టి పదేపదే పిలిచేవాడు. మరణం ఆసన్నమైనపుడు కూడా అతణ్ని నారాయణా అని సంబోధిస్తూ కళ్లు మూశాడు.

అతడు చేసిన పాపాల కారణంగా యమకింకరులు నరకలోకానికి తీసుకువెళ్లడానికి వచ్చారు. అతి భయంకర ఆకారులైన వాళ్లని చూసి విలవిలలాడుతూ తన కొడుకును నారాయణా! నారాయణా! అంటూ పిలవసాగాడు. ఈ శబ్దాన్ని విన్న పరిసరాలలో తిరుగుతున్న విష్ణుదూతలు అక్కడికి పరిగెత్తుకువచ్చి యమకింకరుల్ని అడ్డుకున్నారు.

అప్పుడు యమకింకరులు **ఇతడు మహాపాపి. వేదాది విద్యల్ని నేర్చి, అందమైన కన్యను భార్యగా పొందినా, యౌవనపు మత్తులో, తాగిన మైకంలో ఒక పొదరింటిలో శృంగార చేష్టలు చేస్తున్న విటీవిటుల్ని చూసి వేశ్యాలంపటుడయ్యాడు. పూజకై తెచ్చిన పూలను జారవిడిచాడు. మంత్రాలు మరిచాడు. కనుక ఇతణ్ని నరకానికి తీసుకువెళ్తున్నాము** అన్నారు.

విష్ణుదూతలు **మీరు చెప్పినవన్నీ వాస్తవాలే. కాని ప్రాణావసాన దశలో ఇతడు నారాయణ నామం జపించాడు. అందువల్ల వీడి పాపాలన్నీ నశించాయి. ఇప్పుడు వీడు పుణ్యాత్ముడే** అన్నారు. యమభటులు తిరిగివెళ్లి యముడితో జరిగినవన్నీ చెప్పి **మీకంటే శాసించేవారు మరొకరున్నారా?** అని ప్రశ్నించారు.

యముడు విష్ణుమాహాత్మ్యాన్ని చెప్పి **ప్రపంచమంతటా విష్ణుభక్తుల్ని రక్షించడానికి విష్ణుదూతలు తిరుగుతుంటారు. దేవాధిదేవుడైన పరమశివుడు, బ్రహ్మ, కుమారస్వామి, కపిలుడు, నారదుడు, భీష్ముడు, మనువు, బలిచక్రవర్తి, జనకమహారాజు, ప్రహ్లాదుడు, శుకుడు, వేదవ్యాసుడు మొదలైన పన్నెండుమంది తప్ప వైష్ణవతత్త్వం తెలిసినవాళ్లు మరెవ్వరూ లేరు** అన్నాడు.

యమవిష్ణుదూతల సంవాదాన్ని విన్న అజామిళుడు తన పాపాలను స్మరించుకొని పశ్చాత్తాపం చెందాడు. తాను చేసిన దుర్మార్గాలను ఏవగించుకున్నాడు. శ్రీహరికి శరణాగతుడయ్యాడు. అరిషడ్వర్గాన్ని జయించి అజ్ఞానాంధకారాన్ని పారదోలాడు. తత్త్వజ్ఞానిగా మారి సంసార బంధాలను విడిచి గంగాతీరం చేరాడు.



అక్కడొక ఆలయంలో కూర్చొని యోగమార్గాన్ని ఆశ్రయించి, యోగసమాధి ద్వారా పరతత్త్వంలో అనుసంధానం అయ్యాడు. ఆత్మను పరమాత్మలో లీనం చేశాడు. అప్పుడు మొదట తనను రక్షించిన దివ్యపురుషులు కన్పించారు. వాళ్లు అతణ్ని వైకుంఠానికి తీసుకువెళ్లారు. ఈ వృత్తాంతాన్ని చెప్పిన శుకమహర్షి **నారాయణా అన్న సంబోధన శ్రీహరిని గురించి కాక, తన కొడుకును పిలిచినదైనా ఆ నామోచ్చారణతో అంతటి ఉన్నతి స్థితిని అజామిళుడు అందుకున్నాడని** పరీక్షిత్తుకు తెలిపాడు.

## దక్షుడి సృష్టి కార్యక్రమం

స్వాయంభువ మనువు రెండవ కుమారుడైన ఉత్తానపాదుడి వంశంలో జన్మించిన ప్రాచేతసులు నీటినడుమ పదివేల సంవత్సరాలు తపస్సు చేశారని ఈ వరకే చెప్పబడింది. వాళ్లు తపస్సు చాలించి, సముద్రంలోంచి వెలుపలికివచ్చి నలువైపులా చూశారు. భూమిపూర్తిగా చెట్లతో నిండి ఉండటం చూసి ఆగ్రహించి కోపాగ్ని జ్వాలల్ని మహావాయువుతో ప్రసరింపజేసి చెట్లను ఆహుతి గావించడానికి పూనుకున్నారు.

**సోముడు** వాళ్లని వారించి ప్రజాసృష్టికోసం జన్మించినవాళ్లు ఈ అనర్థానికి ఒడిగట్టడం మంచిదికాదని, సోముడు 'మారిష'తో వారికి వివాహం జరిపించాడు. మారిష ద్వారా వాళ్లకి బ్రహ్మదేవుడి మానసపుత్రుడు **దక్షుడు** పుట్టాడు.

దక్షుడు అన్నిరకాల సృష్టులను కొనసాగించాడు. తన సృష్టి పట్ల సంతుష్టి చెందక విష్ణుదేవుని గూర్చి తపస్సుచేసి **హంసగుహ్యం** అనే స్తోత్రంతో ప్రస్తుతించాడు.

విష్ణువు **పంచజన** ప్రజాపతి పుత్రిక అయిన **అసిక్ని** అనే పేరుగల కన్యను దక్షుడికి భార్యగా అనుగ్రహించాడు. దక్షుడు **హర్యశ్వులు** అనే పదివేలమంది పుత్రుల్ని పొందాడు. వాళ్లని ప్రజాసృష్టి కోసం నియోగించగా, నారదుడు వారికి వైరాగ్యం బోధించి నివృత్తిమార్గం వైపు మళ్లించాడు. ఆ తర్వాత తన తండ్రి బ్రహ్మదేవుడి ఆజ్ఞమేరకు అసిక్ని ద్వారా దక్షుడు వేలకొలది పుత్రుల్ని పొందాడు. వాళ్లకి **శబలాశ్వులని** పేరు. వాళ్లని కూడా నారదుడు నివృత్తి మార్గం వైపు మళ్లించాడు.

దీనితో ఆగ్రహించిన దక్షుడు **దేవ, ఋషి, పితృఋణాలు తప్పనిసరిగా తీర్చవలసినవి. అటువంటి ఋణాలు తీర్చకనే నా కుమారుల్ని నివృత్తిమార్గం వైపు మళ్లించావు. నా కుమారులకు ద్రోహం తలపెట్టినందుకు తక్కిన భాగవతుల వలె కాకుండా లోకసంచారివై ఒకచోట నిలుకడ లేకుండా ఉందువు గాక** అని శపించాడు.

బ్రహ్మదేవుడు ప్రజాసృష్టికి తగిన శక్తిని అతడికి అనుగ్రహించాడు. మళ్లీ అసిక్ని ద్వారా అరవైమంది కూతుళ్లను పొంది, అందులో పదిమందిని **ధర్ముడికి** (యముడు);

పదమూడుమందిని **కశ్యపప్రజాపతికి;** ఇరవై ఏడుమందిని **చంద్రుడికి; భూతుడికి** ఇద్దరిని; **అంగిరసుడికి** ఇద్దరిని; **కృశాశ్వుడికి** ఇద్దర్ని; **తార్క్ష్యుడనే** నామాంతరం కలిగిన కశ్యపుడికి మళ్లీ నలుగురునిచ్చి వివాహం చేశాడు. వీరి సంతానంతో ముల్లోకాలు నిండాయి.

కశ్యప ప్రజాపతికిచ్చిన అదితిదేవికి పుట్టిన కుమారులలో **త్వష్ట** అనే వాడు దైత్యుల చెల్లెలైన **రచన** అనే కన్యను వివాహం ఆడాడు. వాళ్లకి మహాబలాఢ్యుడైన **విశ్వరూపుడు** జన్మించాడు.

ఒకానొక సమయంలో **బృహస్పతి** దేవతలపై కోపించి వెళ్లిపోయాడు. అప్పుడు దేవతలు విశ్వరూపుణ్ని గురువుగా ఎంచుకున్నారు. ఆ సంఘటనను శుకమహర్షి ఇలా వివరించాడు.

## దేవాసుర సమరం – విశ్వరూపుడి అనుగ్రహం

అమరావతిలో దేవతలందరూ కొలుస్తుండగా ఇంద్రుడు గంధర్వగానం వింటూ, అప్సరసల నాట్యం తిలకిస్తూ ఆనందంతో మైమరచి ఉన్న సమయంలో దేవగురువు బృహస్పతి అక్కడికి వచ్చాడు. దేవేంద్రుడు లేచి ఆయనకు స్వాగతం పలకలేదు. బృహస్పతి వెంటనే వెనుతిరిగాడు.

గురుదేవుడు వచ్చి వెళ్లిన సంగతి తెలిసి కంపించిన ఇంద్రుడు ఆయన ఇంటికి వెళ్లాడు. బృహస్పతి అధ్యాత్మ మాయ చేత అదృశ్యుడయ్యాడు. ఆయన పాదాలపై పడి క్షమాభిక్ష వేడుదామని ఎంత ప్రయత్నించినా ఆయన జాడ తెలియలేదు.

మంత్రాంగం నెరిపే గురువులేదని తెలిసి దానవులు అమరావతిపై దండెత్తారు. దానవుల్ని ఎదుర్కోలేక దేవగణాలు బ్రహ్మను ఆశ్రయించారు. బ్రహ్మ దేవతల్ని చూసి **మీ శ్రేయస్సుకోరి తొలినుంచి మీకు విద్యాబుద్ధులు నేర్పిన గురువును అవమానించారు. అందుకే మీకీ దురవస్థ కలిగింది. రాక్షసులు శక్తిహీనులైనా గురువు అనుగ్రహంతో మిమ్మల్ని జయించగలిగారు. ఇప్పుడు మీరు త్వష్ట ప్రజాపతి కుమారుడైన విశ్వరూపుణ్ని ఆశ్రయించండి. అతడు మహాతపస్సంపన్నుడు. అతడి అనుగ్రహంతో మీరు తప్పనిసరిగా రాక్షసుల్ని జయించగలరు** అన్నాడు.

తన్ను ఆశ్రయించిన దేవతలకు విశ్వరూపుడు నారాయణకవచం ఉపదేశించాడు. దేవతలు రాక్షసుల్ని ఓడించారు. అందుకు ప్రతిఫలంగా విశ్వరూపుడు తమతోబాటు హవిర్భాగాలు అందుకునే అవకాశం దేవతలు కల్పించారు.

విశ్వరూపుడి తల్లి రచన, రాక్షసుల ఆడపడుచు కనుక హవిర్భాగాన్ని రాక్షస ప్రముఖులకు పరోక్షంగా పంచిపెట్టేవాడు. ఈ విషయం తెలిసి భయభ్రాంతుడైన ఇంద్రుడు



బ్రాహ్మణుడని, మహనీయుడని భావించకుండా విశ్వరూపుడికున్న మూడు తలల్ని ఖండించాడు.

## ఇంద్రుడి పతనం – అభ్యుదయం

విశ్వరూపుడి మొదటి తల సురాపానం, రెండోతల సోమపానం చేసేవి. మూడోతల అన్నం భుజించేది. మొదటితల కౌజుపిట్టగా, రెండోతల కలవింక పక్షిగా (ఊరపిచ్చిక; కూకటి మూగ పక్షి – శబ్దరత్నాకరం) మూడవది తిత్తిరిగా (తీతువుపిట్ట) రూపొందాయి.

బ్రహ్మహత్యా మహాపాతకం మూడురకాల పక్షుల రూపం ధరించి ఇంద్రుణ్ని వేధించసాగింది. ఇంద్రుడు తన పాపాన్ని నాలుగు భాగాలుచేసి నలుగురికి పంచాడు.

భూమికి తనలో చెయ్యబడిన గొయ్యి తనంతట తానే పూడే వరం ఇచ్చి ఒక భాగాన్ని, తమలో ప్రక్షాళన కాగానే పవిత్రం అయ్యేటట్లు జలాలకు వరం ఇచ్చి రెండవ భాగాన్ని, ఎన్నిసార్లు ఛేదించినా తిరిగి చిగురించేటట్లు చెట్లకు వరం ఇచ్చి మూడవభాగాన్ని, పురుషుల కంటె ఎక్కువగా కామసుఖం కలిగేటట్లు స్త్రీలకు వరం ఇచ్చి నాల్గవభాగాన్ని పంచిపెట్టాడు.

భూమి పాపాన్ని చవిటినేల రూపంలోనూ; నీళ్లు బుడగలు, నురుగల రూపంలోను చెట్లు జిగురు రూపంలోను; స్త్రీలు రజోవికార రూపంలోనూ ఆ పాపాన్ని పంచుకున్నారు. ఇంద్రుడు తన బ్రహ్మహత్యా దోషాన్ని పోగొట్టుకొని స్వర్గపాలన కొనసాగించాడు.

## వృత్రాసురుడు

విశ్వరూపుడి తండ్రి త్వష్ట తన కుమారుణ్ని ఇంద్రుడు చంపినందుకు కోపోద్రిక్తుడై మారణహోమం ప్రారంభించి మహాభయంకర ఆకారుడైన వృత్రాసురుణ్ని సృష్టించాడు. అతడి ధాటికి తట్టుకోలేక దేవతలు విష్ణువును ఆశ్రయించారు. వైకుంఠాన్ని సమీపించి ప్రార్థించారు. విష్ణువు ప్రత్యక్షం అయ్యాడు.

**దధీచి మహర్షిని ఆశ్రయించండి. ఆ మహర్షి దేహం నారాయణ కవచ ప్రభావం వల్ల తేజోవంతమై, సారవంతమై ఉంది. ఆయన అశ్వినీ దేవతలకు అశ్వశిరం అనేవిద్యను బోధించినవాడు. త్వష్ట ప్రజాపతికి నారాయణ కవచం అనుగ్రహించినవాడు. త్వష్టదాన్ని తన కుమారుడు విశ్వరూపుడికి ఉపదేశించాడు. అశ్వినీకుమారుల్ని ముందుంచుకొని ఆయన దేహాన్ని అర్థించండి. విశ్వకర్మ ఆయన ఎముకలతో నూరంచుల వజ్రాయుధాన్ని రూపొందిస్తాడు. అది వృత్రాసురుణ్ని సంహరిస్తుంది.** అని చెప్పి విష్ణువు అంతర్ధానం అయ్యాడు.

దేవతల ప్రార్థనను మన్నించి దధీచి తన దేహాన్ని త్యజించాడు. విశ్వకర్మ వజ్రాయుధాన్ని రూపొందించాడు. అటు పిదప దేవదానవులకు భీకరయుద్ధం జరిగింది. వృత్రాసురుడి ధాటికి దేవతలు బెంబేలెత్తిపోయారు.

ఇంద్ర వృత్రాసురుల యుద్ధసమయంలో వృత్రాసురుడి మాటలు, చేతలు విష్ణుభక్తిని అపారంగా ప్రదర్శిస్తున్న వైనం చూసి దేవేంద్రుడు ఆశ్చర్యం చెందాడు. విష్ణువునే తన మనస్సులో పదిలం చేసుకొని వృత్రాసురుడు పోరు కొనసాగించాడు. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని జారవిడుచుకున్నప్పుడు తాను యుద్ధం చెయ్యక ఆ ఆయుధాన్ని తీసుకొని యుద్ధం చెయ్యమన్నాడు.

దేవేంద్రుడికి వృత్రాసురుడు భగవత్ స్వరూపుడిగానే గోచరించాడు. ఆ తర్వాత వజ్రాయుధంతో వృత్రాసురుడి చేతుల్ని ఇంద్రుడు ఖండించాడు. అతడు నోరు విశాలం చేసి ఇంద్రుణ్ని మింగాడు. దేవేంద్రుడు వృత్రాసురుడి పొట్టచీల్చుకొని వెలుపలికి వచ్చాడు. ఆ విధంగా వృత్రాసురుడి వధ జరిగింది.

ఆ సమయంలో వృత్రాసురుడి శరీరంలోంచి ఒకానొక దివ్యతేజస్సు వెలువడింది. ఆ కాంతి పుంజం విష్ణులోకానికి వెళ్లి నారాయణుడిలో ప్రవేశించింది.

## నహుషుడు

వృత్రాసురుడి వధ కూడా బ్రహ్మహత్యా దోషాన్ని ఇంద్రుడికి కలుగజేసింది. ఆ దోషం అతడిని చండాల రూపంతో ఒళ్లంతా ముడుతలుపడి గజగజ వణుకుతూ వెంటపడింది. క్షయరోగంతో, కుష్ఠురోగంతో దాని శరీరమంతా నెత్తురు చిమ్ముతూంది. ఇంద్రుడు ఎటువెళ్తే అటు వెంటపడసాగింది.

చివరకు దేవేంద్రుడు ఈశాన్యదిశలోని అత్యంత పవిత్రమైన మానస సరస్సులో ప్రవేశించి, అందులోని ఒక తామర తూడులో దూరి, ఆ తూడులోని సన్నని తంతువులతో కలిసిపోయాడు. అలా అందులో బ్రహ్మహత్యా పరిహారం కోసం విచారిస్తూ వెయ్యి సంవత్సరాలు గడిపాడు. ఈశాన్యదిశ పరమేశ్వరుడికి సంబంధించినది కనుక బ్రహ్మహత్య ప్రవేశించలేక దూరంగా కాచుకొని కూర్చుంది.

అప్పుడు నహుషుడు (చంద్రవంశంలోని పాండవకౌరవుల పూర్వీకుడు) అనేరాజు స్వర్గాధిపత్యం పొందాడు. విద్యాబలం వల్ల, యోగబలం వల్ల దక్కించుక్ను పదవి అది. కాని ఐశ్వర్యమదంతో ఇంద్రుడి భార్యను వాంఛించాడు.

శచీదేవి దేవగురువు బృహస్పతి సూచనమేరకు **నువ్వు బ్రహ్మర్షుల చేత పల్లకీని మోయించుకొని దానిపై ఎక్కివస్తే నీ కోరిక నెరవేరుతుంది** అని నహుషుడితో చెప్పింది.



నహుషుడు గర్వంతో గుడ్డివాడై బ్రహ్మర్షులచేత పల్లకీని మోయించాడు. అగస్త్యమహర్షి శాపానికి గురై అజగరం (కొండచిలువ) రూపం ధరించి స్వర్గభ్రష్టుడయ్యాడు.

బ్రహ్మర్షులు దేవేంద్రుడున్న చోటికి వెళ్లి అతణ్ని అమరావతికి ఆహ్వానించారు. ఇంద్రుడు తిరిగివచ్చి స్వర్గాధిపతి అయ్యాడు. వెయ్యి సంవత్సరాలపాటు విష్ణువును ధ్యానించడం వల్ల, పరమేశ్వరుడి దిగ్భాగంలో ఉండి, ఆయన కరుణకు పాత్రుడవడం వల్ల బ్రహ్మహత్యాదోషం క్రమంగా క్షీణించి, ఇంద్రుణ్ని స్పృశించలేకపోయింది. బ్రహ్మర్షులు అతడిచేత అశ్వమేధాది యాగాలు చేయించారు.

## చిత్రకేతువు

**వృత్రాసురుడికి అంతటి దివ్యజ్ఞానం ఎలా కలిగింది? యుద్ధంలో ధర్మయుక్తమైన పౌరుషంతో దేవేంద్రుణ్ని ఎలా మెప్పించగలిగాడు?** అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శుకుడిచ్చిన సమాధానాన్ని, సూతుడు శౌనకాది మునులకు ఇలా తెలియజేశాడు.

శుకుడు నారాయణ సంస్మరణ చేసి **పూర్వం వేదవ్యాసుడు, దేవలుడు, నారదుడు నాకు చెప్పిన వృత్తాంతాన్ని నీకు ఇప్పుడు వివరిస్తున్నాను** అని పరీక్షిత్తుతో అన్నాడు.

పూర్వం చిత్రకేతువనే మహారాజు శూరసేన దేశాలను పాలించేవాడు. అతడు సుగుణవంతుడు. ప్రజారంజక పాలకుడు. అతడికి చాలామంది భార్యలున్నారు. కాని సంతానం కలుగలేదు. అంగీరస మహాముని పుత్రకామేష్టి జరిపించి పట్టపురాణి కృతద్యుతికి కుమారుడు పుట్టేటట్లు అనుగ్రహించాడు.

చిత్రకేతువు కుమారుడి మీది మోహంతో పట్టపురాణి పట్ల బద్ధానురాగం కలిగి ఉండడం ఇతర భార్యలు సహింపలేకపోయారు. కర్కశ హృదయాలతో ఆ బాలుడికి విషప్రయోగం చేశారు. మరణించిన కుమారుణ్ని చూసి భార్యాభర్తలు విలపించారు.

అప్పుడు అంగిరసుడు నారదుడితో బాటువచ్చి **దేహధారులకు జననమరణాలు తప్పవు. ఇది భగవంతుడి మాయావిలాసం. సృష్టి రహస్యాన్ని గుర్తించాలి. అనేక జన్మల్లో పలువురు బంధుమిత్రుల్ని తల్లిదండ్రుల్ని పొందిన దేహం – దాని సంబంధాలు నిజం కావు. జనన మరణాలు మనోభావాలే కాని వాస్తవాలు కావు** అన్నాడు.

ఆ విషయాన్ని పరీక్షించమని బాలుణ్ని బ్రతికించాడు. ఆ బాలుడితో **ఈ బంధువులందరూ నీకోసం దుఃఖిస్తున్నారు. వారికి ఆనందం కలుగజేసిన ఈ శరీరంతోనే సింహాసనం అధిష్ఠించు** అని నారదుడు అన్నాడు. అప్పుడా బాలుడు –

**ఓ మునీంద్రా! పూర్వకర్మల కారణంగా ఎన్నోజన్మలెత్తాను. చేసిన పాపపుణ్యాలను అనుసరించి దేవతల, మానవుల, తిర్యగ్జంతువుల గర్భాలలో పుట్టాను. ఆయాజన్మలలో**

**నా తల్లిదండ్రులు ఎందరెందరో ఉన్నారు కదా! ఈ తల్లిదండ్రుల దుఃఖం పోగొడితే మరి వాళ్ల సంగతేమిటి?** అంటూ అతడు దేహాన్ని పరిత్యజించాడు.

ఈ సంఘటనతో చిత్రకేతుడి వ్యామోహం తొలగింది. బాలుడికి ఉత్తరక్రియలు జరిపించాడు.

నారదుడు ఉపనిషత్తులలో రహస్యంగా ఉన్న మంత్రాన్ని చిత్రకేతుడికి బోధించాడు. దాన్ని నారదుడు చెప్పినట్లే నిరాహారుడై, సమాధినిష్ఠుడై ఏడురాత్రులు అత్యంత దీక్షతో ఆరాధించి చివరకు అనన్యసామాన్యమైన విద్యాధర చక్రవర్తిత్వాన్ని, దివ్యవిమానాన్ని పొందాడు. అందులో నారాయణానుగ్రహంతో ముల్లోకాలు సంచరించాడు. ఒకచోట ఆదిశేషుణ్ని దర్శించాడు.

ఆదిశేషుణ్ని చిత్రకేతుడు స్తుతించాడు. ఆదిశేషుడు అతడికి విష్ణుతత్త్వాన్ని బోధించాడు. ఆ దివ్యవిమానంలో తిరుగుతూ కిన్నర, యక్ష కాంతలచేత శ్రీహరి దివ్యలీలల్ని గానం చేయించాడు. గోవిందుడిపైనే మనస్సు నిలిపి వర్తించసాగాడు.

ఒకరోజు కైలాసంలో నిండుకొలువులో శివపార్వతుల కౌగిలింతను చూసి పరహసించాడు. పార్వతి ఆగ్రహంతో రాక్షసుడివి కమ్మని శపించింది. ప్రతిశాపం ఇవ్వగల శక్తిఉన్నా, శాంతం వహించి చిత్రకేతువు పార్వతిని శాపవిమోచనం కోసం అర్థించాడు. శివుడు పార్వతితో అతడు పరమ విష్ణుభక్తుడని, భగవత్తత్త్వాన్ని అర్థం చేసుకున్నవాడని చెప్పాడు. పార్వతీదేవి ప్రసన్నురాలయింది.

ఆ చిత్రకేతుడే త్వష్ట ప్రజాపతి చేసిన యజ్ఞంలో దక్షిణాగ్ని మధ్యనుండి దానవుడిగా, వృత్రాసురుడిగా జన్మించాడు. అందువల్లే అతడికి అంతటి విష్ణుభక్తి అలవడింది.

## మరుత్తులు

ఆ తర్వాత శుకుడు ద్వాదశాదిత్యుల గురించి చెప్పాడు.

కశ్యపముని భార్యలైన అదితి ద్వారా ఆదితేయులు (దేవతలు) దితి ద్వారా దైతేయులు (రాక్షసులు జన్మించారు) దితిపుత్రులైన హిరణ్యకశిప, హిరణ్యాక్షులు ఇంకా పలువురు రాక్షసులు దేవతల కారణంగా మరణించడం చూసి, దేవేంద్రుణ్ని చంపగల పుత్రుడికోసం తన భర్త కశ్యప ప్రజాపతిని సేవించసాగింది. ఆమె సపర్యలకు సంతోషించిన కశ్యపుడు సంతోషించి ఆమె కోరికను తెలియజెయ్యమన్నాడు.

దితి తన కోరికను వెల్లడించింది. ఇచ్చిన మాటను తప్పలేక ఒక్క సంవత్సరం బాటు తాను చెప్పిన నియమాలతో వ్రతం చెయ్యాలని కశ్యపుడు అన్నాడు.



ఆ విధంగానే వ్రతం ప్రారంభించిన దితి గర్భందాల్చింది. తన పినతల్లి అభిప్రాయాన్ని గ్రహించిన ఇంద్రుడు క్షణమాత్రం కూడా ఏమరుపాటు లేకుండా ఆమెకు సపర్యలు చేయసాగాడు. ఆమెకు కావలసిన పూజాద్రవ్యాల్ని సమకూర్చేవాడు.

ఒకరోజు పని బడలికతో అలసిపోయి సంధ్యాసమయంలో భోజనం చేసి ఆ బడలికతో కాళ్లు కడుక్కోవడం దితి మరిచింది. సమయంకోసం ఎదురుచూస్తున్న దేవేంద్రుడు యోగమార్గంలో గర్భంలోకి చొరబడి దేదీప్యమానంగా వెలుగుతున్న బాలుణ్ని ఏడుముక్కలు చేశాడు. ఏడుముక్కలు ఏడుగురు బాలురిగా ప్రకాశించి ఏడ్వసాగారు.

అరవకండి (మారుద) అని అంటూ మళ్లీ ఒక్కొక్క బాలుణ్ని ఏడుముక్కలుగా చేశాడు. నలభై తొమ్మిది బాలురు (ఆ ఖండాలు) దేవేంద్రుణ్ని ప్రార్థించారు.

దితి మేల్కొంది. దేవేంద్రుడు ఆమెను క్షమించమని ప్రార్థించాడు. ఇంద్రుడు వాళ్లని తమతోబాటు స్వర్గానికి తీసుకువెళ్లి యజ్ఞాలలో సోమపానాన్ని, హవిర్భాగాలను పంచిపెట్టాడు.

(వాల్మీకి రామాయణం బాలకాండలో ఏడుగురని మాత్రమే ఉంది. మారుద (ఏడవకు) అని దేవేంద్రుడు అనడం వల్ల వాళ్లు మరుత్తులయ్యారు. సప్తవిధ వాయువులకు అధిపతులు కావడం వల్ల కూడా (మరుత్తు – గాలి) మరుత్తులుగా ప్రసిద్ధిగాంచారు.

ఇంతటితో **ఆరవస్కంధం** సమాప్తం.

----

# ఏడవ స్కంధం

**తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా**
**ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం**
**బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుడై యుండుట భద్రమంచు తలతున్ సత్యంబు దైత్యోత్తమా! (167)**

పరీక్షిత్తు – **దయాసముద్రుడైన లక్ష్మీపతి దేవతలకోసం రాక్షసుల్ని శత్రువులా హతమార్చాడు కదా! అంతటి మహనీయుడు, నిరంజనమూర్తి అసురుల్ని చంపి, అమరుల్ని ఆదరించడం వింతగా ఉంది. ఈ సంశయాన్ని సర్వజ్ఞులైన మీరే నివారించాలి** అని వినయంగా శుకమహర్షిని అడిగాడు.

**శుకుడు – నీ ప్రశ్న శ్రేష్ఠమైనది. వివరించ తగింది. విష్ణువు చరిత్ర మహావిచిత్రం. పరమ పవిత్రం. శ్రద్ధగా విని అర్థం చేసుకో. జీవాత్మకు పరుడిగా కన్పిస్తూ, సర్వమూ తానే అయిన ప్రభువు తన మాయాబలంతో విశ్వాన్ని సృష్టించాలని భావించి రజోగుణాన్ని, లీలా విలాసాలను ప్రదర్శించాలని తలచి సత్త్వగుణాన్ని, నిద్రించాలని అనుకొని తమోగుణాన్ని కలిగించి నడిచే కాలాన్ని సృష్టించాడు.**

**అటువంటి కాలం వల్ల సర్వత్రా గోచరించే ఈశ్వరుడు కాలస్వరూపుడుగా గణుతికెక్కాడు. ఆ స్వామి సత్త్వగుణ ప్రధానులైన దేవతలకు ఆనందాన్ని, రజోగుణ ప్రధానులైన రాక్షసులకు దుఃఖం కలిగిస్తూ ఉంటాడు.**

**పూర్వం ఈ తత్త్వసారాన్ని రాజసూయ యాగ సమయంలో ధర్మరాజుకు ధర్మమర్మ విదుడైన నారదమహర్షి వివరించాడు. దాన్నే నీకు ఇప్పుడు చెబుతాను"** అన్నాడు. 481 గద్యపద్యాలతో ఈ స్కంధమంతా నారదుడు ధర్మరాజు ప్రశ్నలకు ఇచ్చిన సమాధానంగానే కొనసాగింది.

## కృష్ణనామస్మరణం – ఉన్నతపద సోపానం

రాజసూయ యాగంలో శ్రీకృష్ణభగవానుడి చక్రాయుధం వల్ల శిరస్సు తెగి మరణించిన శిశుపాలుడు తేజోరూపంతో కృష్ణుడి శరీరంలో ప్రవేశించి లీనమయ్యాడు. అదిచూసి ఆశ్చర్యానికి లోనైన ధర్మరాజు సభలో ఉన్న నారదమహర్షిని **సమీపించి – ఎంతటి పుణ్యాత్ములకైనా భగవంతుడిలో ప్రవేశించే శక్తి ఉండదు కదా! అటువంటిది ఎల్లప్పుడూ కృష్ణుణ్ని ద్వేషిస్తూ వచ్చిన శిశుపాలుడికి ఆ మహా సౌభాగ్యం ఎలా లభించింది?** – అని ప్రశ్నించాడు.



నారదుడు – దూషణ భూషణలు, తిరస్కార పురస్కారాలు శరీరానికేగాని ఆత్మకు కావు. కర్తృత్వం తన మీదలేని వాడికి హింసవల్ల కలిగే పాపం ఎప్పుడూ అంటదు. సర్వప్రాణుల్లోనూ ఉండే భగవంతుడికి ద్వేషంకాని విరోధంకాని ఎవరిమీదా, ఎప్పుడూ ఉండదు.

**అలుకనైన, చెలిమినైన, కామంబున**
**నైన బాంధవముననైన, భీతి**
**నైన, తగిలి తలప నఖిలాత్ముడగు హరి**
**జేరవచ్చు వేఱుసేయదతడు.**

కోపం, కోరిక, స్నేహం, మోహం, పగ, ప్రీతి, భీతి – ఇలా ఏ భావనలోనైనా హరిని ఏమరకుండా స్మరిస్తే సర్వభూతాత్ముడైన ఆయన సన్నిధి లభిస్తుంది.

తుమ్మెద ఒక పురుగును తెచ్చి దానిచుట్టూ ఝుంకారం చేస్తూ తిరుగుతూ ఉంటుంది. అలా స్మరణద్వారా శ్రీహరి సారూప్యం పొందవచ్చు.

అధికమైన కామంతో గోపికలు, భయంతో కంసుడు, తీవ్రమైన పగతో శిశుపాల దంతవక్త్రుల వంటి రాజులు, బంధుత్వంతో యాదవులు, ప్రేమతో పాండవులైన మీరు, భక్తితో మావంటి మహర్షులు శ్రీహరినామ స్మరణచేసి ఆయన అనురాగానికి పాత్రులయ్యాం. కనుక ఏవిధంగానైనా నిరంతర స్మరణం వల్ల విష్ణుసాయుజ్యం పొందవచ్చని ధర్మరాజుకు నారదుడు చెప్పాడు.

జయవిజయులనే వైకుంఠ ద్వారపాలకులే సనకస్సనందనాది మునులశాపంవల్ల పాండవుల పినతల్లుల కుమారులుగా మూడవ జన్మలో పుట్టారని నారదుడు తెలిపాడు.

## హిరణ్యకశిపుడు

జయవిజయులు తొలిజన్మలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించారు. హిరణ్యాక్షుడు యజ్ఞవరాహమూర్తి అయిన విష్ణువుచేత సంహరింపబడ్డాడు. ఆ వార్త విన్న హిరణ్యకశిపుడు దుఃఖాన్ని దిగమింగి సభాస్థలిలో దానవ ప్రముఖుల్ని ఉద్దేశించి –

**దానవయోధులారా! మీరు నా సోదరుడి మరణవార్తను విన్నారు. దేవతలకు పక్కలో బల్లెంలా జీవించిన మహావీరుడు అతడు. అంతటివాణ్ని చంపిన శత్రువును**

**సంహరించడానికి వెళ్తున్నాను. అతడి రక్తంతో నా సోదరుడికి తర్పణం వదులుతాను. విష్ణువును సంహరిస్తే దేవేంద్రాది దేవతలందరూ యుద్ధంలో నశిస్తారు. విష్ణువే వాళ్లందరికీ ఆధారం. ప్రాణం.**

**కనుక విప్రులున్న ప్రదేశాలకు వెళ్లండి. యజ్ఞాలు, జపతపాలు, వేదాధ్యయనాలు, వ్రతాలు ఆచరించే వాళ్లందరినీ వెతికి వెతికి చంపండి. విష్ణువే యజ్ఞం. అతడే వేదం. అతడే వైదిక కర్మకాండకు మూలం. దేవతా సమూహాలకు, మునులకు, పై తృకలోకాలకు, సర్వధర్మాలకు అతడే నెలవు. గోవులు, విప్రులు సుఖించే జీవించే చోట్లను, వేదధర్మాలు ఆశ్రమ నియమాలు క్రమబద్ధంగా నడిచే స్థలాలను ధ్వంసం చెయ్యండి.**

అని కఠినంగా ఆదేశాలను జారీచేశాడు. అతడి ఆదేశానుసారం రాక్షసులు అన్నింటినీ ధ్వంసం చెయ్యసాగారు.

తర్వాత హిరణ్యాక్షుడు తన సోదరుడి కుమారుల్ని ఓదార్చి హిరణ్యాక్షుడి భార్యల్ని, తమ తల్లి దితిని రప్పించి ఊరడించాడు. తర్వాత తన తల్లి దితితో ప్రాణికోటి జనన మరణాల గురించి చెప్పి తన సోదరుడు వీరమరణం పొందాడని, ప్రకృతి ధర్మమైన మరణం గురించి దుఃఖించరాదన్నాడు.

**పుట్టుక, వినాశం, శోకం, వివేకం, చింత, స్మరణం అనేవి అనేకవిధాలు. ఈ పరమార్థాన్ని వివరించడానికి పెద్దలు ప్రేతబంధు యమసంవాదం అనే కథ చెబుతారు** – అని హిరణ్యకశిపుడు సుయజ్ఞోపాఖ్యానాన్ని చెప్పాడు.

## యమధర్మరాజు బోధ

ఉశీనరదేశాధిపతి సుయజ్ఞుడు మరణించగా, అతడి భార్యలు, బంధువులు విలపిస్తున్నారు. అక్కడికి యముడు బ్రాహ్మణబాలుడి రూపంలో వచ్చాడు. అతడు వాళ్లని ఓదారుస్తూ ఇలా బోధించాడు.

దేహం ధరించిన పిదప చావుపుట్టుకలు సహజం. వీటిని రోజూ చూస్తూనే ఉన్నారు కదా! పుట్టిన తర్వాత గిట్టక తప్పదు. మీరు చావు రాని వాళ్లలా చనిపోయినవారి కోసం ఎందుకు ఏడుస్తున్నారు? చావును తప్పించుకోవడం ఎవరికీ సాధ్యంకాదు. ఎక్కణ్ణుంచి వచ్చామో, అక్కడికి వెళ్లక తప్పదు.

చిన్నప్పుడే కీకారణ్యంలో ఉన్నా పరమేశ్వరుడి దయ ఉంటే బ్రతుకుతాం. తల్లి గర్భంలో శిశువుల్ని పోషించేది ఆ కరుణామయుడే కదా! డబ్బును వీధిలో పడేసినా సురక్షితంగా ఉంటుంది. ఇంట్లో భద్రంగా దాచుకున్నా మాయమవుతుంది.



పంచభూతాలలో ఏర్పడిన మనిషి శరీరం భవనం లాంటిది. అందులో ఆత్మపురుషుడు పూర్వకర్మానుసారం ప్రవర్తిస్తాడు. కాలం తీరిపోతే అందులోంచి వెళ్లిపోతాడు. అరణిలో అగ్ని దాగి ఉన్నట్లు, శరీరంలో వాయువు ఉన్నట్లు, తామర తూడులో శూన్యం ఆవరించినట్లు దేహంలో దేహి వేరుగా ఉంటాడు. కాలం దాపురిస్తే ఎంతటి సుగుణవంతుడైనా పోవలసినవాడే.

బాలుడి ఓదార్పు మాటలు విని సుయజ్ఞుని బంధువులు ఆశ్చర్యపోయారు. విశ్వం శాశ్వతం కాదని గ్రహించి శాంతించారు. మహారాజుకు ఉత్తరక్రియలు జరిపి నిష్క్రమించారు.

హిరణ్యకశిపుడు పై మాటలద్వారా తమ బంధువుల్ని ఓదార్చాడు.

## ఉగ్రతపం – బ్రహ్మవరం

హిరణ్యకశిపుడు మందర గిరి చరియలపైకి వెళ్లి, కాలి బొటనవేలుపై నిలబడి, రెండు చేతులు సాచి ఆకాశం వంక చూస్తూ కఠోర తపస్సు మొదలుపెట్టాడు. కఠిన నియమాలతో, ఉగ్రతపః ప్రభావంతో భూమి కంపించడం, గ్రహతారాగణాలు చిందరవందర కావడం, ప్రాణికోటి తపించడం జరిగింది. దేవతలు మొరపెట్టుకోగా బ్రహ్మ హిరణ్యకశిపుడి ఎదుట సాక్షాత్కరించాడు.

హిరణ్యకశిపుడు బ్రహ్మవద్ద ఇలా వరం అడిగాడు. **గాలిలో కాని, ధూళిలోకాని, నింగి, నేల, నిప్పు, నీరు, దిక్కులు, మూలలు, పగలు, రాత్రి, చీకటి వెలుగులలోకాని, రాక్షసులు, దేవతలు, మృగాలు, నాగులు** – ఇలా దేనితోను తనకు చావు కూడదన్నాడు. పితామహుడు కటాక్షించాడు.

## రాక్షసుల విజృంభణ – దేవతల ఆక్రందన

వరగర్వంతో విజృంభించి హిరణ్యకశిపుడు యక్ష, భూత, ప్రేత, సాధ్య, చారణ, గంధర్వ, కిన్నర, విద్యాధర, దేవతా గణాలను లొంగదీసుకున్నాడు. దేవేంద్ర నగరాన్ని ఆక్రమించి సింహాసనాన్ని అధిష్ఠించి లోక కంటకుడయ్యాడు. దేవతల్ని తన సేవకులుగా నియమించుకున్నాడు. యజ్ఞయాగాదుల్లో హవిర్భాగాలను తానే అందుకున్నాడు. అతడి ఆజ్ఞను శిరసావహించి సూర్యుడు పరిభ్రమించాలి. వర్షాలు కురవాలి.

అతడి క్రూరకృత్యాలు పెచ్చుమీరుతుండగా దేవజాతులన్నీ భయభ్రాంతులకు లోనై, అందరూ కూడి విష్ణువును ప్రార్థించారు. విష్ణువు వాళ్లకి అభయం ఇచ్చాడు.

**శమదమాది సద్గుణ సంపన్నుడైన తన కుమారుడు ప్రహ్లాదుణ్ని హిరణ్యకశిపుడు**

**హింసించినప్పుడు, అతణ్ని అంతమొందిస్తాను** అని దేవతలకు చెప్పి అంతర్ధానమయ్యాడు.

**ప్రహ్లాదుడు మూర్తీభవించిన హరిభక్తి**

హిరణ్యకశిపుడికి అనుహ్లాద, హ్లాద, ప్రహ్లాద, సంహ్లాదులనే నలుగురు కుమారులు. వాళ్లలో ప్రహ్లాదుడు హరిభక్తుడు. సమస్త ప్రాణుల్ని తనలా చూసేవాడు. పరస్త్రీలను కన్నతల్లిలా పరిగణించేవాడు. పెద్దలు ఎదురైనప్పుడు నమస్కరించే వినయశీలి. దీనులకు తల్లీ, తండ్రీ అన్నీ తానుగా ఉంటూ ఆదరించే ఆర్ద్ర మనస్కుడు. స్నేహితుల్ని సోదరుల్లా భావించి, గురువుల్ని దైవంలా కొలిచేవాడు. హాస్యానికైనా అబద్ధం చెప్పనివాడు.

రూపం, విద్య, సంపద మొదలైనవి అపారంగా ఉన్నా గర్వంలేనివాడు. ఎల్లప్పుడూ హరిచింతన గలవాడు. రాక్షస విరోధులు దేవేంద్రాదులు సైతం అతడి సద్గుణాలను చూసి కీర్తించేవాళ్లు.

ప్రహ్లాదుడు వైఖరి హిరణ్యకశిపుడికి విలక్షణంగా, విపరీతంగా అన్పించింది. **వీడు స్వర్గాధిపత్యాన్ని కూడా లెక్కచెయ్యడు. దుర్బలుడిగా సోమరిగా ఉంటున్నాడు. బహుశా చదివిస్తే బాగుపడతాడేమోనని** ప్రహ్లాదుణ్ని తన వద్దకు పిలిపించి ఇలా అన్నాడు.

**చదువని వాడజ్ఞుండగు; చదివిన సదసద్వివేక చతురత గలుగున్**
**చదువగ వలయును జనులకు; చదివించెద నార్యులొద్ద చదువుము తండ్రీ!**
**(180)**

మంచి, చెడ్డలు గ్రహించే నైపుణ్యం కోసం, శుక్రాచార్యుడి పుత్రులైన చండుడు, అమర్కులనే వాళ్లని రప్పించి, వాళ్లకి తన కుమారుణ్ని అప్పగించాడు. గురుసేవలో జాగ్రత్తగా మసలుకుంటూ, వాళ్లు చెప్పే విషయాలను గ్రహిస్తూ ఉన్నా, మనస్సు శ్రీహరిమీదే లగ్నమై ఉండేది. ఎవరు ఏమిచెప్పినా వినడమే కాని వాదనలకు దిగేవాడు కాదు.

కొంతకాలం గడిచింది – హిరణ్యకశిపుడు కుమారుణ్ని రప్పించాడు. అతణ్ని దగ్గరగా తీసుకొని, తల నిమిరి, శిరస్సును ఆఘ్రానించాడు.

హిరణ్యకశిపుడు **కొడుకుల మాటలు సంతోషాన్ని కలిగిస్తాయి. నువ్వు గురువుల వద్ద చదివిన దాన్ని కొంత వినిపించు** అన్నాడు.

ప్రహ్మాదుడు – తండ్రీ! **ఈ భూమిపై జన్మించిన జనులు సంసారం అనే చీకటి నూతిలో పడి బయటపడలేకున్నారు. మీరు వేరు మేము వేరు. అనే భ్రమతో బ్రతుకుతున్నారు. ఇదంతా భగవంతుడి లీలావిలాసం అని గ్రహించలేకున్నారు. అలా గ్రహించి విష్ణువును తలచుకుంటూ అడవిలో నివసించినా మంచిదే** అన్నాడు.



ప్రహ్లాదుడి శత్రుకీర్తన విని హిరణ్యకశిపుడు ఆశ్చర్యంతో – కుమారా! **ఈ భావాలన్నీ నీ అంతట నీవు చెబుతున్నవి కావు. లోకంలో పెద్దలు ఏం చేస్తే పిల్లలు వాటినే అనుకరిస్తారు. ఈ అవివేకాన్ని నీకు ఎవరు కలిగించారు. విష్ణువు మనకు ప్రధానమైన శత్రువు. అతడి పేరు ఈ రాజ్యంలోనే** విన్పించకూడదని శాసించాను.

**విష్ణుభక్తుల్ని శాసించడం, మునిగణాలను బాధించడం. యజ్ఞయాగాదుల్ని ధ్వంసం చెయ్యడం, ఇవే దైత్యుల కర్తవ్యం. బుద్ధిమాలి శత్రువును స్మరించి చెడిపోకు –** అని మందలించాడు.

ప్రహ్లాదుడు – **పరమాత్మను తెలుసుకునే విషయంలో బ్రహ్మాదులు కూడా అసమర్థులే. అటువంటప్పుడు సామాన్యులు గ్రహించడం సాధ్యంకాదు కదా! నాకెవ్వరూ హరిభక్తిని బోధించలేదు. ఇనుము అయస్కాంతం వైపు ఆకర్షింపబడినట్లు నా మనస్సు హరివైపే ఆకర్షింపబడుతూంది.**

మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు?
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు?
లలితరసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు?
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు?
అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్తమేరీతి నితరంబు నేరనేర్చు?
వినుత గుణశీల! మాటలు వేయునేల?

**మందార పుష్పంలోని తేనె తియ్యదనాన్ని ఆస్వాదించే తుమ్మెద ఉమ్మెత్తపూలవైపు వెళుతుందా? స్వచ్ఛమైన గంగానదీ తరంగాల మీద విహరించే రాజహంస పిల్లకాలువవైపు మొగ్గు చూపుతుందా? లేలేత మావిచిగురును తిని పరవశించే కోయిల కొండ మల్లెల చెంతకు వెళ్లగలదా? పున్నమినాటి చంద్రకిరణాలను గ్రహించే చకోరపక్షి దట్టమైన మంచువైపు చూపు మరల్చుతుందా? అలాగే నారాయణ పాదపద్మాలనే అమృతం తాగడంలోనే ఆనందం పొంది, మత్తెక్కిన నా మనస్సు ఇతర విషయాల వైపు వెళ్లడం లేదు.**

ఈ మాటలు విన్న గురుపుత్రులు అదిరిపడి – **చిన్నవాడివి. పెద్దపెద్ద మాటలంటున్నావు. మేము చెప్పిన విషయాలు వదిలిపెట్టి ప్రభువువద్ద మాకు తలవంపులు తెస్తున్నావు. గర్భశత్రువును స్మరిస్తున్నావు** – అని ప్రహ్లాదుణ్ని మందలించి హిరణ్యకశిపుడితో – **మాకు మరో అవకాశం ఇవ్వండి. దానవనీతిని బోధించి ఇతణ్ని సక్రమమార్గంలో పెడతాం.** అని తమతోబాటు ప్రహ్లాదుడిని తీసుకువెళ్లి ఇతర బాలురితో కలవనీక ఏకాంతంలో – నీతిశాస్త్రం, పురుషార్థాలు, సామదానభేదదండోపాయాలు మొదలైనవాటిని నేర్పారు.

తమ ప్రయత్నం ఫలించిందని నమ్మకం కుదిరిన తర్వాత మహారాణి వద్దకు పంపి చక్కటి దుస్తులు, భూషణాలతో అలంకరింపజేసి ప్రహ్లాదుణ్ని హిరణ్యకశిపుడు వద్దకు తీసుకువెళ్లారు. దారిలో – **నాయనా! ఇప్పటికైనా బుద్ధిమరల్చుకొని మేము నేర్పిన విద్యలను మీ తండ్రికి విన్పించి మా మర్యాదను నిలబెట్టు** – అన్నారు.

## చదువుల సారం

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ని దగ్గరకు తీసుకొని, తన తొడపై కూర్చోబెట్టి, శిరస్సును ముద్దాడి వెన్ను నిమురుతూ – **ప్రహ్లాదా! మీ గురువులు నీకు నేర్పిన విద్యావిశేషాలను వినిపించు. ఇంతకాలం ఏయే శాస్త్రాలు చదివావో అన్నీ వివరించు** – అన్నాడు.

ప్రహ్లాదుడు – **నాన్నా! గురువులు చక్కగా చదివించారు. ధర్మార్థశాస్త్రాలు, తక్కిన సమస్త శాస్త్రాలు చాలా చదివాను. అన్ని చదువుల్లోని సారాన్ని, రహస్యాన్ని గ్రహించాను.**

**సఖ్యం, శ్రవణం, దాస్యం, వందనం, అర్చనం, సేవనం, ఆత్మనివేదనం, కీర్తనం, చింతనం** – అనే తొమ్మిదిరకాల భక్తిమార్గాలను పాటించి మనస్సు, వాక్కు, క్రియలద్వారా ఒకేవిధంగా ప్రవర్తించడం, శ్రీహరిని నమ్ముకొని మంచివాడుగా ఉండటం అన్నింటికన్నా శ్రేయస్కరం అన్పించింది. ఇది తప్ప మరోసత్యం నాకు గోచరించలేదు.

హరిభక్తి లేకుండా సంసార వలయంలో పడటం అన్నది – గుడ్డివాడికి వెన్నెల, చెవిటివాడికి శంఖారావం, మూగవాడితో మంచి గ్రంథాలను చదివించడం, నపుంసకుడికి అందమైన కన్యనిచ్చి పెళ్లిచేయడం, కృతఘ్నుడితో బంధుత్వం, బూడిదలో పోసిన హవ్యం, లోభివద్ద ధనం, పంది ముందు మంచి గంధాన్ని ఉంచడం – వంటిది.

తండ్రీ! శ్రీహరిని అర్చించే చేతులే చేతులు. శ్రీనాథుణ్ని కీర్తించే నాలుకే నాలుక. దేవరక్షకుణ్ని చూసే కళ్లే కళ్లు. శేష శయనుడికి మొక్కే తలే తల. విష్ణుకథల్ని వినే చెవులే



చెవులు. మధువైరిలో లగ్నమైన మనస్సే మనస్సు. భగవంతుణ్ని ప్రదక్షిణం చేసే పాదాలే పాదాలు. పురుషోత్తముడిపై లగ్నం చేసిన బుద్ధే బుద్ధి. దేవదేవుడి గురించి ఆలోచించే రోజే మంచిరోజు. చక్రధరుణ్ని తెలియజెప్పే చదువే చదువు. గోవిందుణ్ని గురించి చెప్పే తండ్రే తండ్రి.

శ్రీపతిని సేవించని శరీరం శరీరం కాదు. కేవలం గాలినింపిన తోలుతిత్తి. వైకుంఠుణ్ని స్తుతించని నోరు ధమధమమని మోగే ఢక్కమాత్రమే. హరిపూజ చెయ్యని చెయ్యి కొయ్యతో చేసిన తెడ్డు. కేశవుణ్ని చూడని కళ్లు గోడకున్న రెండు రంధ్రాలు. చక్రిని ఆలోచించని జన్మజన్మ కాదు. కేవలం నీటి బుడగ. విష్ణుభక్తిలేని పండితుడు ద్విపాదపశువు.

శ్రీహరిధ్యానమనే గాలిమాత్రమే సంసారమనే కారుమబ్బుల్ని చెదరగొట్టగలవు. హరిసేవామృతం లేకపోతే తాపత్రయ దావాగ్ని చల్లారదు. విష్ణుచింతన అన్న బడబాగ్నిలోనే పాపమనే సముద్రాలు ఎండుతాయి. నారాయణ స్తోత్ర సూర్యకిరణాలు ఆపదలనే చీకట్లను పోగొట్టగలుగుతాయి. హరిభక్తి అనే అంజనం లేకపోతే నిర్మల, నిరుపమానమైన ముక్తి అనే పెన్నిధి కన్పించదు.

## హిరణ్యకశిపుడి ఆగ్రహం

ఇలా ప్రహ్లాదుడు తన్మయత్వంతో చెబుతుంటే హిరణ్యకశిపుడు ఆగ్రహంతో గురుపుత్రులవైపు చూసి – **మీరు నేర్పిన శాస్త్రజ్ఞానం ఇదా! మీరు నిజమైన బ్రాహ్మణులు కారు. కుటిల వర్తనులు. ద్రోహం తలపెట్టిన దుర్మార్గుల్ని రోగాలు పట్టిపీడిస్తాయి** – అని మండిపడ్డాడు.

గురుపుత్రులు వినయంగా ఇలా అన్నారు.

**రాజా! ఇవి మేము బోధించినవి కావు. తరతరాలుగా మేము మీకు గురువులం. నీ ఇష్టానికి వ్యతిరేకంగా మేము ప్రవర్తించం. విరోధి కథల్ని మేము చెప్పలేదు. నీ పాదాలమీద ఆన. ఇది అతడికి సహజంగా పుట్టిన బుద్ధి. కనుక తగిన ప్రతిక్రియ ఆలోచించు.**

హిరణ్యకశిపుడు తీవ్రస్వరంతో కొడుకును **ఈ విషయాలు నీకు ఉపాధ్యాయులు చెప్పలేదు. నా కొడుకువైన నీకు ఈ పాడుబుద్ధులు ఎలా వచ్చాయి? ఎవరు నేర్పారు? వాళ్లెవరో చెప్పు** – ప్రశ్నించాడు.

ప్రహ్లాదుడు వినయంగా సమాధానం ఇచ్చాడు.

**నాన్నా! కొందరు చిమ్మచీకటిలో పడి కోరికలు కలిగినవాళ్లై చస్తూ, పుడుతూ ఈ సంసార చక్రంలో పరిభ్రమిస్తుంటారు. అటువంటి మూర్ఖులకు శ్రీహరిపై భక్తిపుట్టదు.**

**ఇతరులు బోధించినా కలుగదు. ఆశచూపినా భక్తి ఏర్పడదు. గుడ్డివాడు మరొక గుడ్డివాడి చెయ్యిపట్టుకొని వాడి సాయంతో ఏ వస్తువునూ చూడలేడు. అలాగే కర్మబద్ధులై కర్మవాదుల వెంట వెళ్లేవారికి శ్రీహరి దర్శనభాగ్యం కలుగదు. విష్ణుభక్తుల పాదధూళి తలమీద దాల్చిన పుణ్యాత్ములు ఆ స్వామిని కళ్ళారా చూడగలుగుతారు.**

**అన్ని శాస్త్రాలు చదివాను. అన్ని కథల్ని తరచి చూశాను. ఈ సంసారం భయంకర సాగరం వంటిది. సంసార సముద్రంలో ఆలుబిడ్డలు తిమింగలాలు. కామక్రోధమదమాత్సర్యాలు పొంగిపొర్లే కెరటాలు. ఇటువంటి ఘోరసముద్రాన్ని దాటాలంటే హరిభక్తి అనే నౌక ద్వారా మాత్రమే సాధ్యం. ఇతర ఆలోచనలు, చదువులు పనికిరావు.**

ఈ మాటలు విన్న హిరణ్యకశిపుడు ఆగ్రహం కట్టలు తెంచుకున్నవాడై – **ఓరీ! నీ పినతండ్రిని చంపిన వాడిమీద ద్వేషం వహించకపోగా వాణ్నే కీర్తిస్తూ వంశానికి కళంకం తెస్తున్నావు. తండ్రిని ద్వేషించే వీడు పుత్రరూపంలో పుట్టిన రోగం. వీణ్ని ముక్కలు ముక్కలు చెయ్యండి. శరీరంలో ఒక అవయవం పాడయితే దాన్నికోసి ఇతర అవయవాల్ని రక్షించే వైద్యుడిలా ఈ ద్రోహిని చంపి వంశప్రతిష్ఠను కాపాడుతాను** – అని భటులను ఆజ్ఞాపించాడు.

## హింసా ప్రయోగం – భక్తికవచం

భయంకర ఆకారం దాల్చిన రాక్షసయోధులు సింహగర్జన చేస్తూ ప్రహ్లాదుణ్ని ఈడ్చుకుపోయి మండుటెండలో పదునైన  శూలాలతో పొడిచారు. తీవ్రంగా కుమ్మారు. ఎంతగా కుళ్లబొడిచినా శరీరం మీద గాయం ఏర్పడలేదు. రక్తపుబొట్టు కింద పడలేదు. ఒక్కసారి కూడా బాధతో అరవలేదు. నారాయణ నామసంకీర్తన మాత్రమే చేస్తున్నాడు. తర్వాత ఏనుగులచేత తొక్కించారు. పాములచేత కరిపించారు. మండుతున్న పాత్రల్లో పడవేశారు. సముద్రంలో పడవేశారు. కుంభవృష్టిలో, మండుటెండలో, మంచుకొండలపై నిలబెట్టారు. చండప్రభంజనానికి ఎదురు నడిపించారు. గోతిలో పాతిపెట్టారు. అన్నం, నీళ్లు ఇవ్వక మాడ్చారు. కొరడాలతో కొట్టారు. గదలతో మోదారు. ఇంత చేసినా చిరునవ్వుతో శ్రీహరినే ధ్యానిస్తూ ఉన్నాడు.

ఈ వార్తలు విన్న హిరణ్యకశిపుడి గుండెలో దడ మొదలయింది. **వీడు నా పాలిట మృత్యువై ఉంటాడు** – అనుకుంటూ తలవాల్చి కూర్చున్నాడు.

గురుపుత్రులు అది గ్రహించి – **ప్రభూ! మీరు దిగులుపడకండి. ముల్లోకాలలో మీవంటి యోధుడు లేడు. సమస్త చరాచరాలు మీకు తలవంచాయి. విచారించకండి. ఎంతటివారైనా వృద్ధసేవ, గురువుల ప్రబోధం తెలివితేటలు కలిగిస్తాయి. గురుదేవులు**



**శుక్రాచార్యులు తిరిగివచ్చేటప్పటికి ఇతడు పూర్తిగా గుణవంతుడవుతాడు** అని అన్నారు.

హిరణ్యకశిపుడు – **వీడికి మళ్లీ నీతిశాస్త్రం నేర్పండి. ఎలాగైనా వీణ్ని దేవతలవైరిగా మార్చండి** – అని ఆదేశించాడు.

## భక్తి బోధ

గురుపుత్రులతో ఆశ్రమానికి వచ్చిన ప్రహ్లాదుడు ధర్మార్థకామ శాస్త్రాలను అభ్యసిస్తూ, గురుసేవను భక్తిశ్రద్ధలతో చేశాడు. చిత్తం ఎల్లప్పుడు విష్ణువు మీదే లగ్నం చేశాడు.

గురువులు గృహకృత్యాలు, జపతపాలు చేసుకోవడానికి వెళ్లిన సమయంలో, తోటి రాక్షసబాలురు ఆడుకుంటూ, తమతో ఆట్లాడడానికి రమ్మని ప్రహ్లాదుణ్ని పిలిచారు. అప్పుడు వాళ్లతో నేర్పుగా ప్రహ్లాదుడు సంభాషించాడు.

మిత్రులారా! గురువులు మనకు బోధించే ఒక్క చదువూ మంచిది కాదు. సంసార భోగవిషయాలే చెబుతున్నారు. జన్మసార్థకతను కలిగించే విషయాలు చెప్పడం లేదు. లోకంలో మనకంటే చిన్నవాళ్లు కూడా మరణించడం చూస్తున్నాం కదా! అయనా జీవితం శాశ్వతమని భ్రమపడుతున్నాం.

ధర్మాలు ఆచరించగల మనిషి జన్మ పొందటం దుర్లభం. మనిషి ఆయుస్సు నూరేళ్లు మాత్రమే. అందులో సగం కాలం నిద్రలో వ్యర్థమవుతుంది. మిగిలిన యాభై ఏళ్లలో పసివాడిగా, బాలుడిగా ఇరవై సంవత్సరాలు గడిచిపోతాయి. ఇక మిగిలిన ముప్పై సంవత్సరాలు మనిషి ఇంద్రియ సుఖాలకు వశమై కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాలు అనే బంధాలలో చిక్కుకొని పతనమవుతాడు.

డబ్బు, బంగారు, వాహనాలు, పాడిపంటలు – మొదలైన ఐహికబంధాలలో కూరుకుపోయి, వాటికోసం అనర్థాలకు పాల్పడతాడు. చిన్న పురుగు సాలీడు గూటిలో చిక్కుకొని బయటకి రాలేనట్లు, మనిషి ఈ బంధాల్లోనుంచి బయటికి రాలేకపోతాడు. మనిషిగా పుట్టినప్పుడే బుద్ధిబలంతో భక్తి ధర్మాలను ఆచరించాలి. అజ్ఞానం కలిగించే సంసార సాగరంలో పడటంకంటే జన్మరాహిత్యాన్ని కలిగించే శ్రీహరి పాదసేవ ఉత్తమం. మునులు, ఋషులు కూడా సాధించలేని ఉన్నతపదం పొందడానికి నారాయణుడి పాదసేవే శరణ్యం.

పరమేశ్వరుడు అనుభవం చేత మాత్రమే తెలుసుకోగల ఆనంద స్వరూపుడు. అందువల్ల మనం అన్ని ప్రాణులమీద దయాదాక్షిణ్యాలు కలిగి ఉండాలి. శ్రీహరి చరణ కమల స్మరణమనే అమృతరసం తాగి పరవశులం కాగలిగితే మనకు ఆ దేవుడి దయవల్ల

ధర్మార్థకామాలు అనాయాసంగా లభిస్తాయి. ఇటువంటి తత్త్వవిషయాలను ఎన్నింటినో ప్రహ్లాదుడు రాక్షస బాలురికి బోధించసాగాడు.

అప్పుడు రాక్షస బాలురు – **మనం చిన్నప్పటి నుంచి కలిసే ఉన్నాం. మరొక గురువు లేడు. మనం ఎక్కడికీ వెళ్లలేం. మరి నీకు ఈ ఆత్మజ్ఞానాన్ని బోధించింది ఎవరు?** – అని ప్రశ్నించారు.

## గర్భంలో తత్త్వ విద్యార్జన

ప్రహ్లాదుడు – పూర్వం మా తండ్రి ఉగ్రతపం చెయ్యడానికి మందర పర్వతం వెళ్లాడు. దేవేంద్రుడు దానవుల్ని హింసించి, మా తల్లిని బంధించి తీసుకువెళ్తున్నప్పుడు నారదుడు ఎదురువచ్చి – **దేవేంద్రా! నీ పగ రాక్షస రాజుతో మాత్రమే. ఈ గర్భవతిపై నిర్బంధం ఎందుకు? ఈమెను నాతో ఆశ్రమానికి తీసుకువెళ్తాను** – అన్నాడు.

**నారదమహర్షీ! ఈమె గర్భంలోని శిశువు దేవతలకు శత్రువుగా పరిణమిస్తాడేమో!** – అని సందేహం వెలిబుచ్చాడు దేవేంద్రుడు.

నారదుడు – **ఈమె గర్భంలోని బాలుడు నారాయణ చరణసేవారతుడౌతాడు, నీకు భయంలేదు** – అని మా తల్లిని వెంట తీసుకువెళ్లాడు.

మా అమ్మ మహర్షిని సేవిస్తూ, ఆశ్రమ నియమాలకు తగినట్లు జీవిస్తున్న రోజుల్లో నారదుడు ధర్మతత్త్వం, జ్ఞానమార్గం ఉపదేశించాడు. ఆమె అంతా విన్నా ఆ విషయాలపట్ల మనసును సూటిగా నిలపక మరిచిపోయింది. నారదమహర్షి అనుగ్రహం వల్ల, దైవయోగం వల్ల నేనన్నింటినీ గుర్తుంచుకున్నాను. నారదుడు చెప్పిన వేదాంతాన్ని తెలుసుకోవడానికి అందరూ అర్హులే. శ్రద్ధగా వినండి.

ఆత్మ శాశ్వతం. దానికి వృద్ధిక్షయాలు లేవు. సంసారం కేవలం స్వప్నం వంటిది. ఎంతమాత్రమూ నిజంకాదు. అన్ని కోరికలూ మనసులోనే పుడతాయి. సమస్త ఫలితాన్ని భగవంతుడికి సమర్పించడం, సజ్జనుల మైత్రి, శ్రీహరి కథాశ్రవణం, వాసుదేవ మననం, నారాయణ సంకీర్తనం, విష్ణుపద ధ్యానం, విరాట్ స్వరూప దర్శనం మొదలైనవి జ్ఞానవైరాగ్యాలను కలిగిస్తాయి.

పురుషుడు తన దేహం కోసం భోగాలు కోరుకుంటాడు. కాని దేహం శాశ్వతం కాదు. తనతో వచ్చేదీ కాదు. ప్రాణం పోగానే కుక్కలు, నక్కలు పీక్కుతింటాయి. చేసిన కర్మల్ని బట్టి మళ్లీ మళ్లీ పుడుతూ ఉండాలి.

భగవంతుడు గాఢమైన భక్తికి చిక్కినట్లు, దాన వ్రతాలకు, శౌచశీలాలకు, జపతపాలకు, నియమనిష్ఠలకు చిక్కడు. భక్తి ఒక్కటే ఆయనను పొందే మార్గం. విష్ణువును



మెప్పించడానికి భక్తి చాలినట్లు బ్రాహ్మణత్వం, దేవత్వం చాలదు. శాంత స్వభావమూ సరిపోదు.

ఈ కొరగాని చదువులు మానండి. మీ పుస్తకాలను గురువులకు అప్పజెప్పండి. చిత్తాన్ని శ్రీహరికి సమర్పణ చేద్దాం. కైవల్యపదాన్ని అందుకుందాం.

## తండ్రి కొడుకుల సంవాదం

ప్రహ్లాదుడి ప్రబోధంతో రాక్షసబాలురు తమ చదువుల్ని ఆపేశారు. గురువులు ఆ విషయాన్ని హిరణ్యకశిపుడికి తెలియజేశారు. తీవ్ర ఆగ్రహంతో ప్రహ్లాదుణ్ని హిరణ్యకశిపుడు రప్పించాడు.

**నా ఆజ్ఞలేకుండా విశ్వంలోని ఏ పదార్థమూ చలించదు. ఇంద్రాది దేవతలు నాకు దాసులు. యముడు, దిక్పాలకులు, యక్షగంధర్వ, కిన్నర, విద్యాధరులు ఎవరైనా నా ఆజ్ఞకు లోబడినవారే. నువ్వేకాక నీ తోటి రాక్షసబాలురినీ చెడగొడుతున్నావు. వంశానికి కళంకం తెచ్చావు. నిన్ను చంపి కులానికి పట్టిన మచ్చను మాపుకుంటాను. దిక్కులన్నీ నేనే గెలిచాను. దిక్కుల్ని పాలించే ఇంద్రాదులే దిక్కులేక నన్నే దిక్కుగా తలచి మొక్కుతున్నారు. ఇక నీకు దిక్కెవ్వడు**– అని హిరణ్యకశిపుడు గద్దించాడు.

ప్రహ్లాదుడు –

దిక్కులు కాలముతోనే
దిక్కన లేకుండు కలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేనివారికి
దిక్కయ్యెడువాడు నాకు దిక్కుమహాత్మా! (265)

తండ్రీ! దిక్కులకు, కాలానికీ అతీతుడు ఎవ్వడో, దిక్కులకు దిక్కైన వాడెవ్వడో, ఆధారం ఉన్న వాళ్లకి, లేనివాళ్ళకి ఆధారం ఎవ్వడో అతడే నాకు దిక్కు.

లోకాలను జయించావు కాని నీలోని ఇంద్రియాలను జయించలేకపోయావు. నిన్ను అరిషడ్వర్గాలు బందీని చేశాయి. వాటిని జయిస్తే నీకు ప్రాణికోటిలో శత్రువులుండరు – అని సమాధానం ఇచ్చాడు.

హిరణ్యకశిపుడు – **ఎంతకు తెగించావు! చావుకు కూడా సిద్ధమయ్యావు. విష్ణువు సేవకుడిలా పొగుడుతున్నావు. నిన్నూ, నీ శ్రీహరిని చంపుతాను. ఎక్కడున్నాడు నీ హరి! చూపించు** – అన్నాడు.

ప్రహ్లాదుడు ఆనందంతో నృత్యం చేశాడు.

విష్ణువు లేని చోటు లేదు. సముద్రంలో, సమీపంలో, ఆకాశంలో, భూమిమీద, అగ్నిలో, అన్ని దిక్కుల్లో, రాత్రిలో, పగటిలో, సూర్యచంద్రుల్లో, ఓంకారంలో, త్రిమూర్తుల్లో, స్త్రీపురుష నపుంసకులైన వ్యక్తుల్లో, అక్కడా ఇక్కడా అని వెదకడం ఎందుకు?

**ఇందుగలడందు లేడని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం**

**డెందెందు వెదకిచూచిన, నందందే కలడు దానవాగ్రణీ! వింటే!** (275)

ఒకచోట ఉన్నాడని, ఒకచోట లేడని సందేహించవద్దు. ఆయన అన్నిచోట్లా ఉన్నాడు. ఎక్కడ వెదికినా అక్కడే కన్పిస్తాడు – అని ప్రహ్లాదుడు విష్ణువు సర్వవ్యాపకత్వాన్ని తెలియజేశాడు.

అప్పుడు హిరణ్యకశిపుడు ఎదురుగా ఉన్న స్తంభాన్ని చూపి **ఈ స్తంభంలో నీ చక్రిని చూపగలవా?** అని హూంకరించాడు.

**నిస్సందేహంగా** అన్నాడు ప్రహ్లాదుడు.

హిరణ్యకశిపుడు ఆ స్తంభాన్ని అరచేతితో గట్టిగా కొట్టాడు.

## శ్రీనరసింహస్వామి ఆవిర్భావం – అసుర సంహారం

తండ్రికొడుకులు వాదించుకుంటున్నప్పుడే విష్ణువు శ్రీనరసింహమూర్తి రూపంలో సమస్త చరాచర జీవరాశుల్లో వ్యాపించాడు. ప్రతి అణువులోనూ విస్తరించాడు.

హిరణ్యకశిపుడి దెబ్బకు స్తంభం తునాతునకలయింది. భూనభోంతరాలు దద్దరిల్లాయి. శ్రీనరసింహమూర్తి అవతరించాడు. ఆ అద్భుత దృశ్యంచూసి హిరణ్యకశిపుడు నిశ్చేష్టితుడయ్యాడు. అది నరరూపం, సింహరూపం రెండూ కలిసి ఏర్పడిన శ్రీహరి మాయారూపం.

ఇక్కడ సుదీర్ఘ నరసింహమూర్తి వర్ణనచేశాడు పోతన. హిరణ్యకశిపుడి రూపవర్ణన కూడా చేశాడు.

శ్రీనరసింహస్వామి హిరణ్యకశిపుణ్ని గోళ్లతోపట్టి, తన తొడమీద పెట్టి, గుండెను చీల్చి, నెత్తుటేరులు ప్రవహిస్తుంటే, అతడి పేగుల్ని మెడలో వేసుకున్నాడు.

ఆ సమయంలో స్వామి అగ్నిశిఖలతో, భీకరవదనంతో, విషంకక్కే తాచుపాముపంటి నాలుకతో, రక్తంతో తడిసిన జూలుతో, కంఠసీమలో రాక్షసుడి పేగు మాలికలతో భయానకంగా కన్పించాడు. తమరాజు మరణించడంతో తన పైకి ఆయుధాలతో వచ్చిన రాక్షసులందరినీ వాడిగోళ్లతో చీల్చిపారేశాడు.



ఈవిధంగా **నరరూపం, మృగరూపమూ కాని నరసింహ రూపంలో**, **రాత్రీ పగలూకాని సంధ్యాసమయంలో, గృహానికి  లోపల వెలుపలా కాని ద్వారం మధ్యలో, ఆకాశమూ భూమి కాని తొడమీద, ప్రాణసహితం, ప్రాణరహితం కాని గోళ్లతో బ్రహ్మ ఇచ్చిన వరానికి భంగం కలుగకుండా రాక్షసవధ జరిగింది.** ఆ ఉగ్రనరసింహుని చూడడానికే అందరూ భయపడ్డారు. హిరణ్యకశిపుడి వధకు సంతోషించి దేవతలు పూలవానలు కురిపించారు. అప్సరసలు నాట్యం చేశారు. కాహల భేరీనాదాలు మోగాయి.

బ్రహ్మ, ఇంద్ర, ఈశ్వరులు తమ అనుచరగణంతో వచ్చి ప్రార్థించారు. వేర్వేరుగా స్తుతించారు. ఆయన వదనంలో ఆగ్రహజ్వాలలు చల్లారలేదు. అప్పుడు బ్రహ్మాదులు లక్ష్మిని ఆశ్రయించి స్వామిని ప్రసన్నం చెయ్యమన్నారు. శ్రీదేవి రెండడుగులు ముందుకు వేసి – **నేను ఇటువంటి ప్రళయ భీకర స్వరూపాన్ని ఏనాడూ చూడలేదు. ఆయన శాంతించే వరకు ఇక్కడే ఉంటాను** – అంది.

బ్రహ్మ **ప్రహ్లాదుడు ఒక్కడికే నరసింహమూర్తిని శాంతింపజెయ్యడం సాధ్యం** అన్నాడు. దేవతల అభ్యర్థన మేరకు ప్రహ్లాదుడు స్వామి పాదాలమీద వాలి నుతించాడు. నరసింహమూర్తి శాంత వదనంతో అతణ్ని లేవనెత్తి వెన్నుదువ్వుతుంటే ప్రహ్లాదుడు ఆనందపరవశుడయ్యాడు.

**నువ్వు దానవనాథుడివై – మన్వంతరకాలం సకల భోగాలు అనుభవించు. శుభప్రదమైన బుద్ధితో నా కథలు విను. తర్వాత గొప్ప యశస్సుతో నా సాన్నిధ్యం పొందుతావు** – అని ప్రహ్లాదుణ్ని అనుగ్రహించి, అంతర్ధానం అయ్యాడు.

నారదుడు పై వృత్తాంతాన్ని చెప్పి – **పరబ్రహ్మ స్వరూపుమైన శ్రీకృష్ణుడు నీకు మిత్రుడుగా, బావమరిదిగా, మంత్రిగా, మనస్సుకు నచ్చినవాడుగా, సకలప్రదాతగా నీ ఇంట్లో సంచరించడం నీకు లభించిన మహాభాగ్యం** – అన్నాడు.

## త్రిపురాసుర సంహారం

ధర్మరాజా! ఒకసారి శివుడి కీర్తికి కళంకం తెచ్చే సంఘటనను శ్రీహరి పరిష్కరించాడంటూ త్రిపురాసుర సంహారాన్ని నారదుడు వివరించాడు.

దేవేంద్రాది దేవతల్ని ఎదుర్కోవటానికి దానవులు మాయావి అయిన మయుణ్ని ఆశ్రయించారు. అతడు – కోరిన చోటికి వెళ్లగలిగిన బంగారం, వెండి, ఇనుములతో నిర్మింపబడిన, రాకపోకలు తెలియరానట్టి నగరాలు. రహస్యమార్గాలు, రక్షణ గృహాలున్నట్టి – పురాలను మయుడు తన యోగబలంతో సిద్ధం చేశాడు. వాటిని ఏ శస్త్రాలు భేదించలేవు. అసురులు వాటి మీద బయలుదేరి తమ ఇష్టం వచ్చినట్లు లోకాలను కొల్లగొట్టసాగారు.

ఆ బాధలు భరించలేని దేవతలు శంకరుణ్ని ఆశ్రయించారు. శివుడు దివ్యాస్త్రం సంధించాడు. ఆ దివ్యాస్త్రం నుంచి లక్షల కొలది బాణాలు త్రిపురాలను చుట్టుముట్టింది. ఆ వేడికి రాక్షసులు మరణించారు. మహాయోగి మయుడు తన యోగబలంతో సిద్ధరసం నిండిన కూపంలో మరణించిన అసురుల శవాలను పడవేశాడు. వాళ్లు పునర్జీవితులై, వజ్రాలవంటి శరీరాలతో మరింత బలవంతులయ్యారు. శివుడు తన పరాక్రమానికి కళంకం ఏర్పడిందని, తన కీర్తికి మచ్చ కలిగిందని బాధపడ్డాడు.

అప్పుడు విష్ణువు పాడి ఆవుగా, బ్రహ్మగోవత్సంగా మారి ఆ కూపంలోని సిద్ధరసాన్ని పూర్తిగా తాగేశారు. విషయం గ్రహించిన మయుడు దైవేచ్ఛను ఎవరూ తప్పించలేరని రాక్షసుల్ని ఓదార్చాడు.

విష్ణువు తన సహజశక్తులైన రథం, సారథి, కేతనం, కవచం, ధనుస్సు మొదలైన యుద్ధసామగ్రిని శంకరుడికి సమకూర్చడంతో రథికుడైన శివుడు త్రిపురాలను భస్మం చేశాడు.

## నారదుడి పూర్వజన్మ

ధర్మరాజు అడిగిన మీదట నారదుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర మొదలైన వర్ణాశ్రమ ధర్మాలను; బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసి మొదలైన చతురాశ్రమ ధర్మాలను వివరించాడు.

తన పూర్వజన్మ గురించి ఇలా చెప్పాడు. ఇంతకు ముందు తాను చెప్పిన శూద్రస్త్రీ గర్భంలో జన్మించడానికి కారణమైన పూర్వజన్మ అది. అప్పుడు గంధర్వ వంశంలో ఉపబర్హణుడు అనే పేరుతో జన్మించాడు. అతడి మధుర భాషణ, గంభీర ప్రవర్తన ఆకర్షితులై దగ్గరైన సుందరీమణులతో క్రీడించేవాడు.

ఒకసారి ప్రజాపతులు దేవసత్రం అనే యజ్ఞం చేస్తూ, విష్ణువు గాథల్నిగానం చెయ్యడానికి గంధర్వుల్ని, అప్సరసల్ని ఆహ్వానించారు. అక్కడ విష్ణువు కథల్ని వీనులవిందుగా గానం చేస్తూ మధ్యలో స్త్రీలపై మనస్సు మళ్లించాడు. మోహం పెరిగి, కీర్తన మరిచి, వాళ్ల పొందుకోసం పరుగెత్తాడు.

ఆ కారణంగా ప్రజాపతులు ఆగ్రహించి – ఎటువంటి దివ్యశక్తులూ లేక భూలోకంలో శూద్ర స్త్రీకి జన్మించు – అని శపించారు (ఈ జన్మ గురించి ఇంతకుముందే ప్రస్తావించబడింది.)



## పవిత్ర ప్రదేశాలు

నారదుడు ప్రహ్లాదుడికి అజగరుడనే మునికి జరిగిన సంవాదాన్ని తెలియజేశాడు. ఆ సంవాదంలో పరమహంస ధర్మాలు, వాటి మాహాత్మ్యం చక్కగా వివరించబడ్డాయి. ధర్మరాజుకు పవిత్రప్రదేశాల గురించి వివరించాడు.

ఎక్కడైతే దయా, గుణ, శీల, తపో, విద్యానిధులైన బ్రాహ్మణులు సుఖజీవనం చేస్తుంటారో, ఎక్కడైతే భాగీరథి మొదలైన నదులు ప్రవహిస్తుంటాయో, ఎక్కడైతే హరిసంకీర్తన, పూజలు, పుష్కలంగా జరుగుతుంటాయో ఆ ప్రదేశాలలో ధర్మకార్యాలు నిర్వర్తించాలి.

శ్రీహరి కడుపులో విశ్వం ఉంటుంది. ఆయన సాధుపురుషుల్లో ఉంటాడు. కాల పాత్రల్ని గుర్తించి అవి సంప్రాప్తించిన వెంటనే ధర్మకార్యాలు నిర్వర్తించాలి.

కురుక్షేత్రం, గయ, ప్రయాగ, పులహాశ్రమం, నైమిశం, ఫల్గుణీనదీతీరం, రామేశ్వరం, ప్రభాసతీర్థం, కుశస్థలి, కాశి, మధురాపురి, పంపాసరోవరం, నారాయణాశ్రమం, సీతారామాశ్రమం, మహేంద్ర మలయ పర్వతాలు మొదలైన తీర్థక్షేత్ర పర్వత ఆశ్రమ స్థలాలను; విష్ణువుయొక్క విగ్రహారాధన జరిగే ప్రదేశాలను, విష్ణుభక్తులు నివసించే పుణ్యక్షేత్రాలను తప్పక సేవించాలి. ఆ పుణ్యస్థలాలలో కొద్దిగా ధర్మకార్యం చేసినా శ్రీహరి దయా విశేషాల వల్ల అది వెయ్యిరెట్లు అధిక ఫలాన్నిస్తుంది.

నారదుడి పూర్వజన్మ ప్రస్తావనతో ఈ స్కంధం పూర్తయింది.

---

# ఎనిమిదవ స్కంధం

**ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపలనుండు లీనమై,**
**ఎవ్వనియందు డిందు, పరమేశ్వరుడెవ్వడు, మూల కారణం**
**బెవ్వడనాది మధ్యలయు డెవ్వడు, స్వరము తానయైన వా**
**డెవ్వడు, వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్** (73)

## మనువులు – విష్ణుజన్మలు

పరమాత్ముడైన విష్ణువు ఏయే మనువుల కాలంలో జన్మించాడు? ఏయే లీలల్ని ప్రదర్శించాడు? అందుకు కారణాలేమిటి? – అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఈ స్కంధం కొనసాగుతుంది.

ఆదిమనువైన స్వాయంభువ మనువు కుమార్తెలైన దేవహూతి, ఆకూతి అనేవారికి క్రమంగా కపిలుడు, యజ్ఞుడు జన్మించారు. అందులో కపిలుడి వృత్తాంతం ముందే చెప్పబడింది.

స్వాయంభువుడు తన భార్య శతరూపతో అడవికి వెళ్లి తపస్సు చెయ్యసాగాడు. విష్ణువుపై మనస్సు నిలిపి ధ్యానంలో ఉన్న సమయంలో రాక్షసులు అతణ్ని భక్షించడానికి ప్రయత్నించారు. అప్పుడు యజ్ఞుడిగా ఉన్న విష్ణువు తన చక్రాయుధంతో వాళ్లని హతమార్చాడు.

అగ్ని కుమారుడైన స్వారోచిషుడు రెండవ మనువు. అప్పుడు విష్ణువు విభుడనే పేరుతో వేదశిరుడనే బ్రాహ్మణుడి భార్య అయిన తుషితకు జన్మించాడు. అతడు కుమార బ్రహ్మచారిగా 88వేలమంది మహామునుల అనుగ్రహంతో వ్రతదీక్షాపరుడయ్యాడు.

ప్రియవ్రతుడి కుమారుడు ఉత్తముడు మూడవ మనువయ్యాడు. అప్పుడు సత్యజిత్తనే వాడు దేవేంద్రుడయ్యాడు. విష్ణువు సత్యసేనుడనే పేరుతో ధర్ముడికి సూనృతకు జన్మించి, సత్యజిత్తుకు మిత్రుడై సత్యనిష్ఠతో దుర్మార్గులైన యక్ష రాక్షసుల్ని దండించాడు.

ఉత్తముడి తమ్ముడు తామసుడు నాల్గవ మనువయ్యాడు. ఆ మనువు కాలంలో విష్ణువు హరిమేధుడికి, హరిణికి హరి అనే పేరుతో జన్మించాడు. దయాసముద్రుడై అన్ని



లోకాలకు ప్రభువైన హరి మొసలికి చిక్కిన గజేంద్రుణ్ని విడిపించి ప్రాణాపాయం నుంచి కాపాడాడు.

## గజేంద్ర మోక్షం

**అడవిలో తిరిగే ఏనుగుకు, నీటిలో ఉన్న మొసలికి పోరాటం ఎలా జరిగింది?** అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు సమాధానంగా శుకుడు గజేంద్రమోక్షం గాథను వినిపించాడు.

పాల సముద్రంలో త్రికూటమనే అందమైన పర్వతం ఉంది. అది పదివేల ఆమడల పొడవు, అంతే వెడల్పు, ఎత్తు కలిగి ఉంది. దానికి బంగారు, వెండి, ఇనుము నిండిన మూడు శిఖరాలున్నాయి. (అందుకే దానికి ఆ పేరు.)

సమస్త మృగాలకు నెలవైన ఆ అడవిలో ఒక గజరాజు దైవవశం చేత తన ఏనుగులతో కలిసి మరో దారి మళ్లాడు. తన భార్యలైన ఆడ ఏనుగులతో విహరించి అలసి, దాహంతో ఒక సరోవరం సమీపానికి వచ్చాడు. ఉత్సాహంతో ఏనుగులు అందులో దిగాయి. సరోవరమంతా కలయతిరుగుతూ, స్నానం చేస్తూ, నీళ్లు చిమ్ముకుంటూ ఉండగా రాహువు సూర్యుణ్ని పట్టుకున్నట్లు మడుగులోని మకరి (మొసలి) రాజు కరిరాజును ఒడిసిపట్టాడు.

ఆ రెండూ పెనుగులాడే సన్నివేశాన్ని పోతన ఇలా వర్ణించాడు.

**కరిదిగుచు మకరి సరసికి, కరి దరికిని మకరి తిగుచు కరకరి బెరయన్**
**కరికి మకరి మకరికి కరి, భరమనుచును నతలకుతల భటులరుదు వడన్**(54)

మొసలి ఏనుగును మడుగులోనికి ఈడ్చింది. ఏనుగు మొసలిని గట్టుపైకి లాగింది. రెండూ రోషావేశాలతో ద్వేషాన్ని పెంచుకున్నాయి. ఏనుగుకంటె మొసలి, మొసలి కంటె ఏనుగు బలమైనవి అనుకుంటూ అతలకుతల లోకాలలోని వీరులు ఆశ్చర్యం చెందారు.

వాటిపోరాటం వెయ్యేళ్ల పాటు భీకరంగా సాగింది. ఆడ ఏనుగులు గజరాజును విడిచి వెళ్లలేక, గట్టుపై ఊరక చూస్తూ ఉన్నాయి. అంతకంతకు మొసలిది పై చెయ్యి అయింది. గజరాజు చితికిపోయాడు. పూర్వపుణ్యం వల్ల కలిగిన జ్ఞానం వల్ల భగవంతుణ్ని ప్రార్థించాడు.

ఈ లోకం ఎవరివల్ల పుడుతుందో, ఎవరిలోపల అణిగి ఉంటుందో, ఎవరిలోపల లయం అవుతుందో, ఎవరు పరమాత్ముడో, ఈ విశ్వానికంతటికీ మూలకారణం అయిన వాడెవ్వడో, పుట్టడం, పెరగడం, గిట్టడం లేని వాడెవ్వడో అన్నీ తానే అయిన వాడెవ్వడో అటువంటి ప్రభువును, ఈశ్వరుణ్ని నేను శరణు గోరుతున్నాను.

లోకాలు, లోకపాలకులు, లోకాలలో ఉన్న వాళ్లందరూ నశించిన పిదప, ఆ గాఢాంధకారానికి అవతల అఖండరూపంలో ప్రకాశించే దేవుణ్ని నేను ప్రార్థిస్తున్నాను. ఇలా పెక్కువిధాల భగవంతుణ్ని ప్రార్థించి కొంత అనుమానాన్ని కూడా గజేంద్రుడు వ్యక్తీకరించాడు.

**కలడందురు దీనులయెడ**
**కలడందురు పరమయోగి గణముల పాలన్**
**కలడందురన్ని దిశలను**
**కలదు కలండనెడు వాడు కలడో! లేడో! (86)**

సర్వాంతర్యామి అయిన ఆ దేవాధిదేవుడు తనపట్ల కరుణ చూపడెందుకు? అని దీనంగా విన్నవించాడు. తుదకు సంపూర్ణ శరణాగతిని ప్రకటించాడు.

**ఓ స్వామీ! నాలో శక్తి లవలేశం కూడా లేదు. ధైర్యం కోల్పోయాను. ప్రాణాలు హరించుకుపోతున్నాయి. మూర్ఛవస్తూ ఉంది. శరీరం స్రుక్కింది. అలసట ఆవహించింది. నాకు నువ్వు తప్ప మరో దిక్కులేదు. దీనుడైన నన్ను క్షమించి ఆదుకోవయ్యా. వరాలిచ్చే కరుణామయా! రావయ్యా! వచ్చి కాపాడవయ్యా** – అని మొరపెట్టుకున్నాడు.

బ్రహ్మ మొదలైన వాళ్లకి విశ్వమంతా నిండి ఉన్న గుణం లేనందువల్ల గజరాజు మొరవిన్నా సాయపడలేక మిన్నకుండిపోయారు.

విశ్వమయుడైన విష్ణువు గజరాజును కాపాడాలని నిశ్చయించాడు. ఈ ఘట్టమంతా పోతన నభూతోనభవిష్యతి అన్న తీరులో రచించాడు.

వైకుంఠంలో ఉన్న విష్ణువు గజేంద్రుడి మొర ఆలకించి రక్షించడానికి వేగిరపడ్డాడు – ఆ సంరంభంలో –

**లక్ష్మీదేవికి చెప్పలేదు. శంఖచక్రాలు చేతుల్లోకి తీసుకోలేదు. సేవకుల్ని పిలవలేదు. గరుడవాహనాన్ని సిద్ధపరచలేదు. చెవిలోని తామరదుద్దు వరకు జారిన జుట్టును సవరించుకోలేదు. ప్రణయ కోపంతో వెళ్లబోతున్న లక్ష్మీదేవి కొంగును పట్టుకున్నవాడు దాన్నీ వదలిపెట్టలేదు.**

అలా వెళ్తున్న విష్ణువు వెంట వైకుంఠం అంతా కదిలింది. ఆ దృశ్యం మనోహరం. వర్ణనాతీతం. గగన వీధిలో సాగుతున్న విష్ణువును చూసి అమరులంతా ఆశ్చర్యంతో చేతులు జోడించారు. తలలు వంచి నుతించారు. ఇవన్నీ ఆయన గమనించలేదు.

సరోవరాన్ని సమీపించి సుదర్శన చక్రాన్ని వదిలి మొసలి తలను ఖండించాడు. పాంచజన్యాన్ని పూరించాడు. సాధుజనులకు ఆహ్లాదం కలిగించాడు. తన చేతితో ఏనుగును మడుగునుంచి వెలుపలికి తీసి, నిమిరాడు. దాని తాపం శమించింది.



విష్ణువుచేత ఖండింపబడిన మొసలి, దేవలముని శాపంతో పొందిన రూపాన్ని విడిచింది. నిర్మలమైన శరీరంతో **హూహూ** అనే గంధర్వుడిగా మారి భగవంతుడిని స్తోత్రం చేసి స్వామి అనుమతితో గంధర్వలోకం చేరింది.

మొసలితో పోరాడిన గజరాజు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడనే రాజు. ద్రవిడ దేశాన్ని పాలించిన అతడు గొప్ప విష్ణుభక్తుడు. ఒకనాడు విష్ణువును ఏకాగ్రచిత్తంతో ధ్యానం చేస్తూ మైమరిచి ఉన్నప్పుడు, అగస్త్యుడు అక్కడికి వచ్చాడు. తనకు గౌరవం ఇవ్వలేదని, లేవకుండా ఉన్న అతణ్ని ఏనుగుగా జన్మించమని శపించాడు.

## గజేంద్రమోక్షం – అంతరార్థం

గజేంద్రమోక్ష ఘట్టాన్ని కుండలినీ యోగంతో అన్వయించి చెప్పిన వాళ్లున్నారు.

సాధకుడికి కుండలినీ యోగంలో ప్రవేశం లభించాలంటే మూలాధారం, స్వాధిష్ఠాన భేదనాలు జరగాలి. వాటి విజయాన్ని సాధించాలి. ఈ రెండు చక్రాలు భోగకేంద్రాలు. యోగికి యోగ కేంద్రాలు.

తంత్రశాస్త్రంలో **మూలాధారానికి** ఏనుగును, **స్వాధిష్ఠానానికి** మొసలిని పేర్కొంటారు. ఒకటి **భూచరం,** మరొకటి **జలచరం**. పంచభూతాలలో భూమి, నీరు పై చక్రాలకు ప్రతీకలు. ఏనుగు జీవుడు. జీవుడు భవం (పుట్టుక) అనే తటాకంలో, తన **భార్యలతో** (కోరికలతో) ఈదులాడుతుంటాడు. స్వాధిష్ఠానచక్రం కామానుభవంతో సుఖానుభవానికి ప్రతీకగా ఉంటుంది. ఈ సుఖాలలో జీవుడు చిక్కుకుంటాడు.

జీవుడి ముందరి కాలును **సుఖానుభవాలు** మొసలిగామారి పట్టుకుంటుంది. జీవుడు (ఏనుగు) సుఖానుభవాల (మొసలి) నుంచి తప్పించుకోవాలని పోరాడతాడు.

యుద్ధం మొదలవగానే ఆడ ఏనుగులు (కోరికలు) ఒడ్డుకు చేరి దుఃఖిస్తాయి. కాని పోరాటంలో పాల్గొనవు. పోరాటంలో విజయం సాధిస్తే మగ ఏనుగుతో సుఖాలు అనుభవించవచ్చని నిరీక్షిస్తుంటాయి.

వెయ్యేళ్ల పోరాటం, అంటే అనేక జన్మలుగా సాగుతున్న పోరాటం అది. కాని జీవుడికి విముక్తి కలగలేదు. మొసలి బలం క్రమంగా పెరుగుతుంది.

జీవుడిలో అహంకారం నశించిన తర్వాత భగవంతుడి స్ఫురణ కలుగుతుంది. ఈశ్వర ప్రణిధానం పొందుతాడు.

సుదర్శన చక్రం (అన్నింటినీ సమదృష్టితో చూసే జ్ఞానం) మొసలిని ఖండిస్తుంది. గజేంద్రుడు జీవన్ముక్తుడవుతాడు. యోగాభ్యాసానికి ఈశ్వర ప్రణిధానం ముఖ్యం. చక్రాలలో

స్వాధిష్ఠాన చక్రం బలమయింది. ఈ చక్రాలను జయించాలంటే సాధకుడికి పరమాత్మ కృప అవసరం.

అన్ని లోకాలు, లోకేశులు, లోకాలలో ఉన్న వాళ్లందరూ నశించిన తర్వాత అంటే – ఆజ్ఞాచక్రాన్ని ఛేదించిన తరువాత పెంజేకటి మొదలవుతుంది. (అది పరమాకాశం). దానికి తర్వాత అద్వితీయ పరబ్రహ్మం ఒక్కటే నిత్యం వెలుగుతూ ఉంటుంది.

ఆజ్ఞాచక్రంపైన ఉన్న ఖాళీస్థలం పరమాకాశం. బయటినుంచి చూస్తే తక్కువ ఖాళీస్థలం కన్పిస్తుంది. అంతర్ముఖంగా అత్యంత విస్తారం. ఎల్లలు లేని ఆకాశం.

## క్షీరసాగర మథనం – అమృత కలశోద్భవం

తామస మనువు తమ్ముడు రైవతుడు అయిదవ మనువయ్యాడు. **శుభ్రుడికి, వికుంఠ** అనే అతడి భార్యకు **వైకుంఠుడనే** పేరుతో విష్ణువు జన్మించాడు. అన్ని లోకాల వాళ్లు గౌరవించే విధంగా **వైకుంఠమనే** లోకాన్ని సృష్టించాడు. అతణ్ని **లక్ష్మీదేవి** స్వయంగా పెళ్లాడింది.

ఆ తర్వాత **చక్షువు** కొడుకైన **చాక్షుషుడు.** ఆరవ మనువయ్యాడు. విష్ణువు **వైరాజుకు సంభూతికి అజితుడనే** పేరుతో జన్మించాడు. ఇతడే **కూర్మ**రూపంలో మందర పర్వతాన్ని సముద్రంలో మునగకుండా మోశాడు. క్షీరసముద్రాన్ని చిలికించి దేవతలకు అమృతాన్ని ప్రసాదించాడు.

రాక్షసుల విజృంభణతో దేవతలు ఇక్కట్ల పాలయ్యారు. దిక్కులు తోచక బ్రహ్మదేవుణ్ని ఆశ్రయించారు. సమస్తమూ కోల్పోయి, కాంతి విహీనులై తన వద్దకు వచ్చిన దేవతల్ని చూసి – **అన్నిటికీ మూల పురుషుడైన భగవంతుణ్ని ప్రార్థిద్దాం** – అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ ప్రార్థించగా విష్ణువు ప్రత్యక్షమయ్యాడు.

**మీరు రాక్షసులతో స్నేహభావంతో మెలగండి. ఎలుక కోసం పాముపొంచి ఉండే విధంగా బలం సమకూరే వరకు సమయం కోసం నిరీక్షించాలి. అమృతాన్ని ఉత్పత్తి చెయ్యడానికి ప్రయత్నించండి. పాలసముద్రంలో అనేక రకాలైన తృణాలు, మొక్కలు, తీగలు, ఔషధాలను విరివిగా వెయ్యండి. మందర పర్వతాన్ని కవ్వంగా, సర్పరాజైన వాసుకిని కవ్వపు తాడుగా చేసుకొని రాక్షసుల సాయం తీసుకొని పాలకడలిని చిలకండి** – అని చెప్పి విష్ణువు అంతర్ధానం అయ్యాడు.

బలిచక్రవర్తి పట్ల స్నేహాన్ని, భక్తిని దేవతలు కనబరిచారు. రాక్షసులు దేవతల్ని చంపాలని ప్రయత్నించినా బలి వాళ్లని అడ్డుకున్నాడు.



దేవతలు రాక్షసుల్ని ఒప్పించి, మందర గిరిని ఎత్తారు. ఆ మహాపర్వతం ఊగిసలాడి, కిందికి జారింది. అందులో చిక్కుకొని కొందరు మరణించారు. కొందరు అవయవాలు కోల్పోయారు.

గరుడవాహనుడై వచ్చిన విష్ణువు, దేవదానవుల్ని పాలకడలి వద్దకు వెళ్లమన్నాడు. వాళ్లక్కడికి చేరే సమయానికి మందరగిరి సాగరం మధ్య ఉంది. ఆకాశవీధిలో నారాయణుడు గరుత్మంతుడిపై చిరునవ్వుతో గోచరించాడు.

వాసుకికి అమృతంలో భాగం ఇస్తామని తాడుగా ఉండటానికి ఒప్పించారు. చిలకడం మొదలయింది. రాక్షసులు అహంకారంతో వాసుకి తలవైపు పట్టుకున్నారు. దేవతలు తోకవైపున్నారు. కొండ అడుగున కుదురు లేనందున మందర పర్వతం కిందికి జారింది. మళ్లీ వాళ్లు కొండను పైకెత్తలేకపోయారు.

విష్ణువు మహాకూర్మంగా (తాబేలు) అవతరించి సముద్ర జలంలోదూరి, వాసుకితో పాటు మందర పర్వతాన్ని పైకెత్తాడు.

మహావిష్ణువు లీలలు పరమాద్భుతం. సముద్రాన్ని చిలికేవాళ్లలో ఒకడైన విష్ణువు, సముద్రమనే కడవకు కుదురయ్యాడు. చిలికే కవ్వం, కవ్వానికి చుట్టిన తాడూ తానే అయ్యాడు.

పాలసముద్రంలో మందర పర్వతం కుడిఎడమలకు గిరగిరా తిరిగింది. దానిశబ్దం బ్రహ్మాండం అంతా వ్యాపించింది. పాలసముద్రంలోంచి తొలుత **హాలాహలమనే** మహావిషం పుట్టింది. దేవదానవులు వాసుకిని వదిలిపారిపోయారు. ఈశ్వరుణ్ని ప్రార్థించారు.

శివుడు పార్వతిని ఒప్పించి హాలాహలాన్ని స్వీకరించాడు.

**మింగుతున్నది తన భర్త అని తెలిసి, అది విషమనీ తెలిసి, అందువల్ల ప్రజలకు మేలు కలుగుతుందనే ఉద్దేశంతో సర్వమంగళ అయిన ఆ పార్వతీదేవి శివుడితో మింగమని చెప్పింది. ఆమె తన మనస్సుతో తన కంఠసీమలోని మంగళసూత్రాన్ని ఎంతగా విశ్వసించిందో!**

పాలకడలి నుంచి **కామధేనువు** పుట్టింది. దాన్ని దేవతలు తీసుకున్నారు. **ఉచ్చైశ్శ్రవమనే** గుర్రం పుట్టింది. దాన్ని బలిచక్రవర్తి గ్రహించాడు. తర్వాత **ఐరావతమనే** నాలుగుదంతాలున్న ఏనుగు పుట్టింది. **కల్పవృక్షం** పుట్టింది. **అప్సరస్త్రీలు** పుట్టారు. **చంద్రుడు** పుట్టాడు.

**లక్ష్మీదేవి** ఉద్భవించి విష్ణువును మెచ్చి వరించింది. అతడి వక్షస్థలాన్ని తన ఆవాసంగా మార్చుకుంది. అప్పుడు సముద్రుడు తన అల్లుడైన విష్ణువుకు **కౌస్తుభాన్ని** ఇచ్చాడు. **వారుణి** (సారాయి) అనే అందగత్తెను రాక్షసులు తీసుకున్నారు.

తర్వాత అమృతకలశాన్ని చేతబట్టుకొని **ధన్వంతరి** అనే దివ్యపురుషుడు జన్మించాడు. సింహం వంటి శక్తిగల అతడు విష్ణువు అంశతో పుట్టాడు. వైద్యవిద్యలో నిష్ణాతుడైన అతడు దేవతలకు వైద్యుడయ్యాడు. ఆ అమృతకలశాన్ని సాటిలేని తమ బలంతో ధన్వంతరి చేతుల్లోంచి రాక్షసులు తీసుకున్నారు. దేవతలు విష్ణువుతో మొరపెట్టుకున్నారు.

## మోహినీ అవతారం

విష్ణువు దరహాసం చేశాడు. మోహినిగా అవతారం దాల్చాడు. అతిలోక సౌందర్యంతో అందరినీ మోహింపజేస్తున్న ఆ సుందరిని చూసి రాక్షసులు – **మేము కశ్యపుడి సంతానం. ఒకే ప్రయోజనాన్ని ఆశించి మేము ఇక్కడ ఉన్నాం. ఉభయులకూ సమంగా అమృతం పంచిపెట్టు** – అన్నారు.

మోహిని – **నేను అందమైన స్త్రీని. సౌందర్యవంతులైన మగవాళ్లను ప్రేమించేదాన్ని. మీకు నాపై నమ్మకం కుదురుతుందా? అందగత్తెల మాటలు నమ్మరానివి. అయినా శక్తివంచన లేకుండా పంచిపెడతాను** – అంది. ఆమె చేతికి రాక్షసులు అమృత భాండం ఇచ్చారు.

ఆమె రాక్షసుల్ని, దేవతల్ని విడివిడిగా కూర్చోబెట్టింది. పైటను జారవిడిచింది. సరసంగా మాట్లాడుతూ రాక్షసుల్ని లొంగదీసి దేవతలకు అమృతం పంచిపెట్టింది.

రాహువనే రాక్షసుడు అది గమనించి రహస్యంగా దేవతల వరుసలో కూర్చున్నాడు. దేవతావేషంలో అమృతం తాగాడు. సూర్యచంద్రులు గమనించి సైగ చేశారు. విష్ణువు చక్రాయుధంతో అతడి తల ఖండించాడు. అమృతంతో ఉండడంతో ఆ తల నిర్జీవం కాలేదు. బ్రహ్మ రాహువు శిరస్సును ఆకాశంలో ఒక గ్రహంగా నిలిపి గౌరవించాడు. రాహుగ్రహం అప్పటి పగతో నేటికీ అమావాస్య పూర్ణిమలలో సూర్యచంద్రుల్ని అడ్డగిస్తూ ఉంది. మొత్తం అమృతాన్ని దేవతలకే పంచి, గరుడ వాహనంపై విష్ణువు వెళ్లిపోయాడు.

బలిచక్రవర్తి నాయకత్వంలో రాక్షసులు దేవతలపై దాడిచేశారు. బలిచక్రవర్తి పన్నిన పలురకాలైన మాయాజాలాలకు విరుగుడు తెలియక ఇంద్రాదిదేవతలు చిక్కుల్లో పడ్డారు. విష్ణువు అక్కడికి రాగానే బలి మాయలు పటాపంచలయ్యాయి. దేవతలది పై చెయ్యి అయింది. దేవతల చేత రాక్షసులు చాలామంది మరణించారు. దేవతలు యుద్ధం చాలించి దేవలోకం వెళ్లారు. శుక్రాచార్యుడు మృతసంజీవని అనే విద్యతో రాక్షసులందరినీ బ్రతికించాడు.



## విష్ణుమాయ – శివుడిమోహం

శివుడు కైలాస పర్వతంపై కొలువుతీరి ఉన్నప్పుడు విష్ణువు యొక్క మోహినీ అవతారం గురించి విన్నాడు. వెంటనే పార్వతీదేవితో నందివాహనంపై కూర్చొని వైకుంఠం వెళ్లాడు. విష్ణువును పలురీతులుగా కీర్తించి – **మనోహరమైన నీ పురుష రూపాన్ని చాలాసార్లు చూశాను. కాని స్త్రీరూపాన్ని చూడలేదు అమృతం పంచినప్పుడు నువ్వు ధరించిన ఆ రూపాన్ని చూప**మన్నాడు.

**లోకాన్ని మోహింపజేసే ఆ రూపాన్ని నీకు చూపుతాను** – అని విష్ణువు మాయమయ్యాడు. శివుడు విష్ణువెక్కడికి వెళ్లాడా అని నాలుగువైపులా పరికించి చూశాడు.

ఆయన ఎదుట ఒక ఉద్యానవనం కన్పించింది. ఆ వనంలో చెట్లవరస ఉంది. అక్కడ లేతవయస్సు సుందరాంగి కన్పించింది. ఆమె పైట తొలగి ఉంది. కొప్పుముడి ఊడి ఉంది. అతిశయించిన ఆ అందం చూసి శివుడు పరవశించి ఆకర్షితుడయ్యాడు.

ఆ జవరాలు బంతిని ఎగరేసింది. అది కిందపడింది. దాన్ని తీసుకోవడానికి వస్తుండగా గాలి తాకిడికి ఆమె చీరముడి ఊడింది. శివుడి మనస్సు కంపించింది. కామావేశంతో చలించిపోయాడు. సతీదేవి అతడివైపు సిగ్గుపడేట్లు చూస్తున్నా, ఆ మోహిని చెయ్యి పట్టుకోవడానికి శివుడు ఆమెను సమీపించాడు. ఆమె పరుగెత్తగా శివుడు వెంటపడ్డాడు. కొండలు, నదులు, సరస్సులు, అడవులు దాటివెళ్తూ తుదకు విష్ణుమాయను శివుడు గ్రహించాడు.

మన్మథుణ్ని ఓడించవచ్చు. యముణ్ని ధిక్కరించవచ్చు. మృత్యుంజయుడై జీవించవచ్చు. కాని స్త్రీల వాలుచూపుల వాడి బాణాలను గెలవడం త్రిపురాంతకుడికే సాధ్యం కాదు.

విష్ణువుపట్ల తన స్నేహం ప్రకటించి శివుడు తన పరివారంతో కైలాసం చేరాడు.

## కూర్మావతారం – అంతరార్థం

కూర్మావతార అంతరార్థాన్ని బ్రహ్మవిద్యాదర్పణం, వేదనిరుక్తం అనే గ్రంథాలు ఇలా వివరిస్తున్నాయి.

కు + ఊర్మి :– కు = భూమి సంబంధమైన; ఊర్మి = జీవుల్ని ఆశ్రయించి ఉండే షడూర్ములని వేద నిఘంటువు.

ఆకలి, దప్పిక, ఆశ, శోకం, మోహం, మరణం – షడూర్ములు.

కూర్మం – భూసంబంధమైన జీవధర్మం కలది.

అమృతం - మృతం (చావు) లేనిది.
సముద్రమ్ = స + ముత్ + ర
స = సాధకుడిలోని సాత్విక ప్రవృత్తులు
ముత్ = సాధకుడిలో నెలవై ఉన్న ఆనందరూప పరబ్రహ్మ తత్త్వం (పరమాత్మ)
ర = గ్రహించేది (రాతి గృహ్ణాతి ఇతి రః)

సాధకుడిలో ఉన్న పరమాత్మను గ్రహించేది లేదా గ్రహించడానికి ప్రయత్నించేది.

**మందరం :-** కింది దాన్ని పైకి, పై దాన్ని కిందికి తేవటం. కింద పరమాత్మ, పైన జీవాత్మ. సముద్ర మథనం ద్వారా, నిరంతరం దైవధ్యానం చెయ్యడం ద్వారా, సాధకుడిలో ఉన్న జీవాత్మను నిరంతరం లోపల ఉన్న పరమాత్మవైపే కేంద్రీకరించాలన్నది మందరంలోని గూఢార్థం.

**వాసుకి :-** సర్పం, కుండలిని; ప్రాణాయామం ద్వారా మనలోని సముద్రాన్ని జీవాత్మ అనే మందరానికి - కుండలిని అనే వాసుకిని కట్టి మథించడమే క్షీరసాగర మథనంలోని మర్మం. ఈ సమయంలో సాధకుడికి అనేక ఆటంకాలు ఎదురవుతాయి. అప్పుడు జీవాత్మ అనే మందరగిరి ఆ ఆటంకాల్లో మునిగిపోకుండా జాగ్రత్త వహించాలి.

దేహాన్ని ఆరోగ్యంగా ఉంచాలి. ప్రాణం ఉన్నప్పుడే ధ్యానం సాధ్యం. ధ్యానం కొనసాగినప్పుడే అమృతత్వం (మోక్షం)

## సాగరమథనం - స్వామి వివేకానందుడి వ్యాఖ్య

మనిషి సంసారమనే సాగరాన్ని చిలుకుతాడు. ఇంద్రియానందం అనే అనేక వస్తువులు అందులోంచి పుడతాయి. వాటిని మనిషి అనుభవిస్తాడు. ఈ అనుభవాలతో అనాసక్తుడిగా ఉంటాడు సన్యాసి. అంతర్ముఖుడై ఆత్మానందాన్ని చవిచూస్తున్న అతను మాయ అందించే మనస్సును ఆకర్షించే ఏ వస్తువునూ స్వీకరించడు. చివరగా వచ్చేది మరణం అనే విషం. దాన్ని చూస్తూ వణికిపోతూ పరుగెత్తి తన వద్దకు వచ్చి శరణుజొచ్చిన వాణ్ని మహాదేవుడిలా, వాళ్ల అజ్ఞానాన్ని నశింపజేసి, అతణ్ని మరణభయం నుంచి కాపాడతాడు. ఆత్మసాక్షాత్కారం పొందిన వ్యక్తికి మరణభయం లేదని కూడా గ్రహింపజేస్తాడు.

## వైవస్వత మనువు

ఇప్పుడు వైవస్వతుడనే ఏడవ మనువు పాలిస్తున్నాడు. అతడినే శ్రాద్ధదేవుడంటారు. అతడికి ఇక్ష్వాకుడు, నభాగుడు, మొదలైన పదిమంది కొడుకులున్నారు. వాళ్లు రాజులయ్యారు. పురందరుడనే వాడు ఇంద్రుడయ్యాడు. ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు,



వసువులు, రుద్రులు దేవతలయ్యారు. గౌతమ, కశ్యప, అత్రి, విశ్వామిత్ర, జమదగ్ని, భరద్వాజ, వసిష్ఠులు సప్తర్షులయ్యారు.

కశ్యపుడి భార్య అదితి గర్భంలోనుంచి విష్ణువు వామన రూపంలో పుట్టి ఇంద్రుడికి తమ్ముడయ్యాడు. గడచిన ఏడు మన్వంతరాల గురించి చెప్పిన శుకుడు రాబోయే మన్వంతరాల గురించి వివరించాడు. ఆ మనువుల పేర్లు వరుసగా సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మ సావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి మొదలైన వాళ్లు.

## వామన చరిత్ర

**విష్ణువు పూర్ణ పురుషుడు. పూర్ణకాముడు. లక్ష్మీదేవి వల్లభుడు. అటువంటి వాడు బలిచక్రవర్తిని మూడడుగుల నేల ఎందుకడిగాడు?** - అనే పరీక్షిత్తు ప్రశ్నకు శుకుడు వామనావతార చరిత్రను వివరించాడు.

ఇంద్రుడిచే పరాజయం పాలైన బలి గురువుల్ని ఆశ్రయించి విద్యలు గ్రహించాడు. తాత ప్రహ్లాదుడు (ప్రహ్లాదుడి కొడుకు విరోచనుడు. అతడి కుమారుడు బలి.) అతడికి వాడిపోని పూలదండ ఇచ్చాడు. శుక్రుడు చంద్రుడివంటి తెల్లని శంఖం ఇచ్చాడు. వేదవేత్తల్ని రప్పించి, పూజించి, సత్కరించి వాళ్ల ఆశీస్సుల్ని పొందాడు. దేవతలమీద విజయం సాధించగలడన్న నమ్మకం కుదిరాక అమరావతిపై దండెత్తాడు.

దేవేంద్రుడు బృహస్పతితో మంత్రాలోచన చేశాడు.

**దేవేంద్రా! ఇప్పుడు బలిని ఎదుర్కోవడం అవివేకం. అతడికి బ్రహ్మవేత్తల ఆశీర్వాద బలం ఉంది. నీకు మంచి రోజులు వచ్చేవరకు అజ్ఞాతంలో ఉండు** - అన్నాడు.

అమరావతి బలికి సునాయాసంగా స్వాధీనమయింది. బలిచక్రవర్తి చక్కటి పాలనను అందించాడు. అందరినీ అలరించాడు. సకల భోగభాగ్యాలు ప్రజలందరికీ సమకూరాయి.

## అదితి ఆవేదన - వామన జననం

అదితి తన కుమారుల సామ్రాజ్యం రాక్షసుల పాలయినందుకు అమితంగా దుఃఖించింది. కన్నీటితో వెళ్లి భర్త కశ్యపుడి వద్ద తన కడుపుకోతను చెప్పుకుంది.

కశ్యప ప్రజాపతి - **అంతా విష్ణుమాయ. జరిగిన దానికి చింతించవద్దు. శ్రీ మహావిష్ణువును ధ్యానించు** - అని చెప్పి **పయోభక్షణం** అనే వ్రతాన్ని ఉపదేశించాడు. నియమనిష్ఠల్ని తెలియజేశాడు.

అదితి ఫాల్గుణమాసం శుక్లపక్షం తొలిరోజున ఆ వ్రతాన్ని ప్రారంభించింది. పన్నెండు రోజులు ఆరాధించగా విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. అదితి తన బాధను విన్నవించింది.

విష్ణువు – **తేజోమయ రూపంతో నీ కడుపున పుడతాను. సహనంతో కూడిన ఉపాయంతో తప్ప రాక్షసుల్ని తప్పించలేము. ఇంద్రుడికి రాజ్యం అప్పగిస్తాను. నిశ్చింతగా ఉండు** – అన్నాడు.

కొంతకాలానికి అదితి గర్భం దాల్చింది. ఆమె గర్భం నుంచి శ్రావణమాసం, ద్వాదశి, శ్రవణానక్షత్రం, అభిజిత్తు లగ్నం పట్టపగలు – ఆకాశంలో సూర్యుడు నట్టనడుమ ప్రకాశిస్తున్నప్పుడు గ్రహాలు, నక్షత్రాలు, ఉచ్ఛదశలో ఉండగా విష్ణువు వామనరూపంలో జన్మించాడు.

వామన జననం అయిన వెంటనే దేవతలు తమ చింతలు వదిలిపెట్టారు. అందరూ సంతోషించారు. ఆకాశవీధిలో కోలాహలం చెలరేగింది. పొట్టిబాలుడైన విష్ణువు వడుగు చెయ్యదగిన వయస్సువాడయ్యాడు.

వామనుడికి వడుగు చెయ్యడానికి కశ్యపుణ్ని ముందుంచుకొని మునీంద్రులు కార్యకలాపాలు జరిపారు. సూర్యుడు గాయత్రీ మంత్రాన్ని ఉపదేశించాడు. బృహస్పతి జన్నిదాన్ని, కశ్యపుడు ముంజ దర్భల మొలతాడును, అదితి కౌపీనాన్ని, భూదేవి నల్లని జింకచర్మాన్ని, చంద్రుడు దండాన్ని, ఆకాశం గొడుగును, బ్రహ్మ కమండలాన్ని, సరస్వతి జపమాలను, సప్తర్షులు పవిత్రమైన దర్భల్ని, కుబేరుడు భిక్షాపాత్రను ఇచ్చారు. పార్వతీదేవి ప్రత్యక్షమై **అక్షయం** అంటూ ఆ బ్రహ్మచారికి భిక్షపెట్టింది. తర్వాత వేదమంత్రాలు చదువుతూ బ్రహ్మచారి సంప్రదాయానుసారం వెలిగే అగ్నిహోత్రంతో హోమం చేశాడు.

## వామనుడి ఆగమనం – 'బలి'దానం

ఉపనయనం పూర్తయిన తర్వాత అక్కడికి వచ్చిన బ్రాహ్మణుల సంభాషణల ద్వారా బలి దానగుణాల్ని వామనుడు విన్నాడు. అతణ్ని దానం అడగాలని సంకల్పించాడు. బలి యజ్ఞవాటికను సమీపించాడు. అతడి తేజస్సును చూసి శివుడో, బ్రహ్మో, విష్ణువో, సూర్యుడో – అని సభలోని వాళ్లు ఆశ్చర్యం పొందారు.

సామగానం చేస్తున్న వేదవేత్తల దగ్గర కొంతసేపు, మంత్రాలు వివరించే విద్వాంసుల మధ్య కొంతసేపు, యజ్ఞ గుండం దగ్గర కొన్నిక్షణాలు, యుగాల విశేషాలు విశదం చేసే ప్రాజ్ఞుల వద్ద కొంతసేపు నిలబడి, కొందరితో చర్చలు జరుపుతూ, వేదగానం చేస్తూ బలిని సమీపించి ఆశీర్వదించాడు.



బలిచక్రవర్తి ఆ బ్రహ్మచారిని **ఏం కావాలని** అడిగాడు. **ఏం కోరగలను? మూడడుగుల భూమి దానం చేస్తే బ్రహ్మలోకం దాకా చూడగలను** – అని నర్మగర్భంగా నవ్వుతూ పలికాడు. **అమాయకుడివిలా ఉన్నావు. ఎవరి వద్ద దానం అడుగుతున్నావో తెలియక అడుగుతున్నావు. ఆలోచించి అడుగు – అని బలి చెప్పాడు. తనకంతే చాలు** – అన్నాడు వామనుడు.

వాళ్ల సంభాషణను విన్న శుక్రాచార్యుడు – **అతడు సాక్షాత్తు విష్ణువు. మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించి నిన్ను దరిద్రుణ్ని చేస్తాడు. వాగ్దాన భంగం నరకప్రాప్తికి కారణం అయినా, మనల్ని యాచకులుగా చేసే దానం దానం కాదని పెద్దలన్నారు. కనుక నీకు అసత్యదోషం అంటదు. నీ మాటను వెనక్కి తీసుకో** – అని హెచ్చరించాడు.

స్త్రీలవద్ద (రహస్యం దాచలేనివాళ్లు); వివాహం నిశ్చయించేటప్పుడు; ప్రాణానికి, మానానికి హానికలిగినప్పుడు; ధన రక్షణకు ; గోవుల్ని, బ్రాహ్మణుల్ని రక్షించడానికి అసత్యం పలికినా దోషం కాదని పెద్దలన్నారు. శుక్రుడి బోధనలు విని బలి రెండు క్షణాలు ఆలోచించి – **మీరు గృహస్థ ధర్మాన్ని చక్కగా చెప్పారు. వాగ్దానం చేసిన తర్వాత దానికి భంగం కలిగించమంటారా? రణరంగంలో వెనుదిరిగినవారు, ఆడినమాట తప్పినవారు చచ్చినవారితో సమం.**

కారే రాజులు, రాజ్యముల్ కలుగవే? గర్వోన్నతిం బొందరే
వారేరీ? సిరి మూటగట్టుకొని పోవం జాలిరే? భూమిపై
పేరైనంగలదే? శిబిప్రముఖులున్ ప్రీతిన్ యశఃకాములై
ఈరే కోర్కులు, వారలన్ మరచిరే ఇక్కాలమున్ భార్గవా! (590)

**నాముందు చెయ్యిసాచి దానం అడిగిన ఆ చెయ్యి ఎంత గొప్పది. లక్ష్మీదేవిని ఆసాంతం ఆప్యాయంగా స్పృశించిన చెయ్యి కిందై, నా చెయ్యిపైన ఉండడం ఎంత అదృష్టం. కనుక ఎటువంటి చేటు వాటిల్లినా నా వాగ్దానం నిలుపుకుంటాను. ఈ రాజ్యాలు – శరీరం అన్నీ అశాశ్వతాలే కదా!**

అని బలి దృఢచిత్తంతో పలికాడు. శుక్రుడు ఆగ్రహంతో – **రాజ్యభ్రష్టుడివి అవుతావు** – అని శపించాడు. అయినా బలి చిరునవ్వుతో వామనుణ్ని దానం స్వీకరించమన్నాడు.

## మూడడుగులే ముల్లోకాలు

బలిచక్రవర్తి పట్టమహిషి **వింధ్యావళి** బంగారు కలశంతో నీళ్లు పోస్తుండగా

వామనుడి పాదాలను బలికడిగాడు. ఎడమ పాదాన్ని కడిగి ఆ నీటిని తలపై చల్లుకున్నాడు. దానధార విడుస్తున్న సమయంలో కలశ రంధ్రం నుంచి నీళ్ళు జారకుండా శుక్రుడు అడ్డుపడ్డాడు. అది గ్రహించి వామనుడు దర్భపుల్లను రంధ్రంలోకి చొప్పించగా శుక్రుడి ఒక నేత్రం దెబ్బతింది. అప్పటినుండి శుక్రుడు **ఏకాక్షుడు** అయ్యాడు.

దానధార చేతిలో పడగానే –

**ఇంతింతై, వటుడింతయై మరియు తానింతై, నభోవీధిపై**
**నంతై, తోయద మండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై**
**నంతై, చంద్రునికంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై**
**నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై (622)**

క్రమంగా పెరుగుతూ వామనుడు బ్రహ్మాండమంతా నిండిపోయాడు. సూర్యగోళం మొదట గొడుగుగా, శిరోభూషణంగా, మకర కుండలాలుగా, కంఠాభరణంగా, భుజకీర్తిగా, చేతి కంకణంగా, మొలనూలుగా, చివరికి పాదపీఠిగా మారింది. (వామనుడు పెరుగుదలను సూర్యుడు కొలమానంగా వర్ణించాడు.)

ఒకపాదంతో భూమిని, రెండవ పాదంతో స్వర్గలోకాన్ని ఆక్రమించిన వామనుడు మూడవ అడుగుకు చోటేది? అని ప్రశ్నించాడు. బలి తన శిరస్సుమీద ఉంచమన్నాడు.

అప్పుడు ప్రహ్లాదుడు విష్ణువుతో – **ఒకప్పుడు ఇంద్ర పదవి ఇచ్చిననీవే, ఈ నాడీ స్థితి కల్పించి నీ పాదసేవా భాగ్యం కల్పించావు** అని స్తుతించాడు. వింధ్యావళి విష్ణువుకు నమస్కరించి పతిభిక్షను కోరింది. బ్రహ్మాది ప్రముఖులు ఆమె ప్రార్థనను మన్నించమన్నారు. వామనుడు – **నా కరుణాకటాక్షం పడుతున్నదంటే మొదట ఆ భక్తుడి సంపదలన్నీ పోయి మనస్సు నా పట్ల ఏకాగ్రం కావాలి. బలి అంతటి ఉన్నత స్థితికి చేరుకున్నాడు. ఇతణ్ని అనుగ్రహిస్తున్నాను. సావర్ణి మనువు కాలంలో ఇతడు ఇంద్రపదవిని అందుకుంటాడు. అంతవరకు వ్యాధులు, శ్రమ, ఆపదలు లేకుండా విశ్వకర్మ సృష్టించిన సుతల లోకంలో సంతోషంగా జీవిస్తాడు** – అని అనుగ్రహించాడు.

శుక్రాచార్యుడి విజ్ఞప్తి మేరకు బలిచక్రవర్తి తలపెట్టిన యాగాన్ని విష్ణువు పూర్తి చేయించాడు.

## మత్స్యావతారం

పరీక్షిత్తు కోరికమేరకు మత్స్యావతారం కథను శుకుడు వినిపించాడు.

గతించిన కల్పం చివర ద్రవిడ దేశాన్ని పాలించిన రాజు **సత్యవ్రతుడు.** కేవలం నీళ్లే ఆహారంగా స్వీకరిస్తూ నదిగట్టుపై విష్ణువుగురించి తపస్సు చేసేవాడు. ఒకరోజు



**కృతమాలిక** అనే నదిలో తర్పణం వదులుతున్న అతడి దోసిలిలోకి ఒక చేప పిల్ల వచ్చింది. ఉలిక్కిపడి ఆ చేపపిల్లను అతడు నీళ్లలోకి వదిలిపెట్టాడు.

చేపపిల్ల అతడితో ఇలా అంది.

**దయామయా! ఈ నదిలో దాయాదుల్ని చంపే పాపిష్టి చేపలు ఉన్నాయి. అక్కడ ఉండలేక నీ చేతిలోకి వచ్చాను. దయలేక నన్ను విడిచిపెట్టావు. చేపలు పట్టే వాళ్లు వలలతో వస్తారు. కనుక నన్ను ఆదుకో!**

సత్యవ్రతుడు జాలితో తన కమండలం నీళ్లలో చేపపిల్లను ఉంచాడు. ఒకరాత్రిలోనే ఆ చేపపిల్ల కమండలం అంతా వ్యాపించింది. దాన్ని ఒక కడవలో ఉంచాడు. ఆ పాత్ర అంతటా ఆ చేప విస్తరించింది. చిన్న మడుగులో ఉంచితే అందులోనూ పెరిగింది. చెరువులో, చివరగా సముద్రంలో ఆ చేపపిల్లను సత్యవ్రతుడు విడిచిపెట్టాడు.

**సముద్రంలో మొసళ్లు నన్ను చంపుతాయి. దయచేసి నన్ను ఎత్తుకో** – అంది.

సత్యవ్రతుడు – **ఒక్కరోజులోనే నువ్వు నూరు ఆమడల మేరకు పెరిగావు. నువ్వు సాక్షాత్తు విష్ణువనే భావిస్తున్నాను. చేపరూపాన్ని ఎందుకు ధరించావు?** – అని అడిగాడు.

ఈ రాత్రి గడిచిన తర్వాత రాబోయే ఏడవరోజున బ్రహ్మకు ఒక పగలు పూర్తవుతుంది. భూలోకం మొదలు ముల్లోకాలు ప్రళయ సముద్రంలో మునుగుతాయి. అప్పుడు ఒక పెద్ద నావ నా ఆజ్ఞానుసారం నీ దగ్గరికి వస్తుంది. నువ్వు అన్నిరకాల ఓషధీ సమూహాలు, విత్తనాలు ఆ నౌకపై ఉంచుకొని సముద్రజలాలలో విహరించు. సప్తర్షులు నీతోకలిసి ఆ నావలో ఉంటారు. నీ ముందు భాగంలో పెనుచీకటి ఆవరిస్తుంది. మునుల శరీరాలు కాంతులు మిణుకుమిణుకుమంటూ మెరుస్తుంటాయి. ఆ ఓడ సముద్రపు అలలకు దెబ్బతినకుండా నేను కాపాడుతాను. నా ఆజ్ఞమేరకు ఒక పెద్దపాము కన్పిస్తుంది. సుడిగాలులకు నావ తిరగబడకుండా ఆ పాముతో నా కొమ్ము కొనకు నావను బంధించు. ప్రళయరాత్రి గడిచేంతవరకు నేను రక్షిస్తుంటాను. ఇందుకే నేను మత్స్యరూపం ధరించాను.

**బ్రాహ్మ**మనే ఆ కల్పాంత కాలంలో ఏర్పడిన ప్రళయంలో అన్ని ప్రాణులు నశించాయి. బ్రహ్మకు నిద్ర ముంచుకువచ్చింది. గురకలు పెడుతూ అతడు నిద్రపోయాడు. అతడి ముఖాల నుంచి వేదాలు వెలువడ్డాయి. హయగ్రీవుడనే రాక్షసుడు వేదాలను దొంగిలించి సముద్రజలాల్లో మునిగి చదువసాగాడు.

ఆ రాక్షసుల్ని చంపడం, నావను రక్షించడం విష్ణువు కర్తవ్యాలయ్యాయి.

సత్యవ్రతుడు ప్రళయం వచ్చినప్పుడు విష్ణువు చెప్పినట్లే చేశాడు. అటు పిదప సప్తర్షులతో చేరి విష్ణువును కీర్తించాడు. విష్ణువు సంతోషించి సాంఖ్యయోగంతో కూడిన పురాతనమైన వేదభాగాన్ని అతడికి బోధించాడు. **ఈ కల్పంలో వివస్వంతుడని పిలువబడే సూర్యుడికి శ్రాద్ధదేవుడనే పేరుతో విష్ణువు దయవల్ల ఆ సత్యవ్రతుడే ఏడవ మనువయ్యాడు.**

ప్రళయరాత్రి ముగిసి తెల్లవారే పర్యంతం ఆ విధంగా విష్ణువు మత్స్యరూపంలో తిరుగుతూ ఉన్నాడు.

తెల్లవారుజామున వేదాలు బాధతో మొరపెట్టుకోవడం విష్ణువు విన్నాడు. హయగ్రీవుణ్ని హతమార్చాడు. అంతటితో ప్రళయకాలం ముగిసింది. బ్రహ్మదేవుడు మేల్కొన్నాడు. విష్ణువు వేదాలను బ్రహ్మదేవుడికి అప్పగించాడు.

విష్ణువుకు సత్యవ్రతుడు అర్ఘ్యం సమర్పించి ప్రళయ సముద్రంలోంచి బయటపడి మనువయ్యాడు.

మత్స్యావతార కథతో **ఎనిమిదవ స్కంధం** సమాప్తం.

---



# తొమ్మిదవ స్కంధం

**నల్లనివాడు పద్మనయనంబుల వాడు మహాశుగంబులన్**
**విల్లును దాల్చువాడు కడు విప్పగు వక్షమువాడు మేలు పై**
**జల్లెడు వాడు నిక్కిన భుజంబుల వాడు యశంబు దిక్కులం**
**జల్లెడు వాడునైన రఘుసత్తము డీవుత మాకభీష్టముల్** (361)

నవమ స్కంధమంతా సూర్యచంద్ర వంశస్థులైన రాజుల చరిత్ర వర్ణింపబడింది. అయిదు లక్షణాలు కలది పురాణం. అవి:–

**సర్గం** :– బ్రహ్మాండ ఉత్పత్తిని వివరించేది; **ప్రతిసర్గం** :– కల్పాంతంలో పునఃసృష్టిని చెప్పేది; **వంశం** :– దేవర్షుల బ్రహ్మర్షుల దేవతల వంశ వర్ణనం; **మన్వంతరం** :– 14 మనువుల పరిపాలనా కాలం.

పై నాలుగు లక్షణాలు ముందున్న ఎనిమిది స్కంధాలలో చోటు చేసుకున్నాయి. వాటి విస్తృత వర్ణన ఆ స్కంధాలలో ఉంది. ఈ స్కంధంలో వంశానుచరితం వర్ణింపబడింది.

## వైవస్వత మనువంశం (సూర్యవంశం)

శ్రీహరి ఒక్కడే ప్రాణులన్నింటికీ అంతరాత్మ. ఆదిపురుషుడు, అతడే విశ్వమైన కారణంగా కల్పాంత సమయంలో అన్నీ లయమైనా తానొక్కడే ఏకాంతంగా నిలిచాడు.

ఆ మహాపురుషుడి బొడ్డు నడుమ ఎర్రటి బంగారు తామరపువ్వు మొలిచింది. అందులోంచి నాలుగుముఖాలున్న బ్రహ్మ పుట్టాడు. ఆయన మనస్సులో మరీచి జన్మించాడు. అతడికి కశ్యపుడు ఉదయించాడు. కశ్యపుడికి దక్షుడి కుమార్తె అదితికి సూర్యుడు పుట్టాడు. సూర్యుడికి సంజ్ఞాదేవికి శ్రాద్ధదేవుడనే మనువు (వైవస్వత మనువు) జన్మించాడు. అతడికి శ్రద్ధ అనే భార్యవల్ల **ఇక్ష్వాక, నృగ, శర్యాతి, దిష్ట, ధృష్ట, కరూశక, నరిష్యంత, పృషధ్ర, అభంగ, కవులనే** పదిమంది పుత్రులు ఉద్భవించారు.

అంతకుముందు మగసంతానం కోసం మనువు మిత్రావరుణుల్ని గూర్చి యాగం చేశాడు. అతడి భార్య శ్రద్ధ హోతను ఆశ్రయించి కూతురు పుట్టేటట్లు చెయ్యమని పరమభక్తితో పాలవ్రతం చేసింది. అలాగే కూతురు జన్మించింది.

మనువు తన కులగురువు వసిష్ఠుడి వద్దకు వెళ్లి – **నేను పుత్రసంతానం కోసం యజ్ఞం చేస్తే ఆడబిడ్డ ఎలా కలిగింది?** – అని అడిగాడు.

వసిష్ఠుడు – **ఇది హోత చేసిన తప్పు. నీ కుమార్తె ఇలాదేవికి నేను పురుషరూపం ఇస్తున్నాను** – అని అనుగ్రహించాడు. అప్పటినుండి **సుద్యుమ్నుడనే** పేరుతో పురుషాకృతితో పెరిగి సింహాసనం అధిష్ఠించింది.

ఒకనాడు సుద్యుమ్నుడు తన పరివారంతో వేటనిమిత్తం మేరుగిరికి వెళ్లాడు. అక్కడ శివపార్వతులు శృంగార కేళిలో ఉంటారు కనుక అక్కడకు ఎవరు వెళ్లినా స్త్రీలుగా మారిపోతారు. సుద్యుమ్నుడు, అతడి పరివారమంతా స్త్రీలుగా మార్పుచెందారు. యువతి రూపంలో సుద్యుమ్నుడు తిరుగుతూ బుధుడి ఆశ్రమ ప్రాంతం చేరాడు. బుధుడు ఆమెను మోహించాడు. వాళ్లిద్దరూ సంసారం చేయగా కొంతకాలానికి **పురూరవుడనే** కొడుకు పుట్టాడు.

తన కుమారుడు మళ్లీ స్త్రీరూపం దాల్చినందుకు చింతించి మనువు వసిష్ఠుడితో మొరపెట్టుకున్నాడు. ఆయన పరమశివుణ్ని ఆశ్రయించగా – ఇతడు **ఒక నెల స్త్రీగా, మరొకనెల పురుషుడిగా రాజ్యపాలన చేస్తాడు** – అని అనుగ్రహించాడు. సుద్యుమ్నుడికి **ఉత్కలుడు, గయుడు, విమలుడు** అనే ముగ్గురు కొడుకులు పుట్టారు. వాళ్లని ఉత్తర దిక్కులోని భూములకు రాజుల్ని చేసి, పురూరవుడికి రాజ్యాన్ని అప్పగించి సుద్యుమ్నుడు తపస్సు చెయ్యడానికి అరణ్యానికి వెళ్లాడు.

సుద్యుమ్నుడు అడవికి వెళ్లిన సమయంలో విష్ణువును గూర్చి తపస్సుచేసి ముందు పేర్కొన్న ఇక్ష్వాకుడు మొదలైన పుత్రుల్ని మనువు పొందాడు.

## చ్యవన మహర్షి

వాళ్లలో మూడవ కుమారుడైన **శర్యాతి** మహారాజు కుమార్తె **సుకన్య**. ఒకనాడు ఆమె విహారం చేస్తూ, చ్యవన మహర్షి ఆశ్రమ సమీపానికి వెళ్లి, అక్కడ పూలు కోస్తూ, ఒకానొక పుట్టలో రెండు జ్యోతులు కన్పిస్తే, అవి మిణుగురు పురుగులని భావించి, ముల్లుతో పొడిచింది. వాటినుండి నెత్తురు కారింది. ఆ అపరాధం వల్ల రాజభటులకు మలమూత్రాలు స్తంభించి పోయాయి.

ఆ వార్త విని శర్యాతి ఆశ్రమంలో ఏదో పొరపాటు జరిగిందని గ్రహించాడు. సుకన్య వచ్చి తాను చేసిన తప్పిదాన్ని తండ్రికి తెలిపింది. వెంటనే తన కూతురితో బాటు పుట్టదగ్గరికి వెళ్లి తపోదీక్షలో ఉన్న చ్యవనమహర్షిని చూసి, విచారంతో చేతులు జోడించి క్షమాభిక్ష కోరాడు. ఆయన అనుగ్రహంతో భటులకు ప్రాణరక్షణ చేసి, తన కుమార్తెను ఆయనకు ఇచ్చి వివాహం చేశాడు.



సుకన్య పతివ్రతా ధర్మాన్ని పాటిస్తూ ఆయనకు సపర్యలు చెయ్యసాగింది. ఒకనాడు దేవ వైద్యులు అశ్వినీకుమారులు ఆశ్రమానికి రాగా, వారికి యజ్ఞాలలో సోమపానార్హత కల్పిస్తానని, తనకు యౌవనం కలిగించమని కోరాడు. వాళ్ల అనుగ్రహంతో నవయౌవనం పొంది సంతోషంగా సంసారం కొనసాగించాడు.

## రైవతుడు

శర్యాతికి ముగ్గురు కొడుకులు. వాళ్లలో అనర్తుడనే వాడి కొడుకు రైవతుడు. ఇతడు సముద్రంలో కుశస్థలి అనే పట్టణం నిర్మించి, ప్రశాంతంగా పాలన గావిస్తూ, వందమంది కొడుకుల్ని, **రేవతి** అనే కుమార్తెను పొందాడు. అసమాన సౌందర్యవతి అయిన ఆమెను ఎవరికి ఇవ్వాలో తెలియక బ్రహ్మలోకం వెళ్లాడు. అప్పుడు గంధర్వులు, కిన్నరులు ఆడుతూ, పాడుతూ ఉండడంతో ఒక్కక్షణం నిలుచుండి పోయాడు.

రైవతుడు బ్రహ్మకు నమస్కరించి తాను వచ్చిన పనిని చెప్పగా – **నువ్విక్కడ గడిపిన ఒక్కక్షణంలో భూలోకంలో ఎన్నోమార్పులు జరిగాయి. నీ కూతుర్ని కోరిన రాజులు, వాళ్ల సంతానం, వాళ్ల మనుమలు గతించారు. అందులో కొన్ని వంశాలు నామరూపాలు లేకుండా నశించాయి. ప్రస్తుతం నారాయణాంశతో బలరాముడున్నాడు. అతడికి నీ కుమార్తెనిచ్చి వివాహం జరిపించు** – అని బ్రహ్మ చెప్పాడు. ఆయన చెప్పినట్లే రైవతుడు వివాహం జరిపించాడు.

ఈ వంశంలోనే నభగుడనే రాజుకు **నాభాగుడు** జన్మించాడు. అతడికి **అంబరీషుడు** జన్మించాడు.

## అంబరీషుడు

అంబరీషుడు సప్తదీవులతో కూడిన భూమండలాన్ని ఏలుతూ, సత్ప్రవర్తనతో, విష్ణుభక్తితో మసలేవాడు. అతడి ప్రతిచర్య విష్ణుసంబంధింగానే కొనసాగేది.

తన గురువైన వసిష్ఠుడి అనుమతితో సరస్వతీనదీ తీరంలో ఎన్నో యజ్ఞాలు నిర్వహించాడు. ఎల్లప్పుడూ హరిని సేవించిన ఫలితంగా నారాయణుడు అతడికి సుదర్శన చక్రం కానుకగా ఇచ్చాడు.

ఒక సంవత్సరం బాటు అంబరీషుడు శ్రీహరిని గూర్చి **ద్వాదశీవ్రతం** చేశాడు. వ్రతం పూర్తి అయ్యాక కార్తీకమాసంలో మూడు రాత్రులు ఉపవాసం ఉండి, యమునా నదిలో స్నానం చేసి, మధువనంలో మహాభిషేక విధిప్రకారం శ్రీహరిని అభిషేకించాడు.

భూరి దానధర్మాలు చేశాడు. అందరికీ షడ్రసోపేతమైన భోజనం పెట్టి ఉపవాసానంతరం తాను భోజనానికై కూర్చున్నాడు. ఇంతలో **దుర్వాసముని** అక్కడికి వచ్చాడు. అతణ్ని అర్ఘ్యపాద్యాదులతో అర్చించి, భోజనానికి ఆహ్వానించాడు. అతడు

అంగీకరించి యమునానదిలో స్నానానికై వెళ్లి, ఎంతకూ రాలేదు. ద్వాదశి ఘడియలు దాటిపోయే సమయం. వ్రతఫలం వ్యర్థమవుతుంది.

ఏం చెయ్యాలని పండితుల్ని అంబరీషుడు అడిగాడు. **అతిథి రాకపోవడం వల్ల ద్వాదశి పారణను మానడం ధర్మంకాదు. నీళ్లు తాగితే – భోజనం చేసినట్టూ ఉంటుంది. చెయ్యనట్టూ ఉంటుంది. ఇది ధర్మ సమ్మతమే –** అని ధర్మజ్ఞులు చెప్పారు. ఆ రాజర్షి మనస్సులో శ్రీహరిని స్మరించి, నీళ్లుతాగి దుర్వాసముని రాకకోసం ఎదురు చూడసాగాడు.

దుర్వాసుడు వచ్చి జరిగింది గ్రహించి, ఆగ్రహించి పళ్లు పటపట కొరికాడు. కళ్ళల్లోనుంచి చిటపటమని నిప్పులు రాల్చాడు. హూంకరించాడు. తన సిగలోని ఒక జడను సమూలంగా లాగి, దానితో ఒక మహా రాక్షసుణ్ని సృష్టించి వదిలాడు. అది శూలం ధరించిన చేతితో అంబరీషుడు పైకి రాసాగింది. అంబరీషుడు నిశ్చలంగా శ్రీహరిని ధ్యానిస్తున్నాడు.

అంతలో ప్రళయాగ్నిలా వచ్చిన సుదర్శన చక్రం ముని పంపిన **కృత్య** అనే శక్తిని కాల్చి వేసింది. దుర్వాసముని వెంటపడింది. ఆయన పరుగుతీశాడు. సుదర్శన చక్రం విడిచిపెట్టలేదు. తుదకు వైకుంఠం చేరాడు.

విష్ణువు అంబరీషుడినే శరణు కోరమన్నాడు. దుర్వాసుడు అంబరీషుడి కాళ్లపై పడ్డాడు. అంబరీషుడు దయతో సుదర్శన చక్రాన్ని స్తుతించాడు. సుదర్శనం అదృశ్యమయ్యింది. దుర్వాసుడు అంబరీషుని శక్తిని కీర్తించి బ్రహ్మలోకం చేరాడు.

ఆ తర్వాత కొంతకాలం రాజ్యం ఏలి, తనకు సాటి అయిన కొడుకులకు రాజ్యం అప్పగించి శ్రీహరి కటాక్షం కోసం తపస్సుచేసి వైకుంఠం చేరాడు.

## ఇక్ష్వాకువంశం

ఇక్ష్వాకుడు వైవస్వత మనువు పదిమంది కొడుకుల్లో పెద్దవాడు. అతడికి వందమంది పుత్రులు. వాళ్లలో పెద్దవాడు **వికుక్షి**. అతడి కుమారుడి పేరు **పురంజయుడు**.

కృతయుగాంతంలో దేవతలకు రాక్షసులకు భీకరయుద్ధం జరిగింది. రాక్షసుల చేత ఓడిన దేవేంద్రుడు విష్ణువు శరణుజొచ్చాడు. విష్ణువు – దేవేంద్రా! పురంజయుణ్ని నేను ఆవహిస్తాను. నువ్వు ఆబోతువై అతడికి వాహనంగా ఉండు. విజయం లభిస్తుంది – అన్నాడు.

ఈ కారణంగా **శశాదుడి** (వికుక్షి) కొడుకు పురంజయుడు **ఇంద్రవాహనుడని,** ఇంద్రుడి మూపురాన్ని ఎక్కి యుద్ధం చేసినందువల్ల **కకుత్స్థుదని** మూడు పేర్లతో ప్రసిద్ధిగాంచాడు.



శ్రీరాముడు **ఇక్ష్వాకు కుల తిలకుడని, కకుత్స్థ వంశ కలశాంబుధి సోముడని** కీర్తింపబడటానికి ఈ మహనీయుడే కారణం. కకుత్స్థుడు – అనేనసుడు – పృథువు – విశ్వగంధుడు – చంద్రుడు – యవనాశ్వుడు – శవస్తుడు (శావస్తి నగరాన్ని నిర్మించినవాడు) – బృహదశ్వుడు – కువలయాశ్వుడు.

ఇలా ఈ వంశంలో కకుత్స్థుడికి పదహారవ తరం వాడు **మాంధాత**. ఇతడు రావణుణ్ని తన బలంతో గడగడలాడించి **త్రసదస్యుడు** అనే బిరుదు పొందాడు. **బిందుమతి** అనే తన భార్యద్వారా ముగ్గురు కొడుకుల్ని, యాభైమంది పుత్రికల్ని పొందాడు. కుమార్తెల్ని **సౌభరి** అనే మహర్షికిచ్చి వివాహం గావించాడు.

మాంధాత రెండవ కుమారుడు **పురుకుత్సుడు** (మరికొన్ని పురాణాల్లో పెద్దకుమారుడని చెప్పబడింది. భాగవతంలో అంబరీషుడు పెద్ద కుమారుడనీ ఉంది.) ఇతడు నాగకన్య **నర్మదను** వివాహం ఆడాడు. షట్చక్రవర్తులలో ఒకడు.

పురుకుత్సుడికి ఏడవతరం వాడు **త్రిశంకుడు.** బొందితో స్వర్గానికి వెళ్లాలని ప్రయత్నించి, విశ్వామిత్రుడి అనుగ్రహంతో త్రిశంకుస్వర్గాన్ని పొందాడు. ఇతడి కుమారుడే **హరిశ్చంద్రుడు**. (షట్చక్రవర్తులలో పేరెన్నిక గన్నవాడు)

హరిశ్చంద్రుడికి ఎనిమిదవ తరంవాడు **సగరుడు.** ఇతడూ షట్చక్రవర్తులలో ఒకడు. ఇతడి తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు సవతి తల్లులు ఆమెకు విషం పెట్టారు. అయినా ఏ మాత్రం ఇబ్బంది లేకుండా గరళంతో పాటు జన్మించినందువల్ల సగరుడు అనే పేరు వచ్చింది.

సగరుడు అశ్వమేధయాగం చేసినప్పుడు **దేవేంద్రుడు** యజ్ఞాశ్వాన్ని అపహరించి కపిల మహర్షి ఆశ్రమంలో దాచాడు. అశ్వాన్ని అన్వేషించడానికి వచ్చిన సగర నందనులు కపిలమహర్షి కళ్లు తెరవగానే భస్మం అయ్యారు. సగరుడి కొడుకు **అసమంజసుడు.** అతడి కుమారుడు **అంశుమంతుడు**. ఇతడు కపిలమహర్షి అనుగ్రహం పొంది అశ్వాన్ని తీసుకువచ్చి తాతయజ్ఞం పూర్తి చేయించాడు.

అంశుమంతుడి కొడుకు **దిలీపుడు.** అతడి పుత్రుడు **భగీరథుడు.** ఇతడు సదాశివుణ్ని గూర్చి ఘోరతపం చేసి దివిజ గంగను పితామహుల భస్మరాశిపై ప్రవహింపజేసి, వాళ్లకి పుణ్యలోకాలు ప్రాప్తింపజేశాడు. ఇతడి పేరు మీదే గంగకు **భాగీరథి** అనే పేరు వచ్చింది.

భగీరథుడికి అయిదవతరం వాడు **ఋతుపర్ణుడు. నలుడికి** ప్రియమిత్రుడు. నలుడికి **అక్షవిద్యా రహస్యం** బోధించి, అతడి నుంచి **అశ్వవిద్యా రహస్యం** గ్రహించినవాడు.

**ఖట్వాంగుడు** భగీరథుడికి పదకొండవ తరంవాడు. ఇంతకు ముందే (తొలిస్కంధంలోనే) ఇతడి ప్రస్తావన ఉంది. ఆయన కుమారుడు **దీర్ఘబాహుడు**. ఈయన కుమారుడే **రఘువు**. ఈయన పేరు కారణంగానే సూర్యవంశానికి **రఘువంశమని** పేరు వచ్చింది. రాముడు **రఘురాముడయ్యాడు.**

రఘుపుత్రుడు **అజుడు.** అజుడి కుమారుడు **దశరథుడు.**

## శ్రీరామావతారం

శ్రీరామచరిత్రను 106 గద్యపద్యాలతో పోతన సంగ్రహంగా చెప్పాడు. జయవిజయులు రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగా జన్మించి శ్రీరామచంద్రుని చేత చంపబడ్డారు. రాముడి సోదరులైన భరత లక్ష్మణ శత్రుఘ్నుల గురించి సంక్షిప్తంగా పోతన చెప్పాడు.

శ్రీరాముడి కుమారుడు **కుశుడు**. కుశుడికి ఇరవై ఒకటవ తరంవాడు **మరువనే** రాజశ్రేష్ఠుడు. కలియుగాంతంలో నశించబోతున్న సూర్యవంశాన్ని మళ్లీ పుట్టించగలవాడయ్యాడు.

అతడికి ఏడవతరం వాడైన **బృహద్బలుడు** భారతయుద్ధంలో పరీక్షిత్తు తండ్రి **అభిమన్యుడి** చేత హతుడయ్యాడు. సూర్యవంశంలో ముందు రాబోతున్న రాజులను గురించి కూడా శుకుడు ప్రస్తావించాడు.

## చంద్రవంశం

జగన్నాథుడి నాభికమలం నుంచి **బ్రహ్మ** ఉదయించాడు. ఆయన మానస పుత్రుడు **అత్రి**. అత్రి మహర్షి కడగంటి చూపుల్లోంచి **చంద్రుడు** పుట్టాడు. బ్రహ్మ ఆజ్ఞమేరకు తారామండలానికి ఔషధులకు అధిపతి అయ్యాడు. చంద్రుడి మూలపురుషుడిగా చంద్రవంశం కొనసాగింది.

తారాచంద్రులకు జన్మించినవాడు **బుధుడు.** అతడు వైవస్వత మనువు కుమార్తె **'ఇలా'** (సుద్యుమ్నుడు) కన్యను వరించాడు. వాళ్లకి **పురూరవుడు** జన్మించాడు. ఊర్వశి పురూరవుణ్ని వరించింది. ఊర్వశి వల్ల పురూరవుడికి **ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు** అనే ఆరుమంది పుత్రులు జన్మించారు.

ఆయువుకు **నహుషుడు** జన్మించాడు. ఇతడు వందయజ్ఞాలు చేసి **దేవేంద్ర పదవి** అలంకరించాడు. (ఇతడి ప్రస్తావన ఈ వరకే ఉంది.)

విజయుడునే పురూరవుడి కనిష్ఠ పుత్రుడి వంశంలో **కుశాంబుడు** జన్మించాడు. అతడి కుమారుడు **గాధి** రాజ్యాధిపతి అయ్యాడు. గాధిరాజు కుమార్తె **సత్యవతి.**



ఆమె భృగువంశస్థుడైన **ఋచికుడనే** బ్రాహ్మణుడికి భార్య అయింది. ఋచికుణ్ని భార్య, ఆమె తల్లి పుత్రులు కావాలన్నారు. ఋచికుడు బ్రహ్మ మంత్రాలతో, క్షత్రియ మంత్రాలతో వేల్చి, హవిస్సు తయారుచేసి స్నానానికి వెళ్లాడు.

తల్లి అడగ్గా సత్యవతి బ్రహ్మమంత్రాలతో వేల్పించిన హవిస్సును తల్లికిచ్చి, క్షాత్రమంత్రాలతో తల్లికోసం వేల్పించిన హవిస్సును తాను గ్రహించింది. ఋచికుడు తిరిగివచ్చి జరిగిన అనర్థాన్ని తెలుసుకొని భార్యతో – **నీ కుమారుడు క్రూరుడిగా ప్రవర్తిస్తాడు. మీ తల్లికి బ్రహ్మజ్ఞానియైన కుమారుడు పుడతాడు** – అన్నాడు.

సత్యవతి ప్రాధేయపడగా నీ **కుమారుడు – సాధువు, నీ మనుమడు క్రూరుడవుతాడు** – అని అనుగ్రహించాడు. సత్యవతికి **జమదగ్ని** జన్మించాడు. అతడు రేణుకను వివాహం చేసుకొని **వసుమనాది** పుత్రుల్ని పొందాడు. పురుషోత్తముడి అంశతో జమదగ్నికి **పరశురాముడు** కుమారుడై జన్మించాడు.

## పరశురామావతారం

హైహయవంశపు రాజుల్లో **కార్తవీర్యార్జునుడు** ప్రసిద్ధుడు. నారాయణాంశ కలిగిన **దత్తాత్రేయుణ్ని** ఆరాధించి అతడి కృపవల్ల శత్రువిజయం, వెయ్యిచేతులు, అణిమాది సిద్ధులు – మొదలైన వాటినెన్నో పొందాడు. ఇతడు **రావణుణ్ని** పరాభవించినవాడు.

ఒకసారి వేటకై వచ్చిన కార్తవీర్యార్జునుడు జమదగ్నిముని ఆశ్రమానికి వచ్చాడు. జమదగ్ని **కామధేనువు** ద్వారా అతడికి, అతడి పరివారానికి భోజనం ఏర్పాటు చేశాడు.

కార్తవీర్యార్జునుడికి కామధేనువుపై మనసు పడింది. తన భటులచేత దాన్ని పట్టించి **మాహిష్మతీపురానికి** బయలుదేరాడు. పరశురాముడు ఆశ్రమానికి వచ్చి తండ్రిద్వారా జరిగింది విని, గండ్ర గొడ్డలి, అమ్ములపొది, విల్లమ్ముల్ని పట్టుకొని మాహిష్మతీ పురం వెళ్లాడు.

కార్తవీర్యార్జునుడితో యుద్ధం చేసి అతణ్ని సంహరించి, కామధేనువును ఆశ్రమానికి తీసుకువచ్చాడు. కార్తవీర్యార్జునుడి పదివేలమంది కొడుకులు పారిపోయారు.

పరశురాముడు తన అన్నలతో బాటు అడవికి వెళ్లినప్పుడు కార్తవీర్యార్జునుడి కొడుకులు ధ్యానంలో ఉన్న జమదగ్ని తలను ఖండించారు. **రేణుక** ఎంతగా బతిమాలినా వాళ్లు ఆ ఘాతుకానికి ఒడిగట్టారు. ఆమె భర్త శరీరం మీద పడి విలపిస్తూ – **రామా! తమ తండ్రిని చంపిన పగతో అర్జునుడి కొడుకులు నీ తండ్రిని చంపారు. శత్రువుల్ని శిక్షించడానికి వేగంగా రా** – అని ఇరవై ఒక్కసార్లు పరశురాముడు లెక్కపెట్టుకొనే రీతిలో ఆక్రోశిస్తూ గుండెలు బాదుకుంది.

పరశురాముడు ఆగ్రహంతో తండ్రి పగ తీర్చుకోవడానికి విసుగు విరామం లేకుండా క్షత్రియశబ్దం విన్పించకూడదన్న ఆక్రోశంతో ఇరవై ఒక్కసార్లు రాజుల్ని గాలించి చంపాడు. పరశురాముడు **శమంత పంచకంలో** రాజుల రక్తాలతో అయిదు మడుగులు చేసి, తండ్రి తలకు తెచ్చి శరీరంతో చేర్చి, తానే సర్వదేవమయుడైన భగవంతుడు కావడంతో, తన్ను గూర్చే యాగం చేశాడు.

గాధికి **విశ్వామిత్రుడు** జన్మించాడు. అతడు తపోబలంతో క్షాత్రాన్ని వదలిపెట్టి **బ్రహ్మర్షి** అయి వందమంది పుత్రుల్ని కన్నాడు.

నహుషుడి కొడుకు **యయాతి**. రాక్షసుల కుల గురువైన శుక్రుడి కూతురు **దేవయానిని**, రాక్షసరాజైన వృషపర్వుని పుత్రిక **శర్మిష్ఠను** వివాహం ఆడాడు. దేవయానికి **యదువు, తుర్వసుడు** అనే ఇద్దరు కుమారులు, శర్మిష్ఠకు **ద్రుహ్యుడు, అనువు, పూరుడు** అనే ముగ్గురు పుత్రులు పుట్టారు.

యయాతి చిన్నకొడుకు **పూరుడు.** ఇతడి పితృభక్తి కారణంగా తండ్రి వార్ధక్యాన్ని గ్రహించి, తన యౌవనాన్ని అతడికిచ్చిన త్యాగధనుడు. యయాతికి పిదప అతడే రాజ్యాధినేత అయ్యాడు.

పూరువుకు 14వ తరంవాడు **దుష్యంతుడు.** అతడి కొడుకు **భరతుడు**. అతడు 133 అశ్వమేధ యాగాలు చేశాడు. అతడి ముగ్గురు భార్యలు క్రమంగా పుత్రుల్ని కన్నారు. కాని భర్తపేరు నిలిపేవాళ్లు కారని వెంటనే తమ బిడ్డల తలల్ని ఖండించారు.

సంతానం లేని వాడైన భరతుడు కొడుకుకోసం **మరుత్‌స్తోమం** అనే యాగం చేశాడు. మమత, బృహస్పతులకు పుట్టిన **భరద్వాజుణ్ని**, వాళ్లు పెంచక వదిలిపెట్టారు. మరుత్తులు భరద్వాజుణ్ని పెంచి కొడుకును కోరిన భరతుడికి ఇచ్చారు. భరతుడు అతణ్ని స్వీకరించాడు.

సంతానం లేకపోయిన భరతవంశానికి భరద్వాజుడు వంశకర్త అయ్యాడు. భరద్వాజుడు – మన్యువు, మన్యువుకు – అయిదుమంది కొడుకులు పుట్టారు. వాళ్లలో నరుడనే నాల్గవ కుమారుడికి సంకృతి, ఆ సంకృతికి గురుడు, రంతిదేవుడు జన్మించారు.

**రంతిదేవుడు** తన సర్వస్వాన్ని పేదలకు పంచిపెట్టి నలభై ఎనిమిది రోజులు నిరశన (నిరాహార) వ్రతం పూని, తర్వాత తాను తినబోతున్న అన్నాన్ని సైతం ఆగంతకులైన అభ్యాగతులకు ఇచ్చి మిగిలి ఉన్న నీళ్లను తాగబోతున్న సమయంలో చండాలుడు ఒకడు దాహం అంటూ రాగా, ఆ నీళ్లను కూడా అతడికిచ్చిన త్యాగమూర్తి. బ్రహ్మాది దేవతల అనుగ్రహానికి పాత్రుడయ్యాడు.



భరతుడు పెంచిన **వితథుడి** (భరద్వాజుడు) మూడవ కుమారుడు **బృహత్‌క్షత్రుడు**. అతడి మనుమడు **హస్తి**. తనపేరు మీదుగా **హస్తినాపురం** నిర్మించి ప్రశస్తి గాంచాడు. హస్తి కుమారుడు **అజమీఢుడు** – అతడి మనుమడు **సంవరణుడు.** అతడు సూర్యుడి కుమార్తె **తపతిని** వివాహం ఆడాడు. తపతీ సంవరణుల దాంపత్యం సుప్రసిద్ధం. వీళ్లకి జన్మించిన వాడే **కురువు**. ఇతడిపేరు మీద **కురువంశం** అని చంద్రవంశం ప్రసిద్ధిగాంచింది.

కురువుకు పదమూడవ తరంవాడు **శంతనుడు**. కౌరవ పాండవుల మూల పురుషుడు. శంతనుడి పుత్రులు **భీష్ముడు, విచిత్రవీర్యుడు**. విచిత్రవీర్యుడి భార్యలు **అంబిక, అంబాలికలు.** వ్యాసభగవానుడి అనుగ్రహంవల్ల అంబికకు **ధృతరాష్ట్రుడు,** అంబాలికకు **పాండురాజు** జన్మించారు. కుంతి కన్యగా ఉన్నప్పుడు సూర్యుడి వరంచేత కర్ణుడు జన్మించాడు. అర్జునుడు – అభిమన్యుడు – పరీక్షిత్తు. పరీక్షిత్తుకు జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడని నలుగురు కుమారులు. ఈ వంశ చరిత్ర చెప్పిన శుకుడు నువ్వు తక్షకుడి కాటుచేత మరణిస్తావు. నీ కొడుకు జనమేజయుడు కోపంతో సర్పయాగం చేస్తాడు – అని భవిష్యత్తునూ ప్రస్తావించాడు.

## యదువంశం

వీళ్లూ చంద్రవంశస్థులే అయినా యయాతి పెద్దకొడుకైన యదువు వంశంలో జన్మించిన కారణంగా యాదవులయ్యారు.

యదువుకు **సహస్రజిత్తు, క్రోష్టువు, నలుడు, రిపుడు** అనే నలుగురు కొడుకులు పుట్టారు. వాళ్లలో **సహస్రజిత్తు** వంశంలో కార్తవీర్యార్జునుడు జన్మించాడు. పరశురాముడి బారినుండి కార్తవీర్యార్జునుడి కొడుకులు అయిదుమంది మాత్రమే తప్పించుకున్నారు. వాళ్లు **జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, ఊర్జితుడు.**

జయధ్వజుడికి **తాళజంఘుడు**, అతడికి నూరుమంది పుత్రులు జన్మించారు. వాళ్లలో పెద్దవాడు **వృష్ణి;** వృష్ణి, మధు, యదువుల వంశాలకు చెందినవారు క్రమంగా వృష్ణులు, మాధవులు, యాదవులని పేరుగాంచారు.

యదువు కొడుకైన **క్రోష్టువు** వంశంలో వచ్చినవాడు **సాత్త్వతుడు.** అతడి ఏడుమంది కొడుకుల్లో **మహాభోజుడనేవాడు** చిన్నకొడుకు. అతడి తర్వాత ఆ వంశంలోని వాళ్లని భోజులుగా వ్యవహరించారు. భోజవంశం వాడే **యుయుధానుడనే** పేరుగల **సాత్యకి.** ఆ వంశంలోని వాడైన **దేవమీఢుడికి** (శూరుడు) **వసుదేవుడు** మొదలైన పదిమంది కొడుకులు, **పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస, రాజాధిదేవి** అనే అయిదుమంది కుమార్తెలు జన్మించారు.

## శూరుడి వంశం

శూరుడు (వసుదేవుడి తండ్రి) తన స్నేహితుడైన **కుంతిభోజుడికి** సంతానం లేనందున అతడి కోరికమేరకు తన కుమార్తె అయిన **పృథను** పెంచుకోవడానికి ఇచ్చాడు. కుంతిభోజుడి పెంపక కారణంగా పృథ, **కుంతి** అయింది.

పృథ చెల్లెలు శ్రుతదేవను కురూశదేశ రాజైన **వృద్ధశర్మ** వివాహం చేసుకున్నాడు. వాళ్లకు **దంతవక్రుడు** పుట్టాడు. శ్రుతకీర్తిని కేకయరాజు **దృషకేతుడు** పెళ్లాడాడు. వాళ్లకు **ప్రతర్ధనుడు** మొదలైన అయిదుమంది కొడుకులు పుట్టారు. రాజాధిదేవిని **జయత్సేనుడు** వివాహం చేసుకున్నాడు. **విందానువిందులు** ఆ దంపతుల కుమారులు. చేది దేశాధిపతి దమఘోషుడు శ్రుతశ్రవసను పెళ్లాడి **శిశుపాలుడనే** కొడుకును పొందాడు.

## ఆహుకుడి వంశం

ఆహుకుడు యదువంశంలో నలభై నాల్గవతరంవాడు. ఇతడికి **దేవకుడు, ఉగ్రసేనుడు** అనే ఇద్దరు కుమారులు కలిగారు. దేవకుడికి **దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు** అనే నలుగురు కుమారులు; **ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి** అనే ఏడుమంది కూతుళ్లు జన్మించారు. దేవకి మొదలైన వాళ్లు వసుదేవుణ్ణి పెళ్లాడారు.

ఉగ్రసేనుడికి **కంసుడు, న్యగ్రోధుడు, సునామకుడు, కహ్వుడు, శంకుడు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు. తుష్టిమంతుడు** అనే కొడుకులు; **కంస, కంసవతి, సురాభువు, రాష్ట్రపాలిక** అనే నలుగురు కుమార్తెలు జన్మించారు. వాళ్లు వసుదేవుడి తమ్ముళ్లకు భార్యలయ్యారు.

## వసుదేవుడి సంతానం

వసుదేవుడికి **రోహిణి** ద్వారా **బలరాముడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు, కృతుడు** మొదలైన ఏడుమంది కొడుకులు; **పౌరవి** గర్భంలో పన్నెండుమంది పుత్రులు; మదిరకు **నందుడు, ఉపనందుడు** మొదలైన అయిదుమంది ; కౌసల్య గర్భంలో **కౌశి**; రోచనకు **హస్తుడు, హేమాంగదుడు** అనే కుమారులు; ఇలకు **ఉరువల్కలుడు**; ధృతదేవకు **త్రిపృష్ఠుడు** ; శాంతిదేవకు **ప్రశ్నముడు, ప్రశ్నితుడు** మొదలైనవాళ్లు; ఉపదేవద్వారా **కల్పవృష్టి** మొదలైన పదిమంది కొడుకులు శ్రీదేవ గర్భంలో **వసుడు, హంసుడు, సుధన్వుడు** మొదలైన ఆరుమంది నందనులు; దేవరక్షితకు **గదుడు** మొదలైన తొమ్మిదిమంది ; సహదేవకు **పురూఘుడు, శ్రుతుడు** మొదలైన ఎనిమిదిమంది; దేవకి గర్భంలో **కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సవదనుడు, భద్రుడు,**



**సంకర్షణుడు** అనే ఏడుమంది కలిగారు. ఎనిమిదవ గర్భంలో భగవంతుడైన **విష్ణుదేవుడు** జన్మించాడు. విష్ణుమూర్తి జననం తర్వాత దేవకి **సుభద్రను** కన్నది. ఆమె అర్జునుడి భార్య అయింది.

ఈ వంశచరిత్రను వివరించిన శుకుడు – మంగళకరమైన శ్రీహరికీర్తి గంగామృతం వంటిది. దాన్ని వీనులవిందుగా కొంతైనా తాగితే అన్ని కలుషాలు నశిస్తాయి. – అని ముగించాడు.

షట్చక్రవర్తులుగా ప్రసిద్ధిగాంచిన పురుకుత్సుడు, హరిశ్చంద్రుడు, సగరుడు – సూర్యవంశస్థులు.

నలుడు, పురూరవుడు, కార్తవీర్యార్జునుడు చంద్రవంశస్థులు.

శ్రీరామచంద్రుడు సూర్యవంశంలోను, శ్రీకృష్ణుడు చంద్రవంశంలోను జన్మించారు.

**తొమ్మిదవ స్కంధం** ఇంతటితో సమాప్తం.

---

# పదవస్కంధం - పూర్వభాగం

**నీపాదకమల సేవయు**
**నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం**
**తాపార భూతదయయును**
**తాపస మందార! నాకు దయసేయగదే!** (1270)

శ్రీకృష్ణ భగవానుడి దివ్యమంగళ లీలావిలాసాలు సమగ్రంగా, అత్యంత సుందరంగా, భక్తజనుల హృదయాలకు ఆహ్లాదం కలిగించే విధంగా పదవ స్కంధంలో వర్ణింపబడ్డాయి. తక్కిన భాగవతమంతా ఒక ఎత్తయితే, ఈ దశమస్కంధం ఒక ఎత్తు. 3133 గద్యపద్యాలున్న అతిపెద్ద స్కంధం. మొత్తం భాగవతంలో **35%** దశమ స్కంధానిది. ఇది పూర్వభాగం, ఉత్తరభాగంగా విభజింపబడింది.

పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుడి స్వరూపంగా చెబుతూ, ఇందులోని పన్నెండు స్కంధాలను భగవంతుడి వివిధ అవయవాలుగా పేర్కొనడం జరిగింది. అందులో దశమస్కంధాన్ని **దశమోముఖమేవచ** (భగవంతుడి ముఖం ) అని చెప్పడం ద్వారా, ఈ స్కంధ ప్రాధాన్యత ఎటువంటిదో చెప్పబడింది.

**మహాత్ముడైన విష్ణువు యదువంశంలో ఎందుకు పుట్టవలసి వచ్చింది? అలా పుట్టిన ఆయన ఏయే పనులు చేశాడు? ఎలా ప్రవర్తించాడు?** అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు సమాధానంగా శుకుడు శ్రీకృష్ణ చరిత్రను వర్ణించాడు.

## శ్రీకృష్ణ జనన కారణం

పూర్వం ఎందరో దానవులు భూమిపై పుట్టి రాజులై పరిపాలించారు. **భూదేవి** ఆ భారం భరించలేక **బ్రహ్మదేవుడి** వద్దకువెళ్లి మొరపెట్టుకుంది. భూదేవిని ఊరడించి, ఆమెను, దేవతల్ని వెంటబెట్టుకొని బ్రహ్మ విష్ణువును దర్శించడానికి వెళ్లాడు. పురుషసూక్తం పఠించి అద్భుతమైన సమాధి స్థితిలోకి ప్రవేశించాడు. ఆ ధ్యానంలో ఆయనకు ఒకమాట విన్పించింది. బ్రహ్మ సంతోషంతో ఇలా అన్నాడు.

భూదేవీ! దేవతలారా! నేను విన్నమాట వివరిస్తాను. దేవతలు వారి వారి అంశలలో యాదవకులంలో జన్మించండి. విష్ణువు **వసుదేవుడి** పుత్రుడిగా జన్మించి,



భూభారం తొలగిస్తాడు. అప్సరసలు సుందరమూర్తులై, విష్ణువును పూజించడానికి పుట్టవలసింది. **ఆదిశేషుడు** విష్ణువు కళలో ఆయనకు అన్నగా జన్మిస్తాడు. ప్రపంచమంతా ఏ మాయలో మోహం చెందుతుందో, ఆ యోగమాయ విష్ణువు ఆజ్ఞమేరకు తన అంశతో కార్యనిర్వహణకోసం భూమిపై జన్మిస్తుంది.

ఈ విధంగా చెప్పిన బ్రహ్మ భూదేవిని ఓదార్చి తన లోకానికి వెళ్లాడు.

## అశరీరవాణి - కంసుడి దౌష్ట్యం

యాదవకులంలో జన్మించిన **శూరసేనుడు మధురానగరం** రాజధానిగా ప్రజారంజకంగా పాలించాడు. ఆయనకు **వసుదేవుడనే** కుమారుడు ఉన్నాడు. అతడు **దేవకీదేవిని** పెళ్లిచేసుకొని రథంమీద తన భార్యతో కలిసి పయనం అయ్యాడు. చెల్లెలి మీద ప్రేమతో **కంసుడు** తానే సారథి అయి రథం నడుపుతున్నాడు. అప్పుడు అశరీరవాణి -

**కంసా! చెల్లెలు దేవకీదేవి మెప్పుకోసం ఎంతో ప్రేమతో రథం నడుపుతున్నావు. ఆమె అష్టమ గర్భంలో పుట్టినవాడు నిన్ను చంపుతాడు సుమా** - అని పలికింది. అది వినగానే కంసుడు చెల్లెలి కొప్పు పట్టుకొని కిందికి లాగి చంపబోయాడు.

వసుదేవుడు కంసుడితో - **బావా! గాలిమాటలు విని సోదరిని చంపబోతున్నావు. అమాయకురాలైన ఆమెను వధించడం న్యాయమేనా? పవిత్రమైన భోజవంశంలో జన్మించిన నీ ప్రతిష్ఠకు ఇది భంగకరం -** అని పలువిధాలుగా నీతివాక్యాలు చెప్పినా కంసుడు విన్పించుకోలేదు. తర్వాత వసుదేవుడు దేవకీదేవి కడుపున పుట్టిన పిల్లలనందరినీ అతడికి అప్పగిస్తానని చెప్పడంతో వాళ్లని విడిచిపెట్టాడు.

దేవకీదేవి మొదట పుత్రుణ్ని కన్న వెంటనే వసుదేవుడు ఆ పసికందును కంసుడి వద్దకు తీసుకు వెళ్లాడు. తనకు మరణం ఎనిమిదవ సంతానం వల్ల కనుక ఆ బిడ్డను వెనక్కి తీసుకెళ్లమని కంసుడు వసుదేవుడితో చెప్పాడు. ఇలా రోజులు గడిచాయి. దేవకీదేవి వరుసగా ఆరుమందిని కన్నది.

ఒకరోజు కంసుడు వద్దకు **నారదుడు** వచ్చి ఇలా అన్నాడు - కంసరాజా! **వ్రేపల్లెలోని నందాది యాదవులు, దేవకి, వసుదేవులందరూ దేవతలు కాని మానవులు కారు. నువ్వు రాక్షసుడివి. విష్ణువు దేవకీదేవి గర్భాన జన్మిస్తాడు. భూమిని నాశనం చెయ్యడానికి వచ్చిన రాక్షసులందరినీ సంహరిస్తాడు.**

ఈ మాటలు ద్వారా కంసుడు తాను **కాలనేమి** అనే రాక్షసుడని గ్రహించాడు. వెంటనే దేవకీ వసుదేవుల్ని బంధించాడు. వాళ్ల సంతానాన్ని విష్ణుస్వరూపులుగా భావించి

సంహరించాడు. యదు భోజ అంధక దేశాలను ఏలుతున్న తన తండ్రి **ఉగ్రసేనుణ్ని** కారాగారంలో పెట్టాడు. పట్టుబట్టి శూరసేనదేశాలకు రాజయ్యాడు.

కంసుడు రాక్షసుల్ని తన అనుచరులుగా కూడగట్టుకున్నాడు. **బాణ, భౌమ, మగధ, మహాశన, కౌశి, ధేనుక, బక, ప్రలంబ, తృణావర్త, చాణూర, ముష్టిక, అరిష్ట, ద్వివిద, పూతన** మొదలైన వాళ్లసాయంతో యాదవుల్ని ఓడించాడు. ఓడినవాళ్లు అవమానంతో వివిధ దేశాలకు వెళ్లిపోయారు. కొందరు అసూయ విడిచి కంసుణ్ని సేవిస్తూ మధురలో ఉండిపోయారు.

## శ్రీకృష్ణ జననం

దేవకీదేవి గర్భాన **ఆదిశేషుడనే** మహనీయుడైన విష్ణుతేజం ఏడవదిగా ప్రవేశించింది. యాదవులకు కంసుడివల్ల ఉన్న భయాన్ని గ్రహించి, విష్ణువు యోగమాయాదేవితో ఇలా అన్నాడు.

**వసుదేవుడి భార్యలందరూ కంసుడిచేత బంధింపబడ్డారు. కాని రోహిణి అనే భార్యమాత్రం నందగోకులంలో తలదాచుకుంది. దేవకి కడుపులో ఉన్న శేషుడనే తేజస్సును బయటకి తీసి, నేర్పుగా రోహిణి గర్భంలో ప్రవేశపెట్టు. నేను నా అంశతో దేవకికి జన్మిస్తాను. నువ్వు నందుడి భార్య యశోదాదేవికి బిడ్డగా పుట్టగలవు.**

**దేశంలోని వివిధ ప్రాంతాల్లో నిన్ను మానవులు దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక – అనే 14 పేర్లతో సేవిస్తారు** – అని యోగమాయాదేవిని విష్ణువు అనుగ్రహించాడు.

విష్ణువు చెప్పినట్లే యోగమాయాదేవి చేసింది. పౌరులు దేవకీదేవికి గర్భస్రావం అయిందని బాధపడ్డారు. ఆ తర్వాత విష్ణువు అంశ వసుదేవుడిలో ప్రవేశించగా, అతడు సూర్యకాంతితో ప్రకాశించాడు. తనలో ప్రవేశించిన విష్ణుతేజాన్ని వసుదేవుడు దేవకీదేవిలో ప్రవేశింపజేశాడు. బ్రహ్మాండ భాండాలన్నింటినీ తన కడుపులో దాచుకున్న విష్ణువు దేవకీదేవి కడుపులో పెరగసాగాడు.

కంసుడికి భయం పట్టుకుంది. విష్ణువు తప్ప మరో విషయం అతడికి గుర్తుకు రావటం లేదు. ఏ పని చేస్తున్నా విష్ణువునే స్మరించసాగాడు. క్రోధం పెరగసాగింది. అతడికి ద్వేషంతో సర్వం విష్ణుమయమయింది.

దేవకీదేవికి నెలలు నిండుతున్న వేళ బ్రహ్మాదిదేవతలు కారాగారంలో ప్రత్యక్షమై, గర్భస్థుడైన విష్ణువును స్తుతించారు. నెలలు నిండాయి. శ్రీమహావిష్ణువు **శ్రావణ బహుళ అష్టమీ తిథి, రోహిణీ నక్షత్రం** అర్ధరాత్రి ఆవిర్భవించాడు.



వసుదేవుడు తనకు దివ్యరూపంతో దర్శనం ఇచ్చిన బాలుణ్ని స్తుతించాడు. దేవకీదేవి కూడా స్తుతించి దివ్యరూపాన్ని చూడడం కష్టంగా ఉంది. ఉపసంహరించమంది.

దేవకీదేవితో విష్ణువు – **పూర్వం స్వాయంభువ మన్వంతరంలో నువ్వు పృశ్నిగా, వసుదేవుడు సుతపుడిగా జన్మించారు. మీకు నేను పృశ్ని గర్భుడిగా జన్మించాను. తర్వాతి జన్మలో మీరిద్దరు అదితి కశ్యపులుగా జన్మిస్తే నేను వామనుడిగా మీ కడుపున పుట్టాను. మొదట మీ తపస్సుకు మెచ్చి ఇచ్చిన మాట ప్రకారం మళ్లీ ఈ జన్మలో కూడా మీ కుమారుడిగా పుడుతున్నాను. ఇక మీతో నాకు జన్మలేదు.** అన్నాడు.

విష్ణువు తన దివ్యరూపం విడిచి, పసిబిడ్డ రూపం ధరించాడు. అప్పుడే పుట్టిన బిడ్డలా ఏడవడం మొదలుపెట్టాడు. గోకులంలో యశోదకు యోగమాయ ఆడబిడ్డగా పుట్టింది. విష్ణు సంకల్పంతో వసుదేవుడు బిడ్డను తీసుకొని రేపల్లెకు బయలుదేరాడు. మధురలో, రేపల్లెలో అందరికీ చిత్రమైన మైకం కమ్మింది. వసుదేవుడు ద్వారాలను సమీపిస్తుంటే వాటంతట అవే తెరుచుకున్నాయి. ఆయన దాటిన వెంటనే **ఆదిశేషుడు** వాటిని మూస్తూ వెన్నంటి వచ్చాడు. బాలుడికి గొడుగులా ఉంటూ నడిచాడు. యమునా నది వసుదేవుడికి దారి ఇచ్చింది.

వసుదేవుడు తాను తీసుకువెళ్లిన బిడ్డను యశోదాదేవి పక్కనపెట్టి, అక్కడున్న శిశువును తీసుకొని వెనక్కి వచ్చాడు. కారాగారంలో శిశువు ఏడుపు వినగానే కాపలావాళ్లు కంసుడికి తెలియజేశారు. కంసుడు ఆవేశంగా వచ్చాడు. దేవకీదేవి పుట్టింది ఆడబిడ్డే కనుక వదిలిపెట్టమని ప్రాధేయపడింది.

కాని కంసుడు ఆ పాపను నేలపైకి విసిరికొట్టాడు. అయితే ఆ శిశువు ఆకాశంలోకి ఎగిరి గద, శంఖ, పద్మ, బాణ, ధనుస్సు, ఖడ్గం, శూలం మొదలైన వాటిని ఎనిమిది చేతులతో ధరించి నిలిచింది. కంసుణ్ని ఉద్దేశించి –

**దుర్మార్గుడా! దేవకీదేవి బిడ్డల్ని ఆరుమందిని చంపావు. పసిబిడ్డ అని కూడా చూడకుండా నేలపై కొట్టి చంపడానికి ప్రయత్నించావు. నిన్ను చంపే వీరుడు నాతోపాటే జన్మించి మరోచోట గొప్ప గౌరవాలు అందుకుంటూ పెరుగుతాడు** – అని చెప్పి అదృశ్యమయ్యింది.

అది విన్న కంసుడికి కోపం నశించి, భయం ఆవహించింది. దేవకీ వసుదేవుల్ని క్షమించమని వేడుకున్నాడు. కంసుడి పశ్చాత్తాపం ప్రకటించే మాటలు విని దేవకీవసుదేవులు శాంతించారు. కంసుడు తన మంత్రులతో జరిగింది చెప్పి సలహా అడిగాడు. వాళ్లు – **పట్టణాలు, గ్రామాలన్నీ వెదికి పసిబిడ్డలు ఎక్కడ కన్పిస్తే అక్కడ చంపుతాం** – అన్నారు.

**విష్ణువు ఒక చోట దొరకదు. అతడికి గోవులు, బ్రాహ్మణులు, వేదాలు, ఓర్మి, కారుణ్యం, సత్యం, యాగం, తపస్సు, దమం, శ్రద్ధ, శాంతి – ఇవన్నీ శరీరాలే. వాటిని అంతం చేస్తే విష్ణువు నిలువ నీడలేకుండా పోతాడు** – అన్నారు.

సాధుజనుల్ని హింసించడానికి కంసుడు అనుమతించాడు. రాక్షసులు సాధువుల్ని హింసిస్తున్న కొద్దీ, వాళ్ల బలం క్రమంగా క్షీణింపసాగింది. పూజ్యుల్ని హింసిస్తే కీర్తి, ఐశ్వర్యం, ధర్మం, ఆయుర్దాయం, క్షేమం నశిస్తాయి కదా!

## గోకులంలో నందనందనుడు

నందుడు తనకు కొడుకు పుట్టాడని ఆనందంతో వేదవిదుల్ని పిలిపించి, స్వస్తి వాచకాలు, శుభాశీస్సులు, పుణ్యాహవచనాలు చేయించాడు. శుభకర్మలు చేశాడు. పితృదేవతలకు పూజలు సలిపాడు. రెండు లక్షల పాడి ఆవుల్ని బ్రాహ్మణులకు దానం చేశాడు.

ఆవులు పుష్కలంగా పాలను ఇవ్వసాగాయి. రేపల్లెలోని వాళ్లందరూ నందనందనుడి జననం పట్ల ఆనందంతో పండగ చేసుకున్నారు. గోపికలు కానుకలు సమర్పించారు. ఆ బాలుడికి తలకు నూనె అంటి, శరీరానికి పసుపు పూసి, స్నానం చేయించారు.

**జోజో కమల దళేక్షణ! జోజో మృగరాజమధ్య! జోజోకృష్ణా! జోజో పల్లవకరపద! జోజో పూర్ణేందువదన! జోజో యనుచున్** జోలపాటపాడి నిద్రపుచ్చారు.

ప్రళయకాలంలో ఎన్నోరకాల జగత్తుల్ని ముంచి, తాను ప్రకాశిస్తూ ఉండే ఆ మాయలాడు గోపికల చేతుల్లో జలకాలాడుతూ కేరింతలు కొడుతూ ఆడుకున్నాడు. లోకాలన్నింటినీ జోకొట్టి నిద్రపుచ్చి, తాను మెలకువగా ఉండే పరమాత్మ గోపికలు జోకొడుతుంటే నిద్రించినట్లు కళ్లు తెరవకుండా, కదలకుండా పడుకున్నాడు.

శుక్లపక్ష చంద్రుడిలా బాలుడు పెరుగుతూ క్రీడలు సాగించాడు. నందుడు రాజైన కంసుడికి ప్రతిసంవత్సరం చెల్లించవలసిన కానుకలనిచ్చి ఆప్త మిత్రుడైన వసుదేవుడి ఇంటికి వెళ్లాడు. అతిథి మర్యాదల అనంతరం వసుదేవుడు కుశల ప్రశ్నలు వేశాడు.

**నందా! నీ ఇంట్లో పెరుగుతున్న నా బిడ్డ సంతోషంగా ఉన్నాడా?** అని ప్రశ్నించాడు. నందుడు – **వసుదేవా! నీకు పుట్టిన బిడ్డలనందరినీ కంసుడు వధించాడు. ఆడపిల్లను కూడా వధించబోతే ఆమె ఆకాశానికి ఎగిరిపోయింది. మొత్తం మీద నీకు సంతానం లేకపోయింది. అంతా దైవాధీనం. కనుక దుఃఖించవద్దు. నా కొడుకే నీ కొడుకని భావించు.**



వసుదేవడు తన బుద్ధిహీనతను నిందించుకున్నాడు. తర్వాత **కంసుడికి పన్నులు కట్టావు. మనం కలుసుకున్నాం. సంతోషం. గోకులంలో ఉత్పాతాలు సంభవించే సూచనలున్నాయి. ముందు జాగ్రత్తపడాలి. వెంటనే బయలుదేరు** – అన్నాడు.

## పూతనవధ – పరమపదప్రాప్తి

కంసుడు ప్రేరేపించిన **పూతన** అనే రాక్షసి అన్నిచోట్లా కలయ తిరుగుతూ శిశువుల్ని చంపుతూ వెళ్లింది. రేపల్లెకు ఆకాశమార్గాన వచ్చింది. మాయావి, కామరూపిణి కాబట్టి మాయతో పల్లెలో ప్రవేశించింది. అందమైన యువతి వేషంతో నందుడి ఇంట కాలుపెట్టింది.

ఏడుస్తున్న బాలుణ్ని చూసి – **నీకు చనుబాలు తాగించగల సమర్థులు లేరు. నువ్వు నా పాలు తాగడం మేలు. నీకు పాలిచ్చిన తర్వాత వెళ్తాను** – అని బాలుణ్ని ఎత్తుకొని ముద్దాడుతున్న పూతనను చూసి యశోదా రోహిణులు అభ్యంతరం చెప్పారు.

వాళ్లు తీవ్ర అభ్యంతరం తెలియజేస్తున్నా పూతన బిడ్డకు పాలివ్వడానికి పూనుకుంది. అప్పుడే నిద్రలేచినట్లు కళ్లుతెరచి, ఎంతో ఆకలిగా ఉన్నట్లు, ఆమె రొమ్ముల్ని చేతితో బిగపట్టుకొని రెండు గుక్కలలో ఆమె శరీరంలోని సత్తువనంతా లాగేశాడు. బాధ భరించలేక పూతన భీకరంగా అరవసాగింది. ప్రాణాలు కోల్పోయి తన వాస్తవమైన భయంకరాకారంతో నేలకూలింది. ఆ అరుపులు విన్న గోపీ గోపికలందరూ స్పృహ తప్పారు. స్పృహ వచ్చిన పిదప **యశోదారోహిణీ** గోపికలందరూ కూలిపోయిన పూతన దగ్గరకు వచ్చారు. ఆమె విశాలమైన పొట్టమీద హాయిగా ఆడుకుంటూ చిన్నబాలుడు కన్పించాడు. వెంటనే అతణ్ని ఎత్తుకొని రక్ష కట్టారు.

పూతన శరీరాన్ని ముక్కలు చేసి దూరంగా తీసుకెళ్లి దహనం చేశారు. కాలుతున్న ఆమె శరీరంలోంచి సువాసనలు వెదజల్లే పొగలు వచ్చాయి. హరి, పాలు తాగినప్పుడే ఆమె పాపాలు పటాపంచలయ్యాయి. ఆమెకు పరమపద ప్రాప్తి లభించింది.

ఒక్కసారి విషపు పాలనిచ్చినంత మాత్రాన పూతనకు ఉన్నత పదం సంప్రాప్తించింది. ఎన్నోసార్లు చనుబాలు తాగించిన యువతులకు, హరి తాగడానికి పాలనిచ్చిన గోమాతలకు ఎంతటి మహద్భాగ్యం అందుతుందో కదా!

## శకట భంజనం

కొడుకు పక్కకు ఒత్తిగిలి బోర్లపడడం నేర్చాడని యశోద ఒకనాడు వేడుక చేసింది. ఆనాడు బాలుడి జన్మనక్షత్రం. బ్రాహ్మణులతో వేదమంత్రాలు, అభిషేకం మొదలైనవి చేయించింది. కొత్తదుస్తుల్ని, ఆహార ధాన్యాలను దానం చేసింది.

తర్వాత చిన్న హరిని పాన్పుపై పడుకోబెట్టి నిద్రపుచ్చింది. పనిమీద ఆమె వంటగదిలోకి వెళ్లింది. ఆకలివేసి మేల్కొని పాలు ఇవ్వడానికి యశోద లేకపోతే పాదాన్ని ఒక్కసారి జాడించాడు. పక్కనున్న బండిని తన్నాడు. అది ఒక్కసారిగా పైకెగిరి నేలపై పడి ముక్కలు ముక్కలయింది. అందరూ ఆశ్చర్యపోయారు. బండిలోని మధుర పదార్థాలన్నీ చెల్లా చెదురయ్యాయి.

సమీపంలో ఆడుకుంటున్న గోపబాలురు తాముచూసింది చెప్పినా ఎవ్వరూ నమ్మలేదు. వృద్ధులైన గోపకులు బాలుడికి బాలగ్రహం సోకిందేమోనని శాంతి విధానాలు నిర్వర్తించారు.

## తృణావర్తుడు

ఒకరోజు **యశోద** తన ముద్దుల కొడుకును తొడపై పడుకోబెట్టి, ముద్దాడుతూ, ప్రేమతో శరీరం నిమురుతూ ఉంది. హఠాత్తుగా ఆ బిడ్డ కొండ శిఖరంలా బరువెక్కాడు.

ఇంతలో కంసుడు పంపిన **తృణావర్తుడనే** రాక్షసుడు సుడిగాలి రూపంలో అకస్మాత్తుగా భూమిపైకి వచ్చాడు. ఆ గాలికి రేగిన దుమ్ము, గోపాలుర కళ్లకు చుట్టుకుంది. వాళ్లు దిక్కుతోచక గాబరాపడ్డారు. భయంకరమైన చీకటి వ్యాపించింది. తృణావర్తుడు విసురుగా బాలుణ్ని పైకెత్తుకెళ్లాడు.

యశోద కంగారుతో విలవిలలాడింది. రాక్షసుడు ఆ బాలుడి బరువును భరించలేకపోయాడు. బాలుడు రెండు చేతులతో వాడి మెడ బిగించాడు. అవి ఏనుగు తొండాల్లా రాక్షసుడి కంఠాన్ని బిగిస్తుంటే విడిపించుకోలేక రెక్కలు తెగిన పక్షిలా కిందపడ్డాడు.

గాలి విసురు తగ్గి దుమ్ము అణగారిన వెంటనే అక్కడి స్థితిచూసి ఏడుపులు మాని గోపికలు సమీపించారు. వికసించిన ముఖంతో రాక్షసుడి వక్షస్థలం మీద ఆడుకుంటున్న బాలుణ్ని ఎత్తుకున్నారు. అతణ్ని యశోద చేతికిచ్చారు. అప్పుడు ఏ మాత్రం బరువు లేకుండా బాలుడు తేలిగ్గా ఉన్నాడు.

## నామకరణం

ఇలా కొన్నిరోజులు గడిచిన తర్వాత యాదవుల పురోహితుడు గర్గమహర్షి వసుదేవుడి సూచన మేరకు రేపల్లెకు వచ్చాడు. అతడు అరిషడ్వర్గాలను జయించినవాడు – శివారాధకుడు. నందుడు ఆయనను చూసి – **మహాత్ములైన మీవంటి వారు మావద్దకు రావడం వల్ల మాకు చాలా శుభం కలుగుతుంది. మీరు ఈ కుమారులిద్దరికీ యథావిధిగా అవసరమైన సంస్కారాలు నిర్వర్తించండి** – అని ప్రార్థించాడు.



రోహిణీదేవి కొడుకును, తన కొడుకును గర్గునికి నందుడు చూపించాడు. కంసుడి వేటనుంచి తప్పించుకున్న బాలిక శక్తి స్వరూపిణియై చెప్పిన మాటల్ని గర్గుడు నందుడికి చెప్పి – **ఈ బాలుడి విషయం తెలిస్తే ఇతడు దేవకీదేవి కొడుకేమోనని కంసుడు అనుమానిస్తాడు. అందువల్ల అపకారం ఉంటుందని, చెయ్యవలసిన సంస్కారాలు రహస్యంగా చెయ్యడం మంచిది** – అని నందుణ్ని ఒప్పించాడు.

**గర్గమహర్షి** రోహిణీదేవి కుమారుడికి ఇలా నామకరణం చేశాడు. జనులందరికీ ప్రీతిపాత్రుడిగా ఉంటూ ఆనందింపజేసేవాడు కనుక **రాముడని**, గర్భం నుంచి లాగబడి (సంకర్షణం) పుట్టినవాడు కనుక **సంకర్షణుడని**, మహాబలవంతుడు కనుక **బలభద్రుడని** – పేర్కొన్నాడు.

యశోదాకుమారుణ్ని చూసి ఇలా అన్నాడు.

ఈ శిశువు పూర్వం తెలుపు, ఎరుపు, పసుపు రంగుల్లో ఉండేవాడు. ఇప్పుడు నల్లనివాడయ్యాడు. కనుక **కృష్ణుడని** పిలవండి. వసుదేవుడికి జన్మించాడు కనుక **వాసుదేవుడనే** పేరు కూడా వర్తిస్తుంది. ఇతడు నారాయణుడితో సమానం. ఇతడి వల్ల దుష్టశిక్షణం, శిష్ట రక్షణం జరుగుతుంది.

నామకరణం అయిన తర్వాత గర్గమహాముని తన నివాసానికి వెళ్లాడు.

## శ్రీకృష్ణబలరామ బాల్యక్రీడలు

శ్రీకృష్ణ బలరాములు తమ బాల్యక్రీడలతో తల్లిదండ్రుల్ని, గోపీ గోపికల్ని సంతోషింపజేస్తున్నారు. మోకాళ్లపై చేతులుపెట్టి, నెమ్మదిగా లేచి నిలబడి, ముందుకు తూలి, మళ్లీ లేచి నిలబడి అటూ, ఇటూ నడుస్తున్నారు.

ఆ బాలురు ఆడుతుంటే రంభాది అప్సరసలు ఆకాశంలో నాట్యమాడారు. వాళ్లు నేలమీద పాకుతూ మెల్లగా తలలెత్తి ఆడుకుంటుంటే ఆదిశేషుడు పడగెత్తినట్లు కన్పించారు. వాళ్ల ఆటపాటల్ని, సొగసును చూసి రేపల్లె ప్రజలందరూ తన్మయత్వం చెందేవాళ్లు.

త్రిమూర్తులకు అతీతుడైన **నారాయణుడు** జన్మలు లేనివాడు కనుక **అమ్మ** అంటూ ఆయనకు ఎవరూ లేరు. ఆ పరమ పురుషుడు బాలుడై అమ్మలందరికీ ఆనందం కలిగించేటట్లు అమ్మా అని పిలువనేర్చాడు. రెండడుగుల్లో భూమిని, ఆకాశాన్ని ఆవరించినవాడు తప్పటడుగులు వెయ్యడం నేర్చాడు.

ఆటపాటల సమయంలో **బాలకృష్ణుడు** పరమశివుడిలా కన్పించేవాడు. ఈ చోట పోతన శివకేశవులు అభేదాన్ని చక్కగా తెలియజేశాడు.

గోపబాలురిలో రకరకాల ఆటలాడుతూ మీరు గోవులు, నేను ఆబోతును, నేను రాజను, మీరు భటులంటూ ఆయా ఆటలకు తగినట్లు ప్రవర్తించేవాడు. దాగుడుమూతలాడటం, ఉయ్యాలలూగడం, చేతి బంతులు ఎగరెయ్యడం, జారుడిలా, చోరుడిలా రకరకాల పోకళ్లు పోయేవాడు. అతడి అల్లరిని భరించలేక గోపికలు ఓర్పు నశించి యశోదవద్దకు వెళ్లి ఫిర్యాదు చేశారు.

## శ్రీకృష్ణుడి దుడుకు చేష్టలు

బాలెంతలు పిల్లలకు పాలు చాలవని గోలపెడుతుంటే, వెక్కిరిస్తూ లేగదూడల్ని ఆవుల వద్దకు వదిలేశాడు. కాగిన పాలు కడవల్లో ఉంటే ఆ పాలను తోటి పిల్లలకు పోసి, మిగిలిన కడవల్ని పగలగొట్టాడు. పాలు అందకుండా ఉట్టి ఎత్తుగా కడితే కింది నుంచే కుండకు పెద్ద చిల్లిపెట్టి, మీగడపాలు దోసిళ్లతో పట్టితాగాడు. ఒక ఇంట్లో జొరబడి నెయ్యితాగి, ఆ కడవల్ని పక్కింట్లో పడవేసి – వాళ్లిద్దరి మధ్య గొడవలు పెట్టాడు. ఇంట్లో బంతి పడిందని వచ్చి, స్నానం చేస్తున్న అమ్మాయి చీర తీసుకొని పారిపోయాడు. ఇంకా ఎన్నో దుడుకు పనుల్ని గోపికలు యశోదకు చెప్పి **మా ఇళ్లల్లో పాలు, పెరుగు బతకనివ్వడమ్మా! ఇక మేము ఇక్కడ ఉండలేము. ఎక్కడికైనా వెళ్తాము** అన్నారు.

యశోద – **ఈ పసివాడు నా ఒళ్లో కూర్చొని పాలు త్రాగడమేకాని, నన్ను విడిచి పక్కకైనా వెళ్లడు. పొరుగింటి దారులు కూడా ఈ బిడ్డకు తెలియదు. ఇంకా కళ్లు కూడా సరిగా తెరవని పసివాడిపై నిందలు వెయ్యడం భావ్యమా? మిమ్మల్ని బతిమాలుకుంటాను** – అని చెప్పడంతో గోపికలు వెనుతిరిగారు.

## విశ్వరూప ప్రదర్శన

ఒకరోజు బలరాముడు, మిగిలిన గోపాలురు కృష్ణుణ్ని తీసుకువచ్చి మన్ను తిన్నాడని యశోదాదేవితో చెప్పారు. యశోదాదేవి కోపంతో కృష్ణుణ్ని మందలించింది. కృష్ణుడు –

**అమ్మా! మన్ను దినంగ నే శిశువునో? యాకొంటినో! వెఱ్ఱినో!**
**నమ్మంజూడకు వీరి మాటలు మదిన్, నన్నీవు గొట్టంగా వీ**
**రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు, కాదేనిన్ మదీయాస్యం గం**
**ధమ్మాఘ్రాణము సేసి నా వచనముల్ తప్పైనదండింపవే** **(338)**

అమ్మా! వీళ్లమాటలు నమ్మొద్దు. నీ చేత నన్ను కొట్టించాలని చూస్తున్నారు. నా నోటి వాసన చూడు. తప్పయితే శిక్షించు. – అని నోరు తెరిచి చూపించాడు.



యశోదాదేవికి – **ఆ నోట్లో సముద్రాలు, పర్వతాలు, అరణ్యాలు, నీటితో నిండిన భూగోళం; అగ్ని, సూర్యచంద్రులు , అష్టదిక్పాలకులు వీళ్లందరితో నిండిన బ్రహ్మాండమంతా కన్పించింది.**

యశోద దిగ్భ్రాంతికి లోనయింది.

ఇది కల కాదుకదా! లేదా విష్ణువు మాయా విలాసం కాదుకదా! మరేదైనా అర్థముందా! ఇది సత్యమా! నాకేమీ తోచడం లేదు. అసలు నేను యశోదను కానా! ఇది మరో చోటా! లేకపోతే ఈ కుర్రవాడెంత? ఇతడి నోట్లో ఈ బ్రహ్మాండమంతా వెలుగులు చిమ్ముతుండడానికి కారణం ఏమిటి? ఆలోచిస్తున్న కొద్దీ ఆశ్చర్యంగా ఉంది.

సాక్షాత్తు విష్ణుమూర్తి తన ముందున్నాడని గ్రహించి స్తుతించింది. ఇలా పరమేశ్వరుడిగా తన్ను భావిస్తున్న యశోదలో మళ్లీ వైష్ణవమాయను ఆవహింపజేశాడు శ్రీకృష్ణుడు.

ఆ మాయా ప్రభావంతో యశోద మోహం చెంది, యథాప్రకారం తన కొడుకుగానే భావించింది.

**యశోదానందులు భగవంతుడి తల్లిదండ్రులుగా జన్మించడానికి వెనుకటి జన్మలో ఏయే నోములు నోచారో!** – అని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శుకుడు ఇలా సమాధానం చెప్పాడు.

**వసువులు అనే దేవతలలో ద్రోణుడనేవాడు ముఖ్యుడు. అతడి భార్య ధర. వాళ్లిద్దరినీ బ్రహ్మదేవుడు భూమిపై జన్మించమని ఆదేశించాడు. ఆ వసువే నందుడు. అతడి భార్యే యశోద. శ్రీహరి కూడా బ్రహ్మమాట మన్నించి ఆ దంపతుల్ని తల్లిదండ్రులుగా అంగీకరించాడు.**

## కట్టువడిన కృష్ణుడు – విముక్తి పొందిన యక్షులు

ఒకనాడు యశోదాదేవి ఇంటివద్ద ఉన్న యువతులందరూ ఎవరి పనిమీద వాళ్లు వెళ్లారు. యశోదాదేవి పెరుగు చిలుకుతూ వెన్నతీస్తున్నది. కృష్ణుడు ఆకలి అని గోల చేస్తున్నాడు. చిలకడం ఆపి అతడికి పాలు ఇస్తుండగా, పొయ్యిమీద పాలు పొంగడం చూసి కృష్ణుణ్ని దింపి పాలకుండను దించడానికి వెళ్లింది.

కృష్ణుడు కోపంతో రాయితీసి పెరుగు కుండను పగులకొట్టాడు. వెన్నతింటూ దొంగ ఏడుపు మొదలుపెట్టాడు. యశోద వంటగది నుంచి వెలుపలికి వచ్చి, ఈ దృశ్యం చూసి అతణ్ని వెదుకుతూ వెళ్లినప్పుడు, మరో ఇంట్లో ఉట్టిమీది వెన్నను తీసి కోతికి పెడుతూ కన్పించాడు.

యశోద కృష్ణుణ్ని పట్టుకోవటానికి వెంటపడింది. అతడు తప్పించుకొని తిరుగుతున్నాడు. చివరకు యశోదకు పట్టుపడ్డాడు. అప్పుడు ఆమె వ్యంగ్యంగా –

**వీరెవ్వరు? శ్రీకృష్ణులు**
**గారా? యెన్నడును వెన్నగానరట కదా!**
**చోరత్వంబించుకయును**
**నేరరట! ధరిత్రి నిట్టి నియతులు గలరే?**

(యశోద నిందించడంలోనే శ్రీహరి దశావతారాలు స్ఫురించే విధంగా పోతన చక్కటి పద్యాన్ని (377) రచించాడు. దాని భావం ఇది.

భయం లేకుండా నీళ్లలోకి జొరబడతావు (మత్స్యావతారం); ఎంత పెద్ద బండనయినా ఎత్తాలని ప్రయత్నిస్తావు (కూర్మావతారం); మట్టితో ఆట్లాడడం మానవు (వరాహావతారం – భూమిని ఉద్ధరించడం); పెద్ద పెద్ద స్తంభాలను ఊపుతావు (నరసింహావతారం); ఇతరుల దగ్గర అల్పమైన వస్తువుల్ని యాచిస్తావు (వామనావతారం); లోకం మీద పడి ఎన్నో గొడవలు తెస్తావు (పరశురామావతారం); నీటి ప్రవాహాలకు అడ్డుకట్ట వెయ్యాలనుకుంటావు (శ్రీరామావతారం – వంతెన నిర్మాణం) ; ముసలిలా నటిస్తూ కోతి చేష్టలతో అల్లరి చేస్తుంటావు (హలాయుధమైన బలరాముడితో కలిసి కృష్ణుడిగా హరిగా (హరి – కోతి అని కూడా అర్థం.) దిగివస్తావు; దిసమొలతో తిరుగుతుంటావు (బుద్ధావతారం – దిగంబరత్వం); ఈ దుడుకు పనులు ఎందుకు చేస్తున్నావో (కల్కి అవతారం); నిన్ను అదుపులో పెట్టటం నాకు సాధ్యం కాదని కదా! కింద మీదు తెలియకుండా ప్రవర్తిస్తున్నావు (భూమి, ఆకాశం నిండా వ్యాపించి ఉన్నావు.)

కృష్ణుణ్ని రోలుకు కట్టింది. మొదలు, తుది; లోపల, బయట, అన్నది లేనివాడు, అన్నిటా తానైన వాణ్ని యశోద అవలీలగా బంధించింది.

**చిక్కడు సిరి కౌగిటిలో**
**చిక్కడు సనకాది యోగి చిత్తాబ్జములం**
**జిక్కడు శ్రుతి లతి కావలి,**
**చిక్కెనతడు లీల, తల్లి చేతన్ ఱోలన్ (363)**

ఆ మాయావి లక్ష్మీ కౌగిలింతకు చిక్కలేదు. సనకనందనాది మహాయోగుల హృదయాల్లోను చిక్కలేదు. ఉపనిషత్తుల్లోను చిక్కలేదు. అటువంటివాడు అవలీలగా తల్లిచేతిలో చిక్కి రోటికి కట్టి వేయబడ్డాడు. ఇంట్లోని తాళ్ళన్నీ తెచ్చి ముడివేసినా నడుముచుట్టూ తిరిగిరావటానికి రెండంగుళాలు మిగిలి ఉంది. ముల్లోకాలు దాగి ఉన్న



ఆ బొజ్జను కట్టడం ఎవరి తరం? కాని తల్లి కష్టం చూడలేక కట్టుపడ్డాడు. యశోద తన పనుల్లో నిమగ్నమయింది. కృష్ణుడు ఇంటి పెరట్లోని రెండు మద్ది చెట్లను చూశాడు. **నలకూబర, మణిగ్రీవులనే** ఇద్దరు యక్షులు **నారదుడి** శాపకారణంగా మద్దిచెట్లుగా పడి ఉన్నారు. వాళ్లు కుబేరుడి పుత్రులు. అహంకారంతో ప్రవర్తించేవాళ్లు.

ఒకరోజు తమ ప్రియురాళ్లతో ఆకాశగంగలో స్నానం చేస్తుండగా నారదుడు అటువైపు వచ్చాడు. అతణ్ని చూడగానే గంధర్వ స్త్రీలు త్వరత్వరగా వస్త్రాలు ధరించారు. వాళ్లిద్దరూ అహంకారంతో దిగంబరులుగా ఉండిపోయారు.

నారదుడు భూమిపై మద్దిచెట్లుగా పడి ఉండమని శపించాడు. వాళ్లిద్దరూ పశ్చాత్తాపం ప్రకటించిన తర్వాత – నూరు దివ్య సంవత్సరాలు అలాగే ఉండి నంద నందనుడి పాదస్పర్శతో మళ్లీ విముక్తి లభిస్తుంది – అని శాపవిముక్తిని నారదుడు తెలియజేశాడు.

ఆ మద్ది చెట్లమధ్య నుండి రోటిని ఈడ్చుకుంటూ వెళ్లి శ్రీకృష్ణుడు వాటిని కూల్చాడు. యక్షులు శాపవిముక్తి పొందారు. కృష్ణుడ్ని నుతించి, అతడి అనుమతితో తమ లోకానికి వెళ్లారు. అంతటి మద్దిచెట్లు ఎలా కూలాయో అని రేపల్లె జనులు ఆశ్చర్యం చెందారు. బాలుడు క్షేమంగా ఉన్నందుకు ఆనందించారు.

## బృందావన గమనం – వత్స, బక, అఘాసురుల సంహారం

రేపల్లెలో జరుగుతున్న ఉత్పాతాలను చూసి గోపకులు సమావేశమై తర్కించుకున్న సందర్భంలో **ఉపనందుడనే** వృద్ధగోపాలుడు – **బృందావనం** అనే ప్రదేశం అన్ని విధాల నివాసయోగ్యమైన స్థలం. అక్కడికి వెళదాం – అన్నాడు. అందుకు అంగీకరించి, రేపల్లె వాళ్లందరూ బృందావనం చేరారు. అక్కడ ఇళ్లు నిర్మించుకొని ఆనందంగా జీవితం గడపసాగారు.

బలరామ కృష్ణులు తోటి గోపబాలురితో కలిసి దూడల్ని మేపుతుండగా, ఒక రాక్షసుడు వాళ్లని చంపాలని కోడెదూడ రూపం ధరించి, దూడల్లో కలిసిపోయాడు. శ్రీకృష్ణుడి వెంటే తిరగసాగాడు. కృష్ణుడు బలరాముడితో విషయం చెప్పాడు. కృష్ణుడు చిన్నగా ఆ దూడవద్దకు వెళ్లి, కాళ్లు, తోక పట్టుకొని పైకెత్తి, పెద్దపెట్టున వెలగ చెట్టుకేసి మోదాడు. ఆ దూడ చితికిపోయింది. **వత్సాసురుడు** ప్రాణాలు వదిలాడు. ఆ దెబ్బకు వెలగచెట్టు నేలకూలింది.

ఒకరోజు దూడల్ని మేపుతూ గోపబాలురంతా అడవికి వెళ్లారు. ఎండ తీవ్రత వల్ల దాహం వేసింది. దూడల్ని కూడా తీసుకొని ఒక కొలను దగ్గరికి వెళ్లి, దాహం

తీర్చుకొని వెనుతిరిగారు. ఒక మహాభయంకరమైన కొంగ (బకం) కృష్ణుణ్ని చంపడానికి మునిలా ఏకాగ్రదృష్టితో కృష్ణుడి వైపే చూస్తున్నది. ఆ ప్రయత్నంలో మహర్షులు చెయ్యతగిన తపస్సిద్ధి దానికి కలిగింది. అది కృష్ణుణ్ని సమీపించి మింగింది. కృష్ణుడే దానికి మింగుడుపడ్డాడు. అతడు **బకాసురుడి** గొంతుకు అడ్డుపడ్డాడు. కొంగ కృష్ణుణ్ని బయటికి కక్కింది. తన్ను పొడవటానికి వచ్చిన ఆ కొంగ ముక్కును పట్టుకొని రెండుగా కృష్ణుడు చీల్చాడు.

కొంతకాలానికి **అఘాసురుడు** బలరామకృష్ణుల్ని చంపాలని ఘోరమైన కొండచిలువ రూపం ధరించాడు. అతడు బకాసురుడి తమ్ముడు. అమృతం తాగిన దేవతలకు కూడా అతడంటే భయమే.

మహాపర్వతం అంత పొడవు, యోజనం వెడల్పుగల ఆకారంతో గోపాలురిని అందరినీ మింగెయ్యాలని వాళ్లు వచ్చేదారిలో ఎదురుచూశాడు. గోపబాలురు దాన్ని చూసి కూడా కృష్ణుడు ఉన్నాడన్న ధైర్యంతో ముందుకు సాగారు. ఆ మహాసర్పం వాళ్లనందరినీ మింగేసింది.

కృష్ణుడు వాళ్ల వెనుకే లోపలికి ప్రవేశించి, తన శరీరాన్ని విపరీతంగా పెంచాడు. లోపల చేరిన గాలి వెలుపలికి రాలేక పక్కభాగాలు బద్దలు కొట్టుకుంటూ బయటికి వచ్చింది.

ఆ మహాసర్పం శరీరం నుంచి దిక్కులు వెలిగిపోయే వెలుగు వేగంగా వచ్చి కృష్ణుడి శరీరంలోకి ప్రవేశించింది. శ్రీహరి రూపాన్ని ఒక్కసారైనా నిల్పుకుంటే ఎంతటి పాపాత్ముడినైనా శ్రీకృష్ణుడు స్వీకరిస్తాడు.

ఆ కొండచిలువ చర్మం కొన్నాళ్లకు ఎండిపోయి, గోపబాలురు ఆడుకునే గుహలా ఉపయోగపడింది.

## విష్ణుమాయ

తర్వాత తమతోబాటు తెచ్చుకున్న చల్దుల్ని నిర్మలమైన నీళ్లున్న కొలను పక్కన కూర్చొని తినసాగారు. నీళ్లు తాగి పచ్చిక బయళ్లలో మేస్తున్న గోవత్సాలు దూరంగా వెళ్లాయి. కృష్ణుడు వాటిని వెదకటానికి వేగంగా అడవిలోకి వెళ్లాడు. అఘాసురుణ్ని చంపిన కృష్ణుడి చర్య ఆశ్చర్యంగా ఉండటంతో బ్రహ్మ ఆ బాలుడి శక్తి ఎటువంటిదో నిర్ణయించాలని, అటు అడవికి వెళ్లి లేగల్ని, ఇటు గోపబాలురనందరినీ రహస్య ప్రదేశంలో దాచాడు.



కృష్ణుడు వెనుదిరిగి వచ్చి గోపాలురు కూడా కన్పించకపోవడంతో ఇది **బ్రహ్మదేవుడు** చేసిన పన్నాగమని గ్రహించాడు. గోపికల్ని సంతృప్తి పరచడానికి, తానే లేగదూడల ఆకారాన్ని, గోపబాలుర ఆకారాన్ని ధరించాడు.

ఆ లీలా గోపాలుడు అన్నీ తానే అయి గోకులానికి వెళ్లాడు. ఇలా ఒక సంవత్సరానికి అయిదారురోజులు తక్కువగా గడిచింది. ఒకనాడు తాను, బలరాముడు అడవికి వెళ్లి దూడల్ని మేపుతున్న సందర్భంలో బలరాముడు కృష్ణమాయను తెలుసుకున్నాడు . బ్రహ్మదేవుడికి ఆ సంవత్సరం అతడి కాలగమనంలో త్రుటితో సమానం.

బ్రహ్మ తాను దాచిపెట్టిన గోపబాలురు, గోవత్సాలు అక్కడ అలాగే ఉండగా, ఇక్కడున్న బాలురిని, దూడల్ని చూసి ఆశ్చర్యం చెందాడు. విష్ణువుని మోహింపజేద్దా మనుకున్న బ్రహ్మ తానే మోహితుడయ్యాడు.

శ్రీకృష్ణుడు అఘాసురుణ్ని చంపింది **కౌమార వయస్సులో.** అంటే ఐదవ ఏట. కాని ఈ సంఘటన **పౌగండ** వయస్సులో అంటే ఆరు సంవత్సరాల వయస్సులో జరిగిందని గోపబాలురు భావించారు. కారణం కృష్ణమాయవల్ల ఆ సంవత్సరకాలం కొద్దిసేపటిలా వాళ్లకి అన్పించింది.

దూడల్ని వెదకడానికి వెళ్లిన కృష్ణుడు తిరిగివచ్చినట్లు – **కృష్ణా! లేగదూడలు అరణ్యం నుంచి ఇప్పుడే తిరిగి వచ్చాయి. నువ్వు తిరిగి వచ్చేవరకు మేమెవ్వరమూ అన్నం తినలేదు చూడు. త్వరగా రా! తిందాం** – అని పిలిచారు. కృష్ణుడు నవ్వుతూ వాళ్లమధ్య కూర్చోగానే కబుర్లు చెబుతూ చల్దులు తినసాగారు.

శ్రీకృష్ణుడు అలా గోపబాలురితో ఒక గోపాలకుడిగా ఆడుతూ, తిరుగుతూ, పాడుతూ, అలసిన అన్న బలరాముడికి సపర్యలు చేస్తూ గోపాలురతో సపర్యలు పొందుతూ, అడవిలో గోవత్సాలను మేపుతూ కాలం గడపసాగాడు.

## ధేనుకాసుర వధ

ఒకరోజు శ్రీదాముడనే గోపాలబాలుడు బలరామకృష్ణులతో – **ఇక్కడికి దూరంగా తాటిపండ్లతో నిండిన ఎన్నో చెట్లున్న వనం ఉంది. అక్కడ ధేనుకుడనే రాక్షసుడు భయంకరమైన గాడిద రూపంలో బంధువులతోపాటు నివసిస్తూ, మనుష్యుల్ని పట్టుకొని తింటూ ఉంటాడు. మీరు ఆ రాక్షసుల్ని మట్టుపెట్టి ఆ తాటిపండ్లను తినిపించండి** – అన్నాడు.

అలాగేనని అందరితో బలరామకృష్ణులు ఆ వనానికి వెళ్లారు. బలరాముడు తాటిచెట్లను తన్నాడు. మగ్గిన తాటిపండ్లు కిందికి రాలాయి. ఆ చప్పుడు విని గాడిద

రూపం ఉన్న రాక్షసుడు రాగానే, అతడి నాలుగు కాళ్లు పట్టుకొని గిరగిర తిప్పి విసిరేశాడు. ఆ రాక్షసుడు రక్తం కక్కుకొని చచ్చాడు. తమపైకి వచ్చిన గాడిదల ఆకారంలోని దాని అనుచరుల్ని, కృష్ణబలరాములు చంపేశారు. గోపాలురు ఆ వనంలోని పండ్లను తిని ఆనందించారు.

## కాళియ మర్దనం

ఒకనాడు గోపాలురితో కలిసి గోవుల్ని తోలుకొని కృష్ణుడు అడవికి వెళ్లాడు. ఆరోజు బలరాముడు వెళ్లలేదు. ఎండ తీవ్రత వల్ల దాహం వెయ్యగా **యమునా (కాళింది)** నది మడుగులో నీళ్లు తాగి గోపాలురు ప్రాణాలు కోల్పోయారు. కృష్ణుడు తన చూపులనే అమృత వర్షంతో వాళ్లనందరినీ బ్రతికించాడు.

**కాళియుడనే** నాగేంద్రుడి కారణంగా ఆ నీళ్లు విషపూరితమయింది. ఆ నీటి తుంపరులతో కూడిన గాలి సోకినా ప్రాణాలు పోతాయి. ఆ మడుగుమీద ఎగిరే పక్షులు కూడా విష ప్రభావానికి లోనై అందులోపడి మరణిస్తాయి.

ఆ మడుగు ఒడ్డునే ఒక కడిమి చెట్టుంది. దానిపైకి ఎక్కిన కృష్ణుడు మడుగులోకి దూకాడు. అల్లకల్లోలమైన ఆ మడుగు నీటిని చూసి కాళియుడు కృష్ణుణ్ని ఎదుర్కొన్నాడు. తన పొడుగాటి శరీరంతో కృష్ణుణ్ని చుట్టేశాడు. కాళియ సర్పం కృష్ణుణ్ని కాటేసిందని అక్కడున్న ఆవులు, ఆబోతులు, లేగదూడలన్నీ దుఃఖంతో మేత మానేసి నిశ్చలంగా చూస్తున్నాయి. గోపాలురు హాహాకారాలు చేశారు.

అక్కడ పల్లెలో ఉన్నవాళ్లు దుశ్శకునాలు చూసి భయపడి, గోకులం నుండి అడవికి పరుగెత్తుకొని వచ్చారు. బలరాముడికి అన్నీ తెలిసినా వాళ్లని వారించలేదు. యమునానది మడుగులోకి దూకి, తాము కూడా ప్రాణాలు వదులుతామని యశోద మొదలైన గోకుల ప్రజలంతా పూనుకున్నప్పుడు అతడు వారించి, ముందు జరగబోతున్నది చూడండన్నాడు.

కొంతసేపు మానవమాత్రుడిగా ప్రవర్తించిన శ్రీకృష్ణుడు, తన శరీరాన్ని విపరీతంగా పెంచి, కాళియుడి శక్తి పూర్తిగా కోల్పోయేటట్లు చేసి, దాని పడగలపై గట్టిగా తన అరచేతితో చరిచి, ఒడిసిపట్టి, గిరగిరతిప్పి విసిరికొట్టాడు. దాని పడగల మీద నిల్చొని నాట్యం చేశాడు. అంతటితో కాళియుడు గర్వం పూర్తిగా హరించుకు పోయింది.

కాళియుడు శరణాగతుడయ్యాడు. అతడి భార్యలు కూడా ప్రాధేయపడగా కృష్ణుడు శాంతించాడు. కాళియుడితో – **ఈ మడుగులోని నీళ్లు గోవులతోబాటు మనుష్యులూ తాగుతుంటారు. ఇక నువ్విక్కడ ఉండరాదు. నువ్వు, నీ భార్యలు, కుమారులు, బంధువులు**



**అందరూ ఇప్పుడే సముద్రంలోకి వెళ్లాలి. ఇంతకుముందు రమణక ద్వీపంలో ఉంటూ గరుత్మంతుడి భయంతో ఈ మడుగులోకి వచ్చావు. నా పాదాల గుర్తులు నీ తలపై ఉండడం వల్ల, గరుత్మంతుడు ఇక నిన్నేమీ చెయ్యడు** – అని చెప్పి అభయం కల్పించాడు.

## కాళియుడి పూర్వగాథ

పూర్వం పాములంటే భయపడే జనులు నెలనెలా మధురమైన పదార్థాలను పాములకు నైవేద్యంగా చెట్ల మొదళ్లలో పెట్టి వెళ్లేవారు. గరుత్మంతుడు తమ్ము చంపకుండా, తమ భాగాలకు వచ్చిన పదార్థాలను ప్రతినెల అతడికి ఇచ్చి సర్పరాజులు బ్రతికేవాళ్లు. కాళియుడు ఒకసారి తన విషం చాలా గొప్పదనే అహంకారంతో భాగం ఎగ్గొట్టి ఆతనే తిన్నాడు. గరుత్మంతుడు కోపంతో అతణ్ని బలంగా కొట్టాడు. ఆ దెబ్బతో కోరలు విరిగి, నోటి వెంట రక్తం కారింది. తలలు చితికాయి.

వెంటనే అతడు పారిపోయి కాళింగి నదిలోని లోతైన మడుగులో ప్రవేశించాడు. అంతకుముందు **సౌభరి** అనేముని ఆ మడుగులో తపస్సు చేస్తుండగా, గరుత్మంతుడు ఆకలితో అక్కడున్న చేపలరాజును పట్టుకొని, చంపి తిన్నాడు. తక్కిన చేపలు శోకంతో మునిని ఆశ్రయించాయి. అప్పుడు ముని జాలి చెంది – **గరుత్మంతుడు ఈ మడుగువద్ద చేపల్ని తినడానికి ప్రయత్నిస్తే మరణిస్తాడు** – అని శాపం ఇచ్చాడు. ఆ శాపం సంగతి సర్పాలలో కాళియుడికి మాత్రమే తెలుసు కనుక అందులోకి ప్రవేశించి ప్రాణాలు కాపాడుకున్నాడు.

## ప్రలంబాసురవధ

ఒకసారి కృష్ణుడు తోటి గోపాలురితో – **మనమంతా రెండు పక్షాలై రాళ్లను గురిచేసి బంతులు విసురుతూ ఆటలాడుదాం** –అన్నాడు. కృష్ణ బలరాములు చెరొక జట్టుకు నాయకత్వం వహించారు.

అప్పటికే ప్రలంబుడనే రాక్షసుడు గోపబాలుడిలా వేషం ధరించి, కృష్ణుడివైపు జట్టులో ఉన్నాడు. అతణ్ని చంపే పన్నాగంతోనే కృష్ణుడు ఈ ఆటను సూచించాడు. ఆ ఆటలో ఓడినవాళ్లు, గెలిచినవాళ్లను పైకెత్తి మొయ్యాలి. వాళ్లు **భాండీరకమనే** మర్రిచెట్టు వద్దకు వెళ్లాలి.

ఆట మొదలుపెట్టిన తర్వాత శ్రీకృష్ణుడు రహస్యంగా బలరాముడికి ప్రలంబాసురుడి వృత్తాంతం తెలియజేశాడు. ఆటలో ఓడిన శ్రీదాముడనే బాలుడు శ్రీకృష్ణుణ్ని మోశాడు. అలాగే కృష్ణుడి జట్టులో **భద్రసేనుడు, ప్రలంబుడు** ఓడారు కనుక **వృషభుణ్ని, బలరాముణ్ని** మోసుకెళ్లాలి.

ప్రలంబాసురుడు బలరాముణ్ని మోసుకెళ్తూ, గొప్పభారంగా ఉన్న అతణ్ని మోయలేక తన భయంకర రూపాన్ని పొందాడు. బలరాముడు గట్టిగా పిడికిలి బిగించి తల వ్రక్కలయ్యేటట్లు కొట్టాడు. అంతటితో నవరంధ్రాలనుండి రక్తం స్రవించి ఆ రాక్షసుడు కిందపడి మరణించాడు.

## శ్రీకృష్ణుడు కబళించిన దావాగ్ని

గోపాలకులు ఆటల్లో నిమగ్నమై ఉండగా గోవులు మేస్తూ, మరొక కారడవిలోకి ప్రవేశించాయి. ఇంతలో అక్కడ వ్యాపించిన కార్చిచ్చు గాలి వేడికి తట్టుకోలేక అవి అంబా అంటూ పెద్దపెట్టున ఆక్రోశించాయి. గోపబాలురు వాటి అడుగు జాడల్నిబట్టి వెళ్లి మళ్లించారు. కాని కార్చిచ్చు అడవి నలువైపులా వ్యాపించింది. వాళ్లందరూ మరణ భయంతో కృష్ణబలరాముల్ని వేడుకున్నారు.

కృష్ణుడు తన యోగమహిమ చేత దావాగ్నిని తాగి గోపాలురిని భాండరీకమనే మర్రిచెట్టు వద్ద విడిచిపెట్టాడు. ఈ వివరాలను గోపబాలురు తమ పెద్దలకు చెప్పినప్పుడు, ఆ పెద్దలు రామకృష్ణులు ఏవో మహత్కార్యాలు నెరవేర్చటం కోసం పుట్టిన దేవతాశ్రేష్ఠులని భావించారు.

## వేణుగానం – గోపకన్యల పరవశం

వర్షాకాలం వచ్చింది. శ్రీకృష్ణుడు గోవుల్ని, కోడెదూడల్ని పూజించాడు. వర్షాకాల లక్ష్మిని అర్చించాడు. వర్షాకాలంలో యథోచితమైన విహారాలతో గడిపాడు.

ఇంతలో శరత్కాలం వచ్చింది. **బృందావనంలో** ఉత్సవాలు మొదలయ్యాయి. చతురనటమూర్తి గోపాలచక్రవర్తి పిల్లనగ్రోవి చేతబట్టి **బ్రహ్మగాంధర్వగీతి** ఆలపించాడు. ఆ మధురగానం వినగానే గొల్లపడుచులు, తమ తమ పనులు ఎక్కడివక్కడ విడిచిపెట్టి గుంపులు గుంపులుగా తమలోతాము ముచ్చటలాడుకున్నారు.

మురళీరవం సోకగానే వాళ్లమనసులు పులకరించాయి. అరవిందదళనేత్రుణ్ని మాటిమాటికి మానసికంగా కౌగలించుకున్నారు. పిల్లనగ్రోవి చేసుకున్న అదృష్టాన్ని మెచ్చుకున్నారు. ఆ పాటలు విని చెట్లు పూదేనెల్ని జారుస్తున్నాయని, నెమళ్లు పురివిప్పి నాట్యం చేస్తున్నాయని, దేవతా స్త్రీలు ఆకాశవీధిలో సంచరిస్తూ, మాధవుణ్ని చూసి, వేణుగానం విని, వశం తప్పి మదన పీడితులై పతుల ఒడులలో ఒదిగిపోతున్నారని, పశువులు మేతమెయ్యడం మాని పరవశిస్తున్నాయని, లేగదూడలు పాలు తాగడం మరిచాయని, ఇలా ప్రకృతిలో సర్వం తమ తమ పనుల్ని మాని ఆనందంతో ఉన్నాయని గోపకన్యలు మాట్లాడుకున్నారు.



**పూర్వజన్మలో నోములు నోచినప్పుడు యమునా నదీతీరంలో వెదురు మోకగా పుట్టాలని కోరుకొనకపోయాను. అప్పుడలా కోరి ఉంటే ఇప్పుడీ జన్మలో మాధవుడి అధరామృతం సేవించి ఉండే దాన్నికదా!** అని ఒక గోపిక వాపోయింది.

బృందావనంలో విహరిస్తున్న గోవిందుడి లీలావిలాసాన్ని, ఆయన మ్రోగించే దివ్యవేణువుని, దాని మధురధ్వనికి పులకించి, పారవశ్యంలో మునిగిన ప్రకృతినీ వర్ణిస్తూ గోపకన్యలు అలా చాలాసేపు ఉండిపోయారు.

## గోపికావస్త్రాపహరణం

**హేమంతఋతువు** ఆసన్నమయింది. ఆ ఋతువు తొలిమాసం **మార్గశీర్షం** తొలిరోజున నందుడి మందలోని గోపకన్యలు వేకువనే నిద్రలేచారు. కాళిందీ నదిలో స్నానం చేసి, నదీతీరంలో **కాత్యాయనీదేవి** ప్రతిమను రూపొందించారు. వ్రతదీక్షను చేపట్టారు. ధూపదీపపుష్పాలతో ఆ దేవిని ఆరాధించారు. నైవేద్యాలను సమర్పించి తమ కోరికను వెలిబుచ్చారు.

**భగవతీ! కాత్యాయనీ! మేము నీకు నమస్కరిస్తున్నాం. దయతో మాకందరికీ కృష్ణుణ్ని పతిగా ప్రసాదించవమ్మా! శ్రీకృష్ణుడు పతి అయిన తర్వాత మేమందరం నేతి వసంతాలాడుతూ శ్రద్ధాభక్తులతో నీకు జాతర చేస్తాం.**

ఇలా ప్రార్థించి, నివేదించిన అన్నం ఆరగిస్తూ ఒక్కనెలబాటు **కాత్యాయనీ వ్రతాన్ని** కొనసాగించారు.

**ఈ వ్రత విధానం విని, గోదాదేవి (ఆండాళ్) శ్రీవిల్లిపుత్తూరులోని తన తోటి చెలికత్తెలతో వ్రతాన్ని ఆచరించి మనోహరమైన తిరుప్పావై (తమిళం) పాశురాలను అనుగ్రహించింది. తాను కోరినట్లు శ్రీరంగనాథుణ్ని పతిగా వరించింది.**

కృష్ణుడు వాళ్లని అనుగ్రహించాలని భావించాడు. ఒకరోజు ఉదయ సమయంలో స్నానం చేస్తున్న గోపికల వస్త్రాలను అపహరించి కడిమి చెట్టు ఎక్కి కూర్చున్నాడు. గోపికలు తమ వస్త్రాలివ్వమని ప్రార్థించారు. వాళ్లనే వచ్చి చీరల్ని తీసుకొమ్మన్నాడు.

**కాత్యాయనీ వ్రతదీక్ష చేస్తూ, చీరలు ధరించకుండా నియమం విడిచి, స్నానం చెయ్యవచ్చా? ఇది అంబికకు అపరాధం చెయ్యడమేకదా! మీకు వ్రతఫలం దక్కాలంటే చేతులెత్తి నమస్కరించండి. నావద్దకు వచ్చి చీరలు తీసుకోండి** – అన్నాడు.

గోపికలు కృష్ణుడు చెప్పినట్లే చీరల్ని తీసుకొని ధరించారు. **మీ వ్రత సంకల్పం నాకు తెలుసు. మీ కోరికలు నెరవేరుతాయి** – అని కృష్ణుడన్నాడు. దాస్యయోగంలో పరిణతి పొందిన గోపికలు భగవంతుడి అనుగ్రహానికి పాత్రులయ్యారు.

ఇలా గోపికల్ని అనుగ్రహించిన కృష్ణుడు తన భక్తురాలయిన బ్రాహ్మణుల భార్యల్ని అనుగ్రహించాలని సంకల్పించాడు.

## విప్రపత్నులపై అనుగ్రహం

ఒకరోజు యమునా నదీతీరంలో పశువుల్ని మేపుతున్నప్పుడు, గోపాలకులు తమకు ఆకలివేస్తుందని, బలరామకృష్ణులతో విన్నవించుకున్నారు. అప్పుడు కృష్ణుడు –

**మీరు ఈ సమీపంలో అంగిరసమనే సత్రయాగం చేస్తున్న వేదవేత్తల వద్దకు వెళ్లండి. పశువుల్ని మేపుతూ ఈ ప్రాంతంలోనే ఉన్న బలరామకృష్ణులు, మిమ్మల్ని అడిగి అన్నం తీసుకురమ్మన్నారని వినయంగా అడగండి** – అని చెప్పి పంపాడు.

శ్రీకృష్ణుడి ఆదేశానుసారం గోపబాలురు బ్రాహ్మణుల్ని అడిగారు. వాళ్లు అన్నం లేదని గద్దించి పొమ్మన్నారు. చిన్నబుచ్చుకున్న వాళ్లు తిరిగివచ్చి కృష్ణుడితో జరిగింది చెప్పారు.

**ఇప్పుడు వాళ్ల భార్యలవద్దకు వెళ్లి ఇంతకుముందు అడిగినట్లే అడగండి** – అని కృష్ణుడన్నాడు.

గోపాలురు బ్రాహ్మణ పత్నులవద్ద అలా చెప్పగానే గోవిందుణ్ని దర్శించాలన్న కుతూహలంతో అన్ని పదార్థాలను తీసుకొని బయలుదేరారు. బిడ్డలు, భర్తలు, తోబుట్టువులు అడ్డుపడినా **అడ్డుపడకండి. తొలగండి.** అంటూ వేగంగా వెళ్లి నందకుమారుణ్ని దర్శించారు. కృష్ణదర్శనంతో పరమానందం పొందారు.

గృహస్థులైన మీ భర్తలు మీతో కలిసి యజ్ఞనిరాటంకంగా నెరవేర్చడానకి మీరు ఇప్పుడే యాగవాటికకు వెళ్లండి. నన్ను స్మరించడం వల్ల, ధ్యానించడం వల్ల మీ కర్మానుబంధమైన శరీరాన్ని విడిచి మనస్సు నాపైనే లగ్నం చేసి ఉచితకాలంలో నన్ను పొందగలుగుతారు – అని అనుగ్రహించాడు.

తమ పత్నులు పొందిన అనుగ్రహం తెలిసి బ్రాహ్మణ శ్రేష్ఠులు తమ్ము తాము నిందించుకున్నారు. తమ తప్పుకు చింతిస్తూ, తమ అపరాధాన్ని క్షమించమని మానసికంగా ప్రణమిల్లారు. కాని కంసుడి పట్ల ఉన్న భయం కారణంగా బలరామకృష్ణుల్ని సందర్శించడానికి వెళ్లలేదు.

## ఇంద్రుని గర్వభంగం

ఒకసారి నందుడు మొదలైన గోపవృద్ధులు, ఇంద్రయాగం చెయ్యాలని సంకల్పించారు. కృష్ణుడు వాళ్ల అభిప్రాయాన్ని గ్రహించి, నందుణ్ని ఉద్దేశించి –



**తండ్రీ! ఈ యజ్ఞం వల్ల ప్రయోజనం ఏమిటి? ఎవరిని ఉద్దేశించి యజ్ఞం చేస్తున్నారు?** అని అడిగారు.

నందుడు – **ఈ యాగానికి అధిపతి ఇంద్రుడు. ఈ యాగంవల్ల అతడు సంతోషించి, తన అధీనంలో ఉన్న మేఘబృందాన్ని మన నేలమీద వర్షింపజెయ్యడం జరుగుతుంది. అందువల్ల పచ్చికపెరిగి, పశువులు జీవింపగలుగుతాయి. వాటి పాడివల్ల మనమూ, దేవతలు కూడా సంతృప్తి చెందగలం.**

కృష్ణుడికి ఈ విషయాలు తెలిసినా దేవేంద్రుడు అమిత గర్వంతో ప్రవర్తిస్తున్నందున, అతడి గర్వాన్ని అణచాలని నందుడితో ఇలా చెప్పాడు.

**ప్రపంచంలో కర్మకు లోబడని ప్రాణి అంటూ ఏదీలేదు. కర్మకారణంగానే పుట్టడం, పెరగడం, నశించడం జరుగుతూ ఉంటుంది. ఆయా ప్రాణులు అనుభవించే కష్టసుఖాలు కర్మకు లోబడే ఉంటాయి. కర్మఫలాన్ని ఇచ్చేది ఈశ్వరుడే అయినా, కర్మలు చేసేవాడికి మాత్రమే ఫలితం ఇస్తాడు కాని, ఏ కర్మా చెయ్యనివాడికి ఇవ్వడు కదా!**

**అని ఇంకా అనేక కారణాలను పేర్కొన్న తర్వాత – మనకు గోరక్షణ తగిన కర్మ కనుక, మనకు ప్రాణాధారమైన ఈ పర్వత ప్రాంతం పట్ల కృతజ్ఞత చూపుతూ, ఆ పర్వతానికి దీవెనలు అందించే విప్రవర్యులకు సంతోషం కలిగించేటట్లు యజ్ఞం చేద్దాం** – అన్నాడు.

గోపవృద్ధులు అందుకు సమ్మతించి బయలుదేరారు. దారిలో కృష్ణుడు – **ఇదిగో పర్వతం. దీన్ని పూజించడానికి రండి** – అని తానే పర్వతాకృతి దాల్చాడు. పూజలు, కానుకలు సమర్పించిన తర్వాత ఆలమందలతోపాటు గిరి ప్రదక్షిణ చేశాడు.

ఇంద్రుడు కోపంతో ప్రళయాన్ని సృష్టించగల సంవర్తకాలనే మేఘసమూహాన్ని పిలిచి, గోకులంపై జడివాన కురిపించమన్నాడు. వర్షం భీకరంగా రావడంతో గోపాలురు కృష్ణుడితో మొరపెట్టుకున్నారు.

**ఆది వరాహమూర్తిగా భూమిని పైకెత్తిన హరి, ఏనుగు తామరమొగ్గను పైకెత్తినట్లు, ముల్లోకాలకు సంతోషించే విధంగా అవలీలగా ఒకచేత్తో గోవర్ధనగిరిని పైకెత్తి గొడుగులా పట్టాడు.**

ఆబాలగోపాలమంతా, తమ తమ పశు సంపదలతో ఆ గొడుగు క్రిందికి చేరారు. రాత్రింబవళ్లు ఏడురోజుల పాటు జడివాన కురిసినా ఎవరూ లేశమైనా తడవలేదు. దేవేంద్రుడికి అహంకారం నశించింది. మేఘాలను వెనక్కి మళ్లించాడు. వర్షం నిలిచిన తర్వాత గోప ప్రజల్ని వెలుపలికి రమ్మన్నాడు కృష్ణుడు. అందరూ పల్లెకు చేరుకున్నారు.

ఏడేళ్ల బాలుడు పర్వతాన్ని ఎత్తిపట్టటం వల్ల ఇంద్రుడికి జ్ఞానోదయం కలిగి, కామధేనువుతోబాటు కృష్ణుడివద్దకు వచ్చి ఆయన పాదారవిందాలను అర్చించి, స్తుతించాడు.

## వరుణలోక యాత్ర

ఒక పర్యాయం నందుడు ఏకాదశీ పుణ్యదినాన ఉపవాసం చేసి విష్ణుపూజ చేశాడు. అసురవేళ అని పట్టించుకోక, తెల్లవారకమునుపే **ద్వాదశీ స్నానం** చెయ్యడానికని **యమునానదిలో** దిగాడు. అప్పుడు వరుణుడి దూత నందుణ్ణి పట్టుకొని వరుణ పట్టణానికి తీసుకువెళ్లాడు.

మిగిలిన గోపకులు నందుడు కన్పించకపోగా ఆందోళన చెంది, బలరామకృష్ణుల్ని బిగ్గరగా పిలిచారు. శ్రీకృష్ణుడు విషయం గ్రహించి, తానూ వరుణలోకానికి వెళ్లాడు.

వరుణుడు శ్రీకృష్ణదర్శనానికి పులకించి, ఉపచారాలు చేసి, పూజించి, తన అపరాధాన్ని మన్నించమని నందుణ్ని అప్పగించాడు. నందుణ్ని తీసుకొని కృష్ణుడు గోకులానికి తిరిగి వచ్చాడు.

నందుడు చెప్పిన వృత్తాంతం విని కృష్ణుడు సాక్షాత్తు భగవంతుడే అని గోపాలురు భావించారు. కృష్ణుడు బంధువుల అంతర్గతాన్ని గ్రహించి, వాళ్ల మనోరథాన్ని ఈడేర్చాలనుకున్నాడు. వాళ్లను **బ్రహ్మకుండంలో** (యమునానది మడుగులో) ముంచెత్తాడు.

దేహాభిమానంతో పుట్టే అజ్ఞానం ద్వారా, ఆ అజ్ఞానం నుండి పుట్టే కోరికల ద్వారా, ఆ కోరికల మూలంగా పుట్టే కర్మలద్వారా జీవుడు యదార్థ స్వరూపాన్ని గ్రహించలేకుండా ఉన్నాడు. ఉచ్చనీచ జన్మల్ని ఎత్తుతూ, సంసార చక్రంలో పడి పరిభ్రమిస్తూ ఉంటారు. అతడికి జిజ్ఞాస కలిగినప్పుడు ఉత్తమ స్థితిని రుచి చూపడం మంచిది అని భావించి తన దివ్యధామాన్ని, దివ్యరూపాన్ని వ్యక్తపరిచాడు.

అది చూసిన నందాదులు పరమానంద భరితులయ్యారు. వెంటనే కలనుంచి మెలకువ పొందినట్లు, పూర్వస్థితికి వచ్చి తమ ముందున్న కృష్ణుణ్ని చూసి ఆశ్చర్యచకితులయ్యారు.

## గోపికల అనన్యభక్తి

శుకమహర్షిని పరీక్షిత్తు – **మహర్షీ! గోపికలు శ్రీకృష్ణుణ్ని కేవలం తమకు ప్రియుడిగా, చెలికాడుగా భావించారే కాని, పరబ్రహ్మ స్వరూపంగా కాదు కదా! అటువంటి విషయాసక్తి కలిగినవాళ్లు త్రిగుణాలతో నిండిన శరీరాల్ని ఎలా విడిచిపెట్టగలిగారు?** – అని ప్రశ్నించాడు.



**చుట్టరికంతో కాని, విరోధంతో కాని, కామంతోకాని, సంతోషంతోకాని, ప్రాణభయంతోకాని, భక్తితోకాని హరిధ్యానంలో ఉన్నవాళ్లు ముక్తి పొందుతారు** – అని శుకుడు చెప్పి, గోపికల ప్రేమ, భక్తిని, ప్రేమోన్మాదాన్ని పరీక్షిత్తుకు విశదంగా తెలియజేశాడు.

గోపికలది దివ్యప్రేమ. అందులో ప్రతిఫలాపేక్షలేదు. స్వర్గాధిపత్యాన్ని సైతం లెక్కచెయ్యని ఎల్లలెరుగని ప్రేమ. అవధిలేని పరమానందం వాళ్ల అంతిమ లక్ష్యం.

ఒకనాడు కృష్ణుడు వాళ్లను అనుగ్రహించాలని భావించి కొంతసేపు క్రీడించి అదృశ్యం అయ్యాడు. ఆ మధురమోహనమూర్తి అలా అదృశ్యం కావడం గోపికలకు బాధాకరమయింది. అతడికోసం కాళిందీ తీరంలోని అరణ్యప్రాంతాన్నింటినీ వెదికారు. చెట్టును, పుట్టనూ అడిగారు. అతడి జాడ తెలియలేదు. అంతలో వాళ్లకొక మల్లెపొద కన్పించింది. ఆ మల్లెల్ని సైతం విడిచిపెట్టక ప్రశ్నించారు.

**నల్లనివాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు పై**
**జల్లెడివాడు, మౌళిపరిసర్పిత పింఛము వాడు, నవ్వు రా**
**జిల్లెడిమోము వాడొకడు చెల్వల మానధనంబు తెచ్చెనో**
**మల్లియలారా! మీ పొదల మాటున లేడుగదమ్మ చెప్పరే! (1011)**

ఇలా వెదికి వెదికి, అన్నింటినీ ప్రశ్నించి చివరకు ఉన్మాదులయ్యారు. విచిత్రంగా ప్రవర్తించసాగారు. ఆ అవస్థలో వాళ్లు శ్రీకృష్ణలీలల్ని అనుకరించడం మొదలుపెట్టారు. సంధ్యాసమయానికి యమునాతీరం చేరుకున్నారు. అప్పుడు కృష్ణుడు వాళ్లమధ్యకు వచ్చాడు. వాళ్లందరూ అతడి చుట్టూ చేరి తమ హృదయాన్ని వ్యక్తపరిచారు.

**నాకోసం స్వజనాన్ని, లోకాన్ని, ధర్మాన్ని త్యజించారు. అదే మీ అనన్య భక్తికి తార్కాణం.** – అంటూ వాళ్లతో రాసక్రీడకు ఉపక్రమించాడు.

గోపికలతో రాసక్రీడ జరిపిన వృత్తాంతాన్ని శుకుడు చెప్పిన తర్వాత పరీక్షిత్తు ఒక సందేహాన్ని వెలిబుచ్చాడు.

**మహాత్మా! పరమేశ్వరుడు ధర్మానికి కర్త. భర్త. ధర్మమే స్వరూపమైన వాడు. సత్కర్మలాచరించేవాడు. అధర్మాన్ని శిక్షించడానికి, ధర్మాన్ని రక్షించడానికి భూమిపై అవతరించాడు. అటువంటి భగవంతుడే ఎటువంటి ధర్మమని పరసతులతో సంగమించాడు?**

శుకుడు – **సర్వభక్షకుడైన అగ్ని సమస్తం భుజించినా, దోషికాదు. అలాగే ఇంద్రుడు, చంద్రుడు మొదలైన తేజస్వంతులు దోషపూరితమైన కార్యాలు ఆచరించినా**

**దోషఫలం పొందరు. ఈశ్వరులు కానివాళ్లు పరపతుల్ని స్పృశించి బ్రతకలేరు. గౌరీపతి తప్ప లోక భయంకరమైన హాలాహలాన్ని మింగి మరొకరు జీవించగలుగుతారా?**

**గోపగోపీ జనంతో, ఇతర జీవరాశులలో అంతర్యామిగా ఎవరు వ్యవహరిస్తున్నారో అతడికి పరస్త్రీలు ఎవరు? క్రీడార్థం అవతరించిన ఆ సర్వవ్యాపి – అలా క్రీడించాడే తప్ప అందులో దోషం లేదు.**

## సుదర్శనుడి శాప విమోచనం

ఒకనాడు నందాదులు లంబికావనం వెళ్లారు .సరస్వతీ నదిలో స్నానం చేసి, పార్వతీ పరమేశ్వరుల్ని పూజించి, కానుకల అర్పించారు. తాము నీళ్లుమాత్రమే పుచ్చుకొని నియమంతో ఉన్నారు.

తర్వాత నిద్రిస్తున్న నందుణ్ని ఒక మహాసర్పం పట్టుకొని మింగడానికి ప్రయత్నించింది. నందుడు **కృష్ణా! – నన్ను రక్షించు** – అని మొరపెట్టుకున్నాడు.

శ్రీకృష్ణుడు ఆ సర్పాన్ని కాలితో తొక్కి ఒక తన్ను తన్నాడు. అది పామురూపాన్ని విడిచి విద్యాధర నాయకరూపాన్ని ధరించింది.

అతడు సుదర్శనుడనే విద్యాధరుడు. సౌందర్య మదంతో వికార స్వరూపం ఉన్న అంగిరస సంతతి వారిని చూసి నవ్వాడు. వాళ్లు కోపించి, సౌందర్య గర్వంతో మమ్మల్ని అవహేళన చేసిన నువ్వు పెద్ద పాములా పడి ఉండమని శపించారు. విద్యాధరుడు క్షమించమని ప్రాధేయపడగా, **యదువంశంలో విష్ణువు అవతరించి ఈ అడవికి వస్తాడు. అప్పుడతని కాలి తన్ను తిని శాపవిముక్తి పొందగలవు**– అని అనుగ్రహించారు.

విద్యాధరుడు కృష్ణుణ్ని కీర్తించి తన లోకానికి చేరుకున్నాడు.

## శంఖచూడుని వథ

ఒక వెన్నెలరాత్రి, తమ చుట్టూ గోపకాంతలు పరివేష్టించి ఉన్నప్పుడు బలరామకృష్ణులు మధుర గీతాలు ఆలపించారు. ఆ గీతాల మాధుర్యంలో మైమరిచిన స్థితిలో ఉండగా, గోపస్త్రీలను కుబేరుడి భటుడు శంఖచూడుడనేవాడు తన యోగబలంతో పట్టుకొని ఉత్తరదిశకు తీసుకు పోసాగాడు.

గోపకాంతల ఆక్రందనల్ని విని రామకృష్ణులు అతడితో తలపడ్డారు. అతడు భయకంపితుడై, గోపకాంతల్ని విడిచి పారిపోసాగాడు. కృష్ణుడు స్త్రీలను చూస్తుండమని బలరాముడితో చెప్పి, శంఖచూడుని వెంటపడి వధించాడు. అతడి కిరీటంలో వెలుగులు వెదజల్లుతున్న చూడామణిని తెచ్చి బలరాముడికి ఇచ్చి సంతోషపెట్టాడు.



## వృషభాసుర సంహారం

అరిష్టుడనే రాక్షసుడు ఎద్దురూపం ధరించి కృష్ణుడికి కీడు చెయ్యాలని వచ్చాడు. ఆ వృషభాన్ని చూసి గోకులంలోని ఆవులు, దూడలు, ఎద్దులు చెల్లాచెదురయ్యాయి. గోపకులు కృష్ణుణ్ని శరణుజొచ్చారు. కృష్ణుడు వృషభాసురుణ్ని చంపగానే గోపల్లెలోని వాళ్లందరూ హర్షించారు. దేవతలు గోపాలకృష్ణుడిపై పూలవాన కురిపించారు.

## నారదాగమనం – కంసుడి సన్నాహం

ఒకనాడు నారదుడు కంసుడు వద్దకు వచ్చాడు. అతడితో – **నీ నుంచి తప్పించుకున్న శిశువు యశోద కన్న కూతురు. శ్రీకృష్ణుడే దేవకీ గర్భంలో జన్మించినవాడు. బలరాముడు రోహిణి కుమారుడు. వాళ్లిద్దరూ నందుడి మందలో ఉన్నారు** – అన్నాడు.

కంసుడు ఆగ్రహంతో వసుదేవుడు చేసిన మోసానికి అతణ్ని చంపాలనుకున్నాడు. నారదుడు అతణ్ని వారించి, నీవంటి వాడికి అది తగదు అని దేవలోకం చేరుకున్నాడు.

కంసుడు వెంటనే దేవకీ వసుదేవుల్ని లోహపు సంకెళ్లతో బంధించాడు. కేశి అనే వాణ్ని పిలిచి గోకులానికి వెళ్లి, రామకృష్ణుల్ని చంపి రమ్మన్నాడు. తన అనుచరులందరినీ పిలిచి తన పన్నాగాన్ని వివరించాడు.

యాదవులలో ఉత్తముడైన అక్రూరుణ్ని పిలిపించి, **నంద గోకులానికి వెళ్లి కప్పం తీసుకొని, ధనుర్యాగం చూడదానికి ఆహ్వానించు. రామకృష్ణుల్ని కూడా ఉపాయంతో తీసుకురా!** – అని కంసుడు ఆదేశించాడు. **అక్రూరుడు** అంగీకరించి బయలుదేరాడు.

## కేశివ్యోమాసురుల సంహారం

కేశి కంసుడి ప్రేరణతో నందుడి మందలోకి వేగంగా ప్రవేశించాడు. అతడు మహా బలవంతుడు. గుర్రం ఆకారంలో దారుణంగా మందను దద్దరిల్లజేశాడు.

కృష్ణుణ్ని వెతుకుతూ వచ్చిన అతడికి, కృష్ణుడే ఎదురై తన ఎడమచేతితో ఆ రాక్షసుడి పళ్లను రాలగొట్టాడు. చేతిని అవలీలగా కడుపులోకి చొప్పించాడు. తన చేతిని పెంచడం ద్వారా రాక్షసుడి దేహం దోసపండులా రెండుగా చీలింది. ఇంద్రుణ్నీ, వరుణుణ్నీ జయించిన కేశిని శ్రీకృష్ణుడు అనాయాసంగా సంహరించాడు.

దేవతలు హర్షం వెలిబుచ్చారు. నారదుడు శ్రీకృష్ణుడి వద్దకు ఇక ముమ్ముందు ఎవరెవరు శ్రీకృష్ణుడి చేత హతమవుతారో చెప్పి, దేవదేవుణ్ని కీర్తించి వెళ్లాడు.

ఒకరోజు పశువులు మేపుతూ గోపబాలురందరూ ఒక పర్వతప్రాంతంలో దాగుడుమూతలు ఆడుతున్నారు. ఆ ఆటలో కొందరు గొఱ్ఱెలుగా, కొందరు కాపరులుగా,

మరికొందరు గజదొంగలుగా ఏర్పడి ఆటలాడసాగారు. అప్పుడు మయుడనే రాక్షసుడి పెద్దకొడుకు **వ్యోమాసురుడనే** వాడు గోపాలుడి వేషం ధరించి, ఆ ఆటలో గొఱ్ఱెలుగా నటిస్తున్న వాళ్లలో నలుగురైదుగురిని తప్ప తక్కినవాళ్లను ఒకపర్వత గుహలో దాచి, ఆ గుహను పెద్దబండతో మూసి, మునుపటిలా ఆటలోకి వచ్చాడు.

కృష్ణుడు అతణ్ని పసిగట్టి, చంపాడు. పర్వతగుహ ద్వారాన్ని మూసి ఉన్న బండను ముక్కలయ్యేటట్లు తన్నాడు. గుహలో తిరుగాడుతున్న గోపాలబాలురిని వెంటబెట్టుకొని గొల్లపల్లె చేరాడు.

## అక్రూరుడిపై అనుగ్రహం

అక్రూరుడు కంసుడి ఆజ్ఞతో బృందావనానికి వచ్చాడు. బలరామకృష్ణుల్ని దర్శించబోతున్న తన అదృష్టానికి మురిసిపోయాడు. మన్మథాకారులైన వాళ్లనిచూసి పరవశించి, వాళ్ల పాదాలకు వినయంగా నమస్కరించాడు. కుశల ప్రశ్నల తర్వాత తాను వచ్చిన కారణాన్ని అక్రూరుడు వాళ్లకి తెలియజేశాడు.

మధురానగరానికి కృష్ణుడు వెళ్లబోతున్నాడని తెలిసి గొల్లపడుచులు ఆవేదన చెందారు. వచ్చినవాడు అక్రూరుడు కాడు . క్రూరుడని నిందించారు. మరునాడు సూర్యోదయ సమయంలో మధురా నగరం బయలుదేరిన కృష్ణుడు తనతోబాటు వస్తానన్న గోపికల్ని వారించి మళ్లీవస్తానని దూతికలద్వారా చెప్పించి వాళ్లని వెనక్కి పంపాడు.

బండ్లనిండా కానుకలు, పెరుగు, పాలు, వెన్న, నెయ్యి మొదలైన వాటిని ఎత్తించుకొని నందాదులు వెంటరాగా రామకృష్ణులు అక్రూరుడు తోలే రథం ఎక్కి బయలుదేరారు. కాళిందీ నదీతీరాన నిలిచి, నీళ్లు తాగి రామకృష్ణులు రథం ఎక్కారు. వాళ్ల అనుమతితో అక్రూరుడు వేదమంత్రాలు జపిస్తూ నదిలో స్నానం చేశాడు. ఆ నదిలో అతడికి రామకృష్ణులు దర్శనం ఇచ్చారు. రథంలో ఉన్నవాళ్లు ఇక్కడికి ఎలా వచ్చారు? అని ఆశ్చర్యంతో చూస్తుండగానే, ఆదిశేషుడిపై పవ్వళించిన కృష్ణుడు దర్శనం ఇచ్చాడు. గద్గద కంఠంతో అక్రూరుడు ఆ స్వామిని స్తుతించాడు. తన్నుస్తోత్రం చేస్తున్న అక్రూరుడికి కృష్ణుడు తన పూర్వరూపం చూపి, నటుడిలా దాన్ని మరుగునపరిచి అదృశ్యం అయ్యాడు.

రథం వద్దకు వచ్చిన అక్రూరుడితో – **దగ్గరే ఉన్న నదిలో స్నానం చేసి రావడానికి ఇంత సమయం ఎందుకు పట్టింది! భూమ్యాకాశాలలో లేని వింతలు నదీజలాలలో కన్పించాయా** ? అని కృష్ణుడు ప్రశ్నించాడు.

అక్రూరుడు – **నీలో లేని వింతలు మరెక్కడైనా ఉంటాయా స్వామీ! అన్నీ నీలోనే ఉన్నాయి** అంటూ సాయంత్రానికల్లా మధురానగరం చేరేటట్లు రథం నడిపాడు.



ముందుగా వెళ్లిన నందుడు మొదలైన వాళ్లు ఊరి పొలిమేరలోని ఉద్యానవనంలో బసచేసి ఉన్నారు. కృష్ణుడు వాళ్లను కలుసుకొని – **నువ్వు రథం తోలుకొని పట్టణానికి వెళ్ళు. మేము తర్వాత వస్తాము** – అని అక్రూరుణ్ని సాగనంపాడు.

## శ్రీకృష్ణుని మధురానగర ప్రవేశం

అక్రూరుడు రామకృష్ణులు వచ్చిన సంగతి కంసుడికి తెలియజేసి తన ఇంటికి వెళ్లాడు. కృష్ణబలరాములు గోపబాలురితో కలిసి పురప్రవేశం చేశారు. కృష్ణుడి రాకను తెలుసుకున్న యువతులు అతణ్ని చూడాలని ఒకరినొకరు పిలుచుకున్నారు. వాళ్లు చేస్తున్న పనుల్ని వెంటనే ఆపి, తొట్రుబాటుతో, తారుమారుగా అలంకరించుకొని వెళ్లారు.

ఎత్తైన మేడలనుండి కృష్ణుణ్ని చూశారు. కృష్ణుడి గురించి విన్నవాటిని చర్చించుకుంటూ ఆ భువనైక సుందరుడు ఇతడేనా? ఇతడు లేని పట్టణం అరణ్య ప్రదేశం. ఇతణ్ని కలుసుకోలేని జీవితం నిరుపయోగం. ఇతణ్ని పలుకరించని పలుకు చిలుక పలుకు. ఇతడిని చూడని చూపులు వ్యర్థం – అనుకున్నారు.

ఎల్లప్పుడూ కృష్ణుడితో ఆడుతూ, పాడుతూ, పలకరిస్తూ, తాకుతూ, జీవిస్తున్న గోపకాంతల అదృష్టాన్ని తలచుకున్నారు.

శ్రీకృష్ణుడు వెళ్తున్న దారిలో నగర వాకిటనుంచి వస్తున్న రంగులు వేసే ఒక చాకలిని చూసి ఇలా అన్నాడు.

**ఓ రజక కుల శిరోమణీ! మేము మీ రాజుకు అతిథులుగా వచ్చాము. మేము ధరించడానికి మంచి వస్త్రాలు లేవు. నీ మూటలో అందమైన బట్టలున్నాయి. మేము రాజుగారి అల్లుళ్ళం. ఆ వస్త్రాలు మాకివ్వు. నీకు మేలు జరుగుతుంది.**

ఆ చాకలి కోపంతో కృష్ణుణ్ని, అతడి స్నేహితుల్ని చులకనగా మాట్లాడాడు. కృష్ణుడు తన ముంజేతితో తల ఊడిపడేటట్లు చాకలిని కొట్టాడు. అతడి ప్రాణాలు గాలిలో కలిశాయి. రామకృష్ణులు తమకు కావలసిన వాటిని తీసుకొని గోపబాలురికి ఇచ్చారు.

ముందుకు సాగిన వాళ్లకు ఒక చేనేత పనివాడు ఎదురువచ్చాడు. అతడు పలురంగులున్న మిక్కిలి మెత్తగా ఉన్న వస్త్రాలను, ఆభరణాలను సంతోషంగా సమర్పించాడు. అతడి పరిచర్యకు సంతోషించి. ఐశ్వర్యాదులను కృష్ణుడు అనుగ్రహించాడు. తన సారూప్యాన్ని, సంపత్తిని ప్రసాదించాడు.

అనంతరం వాళ్లు మాలలు కట్టే సుదాముడి ఇంటికి వెళ్లారు. వాళ్లని చూసిన వెంటనే సుదాముడు అర్ఘ్యపాద్యాదులతో సత్కరించాడు. సుదాముడు ఇచ్చిన దండల్ని అలంకరించుకొని – **నీకేమి కావాలో కోరుకో** – అని కృష్ణుడన్నాడు.

అతడు – **పద్మాలవంటి నీ పాదాలను సేవించడం, నీ పాదాలను అర్చించే భక్తులతో స్నేహం, సర్వప్రాణులపట్ల ఎల్లప్పుడూ దయ ఉండేటట్లు అనుగ్రహించు** – అన్నాడు.

సుదాముడు కోరినవి అనుగ్రహించి బలం, ఆయుస్సు, తేజం, యశం, సిరిసంపదల్నీ కరుణించాడు.

అలా ముందుకు సాగిన కృష్ణుడు దారిలో పలురకాల మై పూతలుంచిన పాత్ర పట్టుకొని వస్తున్న కుబ్జను చూశాడు. ఆమెతో – **ఎవరు నువ్వు. ఈ లేపనాలను ఎవరికి తీసుకెళ్తున్నావు? వీటిని మాకివ్వు. నువ్వు చక్కగా ప్రకాశిస్తావు** – అన్నాడు.

ఆమె **నన్ను త్రివక్ర అంటారు. నేను కంసుడి దాసిని. మైపూతలు చెయ్యడం నాకు తెలిసిన విద్య** – అని వాటిని బలరామకృష్ణులకు ఇచ్చింది.

కృష్ణుడు ప్రసన్నుడై, ఆమె మీగాళ్లమీద తన అడుగులుంచి తొక్కిపట్టాడు. తన రెండు చేతివేళ్లను ఆమె గడ్డం కింద పెట్టి దేహం చక్కగా సాగేటట్లు పైకెత్తాడు. అంతటితో ఆమె వంపులు మాయమై అత్యంత సౌందర్యవతిగా ప్రకాశించింది.

ఆమెను సాగనంపి, ముందుకు వెళ్తూ, పురప్రజలిచ్చిన కానుకల్ని, స్వీకరిస్తూ ధనుశ్శాలకు వెళ్లాడు. అక్కడ గోప వీరులతో రక్షింపబడుతున్న పెద్ద విల్లును చూశాడు. రక్షకులు వారిస్తున్నా, ఎడమచేత్తో ధనుస్సును పైకెత్తి అల్లెత్రాడును బిగించి, నారిని మ్రోగిస్తూ దాన్ని రెండుగా విరిచేశాడు. అప్పుడు వెలువడిన శబ్దం కంసుడి గుండెల్ని భేదించింది.

రక్షకులు దాడిచెయ్యగా, బలరామకృష్ణులు ఆ వింటి తుంటల్ని పట్టుకొని వాళ్లనందరినీ మట్టుపెట్టారు. ఇంతలో సూర్యాస్తమయం అయింది. రామకృష్ణులు ఆ రాత్రి గోపకులతో క్షీరాన్నం భుజించి కంసుడి ప్రయత్నాలను గమనిస్తూ యథేచ్ఛగా విహరిస్తూ ఆ నగర ఉపవనంలో గడిపారు.

సూర్యోదయం అయిన పిదప నందుడు మొదలైన గోపకుల పెద్దలు మల్లరంగంలో కొలువుతీరిన కంసుణ్ణి దర్శించి, కానుకల్ని సమర్పించి, అతడి అనుజ్ఞతో పెద్ద పెద్ద ఆసనాల మీద వరుసగా కూర్చున్నారు.

## రామకృష్ణుల స్వైరవిహారం

కృష్ణబలరాములు అలంకరించుకొని రంగస్థల ద్వారం వద్దకు వచ్చారు. అక్కడ **కువలయాపీడమనే** ఏనుగును చూశారు. మావటి వాడు దాన్ని తమపైకి ఉసిగొల్పడం చూసి, కృష్ణుడు ఏనుగుమీద కలియబడి, దాన్ని అలమటింపజేశాడు. మదించిన ఏనుగును సింహంలా కాలితో తొక్కి భయంకరమైన దాని దంతాలను ఊడబీకి, బాది చంపాడు. ఆ



ఏనుగుదంతాలతోనే మావటి వాళ్లను యమపురికి సాగనంపాడు. చచ్చిన ఏనుగును, వచ్చిన రామకృష్ణుల్ని చూసి నొచ్చిన మనస్సుతో కంసుడు భయపడ్డాడు.

**చాణూర ముష్టికులనే** గొప్ప మల్లయోధులు రామకృష్ణుల్ని మల్లయుద్ధానికి ఆహ్వానించారు. కృష్ణుడు – **మేము మల్లయుద్ధంలో నేర్పరులం కాము. చిన్నవాళ్లం. కాని పోరాటానికి ఆహ్వానిస్తే ఎలా కాదనగలం! నేను చాణూరుడైన నీతో, మా అన్న ముష్టికుడితో పోరాడతాం. ప్రభువైన కంసుడికి ప్రీతికలిగిస్తాం** – అన్నాడు.

ఆ తర్వాత జరిగిన యుద్ధంలో కృష్ణబలరాములు చాణూర ముష్టికుల్ని హతమార్చారు. అది చూసి సభలోని వాళ్లందరూ మెచ్చుకున్నారు. కంసుడు మాత్రం మాత్సర్యంతో మెచ్చలేదు.

## కంసవధ – ఉగ్రసేనుడి పట్టాభిషేకం

కంసుడు కోపంతో – **ఈ గోపబాలురిని పట్టణద్వారం దాటి వెళ్లేటట్లు తరమండి. గొల్లల్ని ముట్టడించండి. నందుణ్ని బంధించండి. వసుదేవుణ్ని చంపండి. ఉగ్రసేనుణ్నీ ఉపేక్షించవద్దు. అతడు నా తండ్రి కాదు. శత్రువు** – అని మంత్రుల్ని ఆదేశించాడు.

కంసుడు ఆదేశాలు ఇస్తుండగానే కృష్ణుడు మంచె మీదికి దూకాడు. తన మీదికి వస్తున్న కృష్ణుణ్ని చూసి కత్తి చేతబట్టుకొని కంసుడు ఎదిరించాడు. గరుత్మంతుడు పామును పట్టినట్లు శ్రీకృష్ణుడు కంసుడి జుట్టు పట్టులాగి, రంగస్థలం మీదికి పడేశాడు. అలా వచ్చిపడిన కంసుడు బిగుసుకుపోయి ప్రాణాలు వదిలాడు.

కంసుడు రోషంలో, సంతోషంలో, నిద్రలో, సంభాషణా సందర్భంలో, భోజనవేళల్లో, నీళ్లు తాగుతున్నప్పుడు శ్రీకృష్ణుణ్ని ద్వేషంతోను, దోషబుద్ధితోనూ తలిచాడు. అయినా అతడు భగవంతుణ్ని చేరి ఉత్తమగతి పొందాడు.

కంసుడి తోబుట్టువులు న్యగ్రోధుడు, గహ్వుడు మొదలైనవాళ్లు అనేక రకాల యుద్ధపరికరాలతో కృష్ణుడి మీదకు విజృంభించారు. అప్పుడు బలరాముడు రౌద్రాకారం దాల్చి **పరిఘ** అనే ఆయుధంతో వాళ్లను యమసదనానికి పంపాడు.

కంసుడు, మరణించిన ఇతరుల భార్యలు, భర్తల మరణ వార్తవిని శోకంతో తమ మందిరాలనుంచి వచ్చి దుఃఖించసాగారు. కృష్ణుడు వాళ్లను ఓదార్చి కంసాదులకు పారలౌకిక క్రియలు జరిపేందుకు ఆదేశించాడు.

దేవకీ వసుదేవుల్ని విడిపించి, బలరాముడితో కలిసి వాళ్లకి నమస్కరించాడు. ఆ తర్వాత ఉగ్రసేనుణ్ని వసుదేవుడు సత్కరించి మధురానగరానికి రాజును చేశాడు.

మధురానగరంలో పరిస్థితుల్ని చక్కబెట్టి బృందావనానికి వస్తామని అందరికీ చెప్పండి. గోకులంతో మీరు ప్రేమతో, దయతో మాకు చేసిన ఉపచారాలు మేమెక్కడున్నా, మా మనసులు నుండి తొలగిపోవు – అని కృష్ణుడు వస్త్రాలు, ఆభరణాలు మొదలైన వాటిని ఇచ్చి నందాదుల్ని సాగనంపాడు. నందుడు ప్రేమ అతిశయించగా గుండెల నిండా బాధతో విలవిలలాడుతూ కన్నీళ్లతో గొల్లపెద్దలతో కలిసి రేపల్లెకు వెళ్లాడు.

## గురుశుశ్రూష

వసుదేవుడు తన కుమారులకు **గర్గుడు** మొదలైన బ్రాహ్మణ పురోహితుల సన్నిధిలో ఉపనయన సంస్కారం జరిపించాడు. ఉపనయనం తర్వాత భూరిదానాలిచ్చాడు.

బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబించిన బలరామకృష్ణులు, భూమిపై జన్మించిన ఎవరైనా, గురూపదేశం వింటే తప్ప విద్యావంతులు కాలేరని చాటి చెప్పటానికి, తాము అన్నీ తెలిసిన వాళ్లైనా, గురువును అన్వేషిస్తూ కాశీనగరం చేరుకున్నారు.

సమస్త విద్యలలో నిష్ణాతుడని ప్రసిద్ధిగాంచిన **సాందీపని** వద్ద శిష్యులుగా చేరారు. వాళ్ల సత్ప్రవర్తన చూసి మెచ్చిన సాందీపని వాళ్లకి వేదాలు, వేదాంగాలు, ధర్మ, న్యాయ, తర్క, రాజనీతి శాస్త్రాలను బోధించాడు. మిక్కిలి ప్రతిభావంతులైన రామకృష్ణులు అరవై నాలుగు కళలను, అరవై నాలుగు రోజుల్లో అభ్యసించారు.

ఇంతటి ప్రతిభావంతులైన శిష్యుల్ని చూసి గురువు – **మా కుమారుడు సముద్రంలో ప్రభాసఘట్టం వద్ద స్నానంచేస్తూ మునిగిపోయాడు. మళ్లీ కన్పించలేదు. గొప్ప ప్రతాపవంతులైన మీరు శిష్యులయ్యారు కనుక గురుదక్షిణగా నా కుమారుణ్ని తెచ్చి ఇవ్వండి** – అన్నాడు.

రామకృష్ణులు రథాన్ని అధిరోహించి సముద్రం వద్దకు వెళ్లారు. సముద్రుణ్ని హెచ్చరిస్తూ – **మా గురువుగారి పుత్రుణ్ని అప్పగించు. లేదంటే మా బాణాలు విరజిమ్మే అగ్నిజ్వాలలకు ఆహుతి అవుతావు** – అన్నారు.

సముద్రుడు – **నా మాటలు నమ్మండి. ఆ బాలుడు స్నానం చేస్తుండగా పెద్ద తరంగం ఒకటి వేగంగా అతణ్ని లోపలికి తీసుకువెళ్లింది. పంచజనుడనే రాక్షసుడు ఆ బాలుణ్ని మింగేశాడు** – అన్నాడు.

శంఖారావం చేసి సముద్రంలోకి ప్రవేశించి **పంచజనుణ్ని** హతమార్చి వాడి పొట్టను చీల్చాడు. అక్కడ బాలుడు కన్పించలేదు. పంచజనుడి శరీరం నుంచి పుట్టిన **పాంచజన్యమనే** పెద్ద శంఖాన్ని కృష్ణుడు తీసుకువచ్చాడు. బలరాముడితో సహా రథం ఎక్కి యమపురికి వెళ్లాడు. **సంయమని** అనే పేరుగల యమపురి వాకిట్లో భయం కల్గించే



తన శంఖాన్ని పూరించాడు. యముడు ఆగ్రహంతో వచ్చి రామకృష్ణుల్ని చూసి, వాళ్లు నారాయణులని గ్రహించి భక్తితో పూజించాడు. వచ్చిన పని గురించి అడిగాడు.

కృష్ణుడు చెప్పిన తర్వాత – ఆ బ్రాహ్మణ బాలుణ్ని తీసుకొని వచ్చి అప్పగించాడు. వాళ్లు గురుదక్షిణను భక్తిపూర్వకంగా సమర్పించారు. సాందీపని వర్ణించలేనంత ఆనందంతో వాళ్లను దీవించాడు. రామకృష్ణులు మధురానగరానికి వచ్చి ప్రజల్ని ఆనందింపజేశారు.

## గొల్లభామలకు సందేశం

ఒకరోజు కృష్ణుడు ఉద్ధవుడితో ఏకాంతంగా ఇలా అన్నాడు. నా మీది వ్యామోహంతో నా రాకను ఎదురుచూస్తూ గోపికలు దుఃఖిస్తుంటారు. వారితో సంశయాన్ని విడిచిపెట్టమని చెప్పు. తప్పక కృష్ణుడు బృందావనానికి వస్తాడని కూడా చెప్పు. –

ఉద్ధవుడు రథం ఎక్కి సూర్యాస్తమయానికి లోపు నందుడి ఇల్లు చేరాడు. వాళ్లకి కృష్ణుడి క్షేమసమాచారాలు చెప్పి సంతోషపెట్టాడు. కృష్ణుడు మిమ్మల్ని దర్శించడానికి త్వరలోనే వస్తాడని చెప్పాడు. ఆ రాత్రి విశ్రమించి ఉదయం సంధ్యోపాసనాది నిత్యానుష్ఠానాలు ముగించుకొని ఉద్ధవుడు ఏకాంత స్థలంలో ఉన్నాడు. గోపకాంతలు అక్కడికి చేరి కృష్ణుడి గురించి అడిగారు.

అందులో ఒక గోపిక శ్రీకృష్ణ చరణధ్యానంలో పరవశురాలయింది. తన సమీపంలో పూదేనెను తాగి మత్తిల్లిన, తన మధుర మంజుల ఝుంకారస్వరంలో కాముకుల్ని కలవరపెట్టేది అయిన ఒక గండుతుమ్మెదను చూసింది.

దాన్ని చూసిన గోపిక తన్ను బ్రతిమాలడానికి ప్రియుడు పంపిన దూతగా కల్పించుకొని ఉద్ధవుడికి అన్యాపదేశంగా స్ఫురించేటట్లు ఆ భ్రమరంతో పలికిన పలుకులే **భ్రమరగీతాలు**. నిందాస్తుతితో (నిందలోనే స్తుతి ఉండడం) సాగిన ఆ మాటలు విని ఉద్ధవుడు వాళ్లను ఓదార్చాడు.

**స్త్రీలు సమీపంలో ఉన్నవాళ్లకంటే దూరంగా ఉన్న ప్రియులపట్ల ఎక్కువగా అనురక్తులై ఉంటారు. అంతేకాక మీరెల్లప్పుడూ నన్నే స్మరిస్తూ ఉండాలని మీకు దూరంగా ఉన్నాను. భయపడకండి. నిరంతర ధ్యానంతో మీరు నన్నే పొందుతారు** – అని శ్రీకృష్ణుడు నాకు చెప్పి పంపాడు. ఆ మాటలు విని గోపికలు సంతోషించారు. ఉద్ధవుడు గోపికల మనోవేదనను గ్రహించాడు.

శ్రీకృష్ణలీలల్ని వర్ణిస్తూ కొన్ని నెలలపాటు ఉద్ధవుడు రేపల్లెలో గడిపాడు. పిదప నందుడు మొదలైన యదుశ్రేష్ఠుల వద్ద అనుజ్ఞ తీసుకొని రథమెక్కి మధురకు బయలుదేరాడు.

**ఉద్ధవుడు మథురానగరం** వచ్చి నందాదులు ఇచ్చిన బహుమానాలు కృష్ణబలరాములకు, ఉగ్రసేన మహారాజుకు వేర్వేరుగా సమర్పించాడు. కృష్ణుడు కుబ్జను అనుగ్రహించడానికి ఉద్ధవుడితో కలిసి ఒకరోజు ఆమె ఇంటికి వెళ్లాడు. ఆమె కోరినట్లు కొన్నాళ్ల సాహచర్యాన్ని ఆమెకు కలిగించాడు.

## అక్రూరుని హస్తినాపుర సందర్శనం

కృష్ణుడు ఉద్ధవ, బలరాములతో కలిసి అక్రూరుని ఇంటికి వెళ్లాడు. అతడితో – **నువ్వు మాకు చుట్టానివి. మేలుకూర్చేవాడివి. వరుసకు పినతండ్రివి. మా కోరికల్ని నెరవేర్చడానికి సమర్థుడివి. పాండురాజు మరణించడంతో తల్లి కుంతితోబాటు పాండవులు ధృతరాష్ట్రుడి ఆదేశంతో హస్తినాపురంలో ఉన్నారు. ధృతరాష్ట్రుడు కొడుకులమీది వ్యామోహంతో కురుపాండవులిద్దరి పట్ల సమానమైన అనురాగాన్ని ప్రదర్శించడం లేదు. హస్తినలో పాండవుల్ని చూసి, పరామర్శించి రావాలి** – అన్నాడు.

అక్రూరుడు కృష్ణుడి ఆదేశం మేరకు హస్తినాపురం వెళ్లి అందరినీ పరామర్శించి సత్కారాలు పొందాడు. ఒకరోజు విదురుడు మాత్రమే ఉన్నప్పుడు కుంతీదేవి మథురలోని తన బంధువుల్ని గురించి విచారించింది. **మా ఇక్కట్లను గురించి వాళ్లు ఆలోచిస్తున్నారా?** అని ప్రశ్నించింది. **దుర్యోధనుడి క్రూరచర్యల్ని గురించి** చెప్పింది. **బలరామకృష్ణులు తమ మేనత్త బిడ్డల క్షేమం గురించి ఆలోచిస్తున్నారా?** అని అడిగింది. **శ్రీకృష్ణుడు భూమిని సమభాగాలుగా చేసి న్యాయసమ్మతంగా తన బిడ్డలకు ఇప్పించగలడా?** అని పరోక్షంగా శ్రీకృష్ణుడి సహాయాన్ని అర్థించింది.

అక్రూరుడు ఇంపైన మాటలతో ఆమెకు దుఃఖోపశమనం కల్గించాడు. వాళ్లని వీడ్కొని బంధుమిత్రుల మధ్య సుఖంగా ఆసీనుడై ఉన్న ధృతరాష్ట్రుని వద్దకు వెళ్లాడు.

**కురుపాండవులు ఇద్దరిపట్ల నువ్వు సమబుద్ధితో ఉండటం శ్రేయస్కరం. లేకపోతే ఇహపరాలలో నిందలకు లోనవుతావు. నువ్వు న్యాయంగా ప్రవర్తించి పాండవులకు వాళ్ల భూభాగాన్ని ఇవ్వు** – అని హితం పలికాడు.

ధృతరాష్ట్రుడు – **నువ్వన్నది నిజమే. మంగళకరమైనది కూడా. కాని ఈ మాటలు నాలో స్థిరంగా నిలబడవు. శ్రీకృష్ణుడు పరమ పురుషుడు. అతడి దివ్యచిత్తంలో ఎలా ఉందో అలాగే జరుగుతుంది.**

అక్రూరుడు అందరివద్ద సెలవు తీసుకొని తిరిగివచ్చి కృష్ణబలరాములకు అంతా చెప్పి ధృతరాష్ట్రుడి అభిప్రాయాన్నీ తెలియజేశాడు.



## జరాసంధుడు

కంసుడి భార్యలు **అస్తి, పాస్తి** అనేవాళ్లు జరాసంధుడి కుమార్తెలు. వాళ్లు విధవలై దుఃఖిస్తూ జరాసంధుడి వద్ద జరిగిందంతా చెప్పి విలపించాడు. జరాసంధుడు కోపోద్రిక్తుడై ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో మధురా నగరంపైకి దండెత్తారు.

శ్రీహరి ఆ దండును చూసి, **జరాసంధుడిపట్ల సామదాన భేదోపాయాలు వ్యర్థం. దండోపాయమే సరైన మార్గం. ఆ మార్గంలో భూభారాన్ని తగ్గించాలి. యుద్ధంలో జరాసంధుణ్ని చంపకూడదు. వాడు మరణించకపోతే మళ్లీ మళ్లీ సైన్యాన్ని సమకూర్చుకొని వస్తాడు. అప్పుడు అందరినీ చంపి చివరగా ఇతణ్ని చంపవచ్చు** – అని తలపోశాడు.

బలరామకృష్ణులు తమ దండుతో జరాసంధుణ్ని ఎదుర్కొన్నారు. పరస్పరం భీషణ వాక్యాలు పలికిన పిదప యుద్ధం కొనసాగింది. తొలుత యాదవవీరులు ఎక్కువగా ప్రాణాలు కోల్పోయారు. అది చూసి బలరామకృష్ణులు విజృంభించారు. హరిదివ్య శరాలు సంధించాడు. బలరాముడు హలాయుధాన్ని, ముసలాన్ని (రోకలిని) సంధించి స్వైరవిహారం చేసి జరాసంధుడి సైన్యాన్ని ఛిన్నాభిన్నం చేసి చంపాడు.

బలరాముడు కోపంతో భయంకర రూపంతో జరాసంధుణ్ణి పట్టుకున్నాడు. ఎత్తిపొడుపు మాటలతో పరాభవించి, తన పిడికిటి పోటుతో కంఠగత ప్రాణుణ్ని చేశాడు. కృష్ణుడు భూభారాన్ని తగ్గించాలన్న ఉద్దేశంతో భవిష్యత్తును తలపోసి, జరాసంధ వధను మాన్పి, మగధుడితో (మగధ దేశాధిపతి జరాసంధుడు) ఇట్లన్నాడు.

**నువ్వు దుఃఖించవలసిన పనిలేదు. వెళ్లు. నీ సేనల్ని సమకూర్చుకొని మళ్లీరా! అలా చెయ్యకపోతే భువిలో, దివిలో విహరించే ప్రజలు మెచ్చేటట్లు నీ పరాక్రమాన్ని చాటి నీ మెదడు ముక్కల్ని పిశాచాలు తినేలా, నీ శరీరాన్ని వదిలిపెట్టు.**

పరాభవంతో వెళ్లిన జరాసంధుడు భూమిలోని దుష్టరాజుల్ని చేర్చుకొని పదిహేడుసార్లు పదిహేడు ఆక్షేపిణుల సైన్యంతో మధురపై దండెత్తాడు. ప్రతిసారి తన బలమంతా క్షీణించిపోయినా 18వ పర్యాయం యుద్ధానికి సిద్ధపడ్డాడు.

## కాల యవనుడు

ఆ సమయంలో కలహవిద్యలో ఆరితేరిన నారదుడు కాలయవనుడి వద్దకు వచ్చాడు. **కాలయవనా! నువ్వు రాజులందరినీ జయించి యాదవుల్ని ఎందుకు జయించలేదు? వాళ్లంటే భయమా? యాదవుల్లో ఒకడు జరాసంధుడు మొదలైన వాళ్లని పరాజయం పాలుచేశాడు. అతడి వీరోచిత కార్యాల గురించి వినలేదా?** – అంటూ రెచ్చగొట్టాడు.

కృష్ణుడి వివరాలు నారదుడి ద్వారా గ్రహించి, వీరాలాపాలు పలికి, మూడుకోట్లమంది మ్లేచ్ఛవీరులతో వెళ్లి మధురానగరాన్ని ముట్టడించాడు.

బలరాముడితో కృష్ణుడు సమాలోచన జరిపాడు.

**యవనుడు** పట్టణాన్ని ముట్టడించాడు. ఒకటి రెండు రోజుల్లో **మాగధుడు** మనమీదికి దండెత్తి వస్తాడు. ఇద్దరూ బలవంతులే. వాళ్లు పట్టణం రెండు వైపులా దాడిచేస్తే – మనం ఒకవైపు యుద్ధం చేస్తున్నప్పుడు, మరొకడు మరోవైపు వచ్చి మనవాళ్లని చంపవచ్చు. లేదా బంధించవచ్చు. కనుక శత్రువులు దాడి చెయ్యడానికి వీలుకాని విషమ ప్రదేశంలో దుర్గం నిర్మించి మనవాళ్లందరినీ ఉంచాలి.

అని ఆలోచించి శ్రీకృష్ణుడు సముద్రుణ్ని అడిగి సాగరమధ్యంలో పన్నెండు ఆమడల పొడవు, అంతే వెడల్పున్న ఒక దుర్గమ ప్రదేశాన్ని సంపాదించి, ఒక పట్టణం నిర్మించమని **దేవశిల్పి** అయిన **విశ్వకర్మను** ఆదేశించాడు.

విశ్వకర్మ పరమనైపుణ్యంతో నిర్మించిన పట్టణంలోకి శ్రీకృష్ణుడు తన యోగ మహిమతో మధురానగర ప్రజలందరినీ చేర్చి బలరాముడికి తెలియజేశాడు. అన్న అనుమతితో కృష్ణుడు మధురానగరం నుండి నిరాయుధుడిగా వెలువడ్డాడు.

కాలయవనుడు అతణ్ని చూశాడు. నారదుడు వర్ణించింది ఇతణ్నేనని నిర్ధారించాడు. కాలయవనుడు కృష్ణుణ్ని పట్టుకోవడానికి అశ్వాన్ని కదిలించాడు. కృష్ణుడు అతడికి పట్టువడకుండా వేగంగా పరుగెత్తాడు. కాలయవనుడు అతడి వెంటపడ్డాడు.

ఇలా పరుగెత్తి, పరుగెత్తి, తుదకు కొండ గుహలోకి ప్రవేశించాడు. కాలయవనుడు అతడి వెంట గుహలోకి వెళ్లి పెద్దపాన్పుమీద పడుకొని గురకపెడుతున్న ఒక మహాపురుషుణ్ని చూశాడు. అతడే కృష్ణుడని భావించి, వజ్రాయుధం వంటి తన కాలితో తన్నాడు. తన్నడంతో నిద్రలేచి ఒళ్లు విరుచుకుంటూ ఆ పురుషుడు గుహనాలుగు వైపులా చూశాడు. మహోగ్రమైన ఆగ్రహంవల్ల చూపుల్లో పుట్టిన అగ్నిజ్వాలల్లో యవనుడు భస్మం అయ్యాడు.

## ముచుకుందుడు

ఆ మహాపురుషుడు ఇక్ష్వాకు వంశంలో జన్మించిన మాంధాత కుమారుడు ముచుకుందుడనే మహారాజు. అసురులకు భయపడిన దేవతల్ని చాలాకాలం రక్షించాడు. దేవలోకాన్ని కాపాడిన అతణ్ని మెచ్చుకొని దేవతలు వరం కోరుకొమ్మన్నారు. ముచుకుందుడు మోక్షం అనుగ్రహించమన్నారు.

**నీ రాజ్యాన్ని విడిచిపెట్టి చిరకాలం మమ్మల్ని సంరక్షిస్తూ ఇక్కడే ఉండిపోయావు. ఈ లోపల నీ పత్నులు, స్నేహితులు, చుట్టాలు, కుమారులు అందరూ గతించారు. ఎంతటి వాళ్లైనా కాలప్రభావాన్ని తప్పించలేరు. భగవంతుడే కాలస్వరూపుడు. కైవల్యం తప్ప మరేదైనా కోరుకో. మోక్షం ఇవ్వడానికి నారాయణుడు తప్ప మేము అధికారులం కాము –** అని దేవతలు చెప్పారు.



ముచుకుందుడు నిద్రను కోరుకున్నాడు. అప్పుడతడు ఈ కొండగుహలోకి వచ్చి ఇంతకాలం నిద్రించాడు. కాలయవనుడు భస్మమైన తర్వాత – **ముకుందుడు**, ముచుకుందుడి ఎదుట నిలిచాడు. ముచుకుందుడు ప్రశ్నించిన తర్వాత కృష్ణుడు తన గురించి తెలిపి – **పూర్వం నువ్వు నన్ను ఆరాధించావు. ఆ కారణం వల్ల నిన్ను అనుగ్రహించడానికి ఈ పర్వత గుహకు వచ్చాను. నీకు ఇష్టమైన వరాలు కోరుకో ఇస్తాను** – అన్నాడు. ముచుకుందుడు కృష్ణుడికి నమస్కరించి, అతడు సాక్షాత్తు నారాయణుడు అని తెలిసి, 28వ మహాయుగంలో భూమిపై పుండరీకాక్షుడు అవతరిస్తాడని పూర్వం **గర్గాచార్యులు** చెప్పినమాట గుర్తుకువచ్చి శ్రీకృష్ణుణ్ని స్తోత్రం చేశాడు.

శ్రీకృష్ణుడు – **క్షాత్రధర్మాన్ని అనుసరించి పూర్వం వేటాడి జంతువుల్ని చంపావు కనుక తపస్సుచేసి పాపం బాపుకో. మరుసటి జన్మలో బ్రాహ్మణుడివై ప్రాణులపట్ల మైత్రికలిగి నన్ను పొందగలవు** అని శ్రీకృష్ణుడు గుహనుండి వెలుపలకు వచ్చాడు. ముచుకుందుడు నరనారాయణులకు నెలవైన బదరికాశ్రమం వెళ్లి శాంతుడై అచ్యుతుణ్ని ఆరాధింపసాగాడు.

కృష్ణుడు మధురానగరంలోని సిరిసంపదల్ని ద్వారకానగరానికి తరలించడానికి మనుష్యుల్ని ఏర్పాటుచేశాడు. ఆ సమయంలో జరాసంధుడు 23 అక్షోహిణుల సైన్యంతో మధురానగరం పైకి దండెత్తి వచ్చాడు. అప్పుడు రామకృష్ణులు భయపడినట్లు సంపదను విడిచిపెట్టి భయంకరారణ్యంలో పరుగెత్తసాగారు. జరాసంధుడు హేళనచేస్తూ వెంటబడ్డాడు.

రామకృష్ణులు **ప్రవర్షణమనే** పర్వతాన్ని ఎక్కారు. అక్కడ వాళ్లని వెతికిపట్టడం కష్టమని ఆ పర్వతాన్ని కాల్చమని సైన్యానికి ఆదేశించాడు. ఆ అగ్నిలో రామకృష్ణులు మరణించారని భావించి జరాసంధుడు మగధదేశం వెళ్లిపోయాడు. రామకృష్ణులు జరాసంధుడి సైన్యం కంటపడకుండా అక్కణ్నుంచి తప్పించుకున్నాడు.

## రుక్మిణీ కల్యాణం

బ్రహ్మదేవుడి ఆనతిమేరకు రైవతుడనే రాజు రేవతి అనే తన కుమార్తెను బలరాముడికి ఇచ్చి వివాహం చేసిన సంగతి ఈ వరకే చెప్పబడింది.

విదర్భదేశంలో కుండిన నగరాన్ని **భీష్మకుడు** పరిపాలిస్తున్నాడు ఆయనకు **రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులు** అయిదుమంది కుమారులు, ఒక కుమార్తె **రుక్మిణీదేవి**. ఆమె అందరికన్నా చిన్నది.

రుక్మిణీదేవి తన తండ్రివద్దకు వస్తున్న అతిథుల ద్వారా శ్రీకృష్ణుడి రూపం, బలం, సద్గుణాలను విని అతణ్నే తన భర్తగా భావించింది. శ్రీకృష్ణుడు కూడా రుక్మిణి రూపం, వివేకం, సత్ప్రవర్తన, శుభలక్షణాలు, సద్గుణాలను గ్రహించాడు. ఆమెను తప్పక వివాహమాడాలని నిర్ణయించాడు.

దుష్టుల మైత్రి కారణంగా రుక్మిణీదేవి పెద్దన్న రుక్మి మాత్రం కృష్ణుడి పట్ల ద్వేషభావం పెంచుకున్నాడు. తన చెల్లెలిని ఛేది దేశాధిపతి అయిన **శిశుపాలుడికి** ఇవ్వాలని నిశ్చయించాడు. రుక్మిణి ఎంతో బాధపడి తన మేలుకోరే **అగ్నిద్యోతనుడనే** విప్రుణ్ణి రప్పించి శ్రీకృష్ణుడికి అతడి ద్వారా సందేశం పంపింది.

అగ్నిద్యోతనుడు వెంటనే ద్వారకకు పయనమయ్యాడు. బంగారు గద్దెపై కూర్చున్న కృష్ణుణ్ని చూసి **పెండ్లి కుమారుడివి కమ్ము** అని ఆశీర్వదించాడు. విప్రుడికి తగిన ఉపచారాలు చేసి, వచ్చినపని గురించి కృష్ణుడు అడిగాడు.

అగ్నిద్యోతనుడు తనను పరిచయం చేసుకొని రుక్మిణీదేవి సందేశాన్ని వినిపించాడు. **నేను నిన్ను వరించాను. నీ మహిమ ఎక్కడ? నేనెక్కడ? అని సిగ్గుపడక నా హృదయం నీ పట్ల లగ్నమయింది. నన్ను కరుణతో కటాక్షించు. నిన్ను ఏ కన్యలు వరించకుండా ఉండగలరు? స్త్రీలలో ఉత్తమురాలైన మహాలక్ష్మి ఆనాడు నిన్ను చేబట్టలేదా? పురుషులలో సింహం వంటి వాడైన నీకు చెందవలసిన దాన్ని నక్కవంటివాడైన శిశుపాలుడు పరిగ్రహించాలని భావిస్తున్నాడు. ససైన్యంగా వచ్చి నీ పరాక్రమాన్నే ఓలిగా ఇచ్చి శిశుపాల జరాసంధుల్ని ఓడించి నన్ను రాక్షసవివాహ పద్ధతిలో పరిగ్రహించు.**

**బంధుజనుల్ని చంపవలసి వస్తుందని భావిస్తే ఒక చక్కని ఉపాయం ఉంది. పెళ్లికి ముందు పెళ్లికుమార్తెగా మా ఇలవేల్పు మంగళగౌరిని కొలవడానికి ఊరివెలుపల ఉన్న ఆలయానికి మొక్కు చెల్లించడానికి నగరినుండి బయలుదేరి వస్తాను. అప్పుడు నిరాటంకంగా నన్ను నీవెంట తీసుకొని వెళ్ళు.**

**నీ అనుగ్రహానికి అర్హురాలను కానట్లయితే బ్రహ్మచర్య వ్రతనిష్ఠ పాటించి నూరు జన్మలకైనా నువ్వే పతివి కావాలని నిన్నే ధ్యానిస్తూ నా ప్రాణాలను నీకే అర్పిస్తాను.**

ఈ సందేశాన్ని విన్న కృష్ణుడు కృతనిశ్చయుడై తన సారథి **దారుకుడుశైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పం, వలాహకం** అనే నాలుగు గుర్రాలను పూన్చి తెచ్చిన రథాన్ని అగ్నిద్యోతనుడితో అధిరోహించాడు.

కుండిన నగరంలో వివాహ కార్యక్రమాలు జోరుగా సాగుతున్నాయి. బలరామకృష్ణుల్ని పారదోలి నిరాటంకంగా శిశుపాలుడి వివాహం జరిపిస్తామని



జరాసంధుడు, దంతవక్త్రుడు, సాల్వుడు, విదూరకుడు, పౌండ్రక వాసుదేవుడు మొదలైన వాళ్లు చతురంగ బలాలతో వచ్చారు.

బలరాముడు శ్రీకృష్ణుడికి సాయపడాలని అసంఖ్యాకమైన సైన్యంతో వెళ్లాడు.

రుక్మిణి తాను పంపిన బ్రాహ్మణుడు ద్వారకకు వెళ్లాడో! లేదో! సందేశం వినిపించాడో? లేదో? అన్న ఆందోళనలో ఉంది. ఇంతలో అగ్నిద్యోతనుడు వచ్చి శ్రీకృష్ణుడు వచ్చిన వార్తను, తప్పక అతడు ఆమెను పరిగ్రహిస్తాడని తెలియజేశాడు.

రుక్మిణి పరమానందభరితురాలయింది. బ్రాహ్మణుణ్ని పలువిధాల కీర్తించి, అంజలి ఘటించింది. బలరామకృష్ణులు తన కుమార్తె స్వయంవరానికి వచ్చారని విని వాళ్లకు ఎదురేగి ఆహ్వానించి భీష్మకుడు విడిది ఏర్పాట్లు చేశాడు.

విదర్భ పట్టణ ప్రజలు శ్రీకృష్ణుడి రాక గురించి విని అతణ్ని దర్శించి, సంతోషించారు. ఈ చక్రాయుధుడు రాజకుమారికి తగినవాడు. ఇతడు శత్రువుల్ని పారదోలి రాజకుమారిని పెళ్లాడాలని భావించారు.

రుక్మిణీదేవి గౌరీదేవిని అర్చించడానికి సపరివారంగా బయలుదేరింది. గౌరిని తన కోర్కెను ఈడేర్చమని ప్రార్థించింది. ముత్తైదువుల అక్షతల్ని, ఆశీర్వాదాలను స్వీకరించి గుడినుంచి బయటకి వచ్చింది.

శత్రురాజ సమూహం చూస్తుండగానే శ్రీకృష్ణుడు రాజకుమారిని రథం ఎక్కించుకొని పాంచజన్యాన్ని పూరించాడు. బలరాముడు వెంటరాగా ద్వారకానగరం వైపు పయనించాడు. రాజులందరూ మూకుమ్మడిగా యాదవసైన్యంపై దాడిచేశారు. బలరాముడు శత్రుసైన్యం మీద దాడిచేసి చిందరవందర చేశాడు. జరాసంధ ప్రముఖులు ఒకచోట చేరి శిశుపాలుణ్ని ఓదార్చారు.

తనవెంట పడ్డ రుక్మి శిరం ఖండించడానికి కృష్ణుడు కత్తి తియ్యగా రుక్మిణి ప్రాధేయపడి అన్నను కాపాడుకుంది. రుక్మిని బంధించి అతడి గడ్డం, మీసం, తల – కత్తితో పాయలు పాయలుగా గొరిగి కురూపిగా చేశాడు కృష్ణుడు. జీవచ్ఛవంగా ఉన్న రుక్మిని చూసి బలరాముడు దయతో అతడి కట్లువిప్పి కృష్ణుణ్ని మందలించాడు. బాధపడుతున్న రుక్మిణిని ఓదార్చాడు.

ద్వారకలో రుక్మిణీకృష్ణుల వివాహ సంరంభం మొదలయింది.

శుభముహూర్తంలో రుక్మిణీ కృష్ణుల వివాహం జరిగింది. ఆ వివాహాన్ని కేకయ, కురు, సృంజయ, యదు, విదర్భ, కుంతి దేశాల రాజులు మిక్కిలి హర్షించారు.

రుక్మిణీ కల్యాణ ఘట్టంతో **పదవస్కంధం పూర్వభాగం** సమాప్తం.

# పదవ స్కంధం - ఉత్తరభాగం

**వేదవధూశిరోమహిత వీధుల చాల నలంకరించు మీ**
**పాద సరోజ యుగ్మము శుభస్థితి మాహృదయంబు లందు ని**
**త్యోదిత భక్తిమై తగిలియుండు నుపాయ మెఱుంగ బల్కు, దా**
**మోదర! భక్తదుర్భవ పయోనిధి తారణ। సృష్టి కారణా। (753)**

## ప్రద్యుమ్నుడు

రుక్మిణీ పరిణయం అయిన తర్వాతి కథను శుకుడు చెప్పసాగాడు.

పూర్వం పరమేశ్వరుడి కంటి మంటలో భస్మమైన తర్వాత మన్మథుడు శరీరం కోసం ఈశ్వరుణ్ని ప్రార్థించాడు. ఆ మన్మథుడే రుక్మిణీ కృష్ణులకు ప్రద్యుమ్నుడనే పేరుతో జన్మించాడు.

ప్రద్యుమ్నుడు తనకు శత్రువని తెలిసి **శంబరుడనే** రాక్షసుడు అతణ్ని పురిటి ఇంటినుంచి దొంగిలించి సముద్రంలో పడవేశాడు. ఒక పెద్దచేప ఆ శిశువును మింగింది. జాలర్లు ప్రద్యుమ్నుణ్ని మింగిన పెద్దచేపతో బాటు మరికొన్ని చేపల్ని పట్టి శంబరుడికి కానుకగా సమర్పించారు. వంటశాలలో చేపను తరిగినప్పుడు గొప్పకాంతితో బయటపడిన శిశువును చూసి ఆశ్చర్యంతో వంటవాళ్లు ఆ విషయాన్ని మాయావతికి తెలిపారు.

మాయావతియే రతీదేవి. భర్త భస్మమైనప్పటినుంచి పాతివ్రత్య నియమంతో ఇక్కడ మాయావతి అనే పేరుతో కాలం గడుపుతుంది. మాయావతి మన్మథుడే ఇతడని గ్రహించి, తానే ఆ బాలుణ్ని పెంచుతానని, తీసుకెళ్లి పోషించసాగింది. బాలుడు పెరిగి యువకుడయ్యాడు. స్త్రీలు అతడి సౌందర్యం చూసి తన్మయత్వం చెందేవాళ్లు.

మాయావతి సిగ్గుతో కూడిన చూపులతో అతణ్ని ఆకట్టుకోవడానికి ప్రయత్నించింది. అప్పుడు ప్రద్యుమ్నుడు ఆశ్చర్యంతో – **తల్లీ! నేను నీ కొడుకుననే భావన లేకుండా సిగ్గువిడిచి కామినిలా ప్రవర్తిస్తున్నావు. నన్ను ఇలా మోహించడం ధర్మం కాదు** – అన్నాడు.

మాయావతి అతడికి తొలినుంచి జరిగినవన్నింటినీ వివరించి, శంబరాసురుణ్ని చంపాలంటే మాయలు నేర్చుకోవాలి అంటూ మాయలన్నింటినీ మాయ చెయ్యగల **మహామాయ** అనే విద్యను ఉపదేశించింది.



ప్రద్యుమ్నుడు శంబరుడి మీద యుద్ధం ప్రకటించి, కొంతసేపు పోరాడి, తన ఖడ్గంతో అతడి తలను ఖండించాడు. శంబర వధతో దేవతలు సంతోషించి పూలవాన కురిపించారు.

రతీసమేతుడై ప్రద్యుమ్నుడు ఆకాశమార్గం ద్వారా ద్వారకానగరానికి వచ్చాడు. అతడు శ్రీకృష్ణుడేమోనని చాలామంది భ్రమించారు. ప్రద్యుమ్నుణ్ని చూసి, తన కొడుకు బ్రతికుంటే ఇప్పటికి ఇలా ఉండేవాడని రుక్మిణి భావించింది. శ్రీకృష్ణ వసుదేవాదులు అక్కడికి వచ్చారు. ఆ సమయంలో నారదుడు వచ్చి జరిగిన వృత్తాంతాన్ని వివరించడంతో రుక్మిణీదేవి ఆనందంతో కొడుకును, కోడలిని ఆశీర్వదించింది. నగరవాసులు సంతోషంతో రుక్మిణీదేవి అదృష్టాన్ని కీర్తించారు.

## సత్రాజిత్తు - స్యమంతకమణి

సత్రాజిత్తు యాదవ నాయకుడు. అతడు సూర్యుణ్ణి ఆరాధించి స్యమంతకమనే మణిని పొందాడు. ఆ దివ్యమణి ఎవరి దగ్గరుంటే వాళ్లకి ఎనిమిది బారువుల బంగారాన్ని ప్రతిరోజు ఇస్తుంది. ఏ దేశంలో అయితే ఆ మణి పూజించబడుతుందో ఆ దేశంలో కరువు కాటకాలు, రోగాలు, అరిష్టాలుండవు. సూర్యతేజస్సుతో ఆ మణి ప్రకాశిస్తుంది.

సత్రాజిత్తు ఆ మణిని ధరించి ఒకసారి ద్వారకకు వచ్చాడు. ప్రజలు అతణ్ని చూసి, శ్రీకృష్ణ దర్శనార్థం సూర్యుడే దిగివచ్చాడని భావించి, కృష్ణుడితో ఆ విషయం చెప్పారు. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు అసలు విషయం వివరించాడు.

తర్వాత కొంతకాలానికి ఆ మణిని యాదవ విభుడైన ఉగ్రసేనుడికి ఇవ్వవలసిందని సత్రాజిత్తును కోరాడు. సత్రాజిత్తు తిరస్కరించాడు. సత్రాజిత్తు సోదరుడు **ప్రసేనుడు** ఒకరోజు ఆ మణిని ధరించి వేటకోసం అడవికి వెళ్లాడు. అతణ్ని, అతడి గుర్రాన్ని చంపి ఒక సింహం మణిని తీసుకొని పరిగెత్తసాగింది. **జాంబవంతుడు** ఆ సింహాన్ని వధించి, మణిని తన గుహకు తీసుకువెళ్లి, తన కుమారుడికి ఆట బంతిగా ఇచ్చాడు.

సత్రాజిత్తు వేటకు వెళ్లిన తన తమ్ముడు ఎంతకూ తిరిగి రానందువల్ల కృష్ణుడే తన తమ్ముణ్ని చంపి మణిని తస్కరించాడని నిందించసాగాడు. శ్రీకృష్ణుడు నింద మాపుకోవడానికి కొందరితో బయలుదేరి ప్రసేనుడి జాడల్ని అనుసరించి వెళ్లి అరణ్యంలో చచ్చిపడి ఉన్న ప్రసేనుణ్ని, గుర్రాన్ని, సింహాన్ని చూశాడు. ముందుకుసాగి జాంబవంతుడి గుహను సమీపించాడు.

## కృష్ణ జాంబవంతుల యుద్ధం

తనవెంట వచ్చిన వాళ్లను గుహద్వారం వద్ద ఉంచి, తానొక్కడే లోపలికి వెళ్లాడు. బాలుడి ఎదురుగా ఆట బంతిగా వేలాడదీసిన మణిని చూసి, దాన్ని తీసుకోవడానికి సమీపించాడు. అక్కడున్న దాది కేక వెయ్యడంతో జాంబవంతుడు వచ్చాడు. శ్రీకృష్ణుడు తన ప్రభువైన శ్రీరామచంద్రుడే అని తెలియక యుద్ధానికి సిద్ధమయ్యాడు.

ఇరవై ఎనిమిది రోజులబాటు వాళ్ల పోరాటం సాగింది. తుదకు పూర్తిగా అలిసిన జాంబవంతుడు శ్రీకృష్ణుడి వాస్తవరూపాన్ని గ్రహించాడు. శరణాగతుడై ప్రస్తుతించాడు.

కృష్ణుడు వచ్చిన పనిని తెలుసుకొని జాంబవంతుడు స్యమంతకమణితోబాటు, తన కుమార్తె **జాంబవతిని** కూడా కానుకగా ఇచ్చాడు. పన్నెండు రోజులు కృష్ణుడి రాకకోసం ఎదురుచూసిన అనుచరులు దుఃఖించి ద్వారకకు వెళ్లి, జరిగిన విషయం చెప్పారు. వసుదేవుడు మొదలైనవారు శోకమగ్నులయ్యారు.

## సత్యభామ

శ్రీకృష్ణుడు మణిని తీసుకొని వచ్చి సత్రాజిత్తుకు అప్పజెప్పి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకున్నాడు. సత్రాజిత్తు పశ్చాత్తాపం చెంది, బలవంతుడితో విరోధం కలిగినందుకు భయపడ్డాడు.

తన కూతురైన **సత్యభామను,** మణిని తీసుకువచ్చి కృష్ణుడికి అప్పజెప్పాడు. కృష్ణుడు సత్యభామను పరిగ్రహించి, స్యమంతకమణిని అతడికే ఇచ్చి – **ఈ నారీమణి చాలు. సూర్యుడు ప్రీతితో నీకు ఇచ్చిన మణిని నువ్వే ఉంచుకో** – అన్నాడు.

ఈ సమయంలోనే పాండవులు కుంతీ సమేతంగా లక్క ఇంటిలో దగ్ధం అయ్యారని విన్న కృష్ణుడు, అన్నీ తెలిసినా బలరాముడితోబాటు హస్తినాపురం వెళ్లి కృప విదుర గాంధారి భీష్మద్రోణుల్ని ఓదార్చాడు.

## శతధన్వుడు – అక్రూర కృతవర్మలు

సత్యభామను తన మిత్రుడైన శతధన్వుడికి ఇచ్చి వివాహం చెయ్యాలని సత్రాజిత్తు తొలుత భావించాడు. మాటతప్పిన సత్రాజిత్తునుంచి మణిని తస్కరించమని అక్రూర కృతవర్మలు శతధన్వుడిని ప్రేరేపించారు. శతధన్వుడు నిద్రిస్తున్న సత్రాజిత్తును చంపి, మణిని తీసుకున్నాడు.

సత్యభామ తండ్రి మరణానికి దుఃఖించి, శరీరాన్ని నూనెలో పెట్టించి, హస్తినాపురం వెళ్లి శ్రీకృష్ణుడితో జరిగిన వృత్తాంతాన్ని చెప్పింది. ద్వారకకు తిరిగివచ్చిన



శ్రీకృష్ణుడు శతధన్వుడిని చంపాలని నిర్ణయించాడు. ప్రాణభయంతో శతధన్వుడు కృతవర్మ ఇంటికి వెళ్లి తనకు సాయపడమని అర్థించాడు.

కృతవర్మ అక్రూరులు కృష్ణబలరాముల్ని ఎదుర్కోవడానికి సాధ్యం కాదని అన్నారు. స్యమంతకమణిని అక్రూరుడికి ఇచ్చి శతధన్వుడు భయంతో గుర్రం ఎక్కి పారిపోయాడు. రామకృష్ణులు అతణ్ని వెంటాడారు. శ్రీకృష్ణుడు శతధన్వుణ్ని చంపి, అతడి వద్ద స్యమంతకమణి కన్పించక బలరాముడితో ఆ విషయం చెప్పాడు.

బలరాముడు కృష్ణుడితో – **నువ్వు ద్వారకకు వెళ్లు. నేను మిథిలానగరం వెళ్లి జనకరాజును దర్శించి వస్తాను** – అన్నాడు (జనకుడి వంశంలో వచ్చిన వాళ్లందరికీ జనకుడనే పేరు వర్తిస్తుంది. నాటి జనకుడు బహుళాశ్వుడు).

బలరాముడు జనక మహారాజుతో కొన్ని సంవత్సరాలు మిథిలానగరంలో ఉన్నాడు. ఆ సమయంలోనే **దుర్యోధనుడు** మిథిలానగరం వెళ్లి, బలరాముడి వద్ద గదాయుద్ధ కౌశలాన్ని పట్టుదలతో నేర్చుకున్నాడు. శతధన్వుడి మరణవార్త విని అక్రూర కృతవర్మలు భయపడి ద్వారకానగరం విడిచి పెట్టారు. అక్రూరుడు లేనందువల్ల ద్వారకలో వర్షాలు పడలేదు. మనుష్యులకు శారీరక మానసిక తాపాలు పెరిగాయి.

ద్వారకలోని వయోవృద్ధులు – **కాశీరాజు తన రాజ్యంలో వర్షాలు పడనప్పుడు అక్రూరుడి తండ్రి అయిన శ్వఫల్కుడిని తీసుకెళ్లి కాందిని అనే తన కూతురునిచ్చి వివాహం చేసి సత్కరించాడు. అప్పుడు వానలు కురిశాయి. అక్రూరుడూ అంతటివాడే. అతణ్ని మన్నించి రప్పించు. ప్రజలు అరిష్టాలు అంతమవుతాయి** – అన్నాడు.

కృష్ణుడు అక్రూరుణ్ని రప్పించాడు. అక్రూరుడు స్యమంతకమణిని కృష్ణుడికి ఇచ్చాడు. కృష్ణుడు దాన్ని అందరికీ చూపించి, తిరిగి అక్రూరుడికే ఇచ్చాడు.

## ఇంద్ర ప్రస్థంలో శ్రీకృష్ణుడు

ఒకనాడు పాండవుల్ని చూడాలని భావించి సాత్యకి మొదలైన వాళ్లతో కృష్ణుడు ఇంద్రప్రస్థానానికి వెళ్లాడు. అక్కడ కొన్ని నెలలబాటు పాండవులతో గడిపాడు. ఒకరోజు అర్జునుడు కృష్ణుడితో కలిసి అరణ్యానికి వెళ్లి క్రూరజంతువుల్ని వేటాడాడు. దాహం వేసి యమునా నదికి వెళ్లి నీళ్లు తాగి అక్కడ సౌందర్యవతిని చూశాడు.

అర్జునుడు ఆమెను సమీపించి వివరాలు అడిగాడు. తాను సూర్యుడి కుమార్తె కాళిందినని, ఈ నదిలో తన తండ్రి తనకోసం ఏర్పాటు చేసిన ఇంట్లో శ్రీకృష్ణుణ్ని పతిగా కోరి తపస్సు చేస్తున్నట్లు చెప్పింది. కాళింది చెప్పిన మాటల్ని అర్జునుడు కృష్ణుడికి చేరవేశాడు. కృష్ణుడు ఆమెను రథంలో ఎక్కించుకొని ధర్మరాజు వద్దకు వెళ్లాడు.

దేవేంద్రుడు ఖాండవవనాన్ని అగ్నిదేవుడికి ఆహారంగా అర్పించడానికి నిర్ణయించి కృష్ణార్జునుల్ని సహకరించమన్నాడు. అర్జునుడి రథానికి కృష్ణుడు సారథి అయ్యాడు.

అగ్నిదేవుడు సంతోషించి అర్జునుడికి అక్షయతూణీరాలు, భేదించడానికి వీలులేని కవచం, గాండీవమనే ధనుస్సు, ద్విరథం, తెల్లని గుర్రాలు సమర్పించాడు. అగ్నిజ్వాలలు నుండి తన్ను తప్పించినందుకు మయుడు ఒక మహాసభను నిర్మించి పాండవులకు ఇచ్చాడు.

## దక్షిణ నాయకుడు

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థపురంలో కొంతకాలం గడిపి, ద్వారకకు తిరిగి వచ్చాడు. ఒక శుభముహూర్తంలో కాళిందిని వివాహం ఆడాడు. అవంతీ పాలకులు విందానువిందులు. వాళ్లు దుర్యోధనుడికి హితులయ్యారు. విందానువిందుల తల్లి రాజాధిదేవి శ్రీకృష్ణుడి మేనత్త.

తమ చెల్లెలు మిత్రవింద స్వయంవరాన్ని విందానువిందులు ప్రకటించారు. శ్రీకృష్ణుడు తన పరాక్రమం ప్రదర్శించి మిత్రవిందను పరిణయం ఆడాడు. కోసల దేశరాజు నాగ్నజిత్తు. అతడు తనవద్ద ఉన్న మదించిన ఏడు ఆబోతుల్ని అణిచిన వాడికే తన కుమార్తె నాగ్నజితిని ఇచ్చి వివాహం చేస్తానన్నాడు. కృష్ణుడు ఆబోతుల్ని అణచి ఆమెను పెళ్లి చేసుకున్నాడు.

కేకయరాజు శ్రుతకీర్తి కుమార్తె, తన మేనత్త కూతురు అయిన భద్రను, మద్రరాజు పుత్రి లక్షణను పరిగ్రహించాడు. **రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ** అనేవాళ్లు కృష్ణుడికి అష్టభార్యలయ్యారు. వీళ్లేకాక నరకాసురుడి చెరలో ఉన్న రోహిణి మొదలైన పదహారువేలమంది కన్యకామణుల్ని కృష్ణుడు పరిగ్రహించాడు.

## నరకాసుర వధ

నరకాసురుడు అదితిదేవి కుండలాలను, వరుణదేవుడి గొడుగును, దేవతల మణి పర్వతాన్ని అపహరించాడు. దేవేంద్రుడు కృష్ణుడితో నరకాసురుడి అత్యాచారాల గురించి చెప్పాడు. నరకాసుర సంహారం కోసం గరుడవాహనుడై, కృష్ణుడు బయలుదేరాడు.

సత్యభామ తానుకూడా యుద్ధరంగానికి వస్తానంది. రాక్షస సంహారం చేసినవాడు తన భర్త అని విన్నదేకాని, ప్రత్యక్షంగా చూసి, ఆ విషయాన్ని సపత్నులతో చెప్పాలని ఉందని కోరింది. కృష్ణుడు వారించాడు కాని ఆమె పట్టుబట్టడంతో తనతోబాటు తీసుకు వెళ్లాడు. **ప్రాగ్జ్యోతిషపురం** చేరి పట్టణం చేరిన కృష్ణుడు తన బాణాలతో పర్వత దుర్గాలను, శస్త్ర దుర్గాలను, చక్రంతో వాయు, అగ్ని, జల దుర్గాలను నాశనం చేశాడు. పాంచజన్యాన్ని



పూరించాడు. ఆ ధ్వనితో అయిదుతలలున్న **మురాసురుడు** నిద్రలేచాడు. కృష్ణుడిపైకి వచ్చాడు. కొంత పోరాటం తర్వాత కృష్ణుడు చక్రాయుధంతో అతడి అయిదు తలల్ని ఖండించాడు. తండ్రిమరణంతో ఆవేశంగా కృష్ణుణ్ని ఎదుర్కొన్న **తామ్రుడు, అంతరిక్షుడు** మొదలైన అతడి ఏడుమంది కొడుకుల్ని తన బాణాలతో ముక్కలు ముక్కలుగా చేశాడు.

తన పక్షంలోని వాళ్లు హతం కావడంతో శ్రీహరిని దూషిస్తూ **నరకాసురుడు** గొప్ప ఏనుగుల గుంపుతో యుద్ధానికి వచ్చాడు. అతణ్ని చూసి సత్యభామ యుద్ధానికి పూనుకుంది.

కృష్ణుడు సరసంగా **భామా! రాక్షసుల్ని గెలవలేమా? యుద్ధానికి నువ్వెందుకు పూనుకున్నావు? ఇలారా! యుద్ధప్రయత్నాన్ని విరమించు. మానదలచకపోతే ఈ విల్లందుకో**– అన్నాడు.

కృష్ణుడిచ్చిన విల్లును తీసుకొన్న సత్యభామకు ఎక్కడ లేని శక్తి వచ్చింది. సుకుమారి అయిన ఆమె ఉద్ధృతంగా యుద్ధం చేసింది. ఆమె బాణాలను సంధిస్తూ కృష్ణుడివైపు చూసిన చూపులు శృంగారరసాన్ని, నరకాసురుడివైపు చూసిన చూపులు వీరరసాన్ని కురిపించింది.

రాక్షససైన్యం వెనుకంజ వేసింది. అప్పుడు కృష్ణుడు – **నీ ధాటికి శత్రుసైన్యం పలాయనం చిత్తగించింది** – అని ప్రశంసించాడు.

నరకాసురుడు – **కృష్ణా! పురుషులముందు ఒక స్త్రీ పౌరుషం ప్రదర్శిస్తుంటే యుద్ధం మాని మౌనం ప్రదర్శించడం నీకు గౌరవం కాదు. రాక్షసులు మహావీరులు. స్త్రీలతో యుద్ధానికి ఇష్టపడరు** – అన్నాడు.

ఆ తర్వాత కృష్ణుడు యుద్ధం మొదలుపెట్టి నరకాసురుణ్ని చక్రాయుధంతో సంహరించాడు. భూదేవి వాసుదేవుడి వద్దకు వచ్చి రత్నాలు పొదిగిన కుండలాలను, వరుణుడి తెల్లగొడుగును, వైజయంతి అనే మాలను, ఒక గొప్పరత్నాన్ని సమర్పించి కృష్ణుణ్ని స్తుతించింది.

భూదేవి తన మనుమడూ, నరకాసురుడి పుత్రుడూ (నరకాసురుడు వరాహమూర్తి అవతారంలో భూమిని ఉద్ధరించినప్పుడు భూదేవి, వరాహమూర్తులకు జన్మించాడు) అయిన భగదత్తుణ్ని చూపి – **ఇతడు నిన్ను చూసి భయపడుతున్నాడు. ఆశ్రయం లేనివాడు. తండ్రిలా పరాక్రమవంతుడు కాదు** – అని ప్రార్థించింది.

కృష్ణుడు అతడికి అభయమిచ్చి సర్వసంపదల్ని అనుగ్రహించాడు.

## పదహారువేల కన్యలతో పరిణయం - పారిజాతాపహరణం

నరకాసురుడి రాజసౌధంలో, అతడు చెరపట్టిన పదహారువేలమంది రాజకన్యల్ని కృష్ణుడు చూశాడు. అతడే తమ భర్త అని వాళ్లు భావించారు. వాళ్లకందరికీ అనేక విధాలైన చీరలు, ఆభరణాలు, పూలమాలలు, సుగంధపు పూతల్ని శ్రీకృష్ణుడు పంపించాడు. నరకాసురుడి కోశాగారం నుంచి ధనసంపదను, రథాలను, అశ్వాలను, అమితవేగం కల ఐరావత వంశంలో పుట్టిన తెల్లని నాలుగుదంతాల ఏనుగుల్ని ద్వారకానగరానికి పంపాడు.

సత్యభామతో కలిసి దేవేంద్రుడి నగరం అమరావతికి వెళ్లాడు. సత్యభామ కోరడంతో నందనవనంలో ప్రవేశించి, అక్కడున్న పారిజాత వృక్షాన్ని పెకలించి గరుత్మంతుడిపై ఉంచి, సత్యభామతో బయలుదేరాడు.

దేవేంద్రాదులు అడ్డుపడి ఎదిరించారు. వాళ్లను ఓడించి పారిజాత వృక్షాన్ని సత్యభామ ఉద్యానవనంలో నాటించాడు.

నరకాసురిడి బారినుండి రక్షించిన రాజకన్యలందరినీ గృహోపకరణాలతో, వేర్వేరు భవంతుల్ని ఏర్పాటు చేయించిన శ్రీకృష్ణుడు పదహారువేలమందిని, పదహారువేల రూపాలతో, పదహారువేల రీతులలో కన్పిస్తూ, శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నాడు. అందరివద్ద సమాన భావం ప్రదర్శిస్తూ ఉత్తమ గృహస్థ ధర్మాన్ని పాటించాడు.

## కృష్ణ సంతానం

శ్రీకృష్ణుడికి రుక్మిణీదేవి ద్వారా ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, చారుదేవుడు, సుదేష్ణువు, సుచారువు, చారుగుప్తుడు, భద్రచారువు, చారుభద్రుడు, విచారువు, చారువు అనే పదిమంది పుత్రులు పుట్టారు. అలాగే తక్కిన భార్యలందరికీ (16,007 మందికి) ఒక్కొక్కరికి పదిమంది పుత్రులు జన్మించారు.

త్రివక్రకు కృష్ణుడివల్ల ఉపశ్లోకుడు పుట్టాడు (10 - ఉత్తర -1330) పిల్ల చెరకకు పిలకలు పుట్టినట్లు తామర తంపరగా పుట్టిన కొడుకులు, మనుమలు మొదలైన వాళ్లతో శ్రీకృష్ణుడు శోభిల్లాడు.

యాదవ, వృష్టి, భోజ, అంధక మొదలైన నూట ఒక్క పేర్లతో కులం వర్ధిల్లింది. ఆ రాజకుమారులకు విద్యనేర్పే గురువులు మూడుకోట్ల ఎనభైవేల ఒక్కవంద మంది ఉన్నారంటే ఇక ఆ రాజకుమారుల్ని లెక్కించడం బ్రహ్మ, పరమేశ్వరులకైనా సాధ్యమా?

ప్రద్యుమ్నుడికి, రుక్మి కుమార్తెవల్ల అనిరుద్ధుడు పుట్టాడు.



## అనిరుద్ధుడి కల్యాణం - రుక్మి మరణం

రుక్మి శ్రీకృష్ణుడివల్ల పరాభవం పొందినా, చెల్లెలిమీద ప్రేమను విస్మరించలేదు. తన కుమార్తె **రుక్మవతి** స్వయంవరాన్ని రుక్మి ప్రకటించాడు. ప్రద్యుమ్నుడు స్వయంవరానికి వెళ్లి, రాజకుమారుల్ని ఓడించి రుక్మవతిని ద్వారకకు తీసుకువచ్చి వివాహం చేసుకున్నాడు. రుక్మి మరో కుమార్తెను కృతవర్మ కొడుకు పెళ్లి చేసుకున్నాడు. తన మనుమరాలైన **రుక్మలోచనను** అనిరుద్ధుడికి ఇచ్చి పెళ్లి జరిపించాడు.

అనిరుద్ధుడి వివాహం సందర్భంలో బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, సాంబుడు, రుక్మిణీ కృష్ణులతోబాటు విదర్భదేశానికి వచ్చి, వివాహం జరిగినన్ని రోజులు ఆనందంగా గడిపారు.

ఈ ఉత్సాహాన్ని కొందరు రాజులు సహించలేకపోయారు. కళింగభూపతి, రుక్మివద్దకు వెళ్లి - నీకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవడానికి సరైన సమయం ఇది. బలరాముడు జూదప్రియుడు. కాని నేర్పరి కాదు. అతణ్ని జూదానికి ఆహ్వానించి విజయం సాధించు - అని రెచ్చగొట్టాడు.

రుక్మి ఆహ్వానించడంతో బలరాముడు జూదం ఆడడానికి అంగీకరించాడు. కొంతసేపు కాలక్షేపానికి ఆడిన పిదప, రుక్మి పందెం పెడదాం అన్నాడు. పందెం పెంచుకుంటూ సాగిన ఆటలో ప్రతిసారి బలరాముడు ఓడాడు. కళింగరాజు, ఇతరులు హేళన చేయసాగారు.

బలరాముడు కోపంతో ఒక లక్ష పందెం కాసి గెలుపొందాడు. రుక్మి దాన్ని అంగీకరించలేదు. బలరాముడు మళ్లీ మరో ఆటలో గెలిచాడు. రుక్మి మొండిగా తనదే గెలుపు అన్నాడు.

అశరీరవాణి - **గెలుపు బలరాముడిదే** - అన్నా దుర్మార్గులైన రాజుల ప్రోద్బలంతో రుక్మి అంగీకరించలేదు. బలరాముడు కట్టలు తెంచుకున్న ఆవేశంతో ఒక ఇనుప గడియను తీసి, రుక్మిని, ఇతరరాజుల్ని చితకబాదాడు. కళింగరాజు పళ్లూడగొట్టాడు. రుక్మిని పట్టుకొని పళ్లూడగొట్టి అతణ్ని చంపాడు.

కృష్ణుడు ఈ చర్యపట్ల మౌనం వహించాడు.

## ఉషానిరుద్ధుల వివాహం

బలిచక్రవర్తి నూరుమంది కుమారుల్లో బాణుడు పెద్దవాడు. శివభక్తుడు. శివుడి అనుగ్రహం పొంది, పార్వతీ సమేతుడిగా శివుణ్ని తన కోట వాకిట రక్షకుడిగా నియమించుకున్నాడు. అతడికి వెయ్యిచేతులు.

ఒకరోజు శివుడితో – **దేవా! నన్ను యుద్ధంలో ఎదుర్కోగలిగిన వీరుడు ఈ భూమిమీద ఒక్కడూ లేడు. నువ్వు ప్రసాదించిన వెయ్యిచేతులు యుద్ధకండూతి కలిగి ఉన్నాయి. ఆ కండూతిని ఎలా తీర్చుకోవాలి? – అన్నాడు. పైగా – ఈ విశాల ప్రపంచంలో నువ్వు తప్ప మరెవ్వరూ నన్ను ఎదిరించగలవాడు లేడు** – అని అహం ప్రకటించాడు.

శివుడు కోపంతో – **మూర్ఖుడా! నీ కేతనం ఎప్పుడూ అకారణంగా కూలిపోతుందో అప్పుడు నా అంతటి వాడితో యుద్ధం జరుగుతుంది** – అన్నాడు. బాణుడు సంతోషించాడు.

అతడికి సౌందర్యవతి, సద్గుణవతి అయిన ఉషాకన్య అనే కూతురుంది. ఒకనాడు ఆమె తన సౌధంలో నిద్రిస్తున్నప్పుడు అసమాన సౌందర్యవంతుడైన అనిరుద్ధునితో సుఖిస్తున్నట్లు కలవచ్చింది. ఆమె అంతవరకు అతణ్ని చూడలేదు.

అప్పటినుంచి విరహవేదనతో బాధపడసాగింది. ఆమె బహిఃప్రాణమైన చెలికత్తె చిత్రరేఖ. ఉషాకన్య అవస్థ గమనించింది. ఉషను అనునయించి అడిగింది. ఉష తన స్వప్న వృత్తాంతాన్ని చెప్పి, అతణ్ని తప్ప మరొకరిని వరించనని, కాని అతడెవడో తెలియడం లేదని చెప్పింది. చిత్రరేఖ – **నేను మానవ, యక్ష కిన్నర సిద్ధ సాధ్య శ్రేష్ఠులచిత్ర పటాలను రాసి చూపిస్తాను. అందులో నీ మనోహరుడు ఎవడో చెబితే వెంటనే తీసుకువస్తాను** విచారించకు – అంది.

చిత్రరేఖ వరుసగా చిత్రపటాలను లిఖించి ఉషకు చూపించసాగింది. అనిరుద్ధుడి చిత్రపటం చూపినప్పుడు ఇతడే తన మనస్సును దోచుకున్నవాడని చెప్పింది.

చిత్రరేఖ – **ఇతడు శ్రీకృష్ణుని మనుమడు. ప్రద్యుమ్నుడి పుత్రుడు. అనిరుద్ధుడు అని పేరు. నేను త్వరగా వెళ్లి అతణ్ని తీసుకువస్తాను** – అని చిత్రరేఖ ఆకాశమార్గంలో పయనించి ద్వారకానగరం చేరింది. అక్కడ నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ని యోగవిద్యా నైపుణ్యంతో ఎత్తుకొని శోణపురం చేరింది.

అనిరుద్ధుడు నిద్రమేల్కొని ఉషను చూశాడు. పరస్పర అనురాగబద్ధులైన వాళ్లు శృంగార లీలావిలాసాలలో గడిపారు. కొంతకాలం సంతోషంగా గడిపిన తర్వాత ఉష గర్భం దాల్చింది.

ఆమె గర్భచిహ్నాలను చూసి అంతఃపుర కంచుకులు బాణాసురుడి వద్దకువెళ్లి – **ప్రభూ! అతి జాగ్రత్తగా కాపలాకాస్తున్నాం. పోతుటీగను కూడా జొరబడనీయం. కాని అదేమి చిత్రమోకాని నీ కుమార్తె గర్భం దాల్చింది** – అన్నారు.

బాణాసురుడు ఆగ్రహంతో అంతఃపురానికి వెళ్లాడు. అక్కడ అనిరుద్ధుణ్ని చూసి మండిపడి భటులతో – వీణ్ని బంధించండి – అని ఆజ్ఞాపించాడు. బంధించడానికి



వచ్చిన భటుల్ని తుత్తునియలు చేశాడు అనిరుద్ధుడు. బాణాసురుడు అనిరుద్ధునితో యుద్ధంచేసి నాగపాశంతో అతణ్ని బంధించాడు.

ఆ సమయంలో బలంగా గాలి వీచి బాణాసురుడి కేతనం భయంకర ధ్వనిచేస్తూ నేలకూలింది. బాణాసురుడు తనకు తగిన వీరుడితో యద్ధం జరుగుతుందని సంబరపడ్డాడు.

నాలుగు నెలలుగా కన్పించని అనిరుద్ధుడి గురించి యాదవులు విచారిస్తున్న సమయంలో నారదుడు శ్రీకృష్ణుడి వద్దకు వచ్చి జరిగినవన్నీ తెలియజేశాడు. వెంటనే శ్రీకృష్ణుడు యుద్ధ సన్నద్ధుడై పరివారంతో బాణాసురుడి పట్టణం శోణపురికి చేరాడు.

శివుడు బాణాసురుణ్ని అమితంగా అభిమానించేవాడు. అందువల్ల తన ప్రమథగణాలతో కృష్ణుడిపై యుద్ధానికి వచ్చాడు. శ్రీకృష్ణుడు శార్ఙ్గమనే తన ధనుస్సుని ఎక్కుపెట్టి ప్రమథగణాలను, భూతపిశాచ ఢాకినీ వీరుల్ని పారదోలాడు. శివుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తే దాన్ని శ్రీకృష్ణుడు చేతితోనే మళ్లించాడు. వాయవ్యాస్త్రాన్ని శివుడు ప్రయోగించాడు. కృష్ణుడు పార్వతాస్త్రంతో దాన్ని నివారించాడు. ఆగ్నేయాస్త్రాన్ని శివుడు సంధించాడు. పద్మాక్షుడు దాన్ని ఇంద్రబాణంతో అడ్డుకున్నాడు.

శివుడి పాశుపతాస్త్రాన్ని కృష్ణుడు నారాయణాస్త్రంతో మళ్లించాడు. తుదకు సమ్మోహనాస్త్రంతో కృష్ణుడు శివుడి శరీరం స్వాధీనం తప్పేటట్లు చేశాడు. శివుడు నందీశ్వరుడి మూపుపై వాలిపోయాడు. ప్రద్యుమ్నుడు కుమారస్వామితో యుద్ధంచేసి పారదోలాడు.

బాణాసురుడు కృష్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. హరి బాణుడి ధనుస్సుల్ని విరిచి, రథాన్ని నుగ్గు గావించి పాంచజన్యం పూరించాడు. బాణుడు చేష్టలుడిగి నిలిచాడు. అప్పుడు బాణుడి తల్లి **కోటర** తన కుమారుణ్ణి రక్షించుకోవడానికి, వీడిన జుట్టుతో వివస్త్రగా కృష్ణుడి ముందు నిలిచింది. ఆమెను చీదరించుకొని మాధవుడు ముఖం మరల్చాడు. బాణుడు యుద్ధరంగం విడిచివెళ్లాడు.

మూడుశిరస్సులు, మూడు పాదాలతో, తీవ్రక్రోధంతో **శివజ్వరం** వచ్చింది. కృష్ణుడు చిరునవ్వుతో వైష్ణవజ్వరాన్ని సంధించాడు. అవి రెండూ పోరాడాయి. ఆ పోరాటంలో శివజ్వరం వైష్ణవజ్వరానికి ఓడి వెనుదిరిగింది. **వైష్ణవజ్వరం** దాన్ని తరమడంలో ఎటూ వెళ్లలేక కృష్ణుడి పాదాలను ఆశ్రయించింది.

బాణుడు రెండవసారి యుద్ధానికి రాగా, అతడి వెయ్యిచేతుల్లో నాల్గింటిని మాత్రం విడిచి తక్కిన వాటిని శ్రీకృష్ణుడు ఖండించాడు.

ఆ సమయంలో శివుడు బాణుణ్ని రక్షించడానికి శ్రీకృష్ణుడి వద్దకు వచ్చి పురుషసూక్తం పఠించి పద్మనేత్రుణ్ని స్తుతించాడు.

కృష్ణుడు సంతోషించి – **నా భక్తుడు ప్రహ్లాదుడి వంశానికి చెందిన వాడు కనుక ఇతడు చంపదగినవాడు కాదు. నీ వంశస్థులను చంపనని ప్రహ్లాదుడికి వరం ఇచ్చాను. కాని ఇతడి గర్వం అణచవలసి ఉంది. అందుకనే నాలుగు చేతులు మిగిల్చి తక్కినవాటిని ఖండించాను. ఇక నీ భక్తులలో అగ్రేసరుడిగా ఖ్యాతిగాంచి జరామరణాది భయాలు లేకుండా జీవిస్తాడు.** – అని అనుగ్రహించాడు.

బాణుడు అహంకారం విడిచిపెట్టి, తనను అనుగ్రహించిన శ్రీకృష్ణుడికి పాదాభివందనం చేశాడు. ఉషానిరుద్ధుల్ని సకల వస్త్రాభరణాలతో సత్కరించి బంగారు రథం మీద తీసుకువచ్చి కృష్ణుడికి అప్పగించాడు.

శ్రీకృష్ణుడు శివుడికి వీడ్కోలు చెప్పి, బాణాసురుణ్ని అక్కడే నిలిపి, తన పరివారంతో, ఉషానిరుద్ధులతో ద్వారకానగరం చేరాడు.

## నృగమహారాజు వృత్తాంతం

ఒకనాడు కృష్ణుడి కుమారులైన ప్రద్యుమ్న, సాంబ, సారణ, చారుబాణులు ఉద్యానవనం వెళ్లి, అక్కడ విహరించి, అలసిపోయారు. దప్పిక తీర్చుకోవడానికి నీటికోసం వెతికారు. వాళ్లకు నీళ్లులేని ఒక పాడుబడిన బావి కన్పించింది. అందులో పెద్ద కొండలాంటి ఊసరవెల్లి కన్పించింది. ఆశ్చర్యంతో దాన్ని బయటకి తియ్యడానికి పెద్ద పెద్ద తాళ్లుతెచ్చి, ప్రయత్నించి విఫలులయ్యారు.

కృష్ణుడికి ఆ విషయం చెప్పారు. కృష్ణుడు అక్కడికి వచ్చి తన ఎడమచేతితో దాన్ని గడ్డిపరకను తీసినట్లు వెలుపలికి లాగాడు. ఆ ఊసరవెల్లి బంగారు రంగుతో మెరుస్తూ పురుషరూపం ధరించింది.

అతడు కృష్ణుణ్ని కీర్తిస్తూ తన పూర్వజన్మ గురించి చెప్పాడు. **నేను ఇక్ష్వాకు పుత్రుడైన నృగుడిని. రాజ్యాన్ని సుభిక్షంగా పాలిస్తూ, అనేక దానధర్మాలు చేశాను. పంచ మహా యజ్ఞాలు నిర్వహించాను. నేను పవిత్ర హృదయంతో కశ్యపుడనే బ్రాహ్మణుడికి ఇచ్చిన ఆవు ఒకటి తప్పిపోయి మళ్లీ వచ్చి ఆల మందలో కలిసింది. అది తెలియక ఆ గోవును మరో బ్రాహ్మణుడికి దానం ఇచ్చాను.**

**ఆ బ్రాహ్మణులు ఇద్దరూ కలహించుకొని నా వద్దకు వచ్చారు. 'నువ్వు అధర్మకార్యం చేశావు' అని నన్ను నిందించారు. అందుకు నేను పశ్చాత్తాపం చెంది దానికి బదులు లక్ష గోవుల్ని ఇస్తానన్నాను. కాని ఇద్దరూ తిరస్కరించారు.**



**కాలం తీరిన తర్వాత యమధర్మరాజు 'నువ్వు అనేక పుణ్యకార్యాలు చేశావు కాని మొదట పాపఫలాన్ని అనుభవించి తర్వాత స్వర్గసుఖాలు అనుభవించవచ్చని కిందికి తోశాడు. అప్పటినుండి ఊసరవెల్లిగా బ్రతుకు సాగదీసి, ఇప్పుడు నీ పవిత్ర స్మర్శతో పునీతుణ్నయ్యాను.**

తర్వాత అతడు దివ్యవిమానం ఎక్కి స్వర్గానికి వెళ్లాడు. విషానికి విరుగుడు ఉంటుంది కాని అధర్మానికి విరుగుడు ఉండదని కృష్ణుడు చుట్టూ ఉన్న వాళ్లకి బోధించాడు.

## పౌండ్రక వాసుదేవుడు

బలరాముడు బంధువుల్ని చూడడానికి రేపల్లెకు వెళ్లినప్పుడు కరూశదేశపు రాజు పౌండ్రక వాసుదేవుడు తన దూతద్వారా కృష్ణుడికి ఒక సందేశం పంపాడు. దూత కృష్ణుడివద్ద సందేశం విన్పించాడు.

**ఓ కృష్ణా! మా రాజు చెప్పిన మాటలు విను. భూమిని రక్షించడానికి వాసుదేవుడనే పేరు నాకు ఉండగా సిగ్గులేక నువ్వు ఆ పేరు పెట్టుకున్నావు. ఇకనుంచి నీ శక్తి, ఎదుటి వారి శక్తి తెలుసుకొని నా చిహ్నాల నన్నింటిని వదలిపెట్టి నా సేవకుడవై బ్రతుకు. లేదా యుద్ధానికి సిద్ధపడు.**

కృష్ణుడు దూతవద్ద యుద్ధానికి సిద్ధంగా ఉండమని మీ రాజుకు చెప్పమని, దండయాత్రకు సిద్ధమై కాశీనగరం చేరాడు. పౌండ్రకుడు రెండు అక్షౌహిణులతోను, అతడి స్నేహితుడైన కాశీరాజు మూడు అక్షౌహిణుల సైన్యంతోను యుద్ధరంగానికి వచ్చారు.

కృష్ణుడి వలెనే పౌండ్రకుడు కూడా చిహ్నాలను ధరించి ఉన్నాడు. అతణ్ని చూసి రంగస్థల నటుడిగా భావించి కృష్ణుడు గట్టిగా నవ్వాడు.

యుద్ధంలో పౌండ్రక, కాశీరాజుల శిరస్సుల్ని కృష్ణుడు ఖండించాడు. కాశీపట్టణంలో కుండల సహితంగా రాజు శిరస్సు పడింది. పట్టణ ప్రజలు, కాశీరాజు భార్యలు, పుత్రులు, మిత్రులు హాహాకారాలు చేశారు.

కాశీరాజు కుమారుడు **సుదక్షణుడు** తండ్రికి పరలోక క్రియలు నిర్వర్తించి, శివుణ్ణి ప్రార్థించి, ఆయన ఆదేశం మేరకు **అభిచార హోమాన్ని** నియమనిష్ఠలతో చేశాడు. అతి భయంకరమైన **'కృత్య'** హోమగుండం నుంచి వెలువడింది. సుదక్షణుడి కోరికమేరకు శ్రీకృష్ణుడి నగరానికి వచ్చింది. ప్రజలు భయపడి శ్రీకృష్ణుణ్ని ఆశ్రయించారు. కృష్ణుడు చక్రాయుధం ప్రయోగించడంతో అది కృత్యను తరుముతూ వెళ్లింది. కృత్య వెనుతిరిగి సుదక్షిణుడిని దహించి వేసింది. చక్రాయుధం పట్టణంలోని కూడల్ని, గోపురాలతోబాటు, నగరాన్నీ భస్మీపటలం చేసింది.

## బలరాముడి సాహస కృత్యాలు

### ద్వివిదుడనే వానరుడి కథ

సుగ్రీవుడి మంత్రి మైందుడు. అతడి తమ్ముడు ద్వివిదుడు. నరకాసురుడి మిత్రుడు. అహంకారి. ఆ వానరుడు మిత్రుడైన నరకాసురుడి వధకు పగ తీర్చుకోవడానికి శ్రీకృష్ణపాలిత ప్రాంతాలలోని పట్టణాలను, పల్లెల్ని తగలబెట్టటడం; వనాలను, సరోవరాలను నాశనం చెయ్యడం, ఆలమందల్ని బెదిరించడం; స్త్రీపురుషుల్ని కొండగుహల్లో బంధించి బాధించడం; పండిన చెట్లను విరిచెయ్యడం; యువతుల్ని నీటిలో ముంచడం; వంటి అకృత్యాలు చేసేవాడు.

ఒకనాడు మధురమైన సంగీతం విన్పిస్తుంటే ద్వివిదుడు **రైవత పర్వతంలోని** గుహకు వచ్చాడు. అక్కడ జూదమాడుతున్న బలరాముణ్ని చూసి, అతడికి కన్పించే విధంగా వెకిలి చేష్టలు చెయ్యసాగాడు. బలరాముడు కోపంతో రాయి విసిరాడు. ద్వివిదుడు లక్ష్యపెట్టక అతడి పరివారాన్ని సమీపించి వాళ్ల వస్త్రాలను చింపాడు.

బలరాముడు **సునంద** అనేపేరు గల తన రోకలితో అతణ్ని కొట్టి, గొంతు పిసికి చంపాడు.

### కౌరవ గర్వభంగం

దుర్యోధనుడి కుమార్తెపేరు **లక్షణ.** శ్రీకృష్ణుని కుమారుడు (జాంబవతికి పుట్టినవాడు) **సాంబుడు** ఆమెను ధైర్యసాహసాలతో ఎత్తుకుపోయాడు. కౌరవసైన్యం సాంబుణ్ని వెంబడించి బాణాలతో అతడి రథాన్ని కప్పేశారు. సాంబుడు వాళ్లతో పోరాడి అపారనష్టం కలిగించాడు. ఒక్కసారిగా కౌరవ ప్రముఖులు అతణ్ని చుట్టుముట్టి విరథుణ్ని చేసి బంధించారు. నారదమహర్షివల్ల విషయం తెలిసి, కౌరవవంశాన్ని నాశనం చెయ్యాలని ఉగ్రసేనుడి అనుమతితో యాదవులు బయలుదేరారు.

బలరాముడు వాళ్లను వారించి – **కౌరవులు మనదగ్గరి బంధువులు. వాళ్లమీద యుద్ధం ప్రకటించడం నీతి కాదు–** అన్నాడు. బలరాముడు విప్రులతోను, కులవృద్ధులతోనూ కలిసి హస్తినాపురం వెళ్లాడు. హస్తినాపురం సమీపంలోని ఒక ఉద్యానవనంలో నిలిచి ఉద్ధవుణ్ని కౌరవుల వద్దకు పంపాడు, ఉద్ధవుడి ద్వారా బలరాముడి రాక తెలిసి అతడి వద్దకు వెళ్లి దుర్యోధనుడు అర్ఘ్యపాద్యాదులను ఇచ్చి గౌరవించాడు.

బలరాముడు దుర్యోధనుడితో – **మా రాజైన ఉగ్రసేనుడి ఆజ్ఞను మీరు మన్నించాలి. బాలుణ్ని కొందరు సైన్యాధిపతులు కలిసి బంధించడం తప్పు. బంధువుల క్షేమం కోరి మీరు చేసిన తప్పును రాజు మన్నించాడు** – అని చెప్పగానే దుర్యోధనుడు ఆగ్రహంతో –



**చాలు చాలు. కాల వైపరీత్యం. అనర్హులైన వాళ్లు ఆజ్ఞాపించడమా? యాదవులు తమకు యోగ్యంకాని ఛత్రచామరాలను ధరిస్తున్నారు** – అన్నాడు.

దుర్యోధనుడి అహంకారపూరితమైన మాటలు బలరాముడికి తీవ్రమైన అసహనాన్ని, ఆగ్రహాన్ని కలిగించాయి.

కౌరవవంశమంతా నాశనం కావాలి అంటూ, తన నాగలితో హస్తినాపురం చిట్టచివరి భాగాన్ని చొప్పించి, పట్టణాన్ని పూర్తిగా పెకిలించి, గంగలో కలపాలని నిర్ణయించాడు. అప్పుడు గోపుర ప్రాకారసౌధాలతో బాటు నగరం ఒకవైపు ఒరిగింది. పౌరులు హాహాకారాలు చేశారు.

భీష్మదుర్యోధనాదులు పరుగెత్తుకొచ్చి శరణువేడి కన్యకతో సహా సాంబుణ్ణి అప్పగించారు. అనేక కానుకల్ని సమర్పించారు. బలరాముణ్ని స్తుతించారు. **మీరు చేసిన అవినీతి వల్ల ఇలా చేశాను. భయపడవద్దు.** – అని బలరాముడు కౌరవులకు అభయం ఇచ్చాడు.

## శ్రీకృష్ణ పరమాత్ముని యోగమహిమ

శ్రీకృష్ణుడు నరకాసురుణ్ని చంపి, అతడి మందిరంలో బంధింపబడిన పదహారువేలమంది కన్యల్ని వివాహం చేసుకున్నాడనే వార్త విని, అతడి వైభవాన్ని సందర్శించాలన్న కోరికతో ఒకనాడు నారదుడు ద్వారకకు వచ్చాడు. అత్యంత శోభాయమానమైన ఆ పట్టణాన్ని తిలకించారు. శ్రీకృష్ణుడిచేత అతిథి సత్కారాలు పొంది, మందిరం నుంచి వెలుపలికి వచ్చాడు.

వాసుదేవుడి యోగమాయా ప్రభావం తెలుసుకోవాలన్న కుతూహలంతో నారదుడు ఒక భార్య ఇంటికి వెళ్లాడు. అక్కడ ఉద్ధవుడితో కలిసి జూదమాడుతున్న కృష్ణుణ్ని చూశాడు. ఇంతకుముందే అంగనల ఉపచారాలు పొందుతూ తన్ను సత్కరించిన కృష్ణుడు ఇప్పుడు ఇక్కడ ఉండడం చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు.

మరొక సుందరీమణి ఇంటికి వెళ్లి అక్కడ పుత్రులతో కలసి ఆనందిస్తున్న హరిని చూశాడు. మరొక ఇంట్లో తన్ను ఆహ్వానిస్తున్న కృష్ణుణ్ని వీక్షించాడు. మరొక చోట తాంబూలం సేవిస్తూ, ఒక ఇంతి ఇంట సంభాషిస్తూ, మరొక సరసజాక్షి గృహంలో భోజనం చేస్తూ...మరో భార్య ఇంట్లో చదరంగం ఆడుతూ...

ఇలా ప్రతిచోటా మురాంతకుడి లీలలు ప్రస్ఫుటం అవడం చూసి నారదుడు ఆనందపారవశ్యంతో మురళీధరుణ్ని సంస్తుతించి నిష్క్రమించాడు.

## జరాసంధుడి దుశ్చర్యలు

శ్రీహరి తన లీలల్ని కొనసాగిస్తుండగా, ఒకరోజు అపరిచితుడైన బ్రాహ్మణుడు సభామండపంలో కొలువుతీరిన కృష్ణుణ్ని దర్శించి నమస్కరించి ఇలా చెప్పాడు.

**జరాసంధుడు తనకు లోబడని రాజులనందరినీ వెతికి వెతికి తెప్పించి తన రాజధాని గిరవ్రజపురంలో కారాగారంలో బంధించాడు. అటువంటి వాళ్లు ఇప్పటికి ఇరవైవేలమంది వరకు ఉన్నారు. వాళ్లు పంపించగా నేను నీ వద్దకు వచ్చాను. వాళ్లు నీతో తమ విజ్ఞప్తిని తెలియజేయమన్నారు. 'నువ్వు దుష్టశిక్షకుడివి. శిష్ట రక్షకుడివి. ఆర్తులైన మమ్మల్ని కటాక్షించి, రక్షించు. నీ పాదాలే మాకు దిక్కు. మా నిర్బంధాల్ని తొలగించి మా కుటుంబంతో కలిసి జీవించేలా అనుగ్రహించు' అన్నారు.**

## ధర్మజుడి రాజసూయ యాగం

ఆ బ్రాహ్మణుడు ఇలా చెబుతున్నప్పుడే నారదుడు అక్కడికి వచ్చాడు. **ధర్మరాజు రాజసూయయాగం చెయ్యాలని సంకల్పించాడు. నీ సేవ ఒక్కటే సర్వయజ్ఞాల ఫలితాన్నివ్వగలదు. కాని లోకాన్ని అనుకరించి ధర్మరాజు యాగం తలపెట్టాడు. అతడు చెయ్యబోతున్న యాగాన్ని సంరక్షించడానికి నువ్వు తప్పకవెళ్లాలి** – అన్నాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు ఉద్ధవుణ్ని చూసి – **ప్రస్తుత కర్తవ్యం ఏమిటి** – అని సర్వజ్ఞుడైనా అమాయకుడిలా అడిగాడు.

ఉద్ధవుడు – **ధర్మరాజు యాగసంరక్షణ అవశ్య కర్తవ్యం. సమస్త దిక్కుల్ని జయించడానికి మూలమైన ఆ యాగ సందర్భంగా జరాసంధుణ్ని సంహరించడం, అతడిచేత బంధింపబడిన రాజుల్ని విముక్తుల్ని చేయడం కూడా సిద్ధిస్తాయి. జరాసంధుణ్ని చంపడానికి భీమసేనుడు సమర్థుడు. జరాసంధుడు బ్రాహ్మణులు ఏదికోరినా కాదనకుండా ఇస్తాడు. కనుక కపట బ్రాహ్మణవేషంలో వెళ్లి జరాసంధుణ్ని యుద్ధభిక్ష నడిగి భీమసేనుడి ద్వారా చంపించడం జరిగితే అన్ని ప్రయోజనాలు సిద్ధించినట్లవుతుంది** – అన్నాడు.

శ్రీకృష్ణుడు నారదుణ్ని గౌరవించి పంపాడు. బ్రాహ్మణుడు కూడా అభయ ప్రదానం పొంది, తిరిగివెళ్లి కృష్ణుడి మాటల్ని రాజులకు విన్పించి సంతోషింపజేశాడు. కృష్ణుడు భార్యాపుత్రులతో, బంధుమిత్రులతో కలిసి ఇంద్రప్రస్థ పురానికి బయలుదేరాడు.

కృష్ణుడి రాక తెలిసి ధర్మరాజు అపరిమితానందంతో సోదరులు, బంధువులు, తదితర పరివారంతో బయలుదేరి ఎదురువెళ్లి సాదరంగా ఆహ్వానించి, తన నగరానికి తీసుకెళ్లాడు.

కృష్ణుడు అర్జునుడితో కలిసి కొన్నినెలలు వినోదకార్యక్రమాలతో గడిపాడు.



## దిగ్విజయ యాత్ర

ధర్మరాజు రాజసూయ యాగం చెయ్యాలని, తన మనసులోని మాటను బయటపెట్టాడు. కృష్ణుడు – **ధర్మరాజా! శ్రేష్ఠమైన ఈ రాజసూయ యాగానికి అవసరమైన సామగ్రిని సమకూర్చు. శత్రువుల్ని జయించడానికి నీ సోదరుల్ని నియోగించు** – అన్నాడు.

ధర్మరాజు సహదేవుణ్ని దక్షిణ దిక్కుకు, నకులుణ్ని పడమటి దిక్కుకు, అర్జునుణ్ని ఉత్తర దిక్కుకు, భీముణ్ని తూర్పు దిక్కుకు, వెళ్లి దిగ్విజయ యాత్ర చెయ్యాలని పురమాయించాడు. వాళ్లు ఆయా దిక్కులకు వెళ్లి రాజుల్ని జయించి కప్పం కట్టించుకొని బంగారం, మణులు, గుర్రాలు మొదలైన వస్తు సముదాయాన్ని ధర్మరాజుకు అప్పగించారు.

జరాసంధుడు మాత్రం కప్పం కట్టలేదని అర్జునుడు చెప్పాడు. ధర్మరాజు వికల మనస్కుడయ్యాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజుతో – జరాసంధుణ్ని కడతేర్చే ఉపాయం ఉద్ధవుడు చెప్పాడు. ఆ ఉపాయాన్ని వివరించి భీమార్జునులతో కలిసి బ్రాహ్మణవేషంలో జరాసంధుడి వద్దకు వెళ్లి యుద్ధాన్ని అర్థించి తామెవ్వరో కృష్ణుడు తెలియజేశాడు.

జరాసంధుడు భీముణ్ని పోరాటానికి ఎన్నుకున్నాడు. భీకరమైన పోరాటం వాళ్లమధ్య కొనసాగింది. శ్రీకృష్ణుడు జరాసంధుడి మరణం గురించి తెలిసినవాడు కనుక భీముడు చూస్తూ ఉండగా ఒకచెట్టు కొమ్మను పట్టుకొని రెండుగా చీల్చి ఇలా చంపు అని సూచించాడు.

(బృహద్రథుడి ఇద్దరు భార్యలకు చెరిసగంగా, రెండు ముక్కలుగా పుట్టిన శిశువును కోటవెలుపల పడవేస్తే గిరివ్రజపుర దుర్గాన్ని రక్షించే 'జర' అనే రాక్షసి చేసి సంధింపబడి జీవించాడు. కనుక జరాసంధుడయ్యాడు. కాబట్టి రెండు ముక్కలైతే విగతజీవుడౌతాడు.)

భీముడు జరాసంధుణ్ని పడదోసి ఒక కాలిని తొక్కిపట్టి మరోకాలిని చేతులతో పట్టి, తలవరకు రెండు భాగాలుగా చీల్చాడు. ఈ దృశ్యం చూసి పురప్రజలు భయకంపితులయ్యారు.

శ్రీకృష్ణుడు జరాసంధుడి కుమారుడైన సహదేవుడనే వాణ్ని మగధ సింహాసనాన్ని అధిష్ఠింపజేశాడు. చెరసాలలోని రాజులందరినీ విడిపించాడు. తర్వాత ఇంద్రప్రస్థపురానికి భీమార్జునులతో చేరుకున్నాడు.

### శిశుపాలవధ

ధర్మరాజు రాజసూయయాగం నిర్వహించాడు. సమస్త ఋషుల్ని, రాజుల్ని, దుర్యోధనాది సహోదరుల్ని ఆహ్వానించాడు. సహదేవుడి సలహామేరకు కృష్ణుడికి అగ్రతాంబూలం ధర్మరాజు సమర్పిస్తుండగా శిశుపాలుడు పలురకాలుగా శ్రీకృష్ణుణ్ని

దూషించసాగాడు. ఆ నిందలు వినలేక మునులు, రాజులు చెవులు మూసుకొని సభనుంచి నిష్క్రమించారు. తనమీదికి వస్తున్న శిశుపాలుడి తలను సుదర్శన చక్రంతో శ్రీకృష్ణుడు ఖండించాడు. శిశుపాలుడి దేహం నుంచి దేదీప్యమానమైన తేజస్సు వెలువడి కృష్ణుడిలో లీనమయింది.

పరీక్షిత్తు వెలిబుచ్చిన సందేహానికి శుకుడు – **ఓ రాజా! మధుసూదనుడి మీది మత్సరంతో మదోన్మత్తుడై మూడు జన్మలనుంచి ముకుందుణ్ని నిందిస్తూ, ఎల్లప్పుడూ ధ్యానిస్తూ ఉండడం వల్ల, విముక్తులై బ్రహ్మాదులకు కూడా సాధ్యంకాని పదవిని పొందాడు** (జయవిజయుల మూడవజన్మ శిశుపాల దంతవక్త్రులది) – అని వివరించాడు.

యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగింది. ధర్మరాజు భూరిదానాలు చేశాడు.

## దుర్యోధనుడి మాత్సర్యం

ధర్మరాజు వైభవాన్ని, సౌందర్యవంతులైన శ్రీకృష్ణుడి భార్యల నడుమ మెరపు తీగలా ప్రకాశిస్తూ ఉన్న ద్రౌపదీదేవి సౌభాగ్యాన్ని, రాజసూయ మహావైభవాన్ని చూసి దుర్యోధనుడు అసూయతో లోలోపల బాధపడసాగాడు.

ఒకరోజు ధర్మరాజు మయసభా మంటపం మధ్య కొలువుతీరి ఉన్నప్పుడు దుర్యోధనుడు అక్కడికి వచ్చాడు. మాయామయమైన ఆ మహాసభలో నీళ్లులేని చోట కట్టుకున్న దుస్తుల్ని ఎగబెట్టుకొని, నీళ్లున్నచోట దుస్తుల్ని తడుపుకొని భ్రమకు లోనయ్యాడు.

భ్రాంతికి లోనైన దుర్యోధనుణ్ని చూసి భీముడు నవ్వాడు. ధర్మరాజు వారిస్తున్నా సభలోని రాజులు, స్త్రీలు పెద్దగా నవ్వారు. మయసభలో తనకు జరిగిన అవమానానికి దుర్యోధనుడు క్రుద్ధుడయ్యాడు. భూభారాన్ని తగ్గించడానికి అవతరించిన కృష్ణుడు ఆ సంఘటన చూస్తూ మౌనం వహించాడు.

## సాల్వుడు – సౌభక విమానం

రుక్మిణీ పరిణయ సందర్భంగా శిశుపాలుడికి సాయంగావచ్చి భంగపడిన రాజులలో సాల్వుడు ఒకడు. యాదవులందరినీ నాశనం చేస్తానని శపథం పూని, ఒక ప్రశాంత ప్రదేశంలో ఈశ్వరుణ్ని గూర్చి తపస్సుచేశాడు. ప్రతిరోజు కేవలం పిడికెడు దుమ్ము మాత్రమే స్వీకరించి పట్టుదలతో తపస్సు చెయ్యసాగాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై ఏం వరం కావాలని అడిగాడు.

**గంధర్వ గరుడ యక్ష రాక్షస దేవతాదులకి సాధ్యంకానిదై, నా ఇష్టానుసారం, అవసరమైనప్పుడు ఆకాశమార్గంలో సంచరించే వాహనాన్ని ప్రసాదించు** – అన్నాడు.



ఈశ్వరుడు లోహనిర్మితమైన మిక్కిలి పొడవు, వెడల్పు ఉన్న, కామగమనమైన పట్టణాన్ని నిర్మించి, దానికి సౌభకమని పేరు పెట్టి సాల్వుడికి ఇచ్చాడు.

ఆ విమానంలో వచ్చి ద్వారకానగరంలోని నదుల్ని, ఉద్యానవనాలని ధ్వంసం చేశాడు. సరస్సులు, బావులు పూడ్పించాడు. కోటల్ని, బురుజుల్ని, యంత్రాల్ని ధ్వంసం చేస్తూ, కొల్లగొడుతూ, ప్రజల్ని చెరపడుతూ పెక్కు బాధల్ని ప్రజలకు కల్పించాడు.

ఈ విధ్వంస చర్యను చూసి ప్రజలకు ధైర్యం చెప్పి, ప్రద్యుమ్నుడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. అతడి వెంట యాదవవీరులు బయలుదేరారు. ప్రద్యుమ్నుడి సైన్యం సాల్వసైన్యానికి తీవ్రనష్టం కలిగించారు. సాల్వుడు మాయా ప్రభావంతో విమానంలో పలు విన్యాసాలు చేశాడు.

సాల్వుడి మంత్రి ద్యుమడనే వాణ్ని ప్రద్యుమ్నుడు కంఠం నరికి చూపాడు. ఇరవై ఏడురోజులు పర్యంతం యుద్ధం కొనసాగింది.

ఇంద్రప్రస్థ నగరం నుంచి ద్వారకకు వస్తున్న కృష్ణుడికి దారిలో అపశకునాలు కన్పించాయి. దారుకుణ్ని వేగంగా రథం నడపమన్నాడు. కృష్ణుడు ద్వారకానగరాన్ని సమీపిస్తుండగా, యుద్ధవాతావరణం కన్పించింది. ఆకాశంలో సౌభకవిమానాన్ని, అందులోని సాల్వుణ్ని కృష్ణుడు చూశాడు. కృష్ణుడి రాకతో యాదవసైన్యం ఉత్సాహాన్ని పుంజుకుంది.

యుద్ధంలో సాల్వుడిని గదతో మోదడం వల్ల అతడి నోటినుంచి, ముక్కు నుంచి రక్తం స్రవిస్తుండగా మూర్ఛపోయాడు. ఇంతలో ఒకడు ఆర్తనాదం చేస్తూ – **మీ తండ్రి వసుదేవుణ్ని సాల్వుడు బంధించాడు** – అన్నాడు.

సాల్వుడు – **నీ తండ్రిని చంపుతున్నాను** – అని తలను ఖండించి, తలతోబాటు సౌభక విమానంలో వెళ్లాడు.

కృష్ణుడు దుఃఖిస్తుండగా సైనికులు – **అది మయుడి చేత కల్పించబడిన మాయ** – అన్నారు.

ఆ మాటలు విన్నంతనే కిందపడి ఉన్న కళేబరం మాయమయింది. వచ్చిన దూత అదృశ్యం అయ్యాడు. కృష్ణుడు సౌభక విమానాన్ని తుత్తునియలు చేసి, కిందికి దిగిన సాల్వుణ్ని చక్రాయుధంతో సంహరించాడు.

## దంతవక్త్రుడి వధ

సాల్వుణ్ని చంపి, సౌభక విమానాన్ని ధ్వంసం చెయ్యడం చూసి దంతవక్త్రుడు సాల్వ, పౌండ్రక వాసుదేవ, శిశుపాలురకు ఉత్తరక్రియలు నిర్వర్తించి, భయంకర ఆకారంతో

కృష్ణుడిమీదకు వచ్చాడు. తన గదా దండంతో కృష్ణుణ్ని కొట్టాడు. కృష్ణుడు తన గదతో అతడి వక్షఃస్థలం మీద మోదాడు. దంతవక్త్రుడు నేలకూలాడు.

సూక్ష్మతేజం అతడి శరీరం నుంచి వెలువడి కృష్ణుడి దేహంలోకి ప్రవేశించింది. అన్న మరణం చూసి, అతడి తమ్ముడు విదూరథుడు కత్తితో కృష్ణుడిపైకి దూసుకువచ్చాడు. చక్రాయుధంతో కృష్ణుడు అతడి శిరస్సును ఖండించాడు. ఇలా పలువురిని శ్రీకృష్ణుడు ఆ సమరంలో వధించడం జరిగింది.

## కుచేలుడు

శ్రీకృష్ణుడి సహాధ్యాయి కుచేలుడు. బ్రాహ్మణోత్తముడు. అభిమానధనుడు. పరమ శాంతమూర్తి. రాగద్వేషాలు లేనివాడు, విజ్ఞానవంతుడు. ధర్మ తత్పరుడు. దారిద్ర్యం తాండవిస్తున్నా ఎవరినీ యాచించడు. అతడి భార్య మహాపతివ్రత.

తన సంతానం ఆకలితో కృశించి, ఎండిన పెదవుల్ని నాలుకతో తడుపుకుంటూ చేతుల్లో ఆకులు, గిన్నెలు పట్టుకొని తల్లివద్దకు వచ్చి పట్టెడన్నం పెట్టమంటుంటే ఆమె కన్న కడుపు తల్లడిల్లి భర్తతో – **ఇంట్లో పేదరికం తాండవిస్తూ ఉంది. దీన్నిగురించి మీరు ఆలోచించడం లేదు. శ్రీకృష్ణుడు మీ మిత్రుడు. ఆయన్ని దర్శించండి. ఆయన కృపాకటాక్షం మనల్ని ఉద్ధరిస్తుంది** – అంది.

ఇల్లాలు చెప్పిన మాటలకు సంతోషించి కుచేలుడు కృష్ణుణ్ని చూడడం ఇహపరసాధనం అని భావించాడు. కాని అతణ్ని దర్శించేటప్పుడు ఏదైనా కానుకలు తీసుకువెళ్తే బాగుంటుందేమో నన్నాడు. ఆమె అతడి చిరిగిన కొంగులో అటుకులు ముడివేసి పంపింది.

కుచేలుడు ద్వారకను సమీపించే కొద్దీ డోలాయమాన చిత్తానికి లోనయ్యాడు. రుక్మిణీ మందిరంలోని కృష్ణుణ్ని సమీపించాడు. కుచేలుణ్ని కొంతదూరంలో చూడగానే కృష్ణుడు పాన్పుదిగి, ఎదురువెళ్లి, ఆదరాభిమానాలతో అతణ్ని కౌగలించుకున్నాడు. సాదరంగా తీసుకువచ్చి తన పాన్పుమీద కూర్చోబెట్టాడు. బంగారు కలశంలోని నీళ్లతో అతడి పాదాలు కడిగి భక్తితో ఆ నీటిని తలపై చల్లుకున్నాడు. రుక్మిణి వింజామర వీచింది.

కుచేలుడి ప్రయాణ బడలిక తీరింది. అంతఃపురస్త్రీలు ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోతున్నారు. కృష్ణకుచేలురు సాందీపని ఆశ్రమంలో తాము గడిపిన నాటి సంగతుల్ని నెమరువేసుకున్నారు. కృష్ణుడు – **నా కోసం ఏమి తెచ్చావు** – అని అడిగాడు. కుచేలుడు తాను తెచ్చిన అటుకుల్ని ఇవ్వలేక మౌనంగా తలదించుకున్నాడు. కృష్ణుడే ఉత్తరీయంలో ముడివేసిన అటుకుల్ని ఇదేమిటని అడుగుతూ, ముడినివిప్పి, పిడికెడు అటుకుల్ని తీసుకొని



ఆరగించాడు. అవి తిన్న తర్వాత మళ్లీ మరో పిడికెడు అటుకులు తీసుకున్నాడు. రుక్మిణి వారిస్తూ – **సకల సంపదలు అనుగ్రహించడానికి, మీరు తీసుకున్న అటుకులు చాలు. ఇక తినకండి** – అంది.

ఆ రాత్రి మధురపదార్థాలను తిని, మెత్తటి పాన్పుమీద పడుకొని, మరుసటిరోజు కాలోచిత కృత్యాలను పూర్తిచేసుకొని కుచేలుడు తన ఊరికి బయలుదేరాడు. దారిలో శ్రీకృష్ణుడి సత్కారాన్ని తలచుకొని పరవశించాడు. పలుమార్లు ముందురోజు జరిగిన వాటిని మననం చేసుకుంటూ నగరం చేరుకున్నాడు.

తన ఇల్లు ఉన్నచోట పాలరాతి కట్టడాలు, ఉద్యానవనాలు, సరోవరాలు, అనేక ఆభరణాలు ధరించిన దాసదాసీ జనాలతో నిండిన గొప్ప మందిరాన్ని చూశాడు. సిరిసంపదలకు ఆలవాలమై కన్పిస్తున్న ఇది ఏ పుణ్యాత్ముడి భవనమో! అని కుచేలుడు ఆశ్చర్యం చెందాడు.

అతడలా చూస్తుండగానే దేవకాంతలవంటి యువతులు కుచేలుణ్ని సాదరంగా ఆహ్వానించి, సంగీత నృత్యవాద్యాలతో అంతఃపురానికి తీసుకొని వెళ్లారు. కుచేలుడి భార్య మానవాకారం దాల్చిన మహాలక్ష్మిలా శోభిల్లుతూ వచ్చి పతిపాదాలకు నమస్కరించింది. వాళ్లిద్దరూ కృష్ణుడి కటాక్షంతో కలిగిన ఐశ్వర్యానికి మిక్కిలి ఆనందించారు.

అర్థకాంక్షతో కుచేలుడు కృష్ణుడివద్దకు వెళ్లాడు. కాని అతణ్ని ఏమీ కోరలేదు. అయినా కృష్ణుడు సకలసంపదలు అనుగ్రహించాడు. కుచేలుడు భోగాలపై ఆసక్తి లేకుండా, నిర్వికారుడై, హరిభక్తి అనే అమృతరస వాహినిలో ఓలలాడుతూ ముక్తుడయ్యాడు.

## గ్రహణ స్నానం – బంధువులు కలయిక

పరశురాముడు ఇరవైఒక్కసార్లు రాజలోకం మీద దండెత్తి వాళ్ల కుత్తుకల్ని తునిమాడు. ఆ రాజుల రక్తప్రవాహాన్ని అయిదు మడుగులు చేశాడు. అవి స్యమంతక పంచకం అనేపేరుతో పవిత్రక్షేత్రం అయింది.

కల్పాంత కాలంలో వలె చూడసాధ్యం కాని సూర్యగ్రహణం వస్తుందని, బలరామకృష్ణులు ప్రజలు తమ వెంటరాగా, స్యమంతక పంచకానికి వెళ్లారు. అక్కడ గోదాన భూదానాలను విరివిగా చేశారు. పుణ్యతీర్థాలలో స్నానం చేసి ఉపవాసం ఉన్నారు.

మత్స్య కోసల విదర్భాది దేశాధిపతులు , నందగోపాది గోపాలకులు, ధర్మరాజుతో కలిసి వచ్చిన భీష్మద్రోణ ధృతరాష్ట్ర సంజయ విదురాదులు ఇతర రాజశ్రేష్టులు అక్కడికి వచ్చారు. వాళ్లు ఉగ్రసేనాది యాదవ ముఖ్యుల్ని పూజించారు. వాళ్లందరూ దేవాధిదేవుడైన శ్రీకృష్ణదర్శనం అయినందుకు ముగ్ధులయ్యారు. శ్రీకృష్ణుడితో బంధుత్వ, మిత్రత్వాలు కలిగే

భాగ్యం యాదవులు పొందినందుకు రాజశ్రేష్ఠులు ఆశ్చర్యపోయారు. కుంతిదేవి తన దైన్యావస్థను వసుదేవుడితో మొరపెట్టుకుంది.

నందయశోదలను చూసి, బలరామకృష్ణులు మొక్కి కౌగలించుకున్నారు. యశోదాదేవి వాళ్లని పసిపిల్లలు వలెనే ఒడిమీద కూర్చోబెట్టి మూర్ధాఘ్రాణం చేసింది. రోహిణి, దేవకీదేవి యశోదాదేవిని కౌగలించుకొని ఆప్యాయంగా మాట్లాడుకున్నారు. గోపికలు శ్రీకృష్ణుడిపై అనురాగంతో అతణ్ని చూడడానికి వచ్చారు.

వాళ్లకి జన్మకర్మలిక ఉండవని శ్రీకృష్ణుడు అనుగ్రహించాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజును సంభావించి కుశలప్రశ్నలను వేశాడు.

ద్రౌపది శ్రీకృష్ణుడి ఎనిమిదిమంది భార్యలను చూసి మీ వివాహాలు జరిగిన తీరు చెప్పమంది. లక్షణ పరిణయ వృత్తాంతం తప్ప తక్కినవి ఇంతకుముందు వర్ణింపబడ్డాయి. లక్షణ తన పెళ్లి వివరాలను తెలియజేసింది.

మద్రరాజు పుత్రిక లక్షణ. నారదగానలోలుడైన గోవిందుణ్ని తొలినుంచి ఆరాధించేది. అతడి కథామృతాన్ని తనివితీరా అనుభవించి, అతడే తన ప్రాణనాధుడని భావించేది. ఆమె అభిప్రాయాన్ని గ్రహించిన తండ్రి అందుకు ఒక ఉపాయం ఆలోచించాడు. ఆకాశంలో కంటికి కన్పించని మత్స్య యంత్రాన్ని పెట్టి, కింద ఉన్న నీటిలో అది ప్రతిబింబించేలా చేశాడు. ఎక్కుపెట్టడానికి సాధ్యంకాని ధనుస్సును, వజ్రసమానమైన బాణాన్ని ఏర్పాటుచేశాడు.

దీన్ని ఎక్కుపెట్టి మత్స్యయంత్రాన్ని పడగొట్టిన వీరుణ్నే నా కుమార్తె పెళ్లాడుతుందని ప్రకటించాడు. రాజపుత్రులందరూ ప్రయత్నించి విఫలులయ్యారు. శ్రీకృష్ణుడు అలవోకగా ఆ మత్స్య యంత్రాన్ని పడగొట్టాడు. అప్పుడు లక్షణ చేతుల్లో ఉన్న కమలహారాన్ని కృష్ణుడి మెడలో, ఇప్పపూల దండతో అతడి వక్షస్థలాన్ని అలంకరించింది.

ఓర్వలేని రాజులు కృష్ణుడిపై దాడికి పూనుకున్నారు. వాళ్లందరి ఉక్కడగించి కృష్ణుడు లక్షణను చేజిక్కించుకున్నాడు. లక్షణ తండ్రి బృహత్సేనుడు గొప్ప కానుకల్ని ఇచ్చాడు. అతడికి ఆ సంపద వైభవం కూడా కృష్ణానుగ్రహం వల్లే కలిగింది. లక్షణ తన కల్యాణగాథను ఇలా వివరించింది.

రామకృష్ణుల్ని దర్శించడానికి దేవల, వ్యాస, కణ్వ, నారద, గౌతమ, చ్యవన, వాల్మీకి, గార్గ్య, వసిష్ఠ, గాలవ, అంగీరస, కశ్యప, అసిత, మార్కండేయ, అగస్త్య, యాజ్ఞవల్క్య, ఋష్యశృంగాది మునులు వచ్చారు. వాళ్లని యధోచితంగా పూజించి – **మీ రాకతో మా జన్మ పావనమయింది. మిమ్మల్ని దర్శిస్తే చాలు. ఇతర పుణ్యతీర్థాలలో**



**పనిలేదు** – అని కృష్ణుడు చెప్పాడు. ఆ మహర్షులు – **దేవా! మేము, బ్రహ్మరుద్రాదులు మీ మాయకు లోబడి ఉన్నాము. నిగూఢమైన నీ అభీష్టం చేత మమ్మల్ని అనుగ్రహించావు. మాయ అనే తెరచాటున ఉన్న నిన్ను ఈ రాజలోకం, మేమూ దర్శించగలిగాము. మా జన్మ, మా విద్య, మా తపోమహిమ సార్థకమయ్యాయి. నీకు నమస్కరిస్తున్నాం** – అన్నారు.

వసుదేవుడు అక్కడికి వచ్చి – **సత్కర్మలద్వారా పూర్వజన్మ కర్మల్ని పోగొట్టుకునే ఉపాయం చెప్పండి** – అని మహర్షుల్ని అడిగాడు. వాళ్ల సూచనమేరకు వాళ్లనే ఋత్విక్కులుగా వరించి స్యమంత పంచక తీర్థం సమీపంలో దేవేంద్రుడికి మించిన వైభవంతో యజ్ఞం నిర్వహించిన వసుదేవుడు భూరిదక్షిణలు ఇచ్చి అందరినీ సంతృప్తి పరిచాడు. అందరూ కృష్ణుడి అనుజ్ఞపొంది తమ తమ నివాసాలకు చేరుకున్నారు.

ఉగ్రసేన వసుదేవులు, బలరామకృష్ణులు బలవంతం చేసి ప్రార్థించి నంద యశోద, గోపగోపికా జనుల్ని కొన్నాళ్లపాటు అక్కడే ఉంచారు. మూడునెలలపాటు అక్కడ గడిపి వర్షాకాలం రాగానే సపరివారంగా ద్వారకానగరం చేరుకున్నారు.

## తల్లి కోరిక తీర్చిన తనయులు

సముద్రంలో తప్పిపోయిన గురుపుత్రుణ్ని రామకృష్ణులు తీసుకువచ్చిన వృత్తాంతాన్ని ద్వారకలోని ప్రజలు చెప్పుకుంటుండగా విని, దేవకీదేవి మరణించిన తమ పుత్రులైన రామకృష్ణ సోదరుల్ని చూడాలని ఉందని కోరింది.

బలరామకృష్ణులు మాయాప్రభావంతో సుతలలోకంలోని బలిచక్రవర్తి వద్దకు వెళ్లాడు. బలి వాళ్లకి పాదాభివందనం చేశాడు.

కృష్ణుడు బలిచక్రవర్తితో – **కృతయుగంలో మరీచిభార్య వర్ణ అనే స్త్రీకి ఆరుమంది పుత్రులు పుట్టారు. తన కూతురినే కామించిన బ్రహ్మను చూసి వాళ్లు పరిహసించారు. బ్రహ్మ ఆగ్రహించి రాక్షసులుగా పుట్టండని శపించాడు. వాళ్లు హిరణ్యకశిపుడి పుత్రులుగా జన్మించారు.**

**దేవతల హితంకోరి యోగమాయ వాళ్లని దేవకి గర్భంలోకి ప్రవేశింపజేసింది. దేవకి ప్రసవించడంతోనే కంసుడు అందరినీ వధించాడు. ఇప్పుడు మా తల్లి ఆ పుత్రుల్ని చూడాలని అంది. ఇప్పుడు నీవద్ద సుఖంగా ఉన్న వీళ్లే ఆ పుత్రులు. వాళ్లని నాతో పంపితే నా అనుగ్రహం చేత సద్గతి ప్రాప్తిస్తుంది** – అన్నాడు. బలిచక్రవర్తి వాళ్లని కృష్ణుడికి అప్పగించాడు.

శిశువుల రూపంలోనే వాళ్లని దేవకీదేవికి అప్పగించాడు. ఆమె ఆనందంతో ఆ శిశువుల్ని ఒడిలో కూర్చోబెట్టుకుంది. వైష్ణవ ప్రభావం చేత వాళ్లు తల్లిపాలు తాగారు.

శ్రీకృష్ణుడి స్పర్శకారణంగా బ్రహ్మ శాపాన్ని పోగొట్టుకొని, తమ రూపాలు ధరించి స్వస్థానాన్ని చేరుకున్నారు.

శుకుడు తర్వాత సుభద్రాపరిణయ వృత్తాంతాన్ని పరీక్షిత్తుకు చెప్పాడు.

## సుభద్రా పరిణయం

అర్జునుడు తీర్థయాత్రల కోసం బయలుదేరి ప్రభాసతీర్థం చేరాడు. సుభద్రపై అతడికి అపారమైన ప్రేమ. బలరాముడు సుభద్రను దుర్యోధనుడికి ఇచ్చి పెళ్లి చెయ్యాలన్న తలపుతో ఉన్నాడని కూడా అర్జునుడు విన్నాడు.

సుభద్రను చూడాలన్న ఆలోచనతో సన్యాసి వేషం ధరించి ద్వారకలో ప్రవేశించాడు. అక్కడి పౌరులు సేవిస్తుండగా వర్షాకాలం అంతా అక్కడే గడిపాడు. బలరాముడు అర్జునుణ్ని సన్యాసిగా భావించి తన మందిరానికి తీసుకువచ్చాడు.

అర్జునుడి సమక్షంలో సుభద్ర తిరుగాడుతూంది. తాను ఎవరన్నది సుభద్రకు తెలియజేశాడు. క్రమంగా సుభద్రార్జునులు పరస్పరం ప్రగాఢంగా ప్రేమించుకున్నారు. ఒకనాడు సుభద్ర దేవతామహోత్సవానికి నగరం వెలుపలికి వచ్చింది. కృష్ణ, దేవకీ వసుదేవుల అనుమతితో అర్జునుడు సుభద్రను అనుసరించాడు.

అలంకరించుకున్న సుభద్ర శృంగార రసాధిదేవతలా విహరిస్తుంటే, అర్జునుడు ఆమెను సమీపించి రథం మీద కూర్చోబెట్టి తీసుకుపోసాగాడు. ఎదుర్కొన్న యదువీరుల్ని నిగ్రహించి ఇంద్రప్రస్థపురానికి చేరుకున్నాడు. బలరాముడికి ఈ వార్తతెలిసి మండిపడ్డాడు. కృష్ణుడు మొదలైన ఆత్మబంధువులు అతడి పాదాలకు ప్రణమిల్లి, మెత్తటి మాటలతో అతణ్ని సుభద్రార్జునుల వివాహానికి అంగీకరించేటట్లు చేశారు.

## శ్రుతదేవుడు – బహుళాశ్వుడు

విదేహదేశంలోని మిథిలానగరంలో శ్రుతదేవుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. పరిపూర్ణ విష్ణుభక్తుడతడు. సర్వవిధాల ఉత్తముడు. బహుళాశ్వుడనే నామాంతరం గల జనకుడు ఆ నగరానికి రాజు. శ్రుతదేవుడిలా నిర్మలమైన అంతరంగంతో ఏ పనిచేసినా ధర్మాన్ని విస్మరించకుండా జీవిస్తూ వచ్చాడు. కృష్ణుడు వీళ్లిద్దరినీ అనుగ్రహించాలని భావించాడు.

శ్రీకృష్ణుడు మిథిలానగరం పయనం అయ్యాడు. ఆయన వెంట అత్రి, కృష్ణ, అసిత, అరుణ, బృహస్పతి, కణ్వ, మైత్రేయ, చ్యవనాది మునులు వెళ్లారు.

శ్రీకృష్ణుడు వస్తున్నాడని తెలిసి బహుళాశ్వుడు ఆనందించి, వివిధ పదార్థాలను



తీసుకువచ్చి శ్రుతదేవుడితోబాటు ఎదురువెళ్లాడు. ఇద్దరూ శ్రీకృష్ణుడి పాదాలకు నమస్కరించారు.

ఇద్దరూ శ్రీకృష్ణుణ్ని మునులతో కలిసివచ్చి తమ గృహాన్ని పావనం చెయ్యమని ప్రార్థించారు. కృష్ణుడు వీళ్లిద్దరికీ ఒకే సమయంలో అనుగ్రహించాలని రెండుచోట్ల వాళ్ల పూజల్ని స్వీకరించారు. బహుళాశ్వుడు రాజోచితంగా పూజించాడు. శ్రుతదేవుడు తన భార్యతో కలిసి యథోచితంగా సపర్యలు గావించాడు.

ధన్యులమయ్యామని శ్రీకృష్ణుణ్ని అనేక విధాలుగా స్తుతించారు. వాళ్లను కటాక్షించి, మునులతోబాటు ద్వారకకు మరలి వచ్చాడు.

## శ్రుతిగీతాలు

శుకుడు పరీక్షిత్తు కోరిన మీదట శ్రుతిగీతాలను వివరించాడు.

కల్పాంత సమయంలో అనేక శక్తులతో కూడుకొని యోగనిద్రలో ఉన్న సర్వేశ్వరుణ్ని వేదాలు స్తోత్రం చేసే పద్ధతి ఎలాంటిదో పూర్వం సనందుడు శ్వేతద్వీప వాసులైన మునులకు విశదీకరించాడు. దాన్ని నారాయణముని నారదుడికి చెప్పాడు. నారదుడు విన్న దానిని శుకుడు పరీక్షిత్తుకు వివరించాడు.

**ఓ విష్ణుదేవా! నీకు జయమగుగాక! నువ్వు సకల జీవులకు జ్ఞాన ప్రదాతవు. ప్రాణుల్లో ఆత్మ స్వరూపుడివి. నీలోనే సకల వేదాలు ప్రవర్తిస్తాయి.**

**సూక్ష్మదర్శనులైన మహితాత్ములు నిన్ను గర్భంలోని అగ్నిగా భావిస్తారు. అరుణులనే ఋషిశ్రేష్ఠులు సంషుమ్నానాడిలో సంచరిస్తూ, హృదయంలో సంచరించి, సూక్ష్మకారణరూపుడివిగా నిన్ను గ్రహిస్తారు. హృదయపద్మం నుంచి వెలువడి మూర్ధన్యనాడిద్వారా బ్రహ్మరంధ్రం చేరుకొని ఆనందమయ పరంజ్యోతి రూపుడివైన నిన్ను చేరి మునులు ముక్తులవుతారు. వాళ్లకి ఇక ముందుజన్మ ఉండదు.**

**ఈ సృష్టికి పరమాణువులే కారణమని, భావించే కణ్వగౌతమాదులు; ప్రకృతి కారణమనే సాంఖ్యులు; దేహాత్మవాదులైన బౌద్ధులు; తమ తమ కుతర్కాలతో నిన్ను తెలుసుకోలేకున్నారు. నిన్ను తెలిసిన పరమయోగులకు నువ్వు తప్ప తక్కినవన్నీ అసత్యాలని అన్పిస్తాయి. నువ్వు సర్వంలో ఉంటావు. విశ్వాత్మకుడివైనా సమస్త కల్మషాలకు అతీతుడివి. శుభరూపుడివి. కల్యాణగుణాత్మకుడివి. నిన్ను ఆత్మతత్త్వం తెలిసినవాళ్లే ఎరుగగలరు.**

ఈ నారాయణోపాఖ్యానం సకల వేదశాస్త్ర పురాణసారం. ఉపనిషత్తులకు సమానం. దీన్ని పఠించినా, విన్నా పాపాలు నశిస్తాయి. ఇహపర సౌఖ్యాలు కలుగుతాయని శుకుడు చెప్పాడు.

## విష్ణుసేవా ప్రాశస్త్యం

పరీక్షిత్తు **– శివుణ్ని సేవించి దేవమానవులు సుఖసంపదలతో జీవిస్తారు. విష్ణువును సేవించే మునీశ్వరులు నిరుపేదలై ఉంటారు. దీనికి కారణమేమిటో వివరించండి** – అని శుకుడు అర్థించాడు.

**శివుడు మహాశక్తి సంపన్నుడు. సత్త్వరజస్తమోగుణాలతో కూడినవాడు. కనుక పరమశివుణ్ని సేవించేవాళ్లు సంపన్నులవుతారు. శ్రీహరి త్రిగుణాతీతుడు. అతణ్ని కొలిచేవాళ్లూ రాగరహితులే. వాళ్లు సంపదల్ని ఆశించరు.**

కృష్ణుడే రాజసూయ యాగ సందర్భంలో ధర్మరాజుకు చెప్పిన సమాధానం ఇది

ఎవరిమీద నాకు అనుగ్రహం కలుగుతుందో ఆ ఉత్తముడి సమస్త సంపదల్ని నేను హరిస్తాను. అతడు ధనహీనుడై శోకిస్తాడు. బంధువులు అతణ్ని తిరస్కరిస్తారు. అతడు అన్నిటినీ త్యజించి, నా భక్తులతో స్నేహంచేసి, క్రమంగా విజ్ఞానం పొంది వైకుంఠప్రాప్తికి అర్హుడౌతాడు. నన్ను కొలవడం కష్టమని దేవతల్ని ఆరాధించి, ఆ ఐశ్వర్యాలు శాశ్వతమని భ్రమించి, కృతఘ్నులై మూర్ఖులు శుభాలకు కారకులైన దేవతల్నే విస్మరిస్తారు. ఇందుకు ఉదాహరణగా ఒక కథ ఉంది.

## వృకాసురుడి వృత్తాంతం

వృకాసురుడి శకుని అనే రాక్షసుడి కొడుకు. దుర్మార్గుడైన సజ్జనుల్ని హింసించేవాడు. అతడు ఒకనాడు నారదుణ్ని చూసి నమస్కరించి **– మునీశ్వరా! త్రిమూర్తుల్లో ఎవరు తమ్ము ఆరాధించే భక్తులకు త్వరగా వరాలిస్తారు?** – అని అడిగాడు.

నారదుడు **– పరమేశ్వరుడే! ఆ కారణంగానే రావణ బాణాసురులు ఆయన్ని సేవించి వైభవాలను పొందారు** – అని చెప్పాడు.

వెంటనే వృకాసురుడు కేదారతీర్థం వెళ్లి ఘోరతపస్సు చేశాడు. తన శరీరంలోని మాంసాన్ని ముక్కలు ముక్కలు చేసి అగ్నికి ఆహుతిచ్చాడు. అయినా శివుడు ప్రత్యక్షం కాలేదు. తుదకు గండ్రగొడ్డలితో తన శిరస్సును ఖండించుకో పోగా శివుడు ప్రత్యక్షమై **ఏమి వరం కావాలో కోరుకో** – అన్నాడు. అతడు **– స్వామీ నా చేతిని ఎవరి తలమీద ఉంచుతానో వాడితల నూరు ముక్కలై పోవాలి** – అని వరం అడిగాడు.

శివుడు వరం ఇచ్చాడు. ఆ వరాన్ని పరీక్షించాలనుకున్న వృకాసురుడు శివుడి తలమీదే చెయ్యి పెట్టాలనుకున్నాడు. శివుడు భయపడి, పరుగెత్తి వైకుంఠం చేరాడు. హరికి విషయం తెలిసింది. విష్ణువు వటువు వేషం ధరించి, దండ కమండలాలతో, జింకచర్మంతో దానవుణ్ని సమీపించాడు.



వృకాసురుడితో – **నువ్వెందుకు ఆయాసపడుతున్నావు? ఈ శరీరాన్ని ఇంతగా అలమటింపజేయడం ఎందుకు**? అని మధుర సంభాషణలతో అతణ్ని సంతోషింపజేశాడు. వృకాసురుడు జరిగింది చెప్పాడు.

విష్ణువు **– దక్షుడి శాపంవల్ల శివుడు అసత్యాలు పలుకుతున్నాడు. అతణ్ని నమ్మకు. సత్యం పలికే వాడైతే నీ చేతిని తగలనియ్యకుండా పారిపోతాడా? అదీగాక అశుచిగా అతణ్ని తాకవద్దు. కనుక కాళ్లూ చేతులు కడుక్కొని తర్వాత స్పృశించు –** అన్నాడు.

విష్ణుమాయలోపడి వృకాసురుడు తననెత్తిమీద తానే చేతినుంచాడు. అతడి తల నూరుముక్కలయింది. దేవతలందరూ సంతోషించారు.

## త్రిమూర్తులలో ఉన్నతుడు

పూర్వం సరస్వతీ నదీతీరంలో మునీశ్వరులు అనేక యాగాలు చెయ్యసాగారు. అప్పుడు త్రిమూర్తుల్లో ఎవరు అధికులన్న చర్చ వాళ్లమధ్య జరిగింది. భృగుమహర్షి తాను శోధిస్తానని చెప్పి, తొలుత బ్రహ్మలోకం వెళ్లి, అతడి సత్త్వగుణం పరీక్షించాలనుకొని, బ్రహ్మను స్తుతించకుండా మౌనంగా నిలుచున్నాడు. బ్రహ్మ కోపించాడు. తన పుత్రుడేనన్న భావంతో సర్దుకున్నాడు.

భృగువు తర్వాత కైలాసం వెళ్లాడు. సోదరుడన్న వాత్సల్యంతో తన్ను కౌగలించుకుంటాడని అతడికి ఎదురువెళ్లాడు. కాని భృగువు మిన్నకున్నాడు. శివుడు కోపించి, త్రిశూలంతో అతణ్ని పొడవాలనుకున్నాడు. పార్వతి అడ్డువచ్చి నివారించింది.

తర్వాత వైకుంఠం వెళ్లిన మహర్షి లక్ష్మి ఒడిలో తలపెట్టుకొని పడుకున్న విష్ణువు వక్షాన్ని తన పాదంతో తన్నాడు. నారాయణుడు నిర్వికారంగా పాన్పునుండి దిగివచ్చి, వినయంగా – నీ రాక గురించి తెలియక అపరాధం చేశాను. క్షమించు. కరుణించి ఈ సింహాసనం అలంకరించు – అన్నాడు.

భృగుమహర్షి సంతోషించి త్రిమూర్తుల స్వభావాలను ఇతర మునులకు వివరంగా తెలియజేశాడు. **అఖిల కల్యాణగుణాకరుడైన నారాయణుడు ఒక్కడే పరమదైవం** – అని నిర్ణయించి మునులు శ్రీహరి పాదారవిందాలను ధ్యానంలో నిలిపారు.

## నరనారాయణులే కృష్ణార్జునులు

కృష్ణుడు కుశస్థలిలో (ద్వారకానగరానికి పూర్వనామం) సుఖంగా ఉన్నప్పుడు ఒక బ్రాహ్మణుడు మరణించిన తన శిశువును కోట వాకిలిలో పెట్టి ఏడుస్తూ...

**ఏ దేశంలో రాజు వేదవేత్తల్ని హింసిస్తూ, అన్యాయమార్గంలో రాగద్వేషాలకులోనై ప్రవర్తిస్తాడో, అక్కడ ప్రజలు దుఃఖాల పాలవుతారు. బ్రాహ్మణద్వేషియై, శాస్త్రాచారాన్ని పాటించని పాపాత్ముడైన రాజు చేసిన పాపం వల్ల నా కుమారుడు పుట్టగానే మరణించాడు** – అని వెళ్లిపోయాడు. ఆ విధంగా అతడికి ఎనిమిది మంది శిశువులు జన్మించి మరణించారు. ప్రతిసారి మునుపటిలా రాజమందిర ద్వారంవద్ద దూషించి వెళ్లేవాడు.

తొమ్మిదవ కుమారుణ్ని అలా తీసుకొచ్చినప్పుడు అర్జునుడు అతడి దూషణను విని, అతడి పుత్రుల్ని రక్షిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. బ్రాహ్మణుడికి విశ్వాసం కలిగింది. కొన్నిరోజుల తర్వాత బ్రాహ్మణుడి భార్యకు ప్రసవవేదన మొదలయింది. బ్రాహ్మణుడు అర్జునుడికి ఈ విషయం చెప్పాడు.

అర్జునుడు శివుడికి నమస్కరించి, మంత్రదేవతల్ని మనస్సులో తలిచాడు. గాండీవాన్ని ఎక్కుపెట్టి ప్రసవమందిరాన్ని బాణాలతో కప్పి వేశాడు. బ్రాహ్మణుడి భార్య ప్రసవించిన వెంటనే ఆ బిడ్డ శరీరంతో ఆకాశంలో అదృశ్యం అయ్యాడు.

బ్రాహ్మణుడు కృష్ణుడితో మొరపెట్టుకున్నాడు. అర్జునుణ్ని నిందించాడు. అర్జునుడు ఆ నిందను వినలేక వెంటనే అష్టదిక్పాలకుల పట్టణాలకు వెళ్లి వెతికి, ఎక్కడా కన్పించక తన ప్రతిజ్ఞానుసారం అగ్నిప్రవేశం చెయ్యటానికి సిద్ధమయ్యాడు.

కృష్ణుడు అతణ్ని వారించి బంగారు రథం ఎక్కి అర్జునుడితో బయలుదేరాడు. రథం వాయువేగంతో నదులు, సాగరాలు, అడవులు, అన్నిటినీ దాటి, దట్టమైన చీకటి మండలాన్ని సమీపించింది. ముందుకు సాగుతున్న కొద్దీచీకటి మరింత భయంకరంగా తోచింది.

గుర్రాలు శక్తి కోల్పోయి, దారితప్పి నిలబడ్డాయి. బాలసూర్యుడి కాంతితో వెలిగే చక్రాయుధాన్ని ప్రయోగించి, ఆ చిమ్మచీకటిని దాటిన పిదప మిరుమిట్లు గొలిపే మహాతేజం కన్పించింది. అర్జునుడు కళ్లు మూసుకున్నాడు. రథం ముందుకు సాగి, గంభీర జలరాశిని చేరింది. ఆ నీటి మధ్యభాగంలో కోటిసూర్య కాంతితో ప్రకాశిస్తున్న భవనం కన్పించింది.

అక్కడ యోగీంద్రులు, భాగవతోత్తములు ఆనందంలో ఉన్నారు. వెయ్యిపడగల ఆదిశేషుడిపై, నీలమేఘశ్యామమైన కాంతితో పీతాంబరాలు ధరించి, లక్ష్మీసమేతుడై, సనక సనందనాది ముని మండలంతో పరివేష్టింపబడి శంఖ, చక్ర, గద, శార్ఙ్గాలతో శోభిస్తున్న నారాయణుడు కన్పించాడు.

ఆ దివ్యమంగళ స్వరూపానికి ఇద్దరూ చేతులు జోడించి నమస్కరించారు. ఆ పురుషోత్తముడు – **భూలోకంలో క్రూరులైన దానవుల సంహారానికి, ధర్మప్రతిష్ఠాపనకు,**



**మీరిద్దరూ నరనారాయణులుగా నా అంశతో జన్మించారు. మిమ్మల్ని చూడాలని ఈ ముని బృందం కోరినందువల్ల, మిమ్మల్ని రప్పించడం కోసమే ఆ విప్రబాలుడిని ఇక్కడికి తెప్పించాను. ఈ బాలకుల్ని తీసుకువెళ్లండి** – అన్నాడు.

కృష్ణార్జునులు భగవంతుణ్ని పలురీతులుగా స్తుతించి ఆ బాలురిని తీసుకుని వచ్చి విప్రుడికి అప్పగించారు.

## బలరాముడి తీర్థయాత్ర

(బలరాముడు తీర్థయాత్రకు వెళ్లడం ఈ స్కంధంలో కుచేలోపఖ్యానం, సుభద్రార్జునుల పరిణయ సన్నివేశాలకు ముందు చోటు చేసుకుంది. కురుక్షేత్ర యుద్ధం పరిసమాప్తం అయినప్పుడు బలరాముడు తీర్థయాత్రను ముగించుకువచ్చాడు కనుక చివరగా ఇక్కడ పొందుపరచడం జరిగింది.)

కురుపాండవుల యుద్ధం అనివార్యం అని తెలియగానే, బలరాముడు ఇరుపక్షాలకు కావలసిన వాడు కనుక తీర్థయాత్ర నెపంతో ద్వారకనుండి వెళ్లిపోయాడు.

బలరాముడు ప్రభాస తీర్థంలో స్నానం చేసి, విప్రముఖ్యులు వెంటరాగా, సరస్వతి, బిందు సరోవరం, వజ్రతీర్థం, విశాలానది, సరయువు, యమున, గంగ మొదలైన పుణ్యనదుల్లో స్నానంచేసి దేవర్షి పితృగణాలకు తర్పణాలు సమర్పించాడు. బ్రాహ్మణులకు సంతర్పణలు చేశాడు. తర్వాత మునులు దీర్ఘ సత్రయాగం జరుపుతున్న నైమిశారణ్యానికి వెళ్లాడు.

బలరాముణ్ని చూసి అందరూ లేచి నిలబడినా, సూతుడు లేవలేదు. బలరాముడు ఆగ్రహంతో కుశాగ్రంతో సూతుణ్ణి సంహరించాడు. **బలరామా! ఇతడికి మేము బ్రహ్మాసనం ఇచ్చాము. అందువల్ల నువ్వు వచ్చినప్పుడు లేవలేదు. నువ్వు బ్రహ్మహత్యాపాతకానికి ఒడిగట్టావు** – అని మహర్షులన్నారు. బలరాముడు పశ్చాత్తాపంతో సూతుణ్ని మళ్లీ బ్రతికించి ఆయువును, ఆత్మశక్తిని, రోగం లేని శరీరాన్ని, విద్యాదక్షతను పొంది ఈ లోకంలో ప్రకాశించే విధంగా అనుగ్రహించాడు.

తన పాపప్రవృత్తికి మార్గం చెప్పమని మునులను అడిగాడు. **బలరామా! ఇల్వలుడనే రాక్షసుడి కొడుకు పల్వలుడు బలగర్వంతో ప్రతిపర్వం నాడు వచ్చి యజ్ఞశాలల్లో మలమూత్రాలను, చీము నెత్తురుని, మద్యమాంసాలను కురిపించి పాడుచేస్తున్నాడు. ఆ రాక్షసుణ్ని నువ్వు చంపితే సంతోషిస్తాము. ఆ తర్వాత పన్నెండు నెలలు నిర్మలమైన హృదయంతో భారతదేశంలోని సకల పుణ్యతీర్థాలను సేవించి వాటిలో స్నానం చేసినట్లయితే పాపాలన్నీ నశిస్తాయి** అని మునులు సూచించారు.

పర్వదినం రాగానే పల్వలుడు వచ్చిన మునులు చెప్పినట్లే బీభత్సం సృష్టించాడు. బలరాముడు అతణ్ని సంహరించి సమస్త పుణ్యతీర్థాలను సేవించాడు. మహేంద్ర పర్వతంలో పరశురాముణ్ని దర్శించాడు.

సప్తగోదావరి, కృష్ణానది, పంపానదులను చూశాడు. భీమానదిని, అక్కడ కొలువై ఉన్న కుమారస్వామిని సందర్శించాడు. శ్రీశైలం, వేంకటాచలం (తిరుమల), కామకోటిశక్తి (కాంచీపురం) మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించి, కావేరి నదిలో స్నానంచేసి, రంగనాథుణ్ణి సేవించాడు.

వృషభాద్రి, మధుర, సేతుబంధం దర్శించాడు. రామేశ్వరం మొదలైన ప్రసిద్ధ క్షేత్రాలను చూసి మలయాచలంలో అగస్త్యుడికి ప్రణమిల్లి, కన్యాకుమారిని చూసి గోకర్ణక్షేత్రంలో పరమేశ్వరుణ్ని ఆరాధించి, నిర్వంధ్యను దాటి, దండకారణ్యాన్ని గడిచి, తుదకు ప్రభాసతీర్థం వెళ్లాడు.

అక్కడ కౌరవ పాండవ సంగ్రామంలో రాజులందరూ హతులయ్యారని, భీమ దుర్యోధనులు గదాయుద్ధానికి సమాయత్తం అయ్యారని విని వాళ్లని వారించడానికి అక్కడికి వెళ్లాడు.

బలరాముణ్ని చూసి, ధర్మరాజాదులు నమస్కరిస్తున్నా త్వరగా భీమ దుర్యోధనులు గదాయుద్ధం చేసే చోటికివెళ్లి – **మీలో ఒకడు భుజబలంలో అధికుడు. ఒకడు అభ్యాసనైపుణ్యంలో శ్రేష్ఠుడు. మీరిద్దరూ సమానులు. మీలో ఎవరూ ఎవరినీ గెలవలేరు. యుద్ధం మానుకోండి** – అన్నాడు.

బలరాముడి హితవచనాలను వాళ్లు పట్టించుకోక పోవడంతో కానున్నది కాకమానదని బలరాముడు అటునుంచి ద్వారకానగరానికి చేరుకున్నాడు.

----

చివరగా కృష్ణ సంతతిని గురించి మళ్ళీ ప్రస్తావించిన శుకుడు – పరీక్షిత్తుతో ముల్లోకాలకు శుభాన్ని చేకూర్చే కృష్ణకథా సుధారసాన్ని భక్తితో పానంచేసే పుణ్యాత్ములు ఇహలోకంలో సకల సౌభాగ్యాలు పొందుతారు. అన్ని పాపాలు నశిస్తాయి. తుదకు శాశ్వతమైన మోక్షాన్ని పొందగలుగుతారు – అని ముగించాడు.

శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పిన విధంగానే సూతుడు శౌనకాది మహామునులకు తెలియజేశాడు. మునులు సూతుణ్ని సత్కరించి అతడికి సంతోషం కలిగించారు.

**దశమ స్కంధం సమాప్తం.**

---



# పదకొండవ స్కంధం

**నగుమొగమున్, సుమధ్యమును, నల్లనిమేనును, లచ్చికాటప**
**ట్టగు నురమున్, మహాభుజము లంచిత కుండల కర్ణముల్ మదే**
**భగతియు, నీలవేణియు, కృపారసదృష్టియు, కల్గు వెన్ను డి**
**మ్ముగ పొడసూపు గాత కనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్ (124)**

యుద్ధభూమిలో కృష్ణుడు రాక్షసవీరుల్ని అసంఖ్యాకంగా సంహరించాడు. భూభారం ఎక్కువగా ఉండడంతో జూదమనే నెపంతో, కౌరవపాండవుల మధ్య యుద్ధం జరిపించి, ఉభయ సైన్యాలనూ రూపుమాపాడు. యదువీరులు మాత్రం యుద్ధంలో నశించక మరింత వృద్ధి చెందుతున్నారు.

తన భక్తులైన యాదవులు ఇతరులనుంచి అవమానాన్ని ఎదుర్కోలేదు. వీళ్లని అంతం చెయ్యడానికి నేను తప్ప మరో దైవం ముల్లోకాలలో లేడు. యదు బలాలకు పరస్పరం విరోధం కల్పించి నాశనం చెయ్యాలని, అందుకు బ్రాహ్మణ శాపం మూలకారణంగా ఉండాలని భావించాడు.

## మహర్షుల రాక – శాపం

కృష్ణుడి సంకల్పానికి అనుగుణంగా విశ్వామిత్ర, అసిత, దుర్వాస, భృగు, అంగిరస, కశ్యప, వామదేవ, వాలఖిల్య, అత్రి, వసిష్ఠ, నారదాది మహర్షులు ద్వారకానగరానికి వచ్చారు. దివ్యపురుషుడైన కృష్ణుణ్ని దర్శించి తరించారు.

కృష్ణుడి లీలావిలాసాలను కీర్తించి ద్వారకకు సమీపంలోని **పిండారకమనే** పుణ్యతీర్థానికి వెళ్లారు. యాదవకులంలోని యువకులు కొందరు సాంబుడికి అందమైన స్త్రీవేషం వేసి, గర్భం ధరించినట్లు తీర్చిదిద్దారు.

మునుల వద్దకు వెళ్లి, నమస్కారం చేసి సాంబుడిని చూపుతూ ఈ అమ్మాయి **కడుపులో ఉన్నది మగశిశువా? ఆడశిశువా–** అని అడిగారు. వాళ్ల పరిహాసాన్ని గ్రహించిన మునులు ఆగ్రహంతో **– అపహాస్యం చేస్తున్నారా? యదువంశాన్ని నాశనం చేసే రోకలి ఈ బాలుడికి పుడుతుంది** – అన్నారు.

మునుల శాపంతో కంపించిన యువకులు సాంబుడి చుట్టూ కట్టిన చీరను విప్పుతుంటే అందులోంచి రోకలి నేలమీద పడింది. ఆశ్చర్యంతో ఆ రోకలిని తీసుకువెళ్లి కృష్ణుడితో జరిగిందంతా వివరించారు. అదంతా తన మాయవల్లే జరిగినా శ్రీకృష్ణుడు –

**ఆ శాపానికి తిరుగులేదు. సముద్రం ఒడ్డున ఉన్న కొండలోని ఎత్తైన బండమీద మీ భుజబలంతో ఈ ఇనుపరోకలిని బాగా రాచి పొడిచేసి, సముద్రంలో కలపండి** – అన్నాడు.

వాళ్లు కృష్ణుడు ఆదేశించినట్లే చేశారు. చివరగా మిగిలిన కీలకమైన ముక్కను పట్టించుకోక సముద్రంలో పడేశారు. దాన్ని ఒక చేప మింగింది. బోయవాడి వలలో ఆ చేప చిక్కింది. ఆ చేప కడుపులోని ఇనుపముక్కను తన బాణం చివర ములికిగా చేసుకున్నాడు.

## విదేహ – ఋషభ పుత్రుల సంవాదం

శుకుడు పై వృత్తాంతాన్ని వినిపించినప్పుడు పరీక్షిత్తు – **మనస్సు ఎలా నిశ్చలంగా నిలుస్తుంది? వసుదేవుడు ఏవిధంగా తన చిత్తాన్ని శ్రీమన్నారాయణుడి చరణకమలాలపై నిల్పాడు**? – అని ప్రశ్నించాడు.

శుకుడి సమాధానం :–

ఒకప్పుడు నారదుడు ద్వారకానగరానికి వచ్చినప్పుడు వసుదేవుడు నారదుణ్ని పూజించి – **పరమపదం చేరేమార్గాన్ని తెలియజేయండి. నారాయణుడిని పుత్రుడిగా పొందినా మోక్షమార్గం తెలియక దైవమాయలో చిక్కి సంసారంలో మునిగాను** – అని అడిగాడు.

నారదుడు – **ఎంత పాపం చేసినా నారాయణ నామస్మరణ ఎల్లప్పుడూ చేసేవాళ్లు ధన్యులు.** అంటూ విదేహ – ఋషభ పుత్రుల సంవాద వృత్తాంతాన్ని తెలియజేశాడు.

**ఋషభ వృత్తాంతం అయిదవ స్కంధంలో చెప్పబడింది.** ఆయన వందమంది సంతానంలో తొమ్మిదిమంది బ్రహ్మవిద్యా విశారదులుగా, లోకాలన్నీ పరమాత్మ స్వరూపంగా భావించి, అన్నిచోట్లకు విచ్చలవిడిగా విహరించగలిగారు.

భూలోకంలో విదేహుడు చేస్తున్న యజ్ఞం ముగింపుకు వచ్చిన సమయంలో ఆ మునులు అక్కడికి వచ్చారు. వాళ్లకు ఎదురేగి విదేహరాజు తగిన రీతిలో పూజించాడు.

విదేహుడు అడిగిన తొమ్మిది ప్రశ్నలకు, తొమ్మిదిమంది మునులు ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రశ్నకు సమాధానం చెప్పారు.



## ప్రశ్నలు –

1. సంసార సాగరాన్ని దాటటానికి అల్పబుద్ధులు, నీరసులైన మానవులకు ఏదైనా మార్గం ఉందా? నిష్ఠగల భక్తులకు పరమేశ్వరుడు సారూప్యం ఎలా ఇస్తాడు?
2. భాగవతుల ధర్మం ఏది? భాగవతుల గుర్తులేమిటి?
3. శ్రీహరి గుణవిశేషాలు ఏమిటి?
4. అజ్ఞానులైన మానవులు మాయను అణచివేసి ఏవిధంగా వైకుంఠం చేరగలుగుతారు?
5. నారాయణుడనే నామంతో అలరారే పరమాత్ముడి ప్రభావం ఎటువంటిది?
6. ఏయే కర్మలను ఆచరిస్తే పాపాలను పోగొట్టుకొని పుణ్యాత్ముడై మానవుడు మురవైరి పాదాలను ఆశ్రయించగలుగుతాడు?
7. ఈశ్వరుడు ఏయే లీలల్ని ఆచరించాడు?
8. త్రికరణశుద్ధిగా హరిపూజ చెయ్యకుండా విపరీత ప్రవర్తన కలిగిన మూర్ఖులకు ముక్తిపొందే ఉపాయం ఏది?
9. అవ్యయుడు, విశ్వవిభుడూ అయిన విష్ణువు ఏయే యుగంలో ఏ రీతిగా ఉన్నాడు? ఏ రూపం ధరించాడు?

పై ప్రశ్నలకు వరుసగా **కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రమిళుడు, చమసుడు, కరభాజనుడు** సమాధానాలు చెప్పారు.

## ఆ సమాధానాల సారాంశం:–

పరబ్రహ్మమని, పరతత్త్వమని, పరమపదమని, పరమేశ్వరుడని, శ్రీకృష్ణుడని వేర్వేరు పేర్లతో శ్రీమన్నారాయణుడు ప్రపంచమంతటా నిండి ప్రకాశిస్తున్నాడు. శరీరం ధరించినవాడు నైమిత్తికాలైన కర్మలు చేస్తూ ప్రళయాంతం వరకు చావు పుట్టుకలతో పడి దొర్లుతుంటాడు.

వేదం చెప్పినట్లు చెయ్యకుండా ఫలాలు కోరేవాడు అనేక జన్మలు ఎత్తుతాడు. మోక్షం కోరేవాడు శాస్త్రం చెప్పినట్లు హరిని పూజించాలి. త్రికరణశుద్ధిగా ప్రతికర్మనూ కృష్ణార్పణంగా చెయ్యడం సుజ్ఞానం.

శ్రీకృష్ణ సంకీర్తనలు వినడం, హరినామకథనాన్ని సంతోషంగా చెప్పడం, నారాయణుడి దివ్యనామాలను ఎల్లప్పుడూ స్మరించడం, అడవుల్లో తిరుగుతున్నా, పరంధాముడి దివ్యలీలల్ని పాడడం, లోకమంతా విష్ణుమయం అని భావించడం, సర్వభూతమయుడైన హరిశంఖ చక్రాలుదాల్చి తన ఆత్మలో ఉన్నాడన్న విశ్వాసంతో

భక్తిశ్రద్ధలు కలిగి ఉండడం, భక్తిమార్గాన్ని ఆశ్రయించి శ్రీహరి సమస్త జగత్తులో నిండి ఉన్నాడనుకోవడం ఉత్తమభాగవతుల లక్షణం.

## చతుర్యుగాలలో విష్ణుమూర్తి స్వరూపం

కృతయుగంలో విష్ణువు తెల్లటిరంగు, చతుర్భుజాలు కలిగి ఉంటాడు. జడలు, నారచీరలు, జింకచర్మం, జపమాలిక, దండం, కమండలం దాల్చి ఉంటాడు. మునులచేత, హంసుడు, సువర్ణుడు, వైకుంఠుడు, ధర్ముడు, అమలుడు, యోగీశ్వరుడు, ఈశ్వరుడు, పురుషుడు, అవ్యక్తుడు, పరమాత్ముడు అనే దివ్యనామాలతో కీర్తింపబడతాడు.

త్రేతాయుగంలో ఎర్రటిరంగుతో, నాలుగుచేతులు, మూడుమేఖలాలు ధరించి, బంగారు రంగు జుట్టుకలిగి – విష్ణువు, యజ్ఞుడు, పృశ్నిగర్భుడు, సర్వదేవుడు, ఉరుక్రముడు, వృషాకపి, జయంతుడు, ఉరుగాయుడనే పేర్లతో బ్రహ్మవాదుల చేత ప్రశంసింపబడతాడు.

ద్వాపర యుగంలో నీలవర్ణం కలిగి పసుపు పచ్చటి వస్త్రాలు ధరించి, రెండు చేతులతో, దివ్యమైన ఆయుధాలు ధరించి, శ్రీవత్సం, కౌస్తుభం, వనమాలికలతో ప్రకాశిస్తూ – జనార్దనుడు, వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, నారాయణుడు, విశ్వరూపుడు, సర్వభూతాత్మకుడు అనే పేర్లతో చక్రవర్తులచేత ప్రస్తుతింపబడతాడు.

కలియుగంలో నల్లటిరూపంతో కృష్ణుడనే పేరుతో భక్తుల్ని రక్షించడానికి యజ్ఞాలలో కీర్తించబడతాడు. హరి, రాముడు, నారాయణుడు, నృసింహుడు, కంసారి, నలినోదరుడనే పేర్లతో బ్రహ్మాదులచేత నుతింపబడతాడు.

## బ్రహ్మాదిదేవతల ఆగమనం

మునులు, దేవతలు, రుద్రుడు, బ్రహ్మ మొదలైన వాళ్లు కృష్ణుడివద్దకు వచ్చి – **దేవా! నువ్వు భూలోకంలో జన్మించి ఇప్పటికి నూట ఇరవైఅయిదేళ్ళు గడిచాయి. ఇక వైకుంఠానికి రావలసింది** – అని ప్రార్థించారు.

(కలియుగానికి పూర్వం 126వ సంవత్సరంలో, అంటే క్రీస్తుపూర్వం 3228వ సంవత్సరం – శ్రీముఖనామ సంవత్సరం శ్రావణ బహుళ అష్టమిరాత్రి పన్నెండు గంటలకు రోహిణీ నక్షత్రంలో కృష్ణుడు జన్మించాడు. 125 సంవత్సరాలు 7నెలలు 8 1/2 రోజులు జీవించి కలి ఒకటవ సంవత్సరం (ప్రమాది నామ సంవత్సరం) చైత్రశుద్ధ పాడ్యమి శుక్రవారం తన అద్భుత అవతారాన్ని చాలించాడు.

– సర్వసిద్ధాంతసారం – సంపుటం 8, పుట 100 – అనుభవానందస్వామి)

**యాదవులకు పరస్పరం వైషమ్యం కలిగింది. వాళ్లని రూపుమాపి, భూభారం తగ్గించి, వైకుంఠానికి వస్తాను – అని చెప్పి కృష్ణుడు దేవతలకు వీడ్కోలు పలికాడు.**



దుశ్శకునాలను చూసి కృష్ణుడు యాదవులను పిలిచి – **కాకులు, గుడ్లగూబలు బంగారు మేడల్లో పలురకాలుగా ఏడుస్తున్నాయి – గుర్రాల తోకల్లో మంటలు పుడుతున్నాయి. చిలుకలు, గోరువంకలు రాత్రిపూట వికృత స్వరాలతో అరుస్తున్నాయి. ఒక జంతువు మరో జాతి జంతువుని కంటున్నది. నివాస గృహాల్లో పుట్టగొడుగులు పుడుతున్నాయి. ఇటువంటి ఉత్పాతాల కారణంగా మీరు ఇక్కడ ఉండడం క్షేమం కాదు. ప్రభాస తీర్థం వెళ్లండి** – అన్నాడు. ఆయన మాట ప్రకారం యాదవులు ప్రభాస తీర్థం చేరారు.

## ఉద్ధవ – శ్రీకృష్ణుల సంవాదం

జ్ఞానవంతుడైన ఉద్ధవుడు తన మనస్సులో విషయమంతా గ్రహించాడు. కృష్ణుడితో **– నువ్వు యాదవకులాన్నంతటినీ నాశనం చేసి వెళ్లినట్లయితే మేమెలా జీవించగలం? నీకు సహచరులుగా నీతో కలిసి, స్నాన, పాన, భోజన, శయన ఆసనాదుల్ని ఎలా విస్మరించగలం?** అని అడిగాడు.

కృష్ణుడు :– బ్రహ్మాది దేవతల కోరిక మేరకు భూభారాన్ని తొలగించాను. నేటికి ఏడవరోజు సముద్రుడు ద్వారకానగరాన్ని ముంచేస్తాడు. యాదవజాతి నాశనమవుతుంది. కలియుగం మొదలవుతుంది. మానవులు ధర్మహీనులై, ఆచారం లేనివాళ్లై, అన్యాయపరులు, అధికరోషం కలవాళ్లు, మందమతులు, తక్కువ ఆయుస్సు కలిగినవాళ్లు, బహురోగాల చేత పీడింపబడేవాళ్లు, నాస్తికులు – అయి పరస్పరం కలహించుకుంటారు. నువ్వు స్నేహితుల, బంధువుల అనుబంధాలను విడిచి, భూతలం మీది పుణ్యతీర్థాలలో స్నానం చెయ్యి. పంచేంద్రియాలవల్ల ఏర్పడే వస్తువులన్నీ నశించేవే అని గ్రహించు.

యదురాజుకు అవధూతకు జరిగిన సంభాషణను కృష్ణుడు ఉద్ధవుడికి చెప్పాడు.

యదురాజు – **శరీరం ధరించినవాడు లోభమోహాదుల్ని వదిలిపెట్టి జనార్దనుడిని ఏవిధంగా చేరవచ్చు** – అని అవధూతను అడిగాడు.

అవధూత – **పరధనం, పరకాంతల వాంఛ, పరవస్తు సంగ్రహణం, పరనింద, శరీరం కంపించకముందే, బుద్ధిచాంచల్యాన్ని పొందకముందే, దృఢమైన భక్తి భావంతో విష్ణుచరణ కమలాలను ఆరాధిస్తూ, నిత్యమైన ఆనందాన్ని పొందేవాడు మోక్షం పొందుతాడు.**

తర్వాత ఉద్ధవుడు అడిగిన వాటికి కృష్ణుడు ఇలా సమాధానం ఇచ్చాడు.

**మౌనవ్రతం, బ్రహ్మచర్యం, సహనం, జపం, తపం, అతిథి సత్కారం, పరహితం,**

**దొంగతనం చెయ్యకుండడం – ఇవి నియమాలుగా ఉండాలి. సమదర్శనం, వైష్ణవభక్తి, ప్రాణాయామం, మనోనిర్మలత్వం :– విద్య; శమదమాది గుణాలు లేకపోవడం, నాపై భక్తి లేకపోవడం :– అవిద్య; చిత్తశుద్ధి కలిగి ఎల్లప్పుడూ తృప్తిగా ఉండడం :– దమం; పై నియమాలు, గుణాలు కలిగి నాపై భక్తి కలిగి ఉండడం :– సుఖం; నన్ను తెలుసుకోలేక తమోగుణంతో ప్రవర్తించడం – దుఃఖం; బంధువులు, గురువుల పట్ల భేద బుద్ధికలిగి, శరీరాన్నే తన ఇల్లుగా భావించేవాడు :– దరిద్రుడు; ఇంద్రియాలను నిగ్రహించి, గుణసాంగత్యాల పట్ల విరక్తుడైనవాడు – ఈశ్వరుడు.**

శ్రీకృష్ణుడు ఉద్ధవుడితో చివరగా – **బదరికాశ్రమం వెళ్లి, తీవ్రమైన యోగనిష్ఠతో, నేను చెప్పిన సాంఖ్యయోగాన్ని మనస్సులో నిలుపుకొని, కలియుగం చివరి వరకు ఉండు** – అన్నాడు.

ఉద్ధవుడు సంతోషంతో, శ్రీకృష్ణుడి పాదకమలాలు హృదయంలో నిలుపుకున్నవాడై బదరికాశ్రమానికి వెళ్లాడు.

## యాదవకుల నాశనం – అవతార ఉపసంహరణం

కృష్ణుడు, బలరాముడితో కలిసి ద్వారకను విడిచిపెట్టాడు. యాదవులు మద్యపానం మత్తులో, సరదాగా పోట్లాడుకోవడం మొదలుపెట్టి, క్రమంగా భీకరయుద్ధానికి పాల్పడ్డారు. మునిశాపం కారణంగా ఏపుగా పెరిగిన తుంగ బెత్తాలతో బాదుకుంటూ, వజ్రాయుధంతో సమానమైన ఆయుధాలతోను పొడుచుకున్నారు.

రణరంగమంతా ముక్కలు ముక్కలైన మొండాలతో, భీభత్సమైన శరీర ఖండాలతో విరిగిన రథాలు, కూలిన గుర్రాలు, చచ్చిన ఏనుగులతో నిండింది. యాదవ యువకులందరూ ప్రాణాలు కోల్పోయారు.

ఈ దృశ్యాలను చూసి నవ్వుకుంటూ కృష్ణబలరాములు ముందుకుసాగారు.

కొంతదూరం వెళ్లిన తర్వాత బలరాముడు ఒక్కడే ఒకవైపు వెళ్లి యోగమార్గంలో అనంతుడిలో ఐక్యమయ్యాడు. కృష్ణుడు మరో మార్గంలో వెళ్లి గుబురుగా ఉన్న ఒక పొదమాటున పడుకొని కాలుమీద కాలుపెట్టి ఆడిస్తూ, విశ్రాంతి తీసుకున్నాడు.

ఒక బోయవాడికి కృష్ణుడు ఆడిస్తున్న కాలు జింక చెవిలా కన్పించింది. వాడు విల్లు ఎక్కుపెట్టి, బాణం సంధించి వదిలాడు. ఆ బాణం తగిలి కృష్ణుడు **హాహాకారం** చేశాడు.

బోయవాడు దగ్గరికి వచ్చి జగన్నాథుడని తెలిసి – **నేను పాపాత్ముణ్ని, అపరాధం చేశాను** – అని తన్ను నిందించుకుంటూ దీనంగా ఏడ్వసాగాడు.



శ్రీకృష్ణుడు – **నువ్వు నిమిత్తమాత్రుడివి. పూర్వజన్మ కర్మల అనుభవాలు ఎంతవారికైనా తప్పవు.**

కాని బోయవాడు – **మహాపరాధం చేసినవాడు, గురువులకు, దైవానికి, వైష్ణవులకు ద్రోహం చేసినవాడు శిక్ష అనుభవించవలసిందే** – అని పవిత్రమైన భావనతో నిరాహార దీక్ష చేసి ప్రాణాలు విడిచి, వైకుంఠప్రాప్తి పొందాడు.

అప్పుడు కృష్ణుడి రథసారథి దారుకుడు వచ్చి ఒంటరిగా ఉన్న కృష్ణుణ్ని చూసి, చేతులు జోడించి – **సముద్రమంతటి యాదవకులం నశించింది. బంధువులు, గురువులు, మిత్రులు, మిగిలినవాళ్లు, చెల్లాచెదురైపోయారు. ద్వారకకు వెళ్లి ఏమని చెప్పను?** అని అంటుండగానే శ్రీకృష్ణుని దివ్యాయుధాలు, గుర్రాలు మాయమయ్యాయి.

నారాయణుడు దారుకునితో – **అక్రూరుడికి, విదురుడికి జరిగినదంతా చెప్పు. ముసలివాళ్లని, పిల్లల్ని, స్త్రీలను హస్తినాపురానికి తీసుకెళ్లమని అర్జునుడితో చెప్పు** అని అతణ్ని సాగనంపాడు. దారుకుడు కృష్ణుడు ఆదేశించినట్లే అందరికీ వివరంగా చెప్పాడు.

అంతలో ద్వారకానగరం పూర్తిగా నీటిలో మునిగిపోయింది. ఎవరూ ప్రవేశించలేని స్థితి కలిగింది.

పరమేశ్వరుడైన కృష్ణుడు నూరుకోట్ల సూర్యుల దివ్యతేజస్సుతో, నారదాది మునుల సమూహం, బ్రహ్మ రుద్రాది దేవతల జయ జయ నినాదాలు చేస్తూ తోడురాగా తన సదనానికి చేరుకున్నాడు.

**ఆ నారాయణుడి మూర్తి సముద్రప్రాంతంలో జగన్నాథుడి రూపంలో ఉంది** – అని శుకుడు పరీక్షిత్తుకు తెలియజేశాడు.

ఈ కథను విన్నవాళ్లు, రాసినవాళ్లు – సిరిసంపదలు, కీర్తి, అదృష్టం కలిగి దీర్ఘాయుస్సుతో గొప్పగా జీవిస్తారు – అని శుకుడు చెప్పిన ఫలశ్రుతితో **పదకొండవ స్కంధం** పూర్తవుతుంది.

–––

# పన్నెండవ స్కంధం

**జగము రక్షింప, జీవుల జంప, మనుప**
**కర్తవై సర్వమయుడవై కానిపింతు**
**వెచట నీ మాయ తెలియంగ ఎవ్వ దోపు?**
**విశ్వసన్నుత! విశ్వేశ! వేదరూప! (35)**

ఇది కేవలం 53 గద్యపద్యాలున్న మిక్కిలి చిన్న స్కంధం

పరీక్షిత్తు శుకమహర్షితో – **మహాత్మా! నారాయణుని దివ్యగాథల్ని, గుణాలను, ఆచారవిధులను, జీవాత్మభేదాన్ని, పూజాపద్ధతిని, జ్ఞానయోగాన్ని – ఇంకా ఎన్నింటినో వివరించి నాకు విజ్ఞానం కలిగించావు. ఇక భవిష్యత్తులో జరగబోయే వాటిని కూడా తెలియజేయవలసింది** – అని కోరాడు.

శుకుడు భవిష్యత్తు రాజన్యుల పేర్లను తెలిపాడు. పరీక్షిత్తు అడిగిన కాలస్వరూపం గురించి, లోకాలు ఎలా నిలుస్తాయి అన్న ప్రశ్నలకు శుకుడు చెప్పిన యుగాలు, ప్రళయాల వివరాలు మూడవ స్కంధంలోనే చెప్పబడింది.

చివరగా శుకమహర్షి – **పుట్టిన వాళ్లందరూ గిట్టక తప్పదు. కనుక చనిపోతున్నాననే భయాన్ని మనసులోంచి తుడిచిపెట్టి హరిని ధ్యానం చేసుకో. అందువల్ల నీకు మళ్లీ పునర్జన్మ ఉండదు** – అని పరీక్షిత్తుతో చెప్పి నిష్క్రమించాడు.

## పరీక్షిత్తు మరణం – జనమేజయుడి సర్పయాగం

శృంగి శాపం చేత ప్రేరేపింపబడిన తక్షకుడు బ్రాహ్మణవేషంలో పరీక్షిత్తును చంపడం కోసం వస్తూ దారిలో కాశ్యపుడనే బ్రాహ్మణుణ్ని కలిశాడు. అతడు పాము విషానికి విరుగుడు చెయ్యగల సమర్థుడు. అతడికి అపారధనాన్ని ఇచ్చి పరీక్షిత్తు వద్దకు వెళ్లకుండా చేశాడు.

తక్షకుడు పరీక్షిత్తుకు సమీపంలో ఉన్నవాళ్ల వద్ద ఒక పండునిచ్చి వెళ్లిపోయాడు. వాళ్లు ఆ పండును పరీక్షిత్తుకు సమర్పించారు. అతడు పండును రుచి చూడడంతోనే, అందులోంచి తక్షకుడు క్రిమిరూపంలో వెలువడి భయంకర సర్పాకారాన్ని పొంది, రాజును కాటువెయ్యగానే, క్షణంలోనే విషాగ్నివల్ల బూడిదగా మారాడు.



జరిగిన సంఘటనను విన్న పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు కోపంతో సర్పకుల నాశనాన్ని సంకల్పించి యజ్ఞం చేశాడు. వేలకువేలు సర్పాలు యజ్ఞగుండంలో పడి నశించాయి. తక్షకుడు ఇంద్రుడి మందిరంలో ఉండడంతో **సహేంద్ర తక్షకాయాను బ్రూహి** అని పలకగానే తక్షకుడితో ఇంద్రుడు కూడా విమానంతో పడుతుండగా, ఆంగీరస మహర్షి వచ్చి, జనమేజయుణ్ని స్తుతించి, హితం పలికి, సర్పయాగాన్ని మాన్పించాడు. (మహాభారతంలో జరత్కారుడు అనే మునికి, జరత్కారువు అనే నాగకాంతకు (వాసుకి చెల్లెలు) పుట్టిన ఆస్తీకుడు సర్పయాగం మాన్పించాడని ఉంది) తర్వాత జనమేజయుడు కూడా విష్ణుపద ధ్యానంతో కాలం గడిపి ఉన్నతపదాన్ని అందుకున్నాడు.

## వ్యాసుడు – వేదాలు – పురాణాలు

సూతుడు శౌనకాది మునులతో ఇంకా ఇలా చెప్పాడు.

తొలుత బ్రహ్మ హృదయంలో ఒక నాదం పుట్టింది. చిత్తవ్యాపారాన్ని నిరోధించడం వల్ల అది రూపం దాల్చి స్పష్టంగా గోచరించింది. ఆ నాదోపాసనవల్ల యోగులు ముక్తిని పొందుతారు. ఆ నాదంలోంచి ఓంకారం పుట్టింది. ఓంకారం సమస్తమంత్రాలకు, ఉపనిషత్తులకు మూలం కావడం వల్ల **వేదమాతగా** కీర్తిగాంచింది.

ఓంకారంలో మూడుగుణాలు, అకార ఉకార మకారాలనే మూడు వర్ణాలున్నాయి. వాటివల్లే ఓంకారం ప్రకాశిస్తుంది. ఆ ప్రణవం వల్ల అక్షర సమామ్నాయాన్ని బ్రహ్మ కల్పించి, ఆ అక్షరాల సముదాయం వల్ల నాలుగు ముఖాల నుంచి నాలుగువేదాలను సృష్టించాడు. వ్యాసుడు వాటిని తన శిష్యులకు బోధించాడు. (ఈ వివరాలు తొలిస్కంధంలో ఉన్నాయి.)

మొత్తం పద్దెనిమిది పురాణాలున్నాయి. బ్రహ్మపురాణం– 10,000 శ్లోకాలు, పద్మపురాణం – 55,000 శ్లోకాలు; విష్ణుపురాణం – 23,000 శ్లోకాలు; శివపురాణం – 24,000; భాగవత పురాణం – 18,000; నారద పురాణం – 25,000; మార్కండేయ పురాణం – 9,000; అగ్నిపురాణం – 15,400; భవిష్యోత్తర పురాణం – 14,500; బ్రహ్మకైవర్త పురాణం – 18,000; లింగ పురాణం – 11,000; వరాహ పురాణం – 24,000; స్కాంద పురాణం – 81,000; వామన పురాణం – 10,000; కూర్మ పురాణం – 17,000; మత్స్య పురాణం – 14,000; గరుడ పురాణం – 19,000; బ్రహ్మాండ పురాణం – 12,000.

నాలుగులక్షల శ్లోకాలు పరిమాణం కలిగిన 18 పురాణాలలో నదుల్లో గంగానదిలా; దేవతల్లో బ్రహ్మలా; తారకల్లో చంద్రుడిలా; సముద్రాలలో క్షీరసాగరంలా;

పర్వతాలలో మేరుపర్వతంలా; గ్రహాలలో సూర్యుడిలా; రాక్షసుల్లో ప్రహ్లాదుడిలా ; రత్నాలలో పద్మరాగంలా; చెట్లలో హరిచందనంలా; ఋషులలో నారదుడిలా; ధేనువుల్లో కామధేనువులా ... అదితి సంతానంలో విష్ణువులా; ఋతువుల్లో వసంతంలా; మాసాలలో మార్గశీర్షంలా; యుగాలలో కృతయుగంలా భాగవతం ప్రకాశిస్తుంటుంది.

త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవరుణుడు, వైశంపాయనుడు, హారీతులు – ఈ ఆరుమంది పురాణ ప్రవక్తలుగా సుప్రసిద్ధులు. ఆ ఆరుగురూ మా తండ్రి రోమహర్షణుడి దగ్గర వాటిని నేర్చుకున్నారు. ఆయన వేదవ్యాసుడి శిష్యుడు.

## మార్కండేయుడు

మృకండు ముని (కర్దమ ప్రజాపతి ఎనిమిదవ కుమార్తె ఖ్యాతి వంశంలోని వాడు) ఉత్తమ పుత్రుడికోసం తీవ్రతపస్సు చేస్తే హరి, హరులు, ఇద్దరూ ప్రత్యక్షమై అనుగ్రహించారు. మార్కండేయుడు జన్మించాడు. అతడు నియమనిష్ఠల్ని చక్కగా పాటించేవాడు.

మృత్యువు తన పాశంతో కట్టివేసినా, దాన్ని తృణీకరించి పదివేల సంవత్సరాలు ఉగ్రతపం ఆచరించాడు.

అతడి తపతీవ్రతకు భయపడి ఇంద్రుడు అప్సరసల్ని పంపినా చలించలేదు. విష్ణువు ప్రత్యక్షమయ్యాడు.

మార్కండేయుడు – **నీ దివ్యనామాన్ని స్మరిస్తూ అనేక యుగాలు ఈ శరీరంతో జీవించే వరం ఇవ్వు.** – అని కోరాడు.

ప్రళయకాలంలో వటపత్రశాయి శరీరంలో జొరబడి, చాలాకాలం అందులోనే ఉండి, అతడి పాదపద్మాలను స్మరిస్తూ, బయటపడి మళ్లీ తన ఆశ్రమంలోనే తపం చెయ్యసాగాడు. శివానుగ్రహాన్ని పొంది, నారాయణుడి పాదపద్మాలను ధ్యానించే బుద్ధిని, మరణాన్ని జయించే శక్తినీ పొందాడు.

మార్కండేయుడి కథను రాసినా, చదివినా మృత్యువు దరిచేరదు అని సూతుడు ఫలశ్రుతి చెప్పాడు.

## ద్వాదశాదిత్యులు

**ప్రపంచానికి కన్నువంటి సూర్యుడు చైత్రమాసం మొదలు, చివరివరకు ఏ నెలలో, ఏ పేరుతో, ఎలా సంచరిస్తాడో** తెలియజెయ్యమని – శౌనకుడు అడిగాడు.

**పరీక్షిత్తు** – శ్రీమన్నారాయణుడి స్వరూపుడైన సూర్యుడు ఒకేరూపం కలవాడు.



మహర్షులు కాలం, దేశం, క్రియ మొదలైన వాటి భేదాల్ని బట్టి పలురకాలుగా వర్ణిస్తుంటారు.

చైత్రమాసంలో ధాత, వైశాఖంలో అర్యముడు, జ్యేష్ఠంలో మిత్రుడు, ఆషాఢంలో వరుణుడు, శ్రావణంలో ఇంద్రుడు, భాద్రపదంలో వివస్వంతుడు, ఆశ్వయుజంలో త్వష్ట, కార్తీకంలో విష్ణువు, మార్గశిరంలో అర్యముడు, పుష్యంలో భగుడు, మాఘమాసంలో పూషుడు, ఫాల్గుణంలో క్రతువు అని వివిధ నామాలతో వ్యవహరింపబడుతున్నాడు.

పురాణాల్లో శ్రేష్ఠమైన భాగవతాన్ని వినేవాళ్లు, చదివేవాళ్లు, రాసేవాళ్లు ఆయుస్సును, ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని పొంది విష్ణువుతో సాయుజ్యం పొందుతారు.

పుష్కర తీర్థంలో కాని, ద్వారకాపట్టణంలో కాని, మధురా నగరంలో కాని ఆదివారం నాడు భక్తితో భాగవతం చదివిన భక్తుడు – సంసార సముద్రాన్ని దాటగలడు.

**శుకయోగికి, పరమేశ్వరుడికి నమస్కరించి సూతుడు పన్నెండు స్కంధాలు గల భాగవత పురాణాన్ని చెప్పడం ముగించాడు.**

---

## డా॥ గాలి గుణశేఖర్‌గారి ముద్రిత గ్రంథాలు

**తెలుగు**

ఉషాపరిణయము (సంశోధిత ప్రతి, పిహెచ్.డి., సిద్ధాంత గ్రంథం)
కొడాలి సాహితీ సౌవర్చసం (యం.ఫిల్., సిద్ధాంత వ్యాసం)
శ్రీవాణి (తమిళ వేదం తిరుక్కుఱళ్ – నకు అనువాదం)
కవితా స్రవంతి (కవిత్వం)
కలలు + కల్పనలు = కాగితాలు (కవిత్వం)
వేమన మతం – సర్వజన హితం
నేటి కవిత్వం (విమర్శ)
అదృష్టనామ సంఖ్యాశాస్త్రం
పిరమిడ్లు – అద్భుతశక్తులు, అంతర్గత రహస్యాలు
సంతాన సౌభాగ్యం
అక్షరాంజలి
మాటకో సామెత
భారత భారతి (కవిత్రయ మహాభారత పరిచయం–వచనం)
శ్రీరామ చరితం (వాల్మీకి రామాయణం–వచనం)

**తమిళం**

వాస్తు శాస్తిర వాస్తవంగళ్
ఆముక్త మాల్యద
వెట్రిక్కు అయిందు పడిగళ్
వాస్తుభూమి
శ్రీకృష్ణ దేవరాయర్
విశ్వాత్మా
ఎదు వరలాఱు?
విణ్‌వెళి కవిదైగళ్

**– మరో 24 అనువాద గ్రంథాలు**

**అముద్రితాలు**

తిరుప్పావై
దుఃఖాంతం (కవిత్వం)
Dreams + Fancies = Paper leaves (Poetry)
English Grammar at a Glance